Islam Maargam
(Telugu)

# ఇస్లాం మార్గం

రచన

యం.డి. ఉస్మాన్ ఖాన్

# విషయసూచిక

# సరియైన సమయంలో... సరియైన పుస్తకం

డాక్టర్ ద్వా.నా. శాస్త్రి
ప్రముఖ సాహితీ విమర్శకులు

హైందవం
క్రైస్తవం
ఇస్లాం
బౌద్ధం

... ఏ మతమైనా మానవాళి సంక్షేమం కోసమే! ప్రశాంత జీవనం కోసమే! గురజాడ అన్నట్లు "అన్నదమ్ములవలెను, జాతులు మతములన్నీ మెలగవలెనోయ్" మతం అనేది జీవన విధానం కారల్‌మార్క్స్ 'మతం మత్తుమందు' అన్నాడని చెప్పారు. ఆ తర్వాతి వాక్యం చెప్పరు. అది ఒక్కొక్కసారి ఉత్తేజాన్ని కలగజేస్తుందన్నాడు. మత్తుమందు ఆరోగ్య రక్షణకీ ఉపకరిస్తుంది. దానిని వాడుకొనే వ్యక్తినిబట్టి మంచి, చెడు ఆధారపడి వుంటాయి. మతాన్ని సమాజహితం కోసం, మానవ సుఖం కోసం వాడుకోవాలి. "కడివెడు పాలలో ఒక విషం బొట్టు" లాగా అతికొద్దిమంది వల్ల మతానికే అపఖ్యాతి వస్తోంది. ముఖ్యంగా స్వార్థపరులు, రాజకీయ నాయకులు, దొంగవ్యాపారులు, మత దురహంకారులు మతాన్ని స్వప్రయోజనాలకు వాడుకొంటున్నారు. స్వప్రయోజనాల కోసం యువతను బలిగొం టున్నారు. మానసిక పరిణతిలేని యువతకి గాలం వేస్తున్నారు.

ఇటువంటి సమయంలో ఖమ్మం జిల్లాలో జగన్నాథపురం గ్రామానికి చెందిన ఎం.డి. ఉస్మాన్‌ఖాన్ గారు చాలా నిర్భయంగా, ఎంతో నేర్పుతో, మరెంతో వివరంగా ఈ 'ఇస్లాం మార్గం' అనే ఈ పుస్తకం రాశారు. చేస్తున్న వృత్తి – మెడికల్‌షాప్ అయితే ఏం ఇస్లాం సాహిత్యంపై ఇప్పటికి పదిహేను అనువాద పుస్తకాలు రాశారు. 'ఆంధ్రజ్యోతి', వార్త, సూర్య వంటి పత్రికలలో "కాలమ్స్" రాస్తూ వుంటారు.

ఇస్లాం అంటే ఏమిటి?
ఇస్లాంలో ఏం వుంది?
ఇస్లాం ఎందుకు పుట్టింది?
ఇస్లాంలోని వాస్తవాలు ఎందరికి తెలుసు?

ఇటువంటి ప్రశ్నలు వేసుకొని రచనలు చెయ్యడం - ఇస్లాం నిజ స్వరూపాన్ని తేటతెల్లం చెయ్యడానికి కలం పట్టడం ఈ ఉస్మాన్ ఖాన్ లక్ష్యం. ఆ లక్ష్యమే ఊపిరిగా జీవిస్తూన్న ఒక సామాన్య ముస్లిం రాసిన మంచి పుస్తకం ఇది.

ముస్లింలు మాత్రమే కాదు – అన్ని మతాల వారూ ఈ పుస్తకంలో చదివి నేర్చుకోవలసిన అంశాలెన్నో వున్నాయి. క్రైస్తవ, హిందూ మతాలు చెప్పిన వాటికీ ఇస్లాంలో చెప్పిన వాటికి సామ్యం కనిపిస్తుంది. మతాన్ని అడ్డుపెట్టుకొని దుష్టరాజకీయాలు చేస్తూ దుర్మార్గులుగా తయారవుతున్న వారికి ఈ పుస్తకం చెంపపెట్టు.

ఒక విధంగా అన్ని మతాల పెద్దలందరికీ ఈ పుస్తకం గుణపాఠం. ప్రజల్లోకి వెళ్ళి మతంలోని రహస్యాలను, ముఖ్య అంశాలను వ్యాప్తి చేయవలసి ఉంది. ఈ అవసరాన్ని గుర్తించిన ఉస్మాన్‌ఖాన్ "నేను సైతం... " అన్నట్టు చీకటిని తిడుతూ కూర్చోకుండా తనవంతు బాధ్యత నెరవేర్చారు. ఈ పుస్తకంలోని భాష కూడా సరళంగా, చదివించేలా ఉండటం విశేషం. సాధారణంగా మత విషయాలను చెప్పేటప్పుడు భాష కొంత కృత్రిమంగా వుంటుంది. కానీ ముస్లిమ్ అయిన ఉస్మాన్‌ఖాన్ అచ్చమైన తెలుగువాడిగా "భాష" రాయటం మరీ విశేషం. పుస్తకం చేతపట్టుకుంటే చకచకా వెళ్ళిపోతాం... అంటే పఠనీయంగా రచన సాగింది. మచ్చుకి కొన్ని-

"ఈ రోజు ఉండి రేపు పోయే ధనాన్ని, అధికారాన్ని చూసుకుని మనిషి విర్రవీగడం మాని దైవమార్గంలో తన సంపదను ఖర్చుచేయాలి"

"ముసాంబరం (అతి చేదైన పదార్థం) తేనెలోని మాధుర్యాన్ని కలుషితం చేసినట్లు ఆగ్రహం ధర్మాన్ని, విశ్వాసాన్ని నాశనం చేస్తుంది"

"కొందరు తమ వాగ్దానాలను దేవుని విషయంలో చేసిన ప్రమాణాలను అతి స్వల్ప మూల్యానికి అమ్ముకుంటారు. ఇలాంటి అమ్ముడుపోయిన వారికి పరలోకంలో ఎలాంటి ప్రతిఫలం లభించదు. దైవం వారితో మాట్లాడడు."

"ఈ ప్రాపంచిక సౌఖ్యాలు క్షణభంగురం. బుద్బుదప్రాయం ఇహలోక జీవితం ఒక క్రీడ, ఒక తమాషా మాత్రమే. భయభక్తులు కలవారికి పరలోక నివాసమే శ్రేష్ఠమైనది".

"అన్ని రకాల లోపాలకు అతీతమైన మచ్చలేని ధర్మం ఇస్లాం."

"ప్రళయదినాన విశ్వాసి కర్మల త్రాసులో తూయబడే వస్తువుల్లో అత్యంత బరువైనది అతని నైతికతే".

ఇటువంటి ఆణిముత్యాలు ఈ పుస్తకంలో కోకొల్లలు. కేవలం విశ్వాసం మాత్రమే చాలదనీ ఆచరణ ముఖ్యమనీ ఈ పుస్తకంలో ప్రత్యేకంగా చెప్పబడింది. ఏ మతంలోనైనా ఇదే పెద్దలోపం – ఆశయానికీ ఆచరణలకీ; ఉపన్యాసాలకీ ఆచరణలకీ పొంతన లేకపోవటం. "ఆచరణ" లేనప్పుడే మతం పట్ల విశ్వాసం సన్నగిల్లుతుంది. తద్వారా పెడ త్రోవకి మార్గం సుగమం అవుతుంది. ఈ సత్యాన్ని గుర్తించిన ఉస్మాన్ ఖాన్ ప్రత్యే కంగా "ఆచరణ"లపై వ్యాసాలు రచించారు.

చాలామంది ముస్లిములకే తెలియని, తెలిసినా వెల్లడించని సత్యాలను రచయిత వెల్లడించారు – "పురుషుడు స్త్రీకి 'తలాక్' ఇచ్చినట్లే స్త్రీ కూడా 'ఖులా' ద్వారా భర్తనుంచి విడాకులు పొందే అధికారం ఉంటుంది. అదే విధంగా ఇస్లాం స్త్రీ పురుషులిద్దరినే విద్య ఆర్జించమని ఆదేశిస్తుంది. తల్లిపాదాల కింద స్వర్గం ఉంటుందని చెప్పి సంఘంలో స్త్రీ స్థానాన్ని సమున్నతంగా నిలిపింది."

సామాజిక స్పృహగల భావాలూ, భౌతికవాద భావాలూ కూడా కనిపిస్తాయి. మొత్తం మీద ఈ పుస్తకం ముస్లిమ్‌లు మాత్రమే కాకుండా అన్ని మతాలూ, అన్ని వర్గాల వారూ అధ్యయనం చేయవలసిన పుస్తకం. వ్యక్తిత్వ వికాసానికి, మతం ఉద్దేశం గ్రహించడానికి ఇటువంటి పుస్తకాలు ఎన్నో రావలసి ఉన్నాయి. అన్ని మత గ్రంథాల్లోనూ గల సత్యాలను 'మసిపూసి మారేడుకాయల్లా'చేసి వక్రభాష్యాలు చెప్తున్న ఈ రోజుల్లో ఇటువంటి పుస్తకాలు మరిన్ని వెలువడాలి. ఆ దిశగా మంచి ప్రయత్నం చేసిన ఉస్మాన్‌ఖాన్‌కి ముబారక్.

**డాక్టర్ ద్వా.నా. శాస్త్రి**
1-1-428, గాంధీనగర్
హైదరాబాద్-500 080

# ప్రేమమార్గం

**– కె. శ్రీనివాస్**

'ఆంధ్రజ్యోతి' సంపాదకులు

మనుషులు వారి పరస్పరతను గుర్తించుకుని, స్వేచ్ఛను కట్టుబాటును నిర్వచించుకుని, తమను నడిపించుకునే విలువల సంపుటిని తామే నిర్వహించుకుని, అనుసరించే వరకు – రాజ్యమూ చట్టమూ ఉన్నా లేకున్నా మతమో ధర్మమో ఒకటి ఉండి తీరాలని పిస్తుంది. మతం అనగానే అది దేవుడికో దేవుని ప్రతినిధులకో సంబంధించినది కానక్కర లేదు. సమాజాల గమనాన్ని, మనిషి నైతికతను కొత్తమార్గం తొక్కించడానికి చరిత్ర మలుపుల్లో మహానుభావులు నాటి సంప్రదాయాలను ధిక్కరించారు, దివ్యసందేశాన్ని ఆలకించినట్టు ఒక కొత్త జీవనమార్గాన్ని ఆవిష్కరించారు. ఆరంభంలో విప్లవాత్మకంగా ఉండిన నూతన ధర్మాలు, రానురాను ఆ ధర్మానుయాయుల చేతిలోనే వక్రమార్గం పట్టడమో, కువ్యాఖ్యానాలకు గురికావడమో, నిస్సారమైపోయి తతంగాలుగా మారి పోవడమో జరిగాయి. బోధనలను పక్కనబెట్టి, బోధకులను ఆరాధించడం వల్ల ఉపయోగ మేమీ లేదు. బోధకులలోని స్ఫూర్తిని పక్కనబెట్టి, వారి బోధనలను కాలానుగుణంగా స్వీకరించకుండా శిలాశాసనాలుగా పరిగణించడం వల్ల అనేక అపచారాలు జరుగు తున్నాయి. ప్రపంచంలోని అన్ని మతాలలోనూ ఈ పెడధోరణులు కనిపిస్తాయి. ఒక సత్యాన్వేషిగా సాధన చేసి ఆరోగ్యకరమైన సన్మార్గాలను రూపొందించిన గౌతమ బుద్ధుడు తన ధర్మంలో దైవం ఉనికి గురించి మాట్లాడనే లేదు. ఆయనే ఇప్పుడు అనేక దేశాలలో భగవంతుడిగా, భగవంతుడి అవతారంగా పూజలందుకుంటున్నారు.

ప్రపంచంలో అమిత వ్యాప్తి ఉన్న ప్రధాన మతాలలో ఇస్లాం కాలరీత్యా ఆధునిక మైనది. కానీ, ఆ మతాన్నే తరచు విమర్శకులు అత్యంత సాంప్రదాయికమైనదిగా చెబు తుంటారు. ఇస్లాం అవతరణ దగ్గర నుంచి అది వ్యాపించిన భూభాగాల్లో, జాతుల్లో అనేక ఘర్షణలు, యుద్ధాలు జరుగుతూ ఉండడం వల్ల, ఇప్పటికీ పాశ్చాత్య ప్రపంచం నుంచి నిరంతరమైన దాడిని ఎదుర్కొంటూ ఉండడం వల్ల ఆ మతానుయాయూలు మిలిటెంట్‌గా

కనిపిస్తూ ఉండవచ్చును కానీ, అనేక సామాజిక విలువల్లో, నైతికతల్లో ఇస్లాంలో తక్కిన మతాల కంటే ఉదారత్వం కనిపిస్తుంది. బురఖాను, తలాఖ్‌ను విమర్శించేవారు, ఇస్లాంలో పెళ్లిళ్లలో పరస్పర ఇష్టాన్ని ప్రాతిపదికగా తీసుకుంటారని, విడిపోయిన స్త్రీలు కానీ, వితంతువులు కానీ పునర్వివాహం చేసుకోవడం సులభమని గుర్తించరు. తెలిసీ తెలియకుండా ఇస్లాంను విమర్శించేవారుకానీ, ఇస్లాంను రాజకీయ ఉగ్రవాద ప్రేరణగా ఉపయోగించుకుంటున్నవారు కానీ - ఇస్లాం ధర్మాన్ని, ప్రవక్త బోధనలను తెలుసుకో వలసిన అవసరం ఉన్నది. మానవాళి మీద, సత్యం మీద, శాంతి మీద ఎంతో ప్రేమతో ముహమ్మద్ చేసిన అనేక బోధనలు అనేక అపార్థాలను, అరిష్టాలను తొలగిస్తాయి.

దేవుడు అక్కరలేకపోయినా మతం అవసరమేనని అంబేద్కర్ విశ్వసించారు, అందుకే బౌద్ధాన్ని స్వీకరించారు, భవిష్యత్తులో ఏనాడైనా దైవ ప్రస్తావన లేని ఒక మానవ ధర్మం ఏర్పడితే, అందులో అన్ని మతాలనుంచి స్వీకరించే సార్వత్రిక, సార్వజనీన సత్యాలు, విలువలు ఎన్నో ఉంటాయి, బౌద్ధం నుంచి, ఇస్లాం నుంచి ఇంకా అధికంగా ఉంటాయి. యం.డి. ఉస్మాన్ ఖాన్ రచనలు ఇస్లాంలోని మార్దవతను, మానవీయతను, అది బోధించే ఆదర్శవంతమైన నడవడిని మంచి తెలుగులో అందించాయి. ఇస్లాం బోధనలను అందరికీ పంచాలనే ఉదాత్త లక్ష్యంతో ఆయన వీటిని రాశారు. వీటిని చదివినవారంతా ఆధ్యాత్మికతలోను, నైతికతలోను కొత్త కాంతులను కనుగొంటారు.

- కె. శ్రీనివాస్
'ఆంధ్రజ్యోతి' సంపాదకులు

ఫిబ్రవరి 3, 2009

# ఆప్త వచనం

ఎస్.ఎమ్. మలిక్
ప్రధాన సంపాదకులు
గీటురాయి వారపత్రిక

'రచన' శ్రమతో కూడుకున్నది, బాధ్యతను మోసుకువచ్చేది, జవాబుదారీ బోనులో నిలబెట్టేది. అది దక్షతతోపాటు శిక్షణ, కమిట్‌మెంట్ కోరుతుంది. నిబద్ధత, అప్రమత్తత, జాగరూకత, నిష్కర్షత, నిష్కల్మషత, నిస్పాక్షికత, నిస్వార్థత దాని అనివార్య పాదాలు. సరళత, స్పష్టత, సూక్ష్మత, సౌమ్యత, సౌహార్దత, ఆర్ద్రత దాని అలంకారాలు. ధార్మిక రచన అయితే వీటినన్నింటితోపాటు విస్తృత ధార్మిక జ్ఞానం, ధార్మిక గ్రంథాల అధ్యయనం, ధార్మిక వ్యక్తుల సహవాసం, సహచర్యం కూడా అవసరమవుతాయి. ఇక ఇస్లామ్ లాంటి ఆచరణను కోరుకునే ధర్మమయితే ధర్మమార్గాన అకుంఠిత శ్రమ, పరిశ్రమ, అంకితభావం కూడా తప్పనిసరి అవుతాయి. 'వంద పేజీలు చదివితే ఒక్క పేజీ వ్రాయి' అన్నారు పెద్దలు. ఇవన్నీ అమరితేగాని వ్రాయకూడదని నేననడం లేదు కాని మంచి రచనకు ఇవన్నీ ఉత్తమ ప్రాతిపదికలు కాగలవని మాత్రమే చెబుతున్నాను; పాటిస్తే ఎవరయినా బాగుపడతారని నేను గట్టిగా నమ్ముతున్నాను.

సోదరులు ఉస్మాన్‌ఖాన్ గారు చాలా శ్రమపడి పత్రికలలో ఇస్లామీయ బోధనలను జనులకూ అచ్చువేసే వారికీ నచ్చేలా తనకు తోచిన అంశాలను స్పృశిస్తూ వ్రాసిన వ్యాసాల సంపుటి ఇది. ఆయన వ్యాసాల మూల విషయం ఇస్లామ్, ఇస్లామీయ బోధనలు. నీతి పలుకులు అన్ని మతాలలోనూ సమంగా ప్రాప్తమవుతాయన్న విషయం సకల జన విదితం. అయినా మన మధ్య అనేక మతాలున్నాయి, అనేక మార్గాలున్నాయి, అనేక ఆరాధనాలయాలు, ఆరాధనా విధానాలు చెలామణిలో ఉన్నాయి. ఎందుకు? ఇస్లామ్ కేవలం మతం మాత్రమే కాదు. అదొక జీవన సమగ్ర విధానం. జీవితం అంటే కేవలం నీతి బోధనలు కాదు. అదొక సమస్యా భూయిష్టమయిన రంగం. అందులో ఎన్నో శాఖలు, కోణాలు, అంశాలు, అంగాలు దర్శనమిస్తాయి. ఇదొక చర్చనీయాంశం, మరే

సందర్భంలోనయినా దాన్ని చర్చించడం అవసరం ప్రస్తుతం అది అప్రస్తుతం.

ఇస్లామ్ వీటికన్నింటికీ సమాధానం ఇస్తుంది, సమాధానపరుస్తుంది. ఆ కోణాలన్నీ అధ్యయనంలోకి వచ్చినప్పుడే ఇస్లామ్ స్వరూపం పరిపూర్ణంగా దర్శనమిస్తుంది.

సోదరులు ఉస్మాన్‌ఖాన్ గారి ఈ రచన సాఫీగా సరళంగా చదవిస్తుంది. జీవితంలో అడుగడుగునా పనికివచ్చే దారి చూపే అనేక బోధనలతో పరిచయం చేస్తుంది. మనసును నీతిమంతమయిన మార్గాన పయనించేందుకు దోహదపడుతుంది. డా. ద్వా.నా. శాస్త్రి, కె. శ్రీనివాస్ లాంటి అనుభవజ్ఞులు, మహానుభావులు వ్రాసిన ప్రశంసాపత్రాలకు నేను అదనంగా ఏమి జోడించగలను? సోదరులు ఉస్మాన్‌ఖాన్ ఇస్లామ్‌లోని అనేక కోణాలను దర్శించి పాఠకులనూ దర్శింపజేస్తారని ఆశిస్తూ సెలవు తీసుకుంటాను.

**ఎస్.ఎమ్. మలిక్**
ప్రధాన సంపాదకులు
గీటురాయి వారపత్రిక

హైదరాబాద్
13.2.09

# అభినందన

స్వామి జ్ఞానదానంద
అధ్యక్షులు
రామకృష్ణమఠ్ మార్గ్

ఇస్లాం మతం మరియు ముహమ్మద్ ప్రవక్త వారి బోధనలపై ఉస్మాన్ ఖాన్ గారు 'ఆంధ్రజ్యోతి' దిన పత్రికలో కొన్ని వ్యాసాలు వ్రాశారు. ఆ పత్రికలో ప్రచురింపబడ్డ తమ వ్యాసాలను పుస్తకరూపంలో వెలువరించ సంకల్పించి ఈ పుస్తకాన్ని మీముందుచు చున్నారు.

నమాజు ప్రాముఖ్యత, భువిపై మానవుడి అత్యున్నత కర్తవ్యం, ఇత్యాది విషయాలపై వీరు ఖుర్ఆన్‌లో తెలుపబడిన విషయాలను చక్కటి తెలుగులో తెలియజేశారు. గీత, వేదాల నుంచి కూడా ఉటంకిస్తూ అన్ని మతాల పవిత్ర గ్రంథాలు నీతి నిజాయితీలతో ధర్మబద్ధమైన జీవితం గడపాలని మనిషికి సూచిస్తున్నాయని విషయాన్ని చక్కగా, సూటిగా తెలియజేశారు.

మానవ సేవతోనే దైవానికి చేరువకాగలమని, వ్యాధిగ్రస్తులరూపంలో, ఆకలి గొన్నవారి రూపంలో దైవం మన ముందుకు వస్తారని, కారుణ్య గుణం ఉన్నవారికి దైవసన్నిధి లభిస్తుందని, సంతృప్తే నిజమైన సంపదని ముహమ్మద్ ప్రవక్త వారి బోధన లను, సదుపదేశాన్ని మనకు తెలియజేశారు. చుట్టూ ఉన్న చెడును చూస్తూ ఉపేక్షించి ఊరుకోవడం కూడా దైవతిరస్కారమే అవుతుందని, చెడును ప్రతిఘటించి మంచిని పెంచడానికి ప్రతి మనిషి పూనుకోవాలన్న మహనీయులైన ప్రవక్త సందేశాన్ని సరళమైన తెలుగులో వివరించారు.

"సర్వజీవరాసుల పట్ల దయ, జాలి కలిగి ఉండు. జాలిగుండె లేనివాణ్ణి అల్లాహ్ ప్రేమించడు. సాధ్యమైనంతవరకూ క్షమాగుణాన్ని అలవరచుకో. ఇతరుల తప్పిదాలను నిండు మనసుతో క్షమించు. దైవం ఎంతో క్షమాగుణం కలవాడు. ఎట్టి పరిస్థితులలోనూ శాంతి మార్గాన్ని, ధర్మ మార్గాన్ని వీడకు." ఎంత చక్కటి ఉపదేశం.

'భగవంతుడు ప్రేమమయుడు, కరుణాంతరంగుడు. ఆయనను మనం ఏ పేరుతో పిలిచినా పలుకుతాడు. అన్ని మతాలు విశ్వమాన సౌభ్రాతృత్వాన్ని, ప్రేమను, సామరస్యాన్ని బోధిస్తున్నాయి. అన్ని మతాల సారం ఒక్కటే' అని ఈ సంకలనాన్ని చదివినవారికి అర్థం అవుతుంది. ఎవరికివారు తమతమ మత గ్రంథాలను సరిగ్గా చదవక పోవటం వలననే విద్వేషాలు, వైషమ్యాలు పెచ్చరిల్లుతున్నాయి. మనిషి మనీషిగా, ఒక ఉదాత్త మానవునిగా ఎదగటానికి ఈ పుస్తకం దోహదపడుతుందని మేము విశ్వసిస్తున్నాము.

నది, సూర్య, వార్త దినపత్రికల ద్వారా, ఇతర మాసపత్రికల ద్వారా ఇస్లాం మత బోధనల సారాన్ని అందరికీ తెలియజేయటానికి ప్రయత్నిస్తున్న ఉస్మాన్ ఖాన్ గారికి మా అభినందనలు.

భగవత్సేవలో,
**(స్వామి జ్ఞానదానంద)**
అధ్యక్షులు
రామకృష్ణమఠ్ మార్గ్

20-12-2008
హైదరాబాద్

# ఆత్మీయ పలుకులు

**అద్దంకి రంజిత్ ఓఫీర్**
రాష్ట్రీయ క్రైస్తవ పరిషత్
వ్యవస్థాపక జాతీయ అధ్యక్షుడు

ఖుర్‌ఆన్ గ్రంథం అరబిక్ భాషలో ఉన్నందున, ప్రపంచంలోని ఇతర జాతుల, మతాల వారికి ఖుర్‌ఆన్‌లోని ధర్మోపదేశాన్ని తెలుసుకునే అవకాశం లేకుండాపోయింది. ఖుర్‌ఆన్ గ్రంథానికి అనువాదాలు చాలా వచ్చినా, అవి "పవిత్ర ఖుర్‌ఆన్ యొక్క అర్థం, తాత్పర్యం"గా అవుతాయి తప్ప అరబిక్‌లోని పవిత్ర ఖుర్‌ఆన్‌కు అవి సమానం కావు అన్న విశ్వాసం ముస్లిమ్ సోదరులలో ఉంది. అందుచేత నేరుగా ఖుర్‌ఆన్‌ను యథాతథంగా చదివి, ఉపదేశాన్ని గ్రహించాలంటే అరబిక్ భాష తెలిసిన ఏ కొద్ది మందికో తప్ప, అందరికీ సాధ్యం కాదు.

దీనికి తోడు  కొద్దిమంది వ్యక్తులు దారి తప్పిన కారణంగా మొత్తం ఇస్లామిక్ ప్రపంచమంతటి మీదికీ, ధర్మం మీదికీ అపనింద వచ్చి పడింది - ఇస్లాం మతమే హింసనూ ఉగ్రవాదాన్ని ప్రోత్సహిస్తున్నందున్న ఈ దుష్ప్రచారం జరుగుతోంది.

ఆ మాటకొస్తే తమ మత గ్రంథాలు ప్రబోధించిన ధర్మ మార్గాన్ని విడిచిపెట్టి, సమాజ హింసకులుగా మారిన భ్రష్టులు అన్ని మతాలలోనూ ఉన్నారు. ముస్లిమ్‌లలో కూడా అలాంటివారు ఉంటే ఉండవచ్చు. అయితే వారికి ఇస్లాంతో ఎలాంటి సంబంధం లేదు. ఇస్లాంను విశ్వసించే వారెవరూ హింసకు పాల్పడరు. కానీ నిజానికి ఇస్లాం ప్రబోధం, పవిత్ర ఖుర్‌ఆన్ ఉపదేశసారం, హింసావాదం కాదని, శాంతి, క్షమ, కరుణ, బాధితులకు, ఆపన్నులకు సహాయహస్తం అందించడం – ఇదే ముహమ్మద్ ప్రవక్త (స)గారి ఉపదేశంలో సారాంశం అనీ ముస్లిమేతరులకు తెలియజెప్పటానికి, మిత్రులు శ్రీ ఉస్మాన్ ఖాన్‌గారు ఈ గ్రంథం ద్వారా చేసిన ప్రయత్నం ప్రశంసనీయం.

ప్రస్తుత సమాజంలో మత విద్వేషాలు నానాటికీ పెరిగిపోతున్న ఈ తరుణంలో ఇటువంటి గ్రంథాలు ఇంకా ఎన్నో రావలసిన అవసరం ఉంది. ప్రపంచంలోని ప్రతి వ్యక్తి, తన మతం ఏదైనప్పటికీ, ఇతర మతాలు ఏం చెబుతున్నాయో తెలుసుకోవాలని మేము

"రాష్ట్రీయ క్రైస్తవ పరిషత్" ద్వారా చాలా కాలంగా పోరాడుతున్నాం.

భారతీయ సనాతన గ్రంథాలైన వేదాలు, ఉపనిషత్తులు కానివ్వండి. పవిత్ర బైబిల్ గ్రంథం కానివ్వండి. ఖుర్ఆన్ షరీఫ్ కానివ్వండి – ఏ గ్రంథమైనా శాంతి మార్గాన్నే బోధించింది కానీ, హింసకు పాల్పడమనికాని, సాటి మనుషులను ద్వేషించమని కాని బోధించలేదు.

కనుక ప్రపంచ మానవాళి శాంతియుత సహజీవనం కొరకు ముహమ్మదు ప్రవక్త (స) ప్రబోధాలను పరిగణనలోనికి తీసుకోవడం మంచిది.

శ్రీ ఉస్మాన్ ఖాన్ గారికి దేవుడు ఆయురారోగ్య ఐశ్వర్యాలను ప్రసాదించి వారి ద్వారా ఇంకా అనేక ఉత్తమ గ్రంథాలను రచింపజేయాలని, అసలైన ఇస్లామిక్ ప్రబోధాన్ని ప్రపంచ ప్రజలందరూ గ్రహించాలని మనసారా ప్రార్థిస్తున్నాను.

సర్వేజనా స్సుఖినోభవంతు!

ఇట్లు
బుధజన విధేయుడు
**అద్దంకి రంజిత్ ఓఫీర్**
రాష్ట్రీయ క్రైస్తవ పరిషత్
వ్యవస్థాపక జాతీయ అధ్యక్షుడు

# నా మాట

**యం.డి. ఉస్మాన్ ఖాన్**

ఇస్లాం ఒక సమగ్రమైన, సంపూర్ణ జీవన విధానం. అది సమస్త మానవ జాతి కోసం అవతరించిన సార్వజనీన ధర్మం. అందుకని దాని బోధనలు యావత్తు మానవాళికీ తెలియాల్సిన అవసరముంది. ఈ అవసరాన్ని దృష్టిలో పెట్టుకొనే నా ఈ వ్యాస పరంపర సాగింది. ఈ వ్యాసాల సంబోధితులు కేవలం ఒక్క ముస్లిం సముదాయం మాత్రమే కాదు. ఆంధ్ర రాష్ట్రంలోని ఎనిమిది కోట్ల మంది ప్రజలతోపాటు, ప్రపంచంలోని ప్రతి తెలుగు వాడూ దీని సంబోధితులే. పరిపూర్ణ ఇస్లాం స్వరూపం ప్రజలముందుకు వచ్చినప్పుడు నిజానిజాలేమిటో వారికి తెలిసిపోతాయి. అపోహలు, అపార్థాలు దూరమవుతాయి. ఈ ఉద్దేశ్యంతోపాటు, ఈ వ్యాసాల్లో మానవులకు వారి ప్రభువు ఇస్తున్న సందేశం, దైనందిన జీవితంలో, జీవితంలోని ప్రతిరంగంలో వారు అనుసరించవలసిన విధానాన్ని తెలియ జెప్పే ప్రయత్నం జరిగింది.

భారతదేశంలోని ప్రధాన మత ధర్మాలను ప్రజలకు పరిచయం చేయ సంకల్పించిన 'ఆంధ్రజ్యోతి' ఇస్లాం సమగ్ర స్వరూపాన్ని పరిచయం చేసే అవకాశాన్ని నాకు కల్పించింది. ఆ మేరకు ఐదేళ్ళ నాడు 'ఆంధ్రజ్యోతి' దినపత్రికలో ప్రారంభమైన నా వ్యాస పరంపర దైవానుగ్రహం వల్ల నేటికీ కొనసాగుతోంది. ఆ వ్యాసాలకు అన్ని వర్గాల నుండీ అనూహ్యంగా లభించిన అపూర్వ ఆదరణే వాటికి పుస్తక రూపం కల్పించడానికి ప్రేరణ అయ్యింది.

ఈ ప్రయత్నానికి 'ఆంధ్రజ్యోతి' అందించిన సహకారం, అసంఖ్యాక మంది పాఠకుల ఆశీర్వాదం మరువలేనిది. ఈ సత్కార్య సాధనలో భాగస్వాములైన 'ఆంధ్రజ్యోతి' ఎం.డి. వేమూరి రాధాక్రిష్ణ, సంపాదకులు కె. శ్రీనివాస్, 'నవ్య' డెస్క్ ఇన్‌చార్జి టి. కుమార్, పూర్వసంపాదకులు కె. రామచంద్రమూర్తి గార్లకు ప్రత్యేకంగా ధన్యవాదాలు తెలియజేస్తున్నాను. అలాగే అడిగిన తడవునే తమ అమూల్యమైన అభిప్రాయాన్ని రాసిచ్చిన ప్రముఖ సాహితీ విమర్శకులు డా॥ ద్వా.నా. శాస్త్రి గారికి, అభినందన పత్రం రాసిన రామకృష్ణ మఠ్ అధ్యక్షులు స్వామి జ్ఞానదానంద గారికి, వెన్నుతట్టి ప్రోత్సహించి, పుస్తక

ప్రచురణకు అనుమతినిచ్చిన 'తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ట్రస్ట్' సంచాలకులు జనాబ్ అబ్బాదుల్లాహ్ గారికి, 'ఆప్తవచనం' రాసిన 'తఫ్హీముల్ ఖుర్ఆన్' అనువాదకులు, గీటురాయి ప్రధాన సంపాదకులు ఎస్.ఎమ్. మలిక్ గారికి, ఆత్మీయ పలుకులు రాసిన 'రాష్ట్రీయ క్రైస్తవ పరిషత్' జాతీయ అధ్యక్షులు అద్దంకి రంజిత్ ఓఫిర్ గారికి, ప్రూఫ్ రీడింగ్ చేసిన మిత్రులు సయ్యద్ హుసైన్ గారికి, డి.టి.పి. మరియు కవరు డిజైన్‌ను అద్భుతంగా తీర్చిదిద్దిన మిత్రులు కె.కె., లక్ష్మీనారాయణ, ముజాహిద్, రఫి గార్లకు, 'టిప్' సిబ్బందికి ధన్యవాదాలు. అలాగే ఈ సత్కార్య సాధనలో అడుగడుగునా సహకరించిన 'మా' టి.వి. జర్నలిస్టు ఏలూరు జీలానీకి, షకీల్, బషీర్‌లకు ప్రత్యేకంగా షుక్రియా.

ఇంకా ప్రత్యక్షంగా, పరోక్షంగా సహకరించిన, ప్రోత్సహించిన ఎందరో మిత్రులకు పేరు పేరునా ధన్యవాదాలు.

అల్లాహ్ ఈ సత్కార్యాన్ని స్వీకరించి, దీని పుణ్యఫలాన్ని నా తండ్రి కీ.శే. ముహమ్మద్ గౌస్ ఖాన్ గారికి ప్రసాదించవలసిందిగా, ఆయన్ను కరుణించి స్వర్గంలోని అత్యున్నత స్థానం అనుగ్రహించవలసిందిగా సవినయంగా విశ్వప్రభువును వేడుకుంటున్నాను.

**యం.డి. ఉస్మాన్ ఖాన్**

ఎన్. జగన్నాధపురం

ములకలపల్లి మం॥

ఖమ్మం జిల్లా

సెల్: 9912580645,

9948412085

# కృషి శ్లాఘనీయం

**అబ్బాదుల్లా**
డైరెక్టర్
తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ట్రస్ట్

శ్రీ యం.డి. ఉస్మాన్ ఖాన్ గత కొన్నేళ్ళ నుండి తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ట్రస్ట్‌లో కేవలం ఒక అనువాదకునిగా మాత్రమే కాకుండా అనేక వ్యాసాలు రచిస్తూ అందరికీ ఆత్మీయమైన గీటురాయి వారపత్రికలో తనదైన శైలిలో వ్యాసాలు వ్రాస్తున్నారు. ఆయన రచనలకు పాఠకుల నుండి మంచి స్పందన వచ్చింది.

ఇస్లాం ఒక ఆచరణయోగ్యమైన జీవన విధానము, దాని బాగోగులను పాఠకులకు పరిచయం చేయాలంటూ ఆ విషయాలను మంచిగా మలచి మానవులందరికీ అందించాలనే తపన ఆయనలో ఎప్పట్నించో ఉంది. ఆలోచనకు తగ్గట్టు అవకాశం కూడా లభించడం వల్ల అనేక శీర్షికలతో వ్యాస రచన చేసి ఒక తెలుగు ప్రముఖ దిన పత్రికలో వారం వారం ప్రచురించారు.

తెలుగు పాఠకలోకం ఈయన రచనలను చదివి అర్థం చేసుకున్నారు. పండిత ప్రముఖులు కూడా మెచ్చుకున్నారు. వారి వారి అమూల్యమైన అభిప్రాయాలను ఈ పుస్తకంలో వ్యక్తపరిచారు.

చీకటిని తొలగించడానికి ఒక కాంతిరేఖ కూడా మనోజ్ఞంగా పని చేస్తుంది. ప్రస్తుత సమాజంలో అలుముకున్న అంధకారాన్ని తొలగించే ప్రక్రియలో ఉస్మాన్‌ఖాన్ కృషి సఫలీకృతం కావాలని ఆశిస్తూ...

అబ్బాదుల్లా

# 1. నైతిక విలువలు పాటిస్తేనే సమాజం స్వర్గధామం

**మనం మన బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించడంతో పాటు ఎదుటి వారి హక్కులను గౌరవించాలి. అదే నైతికత. స్వర్గతుల్యమైన సమాజానికి అదే నాంది. జీవులన్నింటితో సక్రమంగా మసలుకోవడమే నైతికత అన్నారు ముహమ్మద్ ప్రవక్త(స).**

పుడమిపై పుట్టిన ప్రతి మనిషికి కొన్ని హక్కులు, బాధ్యతలు ఉంటాయి. మనుషులు కలసిమెలిసి సమాజంలో సహజీవనం చేస్తున్నప్పుడు, వారి జీవితాలు సుఖంగా, సాఫీగా, ప్రశాంతంగా సాగిపోవాలంటే, ప్రతి ఒక్కరూ ఇతరుల హక్కులను గౌరవించాల్సి ఉంటుంది. ఎవరికి వారు ఇతరుల హక్కులను, తమ బాధ్యతలను గుర్తించి నిర్వర్తిం చడాన్నే 'నైతికత' అంటాం. మానవ సమాజంలో సుఖ సంతోషాలు, శాంతిభద్రతలు నైతికత పైనే ఆధారపడి ఉన్నాయి. ప్రతి మనిషి హక్కులు బాధ్యతలను సక్రమంగా నిర్వర్తిస్తే మానవ సమాజం స్వర్గధామం అవుతుందనడంలో అతిశయోక్తి లేదు.

## అశాంతికి మూలకారణం

కానీ ఈనాడు మానవ సమాజం అశాంతి, అభద్రత, అలజడులతో నిండిపోయి ఉంది. ప్రతి మనిషి తన హక్కులు రాబట్టుకోవడంలో చూపిస్తున్న శ్రద్ధ, తాను ఇతరుల హక్కులను గౌరవించడంలో చూపించడం లేదు.

తన హక్కులు తాను సాధించుకోవడం ఎంత ముఖ్యమో, ఇతరుల హక్కులు నెర వేర్చడం కూడా అంతే ముఖ్యమన్న విషయాన్ని పట్టించుకోవడం లేదు. నేడు కార్మికులకు యాజమానులకు, ప్రజలకు ప్రభుత్వాలకు, వ్యక్తులకు, వ్యక్తులకు మధ్య జరుగుతున్న సంఘర్షణకు మూలకారణం ఇదే.

## నైతికత లోపిస్తే శాపమే

మనుషుల్లో నైతిక విలువలు లోపించడం మూలంగా మనిషి, సాటి మనిషిని గురించి పట్టించుకోలేక పోతున్నాడు. తన స్వార్థం కోసం సాటి మనిషిని కాటికి పంప డానికి కూడా వెనకడుగు వేయడం లేదు. మనిషి తన స్వార్థం కోసం తోటి మనిషితో ప్రవర్తిస్తున్న తీరుగా ఈ సృష్టిలోని ఏ జంతువూ మరో జంతువుతో ప్రవర్తించడం లేదు. జంతువుల్లోని ఏ జీవరాశి అయినా కేవలం అధికార కాంక్షతో మరో జీవరాశిపై దాడి చేసి దాన్ని లొంగతీసుకోవాలని, తన అధికారాన్ని స్థాపించుకోవాలని చూసినట్లు మనకు కనిపించదు.

## ఉత్తమ నడవడిక ఆవశ్యం

ఒక జంతువు మరో జంతువుపై దాడి చేసిందీ అంటే, ప్రకృతి ఆ జంతువును దానికి ఆహారంగా నిర్ణయించిందన్న మాట. దైవం ఆ జంతువుకు మరో జంతువును ఆహా రంగా నిర్ణయించడం వల్ల మాత్రమే ఆకలి తీర్చుకోడానికి దాడి చేస్తుంది తప్ప అకారణంగా సాటి జంతువులను చంపే మృగాలేవీ మనకు కనబడవు.

అందుకే ముహమ్మద్ ప్రవక్త "పశువు కూడా ప్రవర్తించని విధంగా మీరు ప్రవర్తిం చకండి. మీరు సృష్టిలో అత్యుత్తమ జీవరాశిగా సృష్టించబడ్డారు. పవిత్ర ఖుర్ఆన్ మిమ్మల్ని "అష్రఫుల్ మఖ్లూఖ్' అని అభివర్ణించింది. ఎట్టి పరిస్థితిలోనూ నైతికతను కాపాడుకోండి. సాటి మానవులతో, సృష్టిలోని ఇతర సృష్టి రాశులతో ఉత్తమ రీతిని మసలు కోవడమే నైతికత. అని ప్రజలకు ఉపదేశించారు.

కనుక ప్రతి మనిషి సమాజంలోని సాటి మానవ సోదరుల హక్కులను సక్రమంగా నెరవేరుస్తూ, సృష్టిలోని జీవరాశులపట్ల తన బాధ్యతలను నెరవేరుస్తూ, అనైతికతకు తావులేని పరిశుద్ధ జీవితం గడిపితే మానవ సమాజం సుఖశాంతులతో వర్ధిల్లుతుంది.

✦ ✦ ✦

# ౨. నిజమైన సత్కార్యం

**నీవుచేసే ప్రతి సత్కార్యానికీ తగిన ప్రతిఫలాన్ని అందించేది దైవమే, చేసే పని చిన్నదైనా అది సమాజానికి మేలు చేసేదైన ప్పుడు అనంత ఫలితాలనే అందిస్తుంది. ఇందుకు ఉదాహరణగా ముహమ్మద్ ప్రవక్త చెప్పిన ఉదాహరణ...**

హజ్రత్ అబూ హురైరా ఉల్లేఖనం ప్రకారం ముహమ్మద్ ప్రవక్త సెలవిచ్చారు. 'ఒక వ్యక్తి దారిలో నడుస్తున్నాడు. అతనికి ఓ ముళ్లకంప కనిపించింది. దాన్ని అతడు దారిలో నుంచి తొలగించాడు. అతడు చేసిన ఈ పనికి అల్లాహ్ మెచ్చి అతన్ని గౌరవించి కటాక్షించాడు.

## చేసేపని చిన్నదైనా...

నలుగురికీ మేలు చేసేది చిన్నపనే అయినా అది సమాజానికి గొప్పమేలు చేస్తుంది. చిన్న విషయమే కదా అని నిర్లక్ష్యం చూపిస్తే అపార నష్టం కలిగిస్తుంది. సామాజిక వికాసం బాధ్యాతాయుత ప్రవర్తనతోనే సాధ్యమవుతుంది. ఆ బాధ్యత దేవుని ఆదేశంగా స్వీకరించడం సర్వదా క్షేమకరం. మనిషి తన దారిన నడుస్తుండగా దారిలో ఏవైనా అడ్డంకులు రాళ్లు, రప్పలు, ముళ్లు వగైరాలు ఉంటే వాటిని తప్పించాలని, ప్రతి ఒక్కరూ భద్రంగా నడవగలిగేలా మార్గం సుగమం చేయాలని ముహమ్మద్ ప్రవక్త (సం) తన అనుచర సమాజానికి ఇచ్చిన శిక్షణ ఇది. పోతూ పోతూ దారిలో ఓ రాయిని తొలగించడం, లేక ముల్లు కనపడితే లేక ఏదైనా పెంకు, సీసా లాంటి మనుషుల్ని బాధపెట్టే, ప్రమాదకరమైన వస్తువులు కనపడితే వాటిని తొలగించడం ఎంతో గొప్ప సత్కార్యం. చూడడానికి ఇదెంతో చిన్నపనిగా కనిపించవచ్చుగాని ఆ పని చేయడం వల్ల దైవం అతడి తప్పిదాలను క్షమించి అతనికి తన కరుణా కటాక్షవీక్షణాలతో అనంతమైన శుభాలను ప్రసాదిస్తాడని ప్రవక్త ఉద్బోధించారు.

## తీర్చిదిద్దే శిక్షణ

తప్పించడం తరువాత సంగతి చాలామంది మరిన్ని ఆటంకాలు సృష్టిస్తారు. నిర్లక్ష్యంగా రోడ్లపై చెత్తకుప్పలు వేస్తారు. ఇంట్లో ఊడ్చిన చెత్తను రోడ్డువారగా పోస్తారు. దారిలో అరటి తొక్కలు, కుళ్లిన పళ్లు, కూరగాయలు, పారబోస్తారు. ఒక్కోసారి పెంకులు, మేకుల్లాంటి ప్రమాదకరమైన వస్తువుల్ని కూడా బాధ్యతారహితంగా రోడ్లపై వేస్తారు.

మానవుల్లో స్వార్థం గూడుకట్టుకోవడం వల్ల, ఎవరెలా పోతే మనకెందుకులే అన్న ధోరణి ప్రబలడం వల్ల మనుషుల్లో నైతికత, బాధ్యతాభావం, తోటి మానవుల పట్ల ప్రేమ, సోదరభావాలు మృగ్యమై పోతున్నాయి. దీనికి విరుగుడుగా ముహమ్మద్ ప్రవక్త వారు గరిపిన శిక్షణ మానవుణ్ణి బాధ్యతాయుతునిగా, శ్రేయోభిలాషిగా, ఎదుటి వారికి కలిగే బాధను తన బాధగా భావించేవాడిగా తీర్చిదిద్దుతుంది.

✦ ✦ ✦

# ౩. దైవానుగ్రహానికి దారి

**నీతో సమానంగా ఎదుటివారిని కూడా ప్రేమించాలి. వారితో ఆత్మీయంగా మెలగాలి. అప్పుడే అల్లాహ్ సంతోషిస్తాడు. నీవు ఎదుటి వారి యోగక్షేమాలు చూస్తే... దైవం నీ మంచి చెడులు చూస్తాడు. దైవానికి చేరువ చేసేది ప్రేమతత్వమే.**

మానవుల్లో ఒకప్పుడు ఉన్న పరస్పర ప్రేమానురాగాలు, ఆప్యాయతానుబంధాలు నేడు లేవు. ఈ కాలంలో మానవుడు ఎంత ప్రగతి సాధించినా, సైన్సు, సాంకేతిక రంగాల్లో ఎన్ని అద్భుతాలు ఆవిష్కరించినా స్వార్థం, స్వలాభాపేక్ష అతన్ని వీడడం లేదు. ఎంతవరకూ తనూ, తన భార్యాపిల్లలు తప్ప, పక్కవారి గురించి పట్టించుకునే పరిస్థితి లేదు. ఎదుటి వారి యోగక్షేమాలు, మంచి చెడ్డలు, వారి అవసరాల వంటి విషయాలకు మన మనస్సుల్లో స్థానమే లేదు. అంతా యాంత్రికం. ఎవరిగోల వారిది. ఎవరి స్వార్థం వారిది. అవతల వారి అవసరాలు తెలుసుకుంటే వారిని ఆదుకోవాల్సి వస్తుందేమోనన్న భయం. చనువుగా వుంటే ఏదైనా అడుగుతారేమోనని, ఎడమొహం, పెడమొహంగా ఉంటే ఏ పేచీ ఉండదన్న భావన.

## అల్లాహ్‌కు వీరంటేనే ప్రేమ

కాని, ముహమ్మద్ ప్రవక్త సల్లల్లాహు అలైహివసల్లం వారు అందరి అవసరాలు తెలుసుకుని, వారిని ఆదుకునే వారు. ఎవరు ఏదడిగినా ఆయన ఏనాడు కాదనలేదు. లేదనలేదు. కష్టంలో ఉన్నవారి అవసరాలు మనం తీర్చగలిగితే మన అవసరాలు అల్లాహ్ తీరుస్తాడని ఆయన సెలవిచ్చారు. అందరి ఆపద్బాంధవుడూ అల్లాహ్‌యే అయినప్పటికీ, ఆయన ప్రసాదించిన దాన్నుంచి, ఆయన దాసుల అవసరాలు తీర్చేవారిని అల్లాహ్ అమితంగా ఇష్టపడతాడని ముహమ్మద్ ప్రవక్త (సం) ఉపదేశించారు.

## సాటివారిని ప్రేమించు

తోటి మానవుల్ని ఆదుకోని వారిని, తోటి మానవుల్ని ప్రేమించని వారిని అల్లాహ్ ఆదుకోడని, ప్రేమించడని కూడా ముహమ్మద్ ప్రవక్త (సం) బోధించారు. మానవుణ్ని దైవమే ఆదుకోకపోతే, ఆయన ప్రేమించకపోతే ఇక అతడికి దిక్కెవరు? కాబట్టి దైవాగ్రహం నుంచి తప్పించుకోవాలన్నా, దైవ ప్రీతికి పాత్రులు కావాలన్నా ఇహలోకంలో, పరలోకంలో సుఖశాంతులు, సాఫల్యభాగ్యం లభించాలన్నా తోటి మానవుల్ని ఆదరించాలి. గౌరవిం చాలి. వారిని ప్రేమించాలి. వారి కష్టసుఖాల్లో పాలు పంచుకోవాలి.

## ప్రేమమూర్తులు కావాలి

సాటి వారు ఆపదలో ఉంటే హృదయ పూర్వకంగా ఆదుకోవాలి. వారి కష్టాలను దూరం చేయడానికి శక్తి వంచన లేకుండా ప్రయత్నం చేయాలి. మన ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా వారి ఇష్టాలను గౌరవించాలి. మన సొంతానికైతే ఒకటి, ఇతరులకైతే మరొకటి అన్నట్లు ఉండకూడదు. మనం మనకోసం ఏ స్థితిని కోరుకుంటామో, తోటి వారికోసం కూడా అదే స్థితిని కోరుకోవాలి. 'మీరు మీకోసం ఇష్టపడినదాన్నే మీతోటి వారికోసం కూడా ఇష్టపడనంతవరకూ మీరు దైవ విశ్వాసులు కాలేరని ముహమ్మద్ ప్రవక్త (సం) వారు తెలియజేశారు. కాబట్టి మనిషి అసలైన దైవ విశ్వాసి కావాలన్నా విశ్వాసం లోని ప్రత్యేక శుభాలను సొంతం చేసుకోవాలన్నా స్వార్థాన్ని వీడి సాటిమానవు లను ప్రేమించడమే ఏకైక మార్గం.

✦ ✦ ✦

# 4. మంచిమాట స్వర్గానికి బాట

సమాజంలో నిత్యం సంభవించే ఎన్నో అనర్థాలకు నోటి దురుసుతనం, అతి వాగుడే ప్రధాన కారణం అంటే అతిశయోక్తి లేదు. కేవలం నోరు పారేసుకోవడం వల్లనే ఎన్ని గొడవలు జరుగుతున్నాయో మనకు తెలియంది కాదు. అందుకే నోరు మంచిదైతే ఊరు మంచిదవుతుంది అన్నారు విజ్ఞులు. మనిషి పాపాల్లో కూరుకుపోయే కారణాల్లో ఎక్కువ శాతం నోటిద్వారా సంభవించే అనర్థాలే. అందుకే నోటిని అదుపులో ఉంచుకో వాలని చాలా గట్టిగా ఆదేశించారు ముహమ్మద్ ప్రవక్త (స). అన్ని రకాల చెడు మాటలనే కాక, అవసరం లేని మాటలు, ప్రయోజనం చేకూర్చని ప్రేలాపనల నుంచి నోటిని సురక్షితంగా ఉంచుకోవాలని హితవు పలికారు. మాట్లాడే అవసరం లేకపోతే, మాట్లాడినా ప్రయోజనం లేదని తెలిస్తే మౌనంగా ఉండడమే అన్ని విధాలా శ్రేయస్కరం. ఇలా చేయడమే ముక్తి మోక్షమార్గాలకు సాధనమని సెలవిచ్చారు ముహమ్మద్ ప్రవక్త సల్లం వారు.

## అల్లాహ్‌ను ఆరాధించండి

ఒకసారి హజ్రత్ మఆజ్ అన్న పేరుగల ప్రవక్త సహచరుడు ఒకరు దైవ ప్రవక్త ముహమ్మద్ వారిని ఇలా అడిగారు. అయ్యా...! నాకేదైనా ఒక ఆచరణను ఉపదేశించండి. దాని కారణంగా నేను స్వర్గంలోకి ప్రవేశించగలగాలి. నరకానికి దూరం కాగలగాలి. అపుడు దైవ ప్రవక్త ముహమ్మద్ (స) వారు నువ్వు చాలా గొప్ప విషయం అడిగావు. అయితే విను. అల్లాహ్‌ను మాత్రమే ఆరాధించు, మనసు లగ్నం చేసి దైవారాధన చేయి, జకాత్ దానం చెల్లిస్తూ ఉండు. రమజాన్ మాసంలో ఉపవాస వ్రతం పాటించు. (స్తోమత ఉంటే) మక్కా వెళ్లి దైవగృహాన్ని సందర్శించు అని చెబుతూ చివరిగా దైవ ప్రవక్త ముహమ్మద్ (స) వారు తన 'నాలుక'ను పట్టుకుని, "ఇదిగో దీన్ని అదుపులో వుంచుకో" అని సెలవిచ్చారు.

## నోటి దురుసుదనం... నరక మార్గం

ఈ ఉపదేశం విన్న ప్రవక్త సహచరుడు మఆజ్, దైవప్రవక్తా! మనం ఏదో ఒక

విషయమై మాట్లాడుకుంటూనే ఉంటాం కదా! మరి దీనిని గురించి కూడా ప్రశ్నించడం జరుగుతుందా? అని అడిగాడు, అప్పుడు ముహమ్మద్ ప్రవక్త 'మఆజ్! నిత్య జీవితంలో అవసరమైన మాటలు, మానవ సమాజానికి మేలుకలిగే విషయాలు, సంఘసంస్కరణ కోసం ధర్మబద్ధంగా సంభాషించే విషయాలు తప్ప, నిర్భీతిగా అయిందానికి, కానిదానికి అసభ్యంగా అడ్డగోలుగా మాట్లాడే మాటలు.. మానవుల్ని బోర్లాపడేసి, నరకంలోకి ఈడ్చుకుపోతాయి అని సెలవిచ్చారు.

## ఇహం..పరం

ఈ ప్రవచనంలో ముహమ్మద్ ప్రవక్త దేవుని ఏకత్వం, ఆరాధన, ఉపవాసవ్రతం, దాన ధర్మాలు, హజ్ యాత్ర లాంటి ముఖ్యమైన ధార్మిక విధుల్ని వివరిస్తూ ప్రత్యేకంగా నోటిని అదుపులో ఉంచుకోవాలని ఉపదేశించారు. అలా కాకుండా ఎన్ని మంచి పనులు చేసినా, నోరు మంచిది కాకపోతే మాత్రం సకల సత్కార్యాలు బూడిదలో పోసిన పన్నీరు వలె వృధా అయిపోతాయి. స్వర్గ ప్రవేశం మాట అటుంచి నరక గుండంలోకి బోర్లా పడేసి, ముక్కు రాసుకుంటూ ఈడ్చుకుపోబడతారని తీవ్రంగా హెచ్చరించారు. కనుక నోరు మంచిదైతేనే ఇహలోకంలో మనకు గౌరవ ప్రపత్తులు లభిస్తాయి. పరలోకంలో స్వర్గం ప్రాప్తిస్తుంది. కనుక ప్రవక్త మాటలు శిరసావహిద్దాం.

✦ ✦ ✦

# 5. కలిసిఉంటే కలదు సుఖం

**మానవులంతా భిన్నత్వంలో ఏకత్వంగా కలిసిమెలిసి ఉండా లని ప్రవక్త సూచించారు. అందరినీ ద్వేషిస్తూ, విరోధ భావంతో ఉంటే ఇహపరలోకాలలో కష్టాలపాలవుతాం. మంచి గుణాలతో, సోదరభావంతో ఉంటే అల్లాహ్ అనుగ్రహం లభిస్తుంది.**

మానవులు పరస్పరం సఖ్యతతో, ప్రేమానురాగాలతో ఒకే దేహం, ఒకే ప్రాణంలా కలిసి మెలసి ఐక్యంగా ఉండాలి. అలాగే కులం, మతం, హోదా, అధికారం లాంటివి ప్రేమానురాగా లకు అడ్డుగోడలుగా నిలువరాదని ముహమ్మద్ ప్రవక్త (సం) ఉపదేశించారు. దీనికి భిన్నంగా కులమతాలు, భాష, ప్రాంతీయత, హోదా, అధికారాలు ప్రాతిపదికగా మానవులు పరస్పరం ఒకరిపై ఒకరు అసూయా ద్వేషాలు, అనుమానాలు, అపనమ్మకాలు పెంచుకుని శత్రువులుగా మారడాన్ని ప్రవక్త తీవ్రంగా ఆక్షేపించారు. ఒకరి మీద ఒకరికి నమ్మకం లేకపోవడం, దుర్భాషలాడడం, సంబంధాలు తెంచుకోవడం లాంటివి చేయకూడదు. కష్టాల్లో ఉన్నవారిని చూసి సంతోషించడం, బాధపెట్టడం, ఇతరుల మనసును గాయపరచడం, అసూయా ద్వేషాలు కలిగి ఉండడం మహాపాపం. ఇలాంటి వారిని దైవం ఇహపరలోకాల్లో పరాభవం పాలు చేస్తాడని కూడా ప్రవక్త (సం) హెచ్చరించారు.

## దైవాదేశం

హజ్రత్ అబూహురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం ముహమ్మద్ ప్రవక్త (సం) ఇలా ప్రవచించారు. “మీరు ఇతరుల విషయంలో అనుమానాలకు దూరంగా ఉండండి. ఎందుకంటే, అనుమానం అతిపెద్ద అసత్యం. అలాగే ఇతరుల బలహీనతలేమిటో తెలుసుకునే ప్రయత్నం చేయకండి. గూఢచారుల్లా వారి రహస్యాలను, తప్పిదాలను సేకరించే ప్రయత్నం కూడా చేయకూడదు. ఒకరిని మించిపోవడానికి ఒకరు వృధా ప్రయాస పడకూడదు. పరస్పరం అసూయాద్వేషాలు, కుట్రలు కుతంత్రాలు చేయవద్దు. ఎడమొగం, పెడమొగంగా ఉండకూడదు. దేవుని దాసులయిన మానవులారా! దైవాదేశం మేరకు పరస్పరం సోదరులుగా కలిసి మెలసి ఉండండి” (బుఖారి, ముస్లిం)

## విడదీసే అసూయాద్వేషాలు

మానవుల హృదయాల్లో పగ, ప్రతీకారం, అసూయాద్వేషాలను పెంచి పోషించే వాటిని, మానవ సంబంధాలను విచ్ఛిన్నం చేసే వాటిని ముహమ్మద్ ప్రవక్త ఆక్షేపించారు. మొట్టమొదట ప్రవక్త అనుమానం కుశంకలను గురించి ప్రస్తావించారు. ఇదొక అసత్య భ్రమ, ఈ రుగ్మతకు లోనయిన వారి పరిస్థితి ఎలా ఉంటుందంటే ఎవరితోనైనా కొద్దిగా విభేదంతలెత్తితే, ఇక వారి ప్రతి విషయంలో ప్రతి పనిలో వారికి దురభిప్రాయం, దుష్ట సంకల్పమే కనిపిస్తూ ఉంటుంది. లేనిపోని విషయాలలో కల్పించుకుంటారు. సాధారణంగా దీని దుష్ప్రభావం భౌతిక చర్యలపై కూడా ఉంటుంది. దీంతో ఎదుటి వ్యక్తి నుంచి కూడా ప్రతి చర్య మొదలవుతుంది. ఈ విధంగా ఇరువురి మధ్య సంబంధాలు క్షీణించి పోతాయి. తద్వారా సంబంధాలు శాశ్వతంగా చెడిపోయే ప్రమాదం కూడా ఉంది.

## సదుద్దేశమే ఆరాధన

ముహమ్మద్ ప్రవక్త (సం) ఇలా చెప్పారు. ఇతరుల పట్ల అనుమానాలు, అపోహలు, దురభిప్రాయాలు ఉండడాన్ని చెడుగా, దుష్టగుణంగా చెప్పారు. అలాగే ఇతరుల పట్ల సదభిప్రాయం సదుద్దేశం ఉండడాన్ని చక్కని 'ఆరాధన' అని కూడా అభివర్ణించారు. (అహ్మద్) తరువాత ముహమ్మద్ ప్రవక్త (సం) ఇతరుల బలహీనతలను వెదకడం, వారి లోపాలను, తప్పిదాలను రహస్యంగా సేకరించడం, మంచి స్థితిలో ఉన్నవారిని చూసి అసూయ పడడాన్ని, ఓర్వలేని తనాన్ని తీవ్రంగా వ్యతిరేకించారు. ఇలాంటి చర్యలకు పాల్పడిన వారిని దైవం పరలోకంలోనే కాదు, ఇహలోకంలో కూడా కష్టాలపాలు చేస్తాడని హెచ్చరించారు.

## పవిత్ర హృదయం ప్రధానం

'దైవ దాసులయిన మానవులారా! సోదరుల్లా ఐక్యంగా ఉండండి' అని ముహమ్మద్ ప్రవక్త (సం) సెలవిచ్చారు. అంటే పగ ప్రతీకారాలను, ఓర్వలేనితనాన్ని పెంచి పోషించే దుర్గుణాల నుంచి మీ హృదయాలను పవిత్రంగా, పరిశుద్ధంగా ఉంచుకోనంతవరకు మీరు సోదరభావంతో కలిసిమెలసి ఉండలేరని తెలిపారు. కావున ముహమ్మద్ ప్రవక్త (సం) ప్రవచనాలను మనం ఆచరిస్తే నేటి మన సమాజంలో కనిపిస్తున్న చెడు, దుర్గుణాల వాతావరణం తొలగిపోతుంది. దాంతో దైవ దాసులంతా సోదరభావంతో కలిసిమెలిసి ఉంటారనడంలో సందేహం లేదు.

✦ ✦ ✦

# 6. దైవాన్ని నమ్మితే సమాజంలో శాంతి

**మంచితనంలో ఒకరిని మరొకరు మించి పోవాలి కానీ చెడ్డ పనుల్లో కాదని దైవగ్రంథం స్పష్టం చేస్తున్నది. మంచి పనులు చేస్తూ, దైవానికి దాసోహం అన్నప్పుడే వ్యక్తి వికాసం కలుగుతుంది... సమాజం సుఖమయం అవుతుంది.**

యావత్తు సృష్టిరాసుల్లో మానవుడు బుద్ధిజీవి, శ్రేష్టజీవి. ఆలోచనాశక్తి, మంచీ చెడుల విచక్షణా జ్ఞానం ఒక్క మానవుడికే సొంతం. సర్వసృష్టిలో ఏ జీవరాశికీ లేని ప్రత్యేకతను, శ్రేష్టతను, విచక్షణాజ్ఞానాన్ని ఒక్క మానవుడికే ప్రసాదించాడు దైవం. అందుకని మానవ మనుగడకు, క్రమబద్ధ జీవన విధానానికి, ఒక ధ్యేయం, ఒక గమ్యం, ఒక ధర్మం అత్యంత అవసరం. అప్పుడే మానవ జీవితం సక్రమ మార్గాన పయనిస్తుంది. అలా కాకుండా, మనిషి తన ప్రత్యేకతను విస్మరించి, తనకు మాత్రమే ప్రసాదించబడిన స్వేచ్ఛను దుర్వినియోగపరుస్తూ కోరికలకు దాసులై ఇష్టానుసారంగా జీవితం గడిపితే దైవం మానవుడికి ప్రసాదించిన శ్రేష్ఠ స్థానాన్ని కోల్పోయి, నీచ స్థితికి దిగజారిపోతాడు.

దురదృష్టం ఏమిటంటే ఇప్పుడు మనిషి తన ప్రత్యేకతను, తన నిజస్థానాన్ని గుర్తించకుండా, గుర్తించినా అదంతా తన స్వయం కృషేనన్న భ్రమలో దైవాన్ని, దైవచట్టాలను, దైవ ధర్మాన్ని పక్కన పెట్టి, తాత్కాలిక సుఖ భోగాల కోసం మంచి చెడుల్ని, సత్యాసత్యాలను, ధర్మాధర్మాలను వదిలివేశాడు. ఫలితంగా సమాజంలో ఎన్నో దుర్మార్గాలు, దురాచారాలు ప్రబలిపోయాయి. సమాజంలో ఒకరిపట్ల ఒకరికి నమ్మకం, గౌరవ మర్యాదలు లేవు. తల్లిదండ్రుల పట్ల సంతానానికి, సంతానం పట్ల తల్లిదండ్రులకు, భార్యపై భర్తకు, భర్తపై భార్యకు ఉండవలసిన రీతిలో ప్రేమానురాగాలు, నమ్మకాలు లేవు. మానవుల మధ్య మానవ సంబంధాలు పతన దశకు చేరుకుంటున్నాయి. కుటుంబ విలువలు క్షీణిస్తున్నాయి, కలుషితమై పోతున్నాయి. మాటల్లో కల్తీ, చేతల్లో కల్తీ, ప్రేమలో కల్తీ, వ్యాపారంలో కల్తీ, అధికారంలో కల్తీ, రాజకీయాల్లో కల్తీ, ఇలా సమాజంలో ఏ

రంగంలో చూసినా అంతా కల్తీమయం. అవినీతి, అక్రమం, సారాయి, జూదం, వ్యభిచారం సర్వసామాన్యమవుతున్నాయి.

దీనంతటికీ కారణం ఏమిటని మనం ఆలోచిస్తే దైవం తనకు ప్రసాదించిన స్వేచ్ఛను, ప్రత్యేకతను, విచక్షణా జ్ఞానాన్ని మనిషి సక్రమ మార్గంలో వినియోగించకుండా; స్వార్థానికి, స్వలాభాలకు, తాత్కాలిక భోగ విలాసాలకు దుర్వినియోగం చేయడమే ప్రధాన కారణంగా కనిపిస్తోంది. దైవం తన గ్రంథంలో ఇలా అంటున్నాడు. 'మేము మానవుల లోని ప్రతి ఒక్కరి కోసం ఒక ధర్మశాస్త్రాన్ని ఒక జీవిత విధానాన్ని నిర్ణయిం చాము. కనుక మీరంతా మంచి పనుల్లో ఒకరినొకరు మించి పోవడానికి ప్రయత్నించండి. మీరు చేసేవన్నీ దైవానికి తెలుసు. ఆయనకు భయపడండి. (మాయిదా 51)

✦ ✦ ✦

# 7. నిస్వార్థ సేవతోనే అనుగ్రహం

**రెండు చేతులా సంపాదించు.. ఇబ్బడి ముబ్బడిగా ఖర్చు పెట్టు.. అంతేకాని దానధర్మాలంటూ డబ్బును వృథా చేయ వద్దంటూ షైతాను మన మనసును పక్కదారి పట్టిస్తూ ఉంటుంది. అయితే ప్రతిఫలం ఆశించని దానధర్మాలు చేస్తేనే దైవానుగ్రహం లభిస్తుందంటుంది ఖుర్ఆన్.**

నేటి మన సమాజం అసంఖ్యాక సమస్యలకు, చెడులకు అలవాలమైంది. దీనికి కారణం ఆర్థిక వెనుకబాటు అని చాలామంది భావిస్తారు. ఆర్థికంగా మంచి స్థితిలో ఉంటే సమస్యలన్నీ పరిష్కారం అవుతాయనే అపోహ కూడా చాలా మందిలో ఉంది. ఏదో ఒక విధంగా వీలైనంత ఎక్కువ మొత్తంలో డబ్బు సంపాదించాలనో, సంపాదించిన డబ్బును పైసాకు పైసా కూడబెట్టాలనో, లేక విలాసాలకు ఖర్చు పెట్టాలనో కూడా మనం అనుకుంటూ ఉంటాం.

## ధనాశ సర్వాంతర్యామి

ఇలాంటి ఆలోచనా విధానాన్ని మనం పరిశీలించినట్లయితే రెండు విషయాలు మన ముందుకొస్తాయి. ఒకటేమిటంటే, డబ్బు పట్ల వల్లమాలిన ప్రేమ, వ్యామోహం, రెండవది అవసరానికి మించి అనవసరంగా దుబారా చేసే మనస్తత్వం. మానవుల మనసుకు పట్టుకున్న ఈ రోగం చాలా విచిత్రమైనది. షైతాన్ అనేవాడు ఎప్పుడూ ఈ రెండు దృక్పథాల ద్వారా, దైవం మానవులకు ప్రసాదించిన వరాలను, అనుగ్రహాలను, స్వయంగా మానవుల చేతనే దుర్వినియోగమయ్యేలా చేస్తున్నాడు. 'ధర్మా ధర్మాలంటూ, పాప పుణ్యాలంటూ కూర్చొని, ఇబ్బడి ముబ్బడిగా, వీలైనంత ఎక్కువ ధనం సంపాదించక పోతే ఆర్థికంగా వెనుకబడి పోతావు' అని షైతాన్ పిశాచి మనిషి మనసులో దూరి నూరిపోస్తాడు. సంపాదన ప్రారంభం కాగానే, ఇక ఆ ధనాన్ని బాగా కూడబెట్టి కోట్లకు పడగలెత్తు. లేకపోతే నీ సొమ్మును నీ ఇష్టం వచ్చినట్లు ఖర్చుచేసి కోరికలన్నీ తీర్చుకో. విలాసాల్లో మునిగితేలు కానీ పుణ్యకార్యాలని, అనాథలు, నిరుపేదలని, దరిద్రులు, ధార్మిక

సంస్థలంటూ దానం చేసి నీ కష్టార్జితాన్ని బుగ్గిపాలు చేసుకోకు అనికూడా చెబుతాడు.

## ధర్మ శూన్యత

ఈ విధమైన ఆలోచనా ధోరణి చాలా ప్రమాదకరమైనది. ఇలాంటి ఆలోచన కలిగినవారు సత్కార్యాల కోసం, అన్నార్తులు, అభాగ్యుల కోసం పైసాకూడా ఖర్చు పెట్టరు. కాని విచిత్రమేమిటంటే, ఎంతో పొదుపరులు, దూరదృష్టికలవారు, ఎంగిలి చేత్తో కాకిని కూడా కొట్టరని ముద్రపడ్డవాళ్లు సైతం ఒక్కోసారి అనవసర పనుల్లో, మంచినీళ్లలా డబ్బును వృధా చేస్తారు. ఇలాంటి ధోరణి గురించే దైవం ప్రజల్ని హెచ్చరిస్తూ ఇలా అంటున్నాడు.

## అన్నార్తుల వైపే చూడరు

"షైతాన్ చర్యలపట్ల అప్రమత్తంగా ఉండండి. వాడు మీ మనసులను కలుషితం చెయ్యడానికి అనుక్షణం మీ వెనుకే కాచుకుని ఉన్నాడు. ధనం కూడబెట్టకపోతే ఇతరుల దయా దాక్షిణ్యాలపై ఆధారపడ వలసి వస్తుందని రకరకాలుగా భయపెడతాడు. అంతేకాదు విలాసవంతమైన జీవితం గడపడానికి, దుబారాలు చేయడానికి వాడు మీకు కొత్త కొత్త మార్గాలు చూపిస్తాడు. వాడి పంజాలో చిక్కుకున్న వారు మనో వాంఛల్ని తీర్చుకోడానికైతే వేలాది రూపాయలు ఖర్చు పెడతారు. కానీ అన్నార్తునికి అగత్యపరునికి ఒక్కపూట పట్టెడన్నం పెట్టాలంటే విలవిల్లాడిపోతారు". (ఖుర్ఆన్)

## ప్రతిఫలం ఆశించనిదే సేవ...

మన సమాజంలో ప్రబలిన ఈ చెడు దూరం కావాలంటే దైవం, దైవ ప్రవక్త సూచించిన మార్గంలో నడవడమే సరైన పరిష్కారం. ప్రజల్లో నైతిక పరివర్తన రావాలని, ప్రతిమనిషి హృదయంలో ఇతరుల పట్ల ప్రేమ, సానుభూతులు జన్మించాలని ముహమ్మద్ ప్రవక్త (సం) ప్రవచించారు. అంతేకాదు తమ ప్రేమ సానుభూతులకు ఇతరుల నుంచి ఏమీ ఆశించకూడదని, నిస్వార్థంతో ప్రజలకు చేసే మేలునే దైవం స్వీకరిస్తాడని ఆయన సెలవిచ్చారు. ప్రజల నుంచి ప్రతిఫలం ఆశించకుండా చేసే ప్రతి పనికి అనేకరెట్లు పుణ్యఫలం దైవం మనకు ప్రసాదిస్తాడు.

✦ ✦ ✦

# 8. ద్వంద్వ వైఖరి

**ప్రళయ దినం నాడు అందరికంటే నీచమైన స్థితిలో ఒక మనిషిని చూస్తారు. అతడు కొందరి వద్దకు వెళ్లేటప్పుడు ఒక ముఖంతో, మరికొందరి దగ్గరకు వెళ్లేటప్పుడు మరొక ముఖంతో వెళ్లేవాడై ఉంటాడు అన్నారు ముహమ్మద్ ప్రవక్త. అలాంటి వైఖరిని వీడితేనే దైవ కృప లభిస్తుంది.**

ఇద్దరు వ్యక్తులు, లేదా రెండు వర్గాల మధ్య ఎప్పుడైనా వైరం, వైరుధ్యం ఏర్పడితే, కొంతమంది ఇరువైపులా వ్యవహారం నడుపుతూ ఒకరికి వ్యతిరేకంగా మరొకరి వద్ద మాట్లాడుతూ ఉంటారు. ఇది కొంతమందికి అలవాటు. ఇదే విధంగా మరి కొంతమంది ఒక వర్గంతో కలిసి ఉంటూ, వారితో మంచి సంబంధాలు కొనసాగిస్తూ వారి వ్యతిరేకుల దగ్గర, వారికి వ్యతిరేక ప్రచారం చేస్తుంటారు. ఇలాంటి వాళ్లను ద్వంద్వ స్వభావం కలవారని అంటాం.

ఇలాంటి ద్వంద్వ వైఖరిని కపట వైఖరిగా, మోసపూరిత వైఖరిగా పరిగణిస్తారు. ఇలాంటి దుష్ట స్వభావానికి దూరంగా ఉండాలని, ఇది మహాపాపమని ఇలాంటి వైఖరి అవలంబించే వారు ఘోరమైన శిక్షను అనుభవిస్తారని, ఇహలోకంలోనే కాకుండా, పరలోకంలో కూడా భయంకరమైన శిక్షను చవిచూస్తారని ముహమ్మద్ ప్రవక్త (స) హెచ్చరించారు.

హజ్రత్ అబూహురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం ముహమ్మద్ ప్రవక్త (సం) ఇలా సెలవిచ్చారు. "మీరు ప్రళయ దినం నాడు అందరి కంటే నీచమైన స్థితిలో ఒక మనిషిని చూస్తారు. అతడు కొందరి వద్దకు వెళ్లేటప్పుడు ఒక ముఖంతో, మరి కొందరి దగ్గరకు వెళ్లేటప్పుడు మరొక ముఖంతో వెళ్లేవాడై ఉంటాడు. (బుఖారి, ముస్లిం)

మరొక ప్రవచనంలో ముహమ్మద్ ప్రవక్త (సం) ఇలా ఉపదేశించారు. 'ఇహ లోకంలో రెండు నాలుకలు ఉన్న మనిషి నోటిలో ప్రళయ దినాన రెండు అగ్ని నాలుకలు

ఉంటాయి" (అంటే మునాఫిఖ్ (కపటి) లాగా ఎక్కడి మాట, అక్కడ మాట్లాడేవాడు) (అబూదావూద్, అమ్మార్ బిన్‌యాసిర్)

కొంతమంది తమకు అవసరం లేకపోయినా ఇరువర్గాల మధ్య దూరి ఎవరికి చెప్పే మాయ మాటలు వారికి చెప్పి 'ఇరు వర్గాలనూ రెచ్చగొట్టి ఆనందిస్తారు. అలా కాకుండా సదుద్దేశంతో ఇరువురి మధ్య సయోధ్య కుదిరిస్తే అలాంటి వాళ్లను అభినందించాలి. కాని ఇక్కడ ద్వంద్వ స్వభావులు ఇరువురి మధ్య మరింత అగాధాన్ని సృష్టించి పైశాచిక ఆనందం పొందుతారు. ఇలాంటి కపటులు, ప్రళయ దినాన అత్యంత భయంకర శిక్షను చవిచూస్తారని ప్రవక్త హెచ్చరించారు. ఇక్కడ మనం ఒక విషయాన్ని అర్థం చేసుకోవాలి. దుష్కార్యాలు, దుష్ప్రవర్తనలు దైవం దృష్టిలో అత్యంత తీవ్రమైనవి. మనం వాటిని చాలా మామూలు విషయాలుగా పరిగణిస్తాం. అందుకని వాటికి దూరంగా ఉండేందుకు నిరంతరం ప్రయత్నించాలి. ఇలాంటి చెడులను గురించి పవిత్ర ఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది: 'వతహ్‌సబూనహు హయ్యినం వహువ ఇందల్లాహి అజీం' అంటే మీరు చాలా చిన్న విషయమని, మామూలు విషయమని భావిస్తారో దేవుని దృష్టిలో అది చాలా గొప్ప విషయం, తీవ్రమైన విషయం అని అర్థం.

## దైవకృపకు మార్గం

ద్వంద్వ వైఖరి అనే దురలవాటు కూడా ఆ కోవకు చెందిందే. చాలా మంది దీన్ని చాలా సామాన్య విషయంగా భావిస్తుంటారు. దీనికి దూరంగా ఉండాలని, దీన్నుంచి రక్షింపబడాలనే ధ్యాసే ఉండదు. కాని ఇది ఎంత భయంకరమైన తప్పో ముహమ్మద్ ప్రవక్త ప్రవచనాల ద్వారా మనకు అర్థమవుతోంది. దీని వల్ల ఇహలోకంలో కూడా పరాభవం పాలు, అభాసుపాలు కావడంతో పాటు, పరలోకంలో తీవ్రమైన శిక్ష అనుభవించాల్సి ఉంటుందన్న విషయం కూడా మనకు తేటతెల్లమయింది. కావున ఇహలోకంలో గౌరవప్రదమైన జీవితం గడపాలన్నా, పరలోకంలో దైవప్రీతికి, దైవ ప్రేమకు పాత్రులు కావాలన్నా ఇలాంటి ద్వంద్వ స్వభావాన్ని వీడి, పరిశుద్ధ హృదయంతో సాటి మానవ సోదరుల పట్ల ప్రేమ భావాన్ని కలిగి ఉండాలి. అప్పుడే దైవ శిక్ష నుంచి తప్పించుకుని ఆయన ప్రేమకు పాత్రులు కాగలం.

✦ ✦ ✦

# 9. నోరు మంచిదయితేనే స్వర్గ ప్రాప్తి

మహ్మద్ ప్రవక్త ఇలా అన్నారు .... 'తమ పెదవుల మధ్య ఉండే నాలుకను, తమ తొడల మధ్య వుండే మర్మాంగాన్ని కాపాడుకుంటామని ఎవరు నాకు హామీనిస్తారో, వారికి స్వర్గం లభిస్తుందని నేను హామీనిస్తాను.' నాలుకను విచ్చలవిడిగా వదిలేసి, దాన్ని దుర్వినియోగం చేయడమంటే, కోరి ఆపదలు కొని తెచ్చుకోవడమే.

## అసత్యం ఆపద

నోరు తెచ్చే ఆపదలో అసత్యం ఆడడం అన్నిటికంటే పెద్ద ఆపద. ఈ ఒక్క ఆపదను గనక దగ్గరికి రాకుండా చూసుకోగలిగితే, మిగతా ఆపదను ఎదుర్కోవడం చాలా తేలిక. ఎందుకంటే అసత్యం అనేక అనర్థాలకు దారి తీస్తుంది, చాలా తేలిగ్గా కనిపించే ఈ అసత్యం గనక ఒక్కసారి పలికినట్లయితే దాన్ని కప్పిపుచ్చుకోవడానికి మరిన్ని అబద్ధాలు ఆడవలసి ఉంటుంది. అబద్ధాలకు పాల్పడే వారు అనేక నీతి మాలిన పనులక్కూడా పాల్పడుతుంటారు. ఈ నీతిమాలిన పనుల్ని కప్పిపుచ్చుకోడానికి వాడే అందమైన తొడుగే ఈ అసత్యం. ఎట్టి పరిస్థితిలోనూ అసత్యం పలకనని, సదా సత్యమే పలుకుతానని తీర్మానించుకున్న మనిషి సకల దుర్మార్గాలకు, దుర్గుణాలకు, నీతిమాలిన పనులకు దూరంగా ఉంటాడు. ఎందుకంటే విచారణ అంటూ జరిగితే అతడు నిజమే పలకవలసి ఉంటుంది . కాబట్టి అన్ని రకాల చెడులకు దూరంగా ఉంటాడు. ముహమ్మద్ ప్రవక్త అబద్ధం పలకడం ఎట్టి పరిస్థితులలోనూ ధర్మసమ్మతం కాదని పరిహాసానికైనా అబద్ధం పలకకూడదని, మీలో ఎవరైనా మీపిల్లలకు ఏదైనా ఇస్తామని చెప్పి తరువాత ఇవ్వక పోవడం కూడా ధర్మసమ్మతం కాదని చెప్పారు.

## కపట లక్షణాలు

ఒక అసత్యాన్ని మీ తోటి వారు నిజమని నమ్మేటట్లు చెప్పడం కూడా ఘోరమైన విశ్వాసఘాతుకం. (అబూదావూద్)

అబద్దాలకు అలవాటు పడ్డ మనిషి క్రమంగా కపటిగా కూడా మారిపోతాడు.

కపట వ్యక్తిలో ముఖ్యంగా నాలుగు దుర్లక్షణాలు ఉంటాయని ప్రవక్త(స) సెలవిచ్చారు. ఎవరిలోనైతే ఈ నాలుగు దుర్లక్షణాలు ఉంటాయో అతడు పరమ కపటి. ఒకవేళ అతనిలో ఈ నాలుగింటిలో ఏ ఒక్క గుణం ఉన్నా ఆ మేరకు అతడు కపటే. ఆ దుర్గుణాలు ఏమిటంటే....

1. నమ్మి అతడికేదైనా వస్తువు అప్పగిస్తే అతడు దాన్నికాజేస్తాడు,

2. వాగ్దానం చేస్తే దాన్ని భంగపరుస్తాడు.

3. నోరు విప్పితే అబద్ధాలే పలుకుతాడు.

4. వాదులాటకు దిగితే నోటితో బూతులు పలుకుతాడు .

దైవదూతలు మనం మాట్లాడే ప్రతిమాటను రాసి పెడుతున్నారన్న విషయం మరవ కూడదు. మనం మాట్లడే ప్రతిమాటకు దైవం ముందు సమాధానం చెప్పుకోవాలనే భావన మన దృష్టి పథం నుండి దూరం కాకూడదు...

✦ ✦ ✦

# 10. అమృత వచనాలు

మనం మాట్లాడే ప్రతి మాటా మధురంగా ఉండాలి. మన ప్రతి మాటకూ రేపు దైవం ఎదుట సమాధానం చెప్పుకోవాలని గ్రహించాలి. ఆ భావన ఉన్నప్పుడు మన మాటలు అమృతపు జల్లులవుతాయి.

సకలచరాచర సృష్టికర్త అయిన దైవం మానవులను సృష్టించి వారి మార్గదర్శనం కోసం ప్రవక్తలను, గ్రంథాలను అవతరింపజేశాడు. ముహమ్మద్ ప్రవక్త ఆ పరంపరలోని చివరి ప్రవక్త. దైవం ద్వారా ఉపదేశాలు పొందిన ప్రవక్త (సం) వాటినే మానవాళికి అందించారు. ఒకసారి దైవోపదేశాలను ప్రజలకు ఉపదేశిస్తూ ఇలా సెలవిచ్చారు.

## మధ్యే మార్గం

"ఏకాంతంలోగాని, బాహ్యంలోగాని, ఏ స్థితిలోనైనా దైవానికి భయపడండి. ఆనందంలోనూ, ఆగ్రహ స్థితిలోనూ న్యాయం, సత్యమే పలకండి" అంటే ఇష్టం లేని వారి గురించి వ్యతిరేకంగా మాట్లడడం, ఇష్టమైన వాళ్లు చెడ్డవాళ్ళయినా సమర్థించడం, వారి పక్షాన మాట్లాడడం చేయకూడదు. మిత్రుడైనా, శత్రువైనా ఎట్టి పరిస్థితిలోనూ న్యాయం పక్షానే మాట్లాడాలి.

కలిమిలోనూ, లేమిలోనూ ఏ స్థితిలోనైనా సత్యమార్గాన్ని అవలంబించాలి. అంటే దైవం పేదరికానికి, దారిద్ర్యానికి లోనుచేసినప్పుడు అసహనానికి, ఆందోళనకు లోను కాకూడదు. దైవం సంపదను, సంతోషాన్ని ప్రసాదించినప్పుడు మనిషి తన నిజ స్థితిని మరిచిపోయి గర్వపడకూడదు. తలబిరుసుతనం ప్రదర్శించకూడదు..

## మౌనచింతన

మీతో బంధుత్వ సంబంధాలు తెంచుకొని, దుష్ప్రవర్తన అవలంబించే బంధు జనుల పట్ల మీరు సత్సంబంధాలు కొనసాగించండి. వారి హక్కులను సక్రమంగా నెర వేర్చండి. ఎవరైతే మిమ్మల్ని తృణీకరించారో, మీ హక్కులను కొల్లగొట్టారో అలాంటి వారి

హక్కులను మీరు నెరవేర్చాలని, దైవం మిమ్మల్ని ఆదేశిస్తున్నాడు. మిమ్మల్ని హింసించిన వారిని, మీపై దౌర్జన్యం చేసిన వారిని క్షమించాలని దైవం ఆజ్ఞాపిస్తున్నాడు. మౌనంగా ఉన్నప్పుడు మంచి విషయాల గురించే ఆలోచించాలని ముహమ్మద్ ప్రవక్త సెలవిచ్చారు.

## దైవ స్మరణ కావాలి

మీ సంభాషణ దైవస్మరణ కావాలి. మీ దృష్టి గుణపాఠం గ్రహించే దృష్టి కావాలి అన్నారు ప్రవక్త(స). అంటే సంభాషణలో ఆత్మీయత ఉట్టిపడాలి, ఎవరి మనస్సునూ నొప్పించకూడదు, ప్రతీ మాటకూ రేపు దైవం ముందు సమాధానం చెప్పాలనే భావన ఉండాలి. ఇలాంటి సంభాషణ దైవ స్తోత్రం సమానమని ప్రవక్త ప్రవచనాల భావం. అలాగే సృష్టిలోని ప్రతి వస్తువు నుంచీ మనం గుణపాఠం నేర్చుకోవాలి. నిజమైన ధార్మిక దృష్టిని అలవరుచుకొని ప్రవక్త ప్రవచనాల వెలుగులో జీవితాలను సాఫల్యం దిశగా మలచుకోవచ్చు.......

✦ ✦ ✦

# 11. సత్కార్యమే సత్యమార్గం

**సత్కార్యాల్లో ఇతరులతో పోటీ పడండి.... ధన సేకరణ విషయంలోకాదు అని ముహమ్మద్ ప్రవక్త సందేశం ఇచ్చారు. ప్రపంచంలో కష్టాలు పడుతున్న వారెందరో ఉన్నారు. మనకు లభించిన జీవితం దైవం ప్రసాదించిన వరమని, సంతృప్తిగా... ఆనందంగా జీవించాలని ఆయన ప్రవచించారు. ఖుర్ఆన్‌లో సంతృప్తిని గురించి ఇలా ఉంది.**

మీరు ఇతరులతో పోటీ పడండి, కానీ ధన సంపదల విషయంలో కాదు, సత్కార్యాల విషయంలో అని ముహమ్మద్ ప్రవక్త బోధించారు. అంటే మీ తోటి వారు ఒక సత్కార్యం చేస్తే మీరు రెండు సత్కార్యాలు చెయ్యండి, మంచికి, సదాచరణకు, పరోపకారానికి సంబంధించి మీకు సాధ్యమైనంత మేర ఇతరులతో పోటీ పడండి.చేతకాని భారాన్ని నెత్తిన వేసుకోకండి, లేమికి సంబంధించి మీరు మీకంటే కింది వారిని చూడండి అని సెలవిచ్చారు. అంటే, ఆర్థికంగా, సామాజికంగా తనకంటే కింది స్థాయిలో ఉన్నవారి జీవితాలను చూసినట్లయితే, దైవం మనకు ప్రసాదించిన మెరుగైన జీవితం పట్ల సంతృప్తి కలగడమే కాకుండా, గర్వం అహంకారం మన దరిచేరవు, దైవం పట్ల కృతజ్ఞతా భావంతో హృదయం పరవశించిపోతుంది.

## ఆ జాగ్రత్త అవసరం

సాధారణంగా మానవుడెప్పుడూ తనకంటే పై వాడినే చూస్తాడు... కానీ క్రిందివాడ్ని చూడడు. తన పక్కవాడికి పదెకరాలు పొలం వుంటే తనకు ఇరవైఎకరాలుండాలని, అతడికో పెద్ద బిల్డింగ్ ఉందంటే తనకు అంతకంటే పెద్దది ఉండాలని, అతడి బ్యాంక్ బ్యాలన్స్ కంటే తనదే ఎక్కువ వుండాలని, అతడి పిల్లలు హైదరాబాద్‌లో చదువుతుంటే తన పిల్లలు అమెరికాలో చదవాలని ఈ విధంగా ఒక్కవిషయంలో అని కాకుండా ప్రతి విషయంలోనూ తన పక్కవాడి కంటే ఒక్క మెట్టు పైనే ఉండాలని కోరుకుంటాడు, ప్రతి

విషయంలో పరులతో పోటీ పడుతుంటాడు. ఒకవిధంగా ఇలాంటి కోరిక తప్పుకాక పోయినప్పటికీ, అది ఈర్ష్యగా అసూయగా మారకుండా జాగ్రత్త పడవలసిన అవసరం ఉంది.

## దైవానికి కృతజ్ఞత

ఒకసారి షేక్ సాది(ర) కాలి నడకన ప్రయాణిస్తూ ఒక ఊరుకు చేరుకున్నారు. అప్పుడాయన కాలిచెప్పులు తెగిపోయాయి. కొత్తవి కొనుక్కోడానికి జేబులో డబ్బుల్లేవు. దైవం తన కాళ్లకు చెప్పులు కూడా లేని దుస్థితి కల్పించాడే, అని ఆయనకు చాలా బాధ కలిగింది. అంతలో మసీదుకెదురుగా అసలు కాళ్లే లేని ఓ యాచకుడు కనిపించాడు. రెండు కాళ్లూ లేని కారణాన అతడు నేలపై పాకుతున్నాడు. ఈదృశ్యం చూడగానే ఆయన అంతకు ముందు చెప్పుల్లేవని బాధ పడ్డందుకు సిగ్గు పడుతూ, దైవం తనకు రెండు కాళ్ళతో పాటు, నిక్షేపంలాంటి ఆరోగ్యం కూడా ప్రసాదించినందుకు కృతజ్ఞతాంజలి ఘటించారు. అందుకే దైవప్రవక్త ముహమ్మద్(స) ప్రాపంచిక విషయాలలో మనిషి ఎప్పుడూ తనకంటే పైవాణ్ణి చూడవద్దని, తనకంటే కింది వాణ్ణి చూడాలని ఉద్బోధించారు. దైవం మనకు చేసిన అసంఖ్యాక మేళ్లను స్మరిం చుకుంటూ, అవి ప్రాప్తం కానివారికి చేతనైన సాయంచేయడమే సిసలైన ధర్మా చరణ.....

✦ ✦ ✦

# 12. సంతృప్తితో ప్రశాంత జీవితం

మన జీవితంలో దైవం ప్రసాదించిన దానితో సంతృప్తి చెందగలిగితే అనంతమైన ఆనందం మన సొంతం అవుతుంది. అసంతృప్తి కారణంగా ఈర్ష్య, అసూయ, ద్వేషాలు ప్రబలుతాయి. జీవితం అల్లకల్లోలం అవుతుంది. ప్రతి మనిషీ మేలునే కోరుకొంటాడు. కష్టనష్టాలను, వినాశాన్ని కోరుకునేవారు ఎవరూ ఉండరు, ఇహలోకంలో సంతోషకర మైన, గౌరవ ప్రదమైన జీవితం పరలోకంలో అమర సుఖాలతో కూడిన శాశ్వత జీవితాన్ని ప్రతి మనిషి కోరుకుంటాడు, దాని కోసం తనకు తెలిసిన రీతిలో ప్రయత్నాలు చేస్తాడు. అలాంటి జీవితం పొందడానికి ముహమ్మద్ ప్రవక్త (సం) కొన్ని సూత్రాలు ఆచరించమని ఉపదేశించారు. అవేమిటో తెలుసుకుందాం.

- దైవం నిషేధించిన వస్తువుకు పూర్తిగా దూరంగా ఉండండి. మీరు వాటిని పూర్తిగా త్యజిస్తే మీకంటే గొప్ప దైవ భక్తులు మరొకరుండరు.
- దైవం రాసిన విధిరాత పట్ల పూర్తి సంతృప్తిగా, సంతోషంగా ఉండండి. అలా ఉంటే, మీరు ఎవరి అవసరం లేకుండానే సంపన్నులవుతారు.
- మీ పొరుగువారి పట్ల సత్ప్రవర్తన కలిగి ఉండండి. వారి పట్ల మీప్రవర్తన ఉత్తమమైనదైతే మీరు సంపూర్ణ విశ్వాసులు.
- మీరు మీకోసం దేన్ని కోరుకుంటారో అదే మీ పొరుగు వారి కోసం ఇష్టపడండి, పొరుగువారి పట్ల మీరు ఇలాంటి ప్రేమ కలిగి ఉంటే దైవ విశ్వాసులుగా పరిగణించబడతారు.
- ఎక్కువగా నవ్వకూడదు, మితిమీరి నవ్వడం వల్ల హృదయం నిర్జీవమవుతుంది

## తృప్తికి మించింది లేదు

ప్రవక్త (స) ప్రవచనాలు సమాజానికి ఎంత అవసరమో ప్రస్తుత స్థితి చూస్తే మనకు అర్థమవుతుంది. మొదట ముహమ్మద్ ప్రవక్త (స) దైవం నిషేధించిన వాటి జోలికి వెళ్ల వద్దని, నిషేధితాలను త్యజించిన వారే దైవభక్తులని బోధించారు. నిర్ణీత విధులుకాక, అదనపు ఆరాధనలు చేయకున్నా నిషేధితాలను త్యజించిన వారే దైవభక్తులనడంలో

సందేహం ఏముంది? దైవం రాసిన విధి రాత ప్రకారం, ఉన్న దాంట్లోనే సంతృప్తి చెందితే స్వార్థం, అసూయాద్వేషాలకు తావుండదు. అలాంటి వ్యక్తి నిశ్చింతగా, ప్రశాంతంగా జీవిస్తాడు, పొరుగు వారిని ప్రేమిస్తాడు. తాను కోరుకునేదే ఇతరులకోసం కోరుకునే వ్యక్తి ఇతరులకు ఎట్టి పరిస్థితిలోనూ హాని తలపెట్టలేడు. వారి పట్ల ప్రేమతో, సత్ప్రవర్తనతో మెలుగుతాడు. ఒకవేళ ఇతరుల విషయమై చెడు తలంపు వస్తే తనకుతాను కీడు తలపెడుతున్నట్లుగా భావిస్తాడు. ఇతరులకు కీడు తలపెట్టే వాడు ఎప్పటికీ విశ్వాసి కాలేడు.

## దైవానికి ప్రియమైనవారు

ప్రవక్త మహనీయులు(స) ఎక్కువగా నవ్వకూడదని హితవు పలికారు. నవ్వు దివ్యౌషధం అయినప్పటికీ, పలు విధాల చేటు అనే సంగతి కూడా మరువరాదు. ఏదీ మితిమీరకూడదు. కావున మనం ఈ ప్రవచనాలపై దృష్టిపెట్టి, వీటిని పాటించినట్లయితే ఇహలోకంలో, పరలోకంలో సాఫల్యాలను పొందుతాం. అధర్మాలకు, నిషేధాలకు దూరంగా ఉండడం వల్ల ఇరుగు పొరుగువారితో మంచి సంబంధాలు పెంపొంది, తద్వారా ప్రజలందరికీ ప్రేమపాత్రులమవుతాం. ప్రజల ఆదరాభిమానాలను పొందిన వ్యక్తిని దైవం ప్రేమిస్తాడు. దైవానికి ప్రీతిపాత్రుడైన వారికి స్వర్గం అతడి శాశ్వత నివాసమవుతుంది.

✦ ✦ ✦

# 13. దయ నిండిన మనసు

**వ్యాధిగ్రస్తులు, ఆకలితో అలమటించే వారి పట్ల దయ చూపించడం ప్రతి ఒక్కరి ధర్మం అని ముహమ్మద్ ప్రవక్త తేటతెల్లం చేశారు. కష్టంలో ఉన్న వారిని సేవిస్తే భగవంతుని సేవించినట్టేనని వివరించే ఘట్టం ఇది.**

సాధారణంగా ఎవరైనా బిచ్చగాడు మన ఇంటి ముందుకు వచ్చి, అమ్మా.. ఆకలవుతుంది ఒక ముద్ద అన్నం పెట్టమ్మా! అని దీనంగా అభ్యర్థిస్తే మనం చాలా నిర్లక్ష్యంగా పోపోవయ్యా అని ఛీత్కరించుకుంటాం. అన్ని అంగాలు సలక్షణంగా ఉండి, ఆరోగ్యంగా ఉన్న వృత్తిపరమైన యాచకులను పక్కన పెడితే, విధి వక్రించి కుంటివాడు గానో, గుడ్డివాడు గానో, ఇతర శారీరక లోపాలతో, చూసే దిక్కులేని అనాథలు, అభాగ్యులు సమాజంలో ఎందరో ఉన్నారు. అటువంటి అభాగ్యులను ఆదుకోవలసిన కనీస బాధ్యత మానవత్వమున్న ప్రతి ఒక్కరిపైనా ఉంది. అలాగే అనారోగ్యానికి గురై, 'నా' అన్న దిక్కులేకుండా, కనీసం పరామర్శించే వారు కూడా కరువై, జీవచ్ఛవాల్లా బ్రతుకుతున్న వారు కూడా సమాజంలో ఎందరో ఉన్నారు.

## అందరి కర్తవ్యం

ఆకలి గొన్నవారికి పిడికెడు అన్నం పెట్టడం, వ్యాధి గ్రస్తుల్ని పరామర్శించి, వారికి మానసిక ధైర్యం చెప్పడం మానవత్వమున్న ప్రతివారు, ముఖ్యంగా దైవాన్ని విశ్వసించే ధార్మిక ప్రజల కనీస విధి అని ముహమ్మద్ ప్రవక్త (సం) ఒక హదీసులో సెలవిచ్చారు. ప్రళయదినాన దైవం ఇలా ప్రశ్నిస్తాడని ముహమ్మద్ ప్రవక్త (సం) వారు సెలవిచ్చారు. "ఓ ఆదం సంతానమా....! (మానవులంతా ఆదం సంతానమే) నేను ఆకలితో అలమటిస్తున్నపుడు, నేను వ్యాధిగ్రస్తుడినై పడి ఉన్నపుడు నువ్వు నన్ను పరామర్శించలేదే" అంటాడు. దానికి మానవుడు నా స్వామీ, పరాత్పరా! నిన్ను నేను పరామర్శించడమేమిటి

నువ్వు సర్వలోకాలకూ ప్రభువువి కదా? అందరినీ పోషించేవాడివి, అందరి ఆరోగ్యాలనూ కాపాడేవాడివి కదా? అంటాడు.

## నన్నక్కడ దర్శించి ఉండేవాడివి

అప్పుడు దైవం.. 'నీకు గుర్తుందా? నా ఫలానా దాసుడు అనారోగ్యంతో దిక్కులేని స్థితిలో పడి ఉంటే నువ్వతణ్ని పరామర్శించలేదు. నువ్వు నా దాసులకు అన్నపెట్టివుంటే, వారిని పరామర్శించి వుంటే నన్నక్కడ దర్శించేవాడివి. ఈ విషయం నీకు తెలియదా అంటాడు. (ముస్లిం, అబూహురైరా).

కనుక వృత్తిపరమైన యాచకులను పక్కన పెడితే, నిజమైన పేదసాదలను, అంగవికలురను ఆదుకోవడం, వారిని పరామర్శించడం, వైద్య సేవలందించడం మానవత్వమున్న మనుషుల కనీస ధర్మం.

✦ ✦ ✦

# 14. సమాజ హితం ఇస్లాం ఆశయం

**బంధువులకు వారి హక్కును ఇవ్వండి. పేదరికానికి గురైన వారికి, బాటసారులకు కూడా వారి హక్కులు చెల్లించండి అని ఖుర్ఆన్ బోధిస్తుంది. దైవంపై విశ్వాసం ఎంత ప్రధాన మైనదో నీ పొరుగువారిపట్ల నీవు నిర్వర్తించవలసిన బాధ్యతలు కూడా అంత ప్రధానమైనవే అంటుంది ఇస్లాం. సామాజిక సంక్షే మమే సమున్నత మత విధానం అని ఇస్లాం చాటుతుంది.**

వ్యక్తిగత, సామాజిక సంక్షేమానికి దోహదపడే ప్రతి పనినీ నైతిక సత్కార్యం అంటుంది ధర్మం. ఇస్లామీ ధర్మశాస్త్రం దైవభక్తితో పాటు మానవప్రేమకూ ఎంతో ప్రాముఖ్యతనిస్తుంది. కేవలం లాంఛనప్రాయమైన ఆచార సంప్రదాయాలకు మాత్రమే కట్టుబడి ఉండడాన్ని వ్యతిరేకిస్తుంది. ఈ విషయంలో పవిత్ర ఖుర్ఆన్ ఇలా అంటోంది. “సత్కార్యం అంటే మనిషి దైవాన్ని, దైవ ప్రవక్తల్ని దైవ దూతల్ని , దైవ గ్రంథాల్ని, అంతిమ దినాన్ని మనస్ఫూర్తిగా విశ్వసించడం. అంతేకాదు; దేవుని ప్రేమలో తాము అమితంగా ఇష్టపడే ధన సంపదను బంధువుల కోసం నిరుపేదల కోసం బాటసారుల కోసం, సహాయం చెయ్యమని అర్థించే వారి కోసం, ఖైదీలను విడిపించడం కోసం వ్యయ పరచడం. ఇంకా దైవ ప్రార్థన నమాజ్‌ను స్థాపించడం, జకాత్ చెల్లించడం, వాగ్దానం చేస్తే దాన్ని పాటించడం, కష్టకాలంలో సహన స్థయిర్యాలు కనబరచడం, ఇలాంటి వారు మాత్రమే సజ్జనులు, సత్యసంధులు, దైవం పట్ల భయ భక్తులు కలవారు కూడా వీరే.” దైవం పట్ల నిజమైన విశ్వాసం, హృదయపూర్వక నమ్మకం కలిగి ఉండటంతోపాటు తోటి మానవుల కష్టసుఖాల్లో పాలుపంచుకోవాలి. వారు ఆపదలో ఉంటే ఆదుకోవాలి. కులమతాలకు అతీతంగా మానవ సంక్షేమానికి ఉపయోగపడే కార్యక్రమాలు చేపట్టాలి. బంధుమిత్రులు, ఇరుగుపొరుగు వారి పట్ల ప్రత్యేక దృష్టి పెట్టాలి. తరువాత ఈ పరిధిని విస్తరించుకుంటూ ముందుకు సాగాలి.

## ప్రవక్త బోధన

'పొరుగు వారు ఆకలితో అలమటిస్తుండగా, మీరు కడుపు నిండా తిన్నట్లయితే మీలో రవ్వంత కూడా విశ్వాసం లేదు' అన్నారు ముహమ్మద్ ప్రవక్త (స). ఎవరి దుష్ప్రవర్తన వల్ల వారి పొరుగు వారు భద్రంగా ఉండరో వారికి దైవం పట్ల విశ్వాసమే లేదు అని బోధించారు కూడా. నిజానికి ఖుర్ఆన్ బోధనలు, ప్రవక్త ప్రవచనాల ప్రకారం ఒక దైవ విశ్వాసి, సమస్త మానవాళి, జంతుజాలం, వృక్షసంపద పట్ల కూడా తన నైతిక బాధ్యతను నిర్వర్తించవలసి ఉంటుంది. కనీసం వినోదం కోసం ఒక క్రీడగా భావించి పక్షులను, జంతువులను కూడా చంపడానికి అనుమతిలేదు. అలాగే మొక్కలను, పండ్లనిచ్చే, నీడనిచ్చే చెట్లను కూడా అనివార్యమైన పరిస్థితులేర్పడితే తప్ప తొలగించడం నిషిద్ధం. దైవోపదేశాలు, ప్రవక్త ప్రవచనాల వెలుగులో ప్రతి వ్యక్తి తన జీవితాన్ని సమీక్షించుకుంటూ సమాజం పట్ల తనపై మోపబడిన నైతిక బాధ్యతను చిత్తశుద్ధితో నిర్వర్తించాలి.

✦ ✦ ✦

# 15. అధర్మానికి మూలం

**దుర్గుణాలలో క్రోధం అత్యంత ప్రమాదకరమైనది. అందుకే కోపాన్ని దరి చేరనివ్వవద్దని ముహమ్మద్ ప్రవక్త చెప్పారు. ఆగ్రహం వచ్చినప్పుడు నిగ్రహించుకోగలిగినవారే నిజమైన మనుషులని ప్రవగక్త (సఅసం) తెలిపారు.**

ఆగ్రహం అనర్ధదాయకం అని తెలిసినా ఆగ్రహమనే ఆగర్భశత్రువు మానవ మస్తిష్కాలపై స్వారీ చేస్తూ ఎన్నో అనర్థాలను తెస్తూనే ఉంది. 'క్షణ' కాల ఆగ్రహం 'జీవిత కాలానికి' సరిపడ చేదు జ్ఞాపకాలను మిగిల్చి వెళుతుంది. క్షణకాలం నిగ్రహం కోల్పోయిన కారణంగా ఎన్నో దారుణాలు, మారణాలు, దురాగతాలు జరుగుతున్నాయి.

## ధర్మాన్ని కూల్చే కోపం

అందుకే ముహమ్మద్ ప్రవక్త (సం): 'ఎట్టి పరిస్థితులలోనూ ఆగ్రహాన్ని మీ దరిచేరనీయకండి' అని పదే పదే ఉపదేశించారు. (బుఖారి)

ఎందుకంటే చెడు అలవాట్లన్నిటిలో 'ఆగ్రహం (కోపం) అత్యంత ప్రమాదకరమైన, దుష్పరిణామాలు మిగిల్చే దురలవాటు, ఆగ్రహ స్థితిలో మనిషికి తన లాభనష్టాలగురించి కాని, దైవాదేశాల హద్దుల అతిక్రమణను గురించి కాని స్పృహ ఉండదు. షైతాన్ పాచిక ఆగ్రహ స్థితిలో పారినంతగా మరే స్థితిలోనూ పారదు. అంటే ఆ స్థితిలో మనిషి తన అధీనంలో కాకుండా, షైతాన్ గుప్పిట్లో ఉంటాడు. చివరికి అతడు ఒక్కోసారి ఆగ్రహంతో దైవధిక్కారిలా కుఫ్ర్ (తిరస్కార) మాటలు కూడా మాట్లాడతాడు. అందుకే ముహమ్మద్ ప్రవక్త (స) 'ముసాంబరం (అతిచేదైన పదార్థం) తేనెలోని మాధుర్యాన్ని కలుషితం చేసినట్లు, ఆగ్రహం.. ధర్మాన్ని, విశ్వాసాన్ని నాశనం చేస్తుంది' అని సెలవిచ్చారు.

## మనసే మనిషికి శతృవు

అందుకే మనిషికి అందరికన్నా బద్ధ శతృవు, ఎంతో కష్టం మీద గాని లొంగని

దుష్టశత్రువు స్వయంగా నీ మనసే' అని ముహమ్మద్ ప్రవక్త (స) ప్రవచించారు. ప్రత్యేకించి ఆగ్రహ స్థితిలో మనసును స్వాధీనంలో ఉంచుకోవడం చాలా కష్టంతో కూడుకున్న పని. అందుకే, 'పోటీలో ప్రత్యర్థిని మట్టి కరిపించేవాడు బలశాలీ, పహిల్వాను కాదు. ఆగ్రహం కలిగినప్పుడు నిగ్రహించుకొన్న వాడే నిజమైన బలశాలి, వీరుడు అని కూడా ఆయన (సల్లం) సెలవిచ్చారు. అంటే మానవుడి మనసులో కోపం, క్రోధం, ఆగ్రహం, అసహనం అన్న పదాలకు తావుండడానికి వీల్లేదని దీనర్థం కాదు. ఎందుకంటే, సహించరాని కటువు మాటల వల్ల మనసుకు బాధ కగలడం మానవ సహజం. దైవ ప్రవక్తలు కూడా దీనికి మినహాయింపు కాదు. అయితే అలాంటి స్థితిలో కూడా మనసును అదుపులో ఉంచు కోవాలి. అలా కాకుండా ఆగ్రహవేశాలకు లోనై, దైవ విశ్వాసి అయిన ఒక దాసుడు తన దాస్య స్థాయికి భిన్నంగా వ్యవహరించడం అతని స్థాయికే అవమానకరం.

✦ ✦ ✦

# 16. నిజమైన దైవారాధన

సృష్టిలోని అసంఖ్యాక సృజనల్లో మానవ సృష్టికి గల ప్రత్యేకత ఏమిటి? మానవ జన్మ అర్థం, పరమార్థం ఏమిటి? అని ఆలోచిస్తే అందులో ఏదో మహత్తర మర్మం దాగి ఉందని అర్థమవుంది. ఇతర జీవుల్లా పుట్టడం పెరగడం కనిపించిన దాన్ని తిని, పిల్లల్ని కని చివరకు గిట్టిపోవడం ఇది మాత్రమే జీవితం కాదని దానికి భిన్నమైన ఉద్దేశ్యం, లక్ష్యం మానవ జన్మకు ఉంటుందని మన వివేకం హెచ్చరిస్తూ ఉంటుంది.

## ఆరాధన ప్రధానం

మానవ జన్మ పరమోద్దేశాన్ని పవిత్ర ఖుర్ఆన్ ఇలా వివరిస్తోంది.. **'వమాఖలఖ్ తుల్ జిన్న వల్ ఇన్స ఇల్లా లియాబుదూన్'** అంటే 'మేము జిన్నాతులను, మానవులను కేవలం మా ఆరాధన కోసమే సృష్టించాము' అని దైవం అంటున్నాడు. మానవ సృజన ఉద్దేశం కేవలం దైవారాధన మాత్రమే అని దీని ద్వారా మనకు అర్థమవుతోంది. అయితే మానవుడు ఉదయం లేచింది మొదలు రాత్రి పడుకునే వరకూ దైవాన్నే ఆరాధిస్తూ ఉండాలా? మసీదులోనో, గుడిలోనో, చర్చిలోనో కూర్చొని దైవారాధనలో నిమగ్నమై పోవాలా? సర్వసంగ పరిత్యాగిలా మారి, తపోనిష్టలో, ధ్యాన ముద్రలో గడపాలా? దైవ ప్రసన్నత, ముక్తి మోక్షాల కోసం ఇలాంటి తపస్సు అవసరమా? ఎంత మాత్రం కాదు.

## దైవ మార్గం

'దైవారాధన అనే పదానికి సరైన అర్థం తెలియక ఎవరి ఇష్టానుసారం వారు దైవాన్ని ఆరాధిస్తున్నారు. దైవం మానవుల మార్గదర్శకం కోసం వారి ఇహ, పర ముక్తి మోక్షాల కోసం, సాఫల్యం కోసం అవతరింప జేసిన గ్రంథాలను ఆయన పంపిన ప్రవక్త లను అనుసరించాలి. అప్పుడే మానవునికి సరైన మార్గదర్శనం లభిస్తుంది. సాధారణంగా మనం వేటినైతే ప్రాపంచిక విషయాలు అనుకుంటామో, అవి కూడా దైవ మార్గదర్శకం ప్రకారం చేసినట్లయితే దైవారాధనగానే పరిగణించబడతాయి. వ్యాపారం, ఉద్యోగం, రాజకీయం ఏవీ ముక్తి మోక్షాలకు అడ్డంకులు కావు. కాకపోతే ఇవన్నీ దైవం నిర్దేశించిన పద్ధతి ప్రకారం చేయాలి.

## సత్కర్మలతోనే ప్రతిఫలం

సమాజాన్ని, కుటుంబాన్ని, పొరుగువారిని నిర్లక్ష్యం చేసి నిష్ఠగా ఎన్ని పూజలు చేసినా, ఎన్ని వ్రతాలు ఆచరించినా, ఎన్ని నోములు నోచినా ప్రయోజనం శూన్యం. అక్రమంగా సంపాదించిన సొమ్ముతో మక్కాకో, మదీనాకో వెళితే ముక్తి లభిస్తుందా? అధర్మ సంపాదనతో సత్కర్మలు చేస్తే పుణ్యం కాదు కదా పాపం మూట కట్టుకోవలసి ఉంటుంది. కాబట్టి ఇహపర సాఫల్యాలు పొందాలంటే ప్రతి ఒక్కరూ తమ జీవితాన్ని ఆరాధనగా మలచుకోవాలి. దైవం, దైవప్రవక్త ఆదేశాలకనుగుణంగా సత్కర్మలు చేస్తే అది నిజమైన దైవారాధన. ఇలాంటి ఆరాధనకే దైవం ప్రతిఫలం ప్రసాదిస్తాడు.

✦ ✦ ✦

# 17. ఏకదైవారాధనే శరణ్యం

**మానవ జీవితాలకు సార్ధకమైన మార్గం చూపేది ఆ దేవుడే. అందుకే ఆయనను మాత్రమే ఆరాధించాలి.**

దైవం మానవుల్ని సృష్టించి వారి మానాన వారిని వదిలివేయలేదు. వారికి ఒక మార్గం చూపాడు. ఏది మంచి మార్గం, ఏది చెడు మార్గమో వారికి తెలియజేశాడు. ఎందుకంటే సమస్త మానవాళిని సృష్టించి, పోషించి పాలించే వాడు ఆయనే. అలాంటి దైవం మాత్రమే మానవులకు రుజుమార్గం, జీవిత సంవిధానం చూపగలడు. అందుకని ఆయన మాత్రమే పూజకు ఆరాధనకు అర్హుడు. మిగిలిన వారంతా సృష్టితాలు, దాసులు, పాలితులు మాత్రమే. మానవులు పరస్పరం సహాయసహకారాలు అందచేసుకుంటున్నప్పటికీ అసలు సహాయం చేసేవాడు సృష్టికర్త అయిన దైవం మాత్రమే. కాబట్టి మానవులు తమ అవసరాల పరిపూర్తికి ఆయన్నే వేడుకోవాలి. ఆయన్నే అర్థించాలి. ఆయన్నే ఆరాధించాలి. ఎందుకంటే "మీకు ఏ ఇబ్బందులెదురైనా సహనంతో, ప్రార్ధన (నమాజ్) ద్వారా నా సహాయాన్ని అర్థించండి (బఖర:45) అంటున్నాడు దైవం పవిత్ర ఖుర్ఆన్‌లో.

## దేవుని ఏకత్వానికి ఎన్నో నిదర్శనాలు

మరొక చోట "మానవులారా! మీ ఆరాధ్య దైవం ఒక్కడే కరుణామయుడు, కృపాశీలుడైన ఆ దైవం తప్ప మరో దైవం లేదు. భూమ్యాకాశాల సృజనలో రేయింబవళ్ల రాకపోకల్లో, సముద్రాల్లో తిరుగాడుతూ, మానవాళికి ప్రయోజనం చేకూర్చే ఓడల్లో, దైవం పై నుంచి కురిపించే వర్షపు నీటిలో– తద్వారా ఆయన మృత భూమికి జీవం పోసి, పుడమిపై పలురకాల జీవరాసుల్ని వర్ధిల్లజేసే ఆయన సృష్టి నైపుణ్యంలో, గాలుల సంచారంలో నేలకు నింగికి మధ్య, నియమబద్ధంగా సంచరించే మేఘాలలో, బుద్ధిమంతులకు దేవుని అస్తిత్వాన్ని ఆయన ఏకత్వాన్ని తెలిపే అనేక నిదర్శనాలున్నాయి. దేవుని ఏకత్వం తెలిపే ఇన్ని నిదర్శనాలు కళ్లముందు స్పష్టంగా కనిపిస్తున్నప్పటికీ కొంతమంది నిజ దైవాన్ని వదలి మిథ్యా దేవుళ్లను పట్టుకుని వేలాడుతుంటారు. (బఖరా 163, 164)

"కాని నిజమైన విశ్వాసులు మాత్రం సృష్టికర్తనే ఆరాధిస్తారు. ఆయన్నే అర్థిస్తారు. అలాంటి వారే స్వర్గానికి అర్హులైన దాసులు. ఇలాంటి దైవభీతి పరులే తమ ప్రభువు నుంచి వచ్చిన రుజు మార్గంలో ఉన్నారు. సాఫల్యం పొందేవారు, మోక్షం పొందేవారు వీరే"

(ఖుర్ఆన్ 1-5)

ఈ విషయమే భగవద్గీతలో ఇలా వుంది. "నాయందే మనస్సు గల వాడవుగానూ, నా భక్తుడవుగానూ, నన్నే ఆపద్బాంధవునిగా పూజించువాడవుగనూ అగుము. నాకు నమస్కరింపుము. ఈ ప్రకారం చిత్తము నాయందే నిలిపి, నన్నే పరమ గతిగా, నన్నే కొలచిన వాడవై తుదకు నన్నే పొందగలవు." (గీత 9:34)

అదే విధంగా బైబిల్‌లో ఒకచోట దేవుడైన యెహోవా ఇలా అంటున్నాడు. "నేను తప్ప మరొక దేవుడు నీకు ఉండకూడదు. పైన ఆకాశమందైనా కాని, కింద భూమి యందైనా కాని భూమికింద నీళ్లయందే కాని ఉండు దేని రూపమునైనను, విగ్రహము నైనను నీవు చేసుకొనకూడదు. వాటికి సాగిల పడకూడదు. పూజించకూడదు."

(నిర్గమకాండము 20:3)

## ఇహపరాల సాఫల్య మార్గం

పైన ఉదాహరించిన మూడు గ్రంథాల్లోనూ మానవులు సర్వకాల సర్వావస్థల్లో, దైవాన్నే అర్థించాలని, ఆయన్నే ఆరాధించాలని, ఆయన్నే పూజించాలని, ఆయన ఏకత్వానికి భంగం కలిగే ఎలాంటి చర్యకు పాల్పడరాదని బోధించడం జరిగింది. కనుక మానవుడు ధర్మ శాస్త్ర బోధనల ప్రకారం ఆచరించి, ఇహపర సాఫల్యాలను సొంతం చేసుకోవచ్చు. శాశ్వత ఆనంద నిలయమైన స్వర్గ సాధనకు దైవంపైన మనస్సు లగ్నం చేసి ఆరాధించడం తప్పని సరి.

✦ ✦ ✦

# 18. దేవునిపై విశ్వాసంతో సార్థకత

**దేవునిపై పరిపూర్ణ విశ్వాసం ఉంచాలని అన్ని మతాలు చెబుతాయి. దేవుడు న్నాడని అంగీకరిస్తే సరిపోదు.. త్రికరణ శుద్ధిగా ఆయన శరణు వేడితే జన్మ సార్థకం అవుతుందని చెప్పే ఖుర్ఆన్ ప్రవచన సారం.**

నైతికతకు, ఆధ్యాత్మికతకు పునాది విశ్వాసం. విశ్వాసమంటే దైవంపై విశ్వాసం. ఈ అండ పిండ బ్రహ్మాండాన్ని సృష్టించిన వాడొకడున్నాడనే విశ్వాసం. ఆయనే మానవాళి మార్గదర్శకం కోసం మానవుల్లోనే ఉత్తములైన వారిని ప్రవక్తలుగా ఎంపిక చేసి పంపించా డన్న విశ్వాసం. మానవాళి మార్గదర్శకం కోసం తన హితోపదేశాలు పంచేం దుకు ప్రవక్తలను అవతరింపజేశాడన్న విశ్వాసం. మానవుల మంచి చెడ్డలు విచారిం చడానికి వారి కర్మలకనుగుణంగా వారికి సత్ఫలితమో లేక దుష్ఫలితమో ఇవ్వడానికి పరలోకాన్ని సిద్ధపరచి ఉంచాడన్న విశ్వాసం, ఇదేవిధంగా దైవదూతలపై, విధి రాతపై, విశ్వాస ముంచడం కూడా చాలా అవసరం. వీటన్నింటికన్నా దైవ విశ్వాసం అన్నది చాలా ముఖ్యమైన అంశం. ఇది లేకుండా మిగిలినవన్నీ నిరర్థకం.

## ఏది పరిపూర్ణ విశ్వాసం?

దైవ విశ్వాసమన్నది చాలా విస్తృతార్థం ఉన్న పదం. దేవుడు ఉన్నాడు అనే వారందరికీ పరిపూర్ణ దైవ విశ్వాసం ఉన్నట్టు కాదు. నోటితో అన్నంతలోనే దైవ విశ్వాసం పరిపూర్ణం కాదు. ఎవరు అన్నా, అనకపోయినా, ఎవరు ఒప్పుకున్నా, ఒప్పుకోకపోయినా దేవుడనేవాడు ఉన్నాడు. ఆలోచితంగానో, అనాలోచితంగానో దేవుడున్నాడని చాలా మంది అంటారు. అసలు విషయం అదికాదు. 'దైవ విశ్వాసం' అంటే, దైవం 'మాత్రమే' ఈ సమస్త సృష్టికి 'కర్త' అని, యజమాని అని, ఆయన ఒక్కడే మనందరి ప్రభువు, పాలకుడని, మనమంతా ఆయన పాలితులమని, ఆయనకు మాత్రమే దాసులమని, ఆయన మాత్రమే

పూజకు, ఆరాధనలకు అర్హుడని, ఆ 'ఒక్కడికి' మాత్రమే దాస్యం చేయడం మానవుల విధి అని అంగీకరించాలి, విశ్వసించాలి.

ఎందుకంటే, 'ఆయనే మిమ్మల్ని పుట్టించాడు. మీకు ఉపాధినిచ్చాడు. తరువాత మరణం కలిగిస్తాడు, తరువాత ఆయనే మిమ్మల్ని మళ్లీ బతికిస్తాడు. మీరు దైవ సమానులుగా (దైవాంశ సంభూతులుగా) భావిస్తున్న వారిలో ఎవరైనా ఈ పనులు చేసేవాడున్నాడా? అని ప్రశ్నిస్తుంది పవిత్ర ఖుర్‌ఆన్ (30-40)

## నమ్మితేనే పరివర్తన

అందుకే మానవుడు విశ్వసృష్టికర్త అయిన నిజదైవంపై సంపూర్ణ విశ్వాసముంచి, ఆయన తన ప్రవక్తల ద్వారా, గ్రంథాల ద్వారా పంపిన హితోపదేశాల కనుగుణంగా నడుచుకుంటేనే, మానవుల్లో నిజమైన నైతిక, ఆధ్యాత్మిక పరివర్తన సిద్ధిస్తుంది. దైవ విశ్వాసాన్ని గురించి సరిగా అర్థం చేసుకుని, రేపు అంటే మరణానంతరం ఆ దైవం ముందు ఇహలోకంలో చేసిన కర్మలకు జవాబు చెప్పుకోవాలన్న భావనతో మానవుడు మనుగడ సాగిస్తే ఇహలోకంలోనూ పరలోకంలోనూ గౌరవమర్యాదలు ప్రాప్తిస్తాయి.

✦ ✦ ✦

# 19. స్త్రీ స్వాతంత్ర్యం

**పవిత్ర ఖుర్ఆన్ గ్రంథంలో ఇలా ఉంది. 'ఆయన మిమ్మల్ని ఒకే ప్రాణి నుంచి పుట్టించాడు. అదే ప్రాణి నుంచి దాని జతను కూడా సృష్టించాడు. ఇంకా ఆ జంట ద్వారా ఎంతో మంది స్త్రీలను, పురుషులను భూమిపై వ్యాపింపజేశాడు.**

**(నిసా : 1)**

మానవాళి మనుగడకు ఆక్సిజన్ ఎంత అవసరమో, నైట్రోజన్ కూడా అంతే అవసరం. అదే విధంగా స్త్రీ పురుషులు ఇద్దరూ తమతమ పరిధుల్లో ఎంతో ప్రాముఖ్యతను కలిగివున్నారు. మొట్టమొదట ఇస్లాం స్త్రీ ఉనికిని, ఆమె వ్యక్తిత్వాన్ని అంగీకరిస్తుంది. పురుషుని వ్యక్తిత్వంతో స్త్రీని ముడిపెట్టదు. ఆమె స్వతంత్రురాలు. తన ఆస్తి సంపదలకు ఆమె హక్కుదారు. యజమాని, తన ఆస్తిని ఇష్టానుసారంగా ఖర్చుపెట్టుకోడానికి పూర్తి స్వేచ్ఛ అధికారం ఆమెకు ఉంటాయి. ఖుర్ఆన్ స్త్రీ స్వాతంత్ర్యాన్ని ఇలా ప్రతిపాదించింది. 'పురుషులు ఏది సంపాదిస్తారో దాని ప్రకారం వారికి వాటా లభిస్తుంది. స్త్రీలు ఏది సంపాదిస్తారో దాని ప్రకారం వారికీ భాగం లభిస్తుంది. 'మగవారికి మహిళలపై ఎలాంటి హక్కులైతే ఉన్నాయో, అలాంటి హక్కులే ధర్మం ప్రకారం మహిళలకు కూడా మగవారిపై ఉన్నాయి.

## ఆమె హక్కులు

వివాహ సమయంలో వరుని ఎంపికలో స్త్రీకి సంపూర్ణ స్వేచ్ఛ ఉంటుంది. నికాహ్ (వివాహం) విషయంలో స్త్రీ అనుమతి, అభీష్టం తప్పనిసరి. అలాగే వారసత్వ పంపిణీ విషయంలో తల్లిదండ్రులు, భర్త, సంతానం, ఆస్తిలో కూడా స్త్రీకి వాటా లభిస్తుంది. ఇది కాకుండా ఇస్లామీ ధర్మంలో మహర్ (స్త్రీ ధనం)కు కూడా ఆమెయే హక్కుదారు. ధర్మశాస్త్రం ప్రకారం మహర్ ఒక విధి. ఎందుకంటే దీనిద్వారానే నికాహ్ పరిపూర్ణతను సంతరించు కుంటుంది. మహర్ తప్పకుండా చెల్లించే ఓ కానుక. ఇది ప్రేమకు ప్రతిరూపం. వరుడు

వధువు నుంచి కట్నం ఇమ్మనడం హరాం. కాని వధువుకు వరుడు మహర్ చెల్లించడం మాత్రం వాజిబ్ (తప్పని సరి విధి).

## మరికొన్ని హక్కులు

పురుషుడు స్త్రీకి 'తలాక్' ఇచ్చినట్లే స్త్రీకి కూడా 'ఖులా' ద్వారా భర్తనుంచి విడాకులు పొందే అధికారం ఉంటుంది. అదేవిధంగా ఇస్లాం స్త్రీ పురుషులిద్దరినీ విద్య ఆర్జించమని ఆదేశిస్తుంది. మొత్తంమీద ఇస్లాం స్త్రీకి అన్ని రంగాల్లో సంపూర్ణ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను ప్రసాదించింది. తల్లి పాదాల కింద స్వర్గం ఉంటుందని చెప్పి సంఘంలో స్త్రీ స్థానాన్ని సమున్నతంగా నిలిపింది.

✦ ✦ ✦

# ౨౦. జవాబుదారీతనం

విశ్వానికి జీవం పోసిన దైవంపై విశ్వాసం ఉంచడం మన ప్రథమ కర్తవ్యం. సదాచారం, సత్ సంకల్పం, సచ్ఛీలత ఇవ్వన్నీ కూడా విశ్వాసంలో భాగాలే. మనం చేసే ప్రతి పనికి దైవం ఎదుట సమాధానం చెప్పుకోవాలన్న స్పృహ మనిషిని రుజుమార్గంలో నడిపిస్తుంది.

విశ్వాసానికి 70కి పైగా శాఖలున్నాయి. వాటిలో దేవుని ఏకత్వాన్ని నమ్మడం అన్నింటికన్నా ఉన్నతమైనది. పవిత్రమైనది. అంటే సకల చరాచర సృష్టికి ఒకే ఒక కర్త ఉన్నాడని ఆయన మాత్రమే విధేయతకు, ఆరాధనకు, పూజకు అర్హుడని విశ్వసించడం, ఆ ప్రకారం ఆచరించడం. తరువాత అన్నిటికన్నా అధమస్థాయి కలిగిన శాఖ, ఇబ్బంది ఆటంకం కలిగించే వస్తువుల్ని దారిలో నుంచి తొలగించడం' అని దైవప్రవక్త ముహమ్మద్ (సల్లం) వారు ఓ హదీసులో ప్రవచించారు. అంటే మానవుడు తననూ, విశ్వాన్ని, విశ్వంలోని సమస్తాన్ని సృష్టించిన సృష్టికర్తను మాత్రమే పూజించాలి.

## విశ్వాస శాఖలు

విశ్వాస శాఖలంటే.. మానవుడి అంతర్, బాహ్యాచరణలు, స్థితిగతులన్నీ వీటి పరిధిలోకి వస్తాయి. ఒక హృదయంలో విశ్వాసం ప్రవేశిస్తే, ఆ హృదయంలో దాని సత్ఫలితాలే వెల్లివిరియాలన్నమాట. ఏ విధంగానైతే పచ్చగా కళకళలాడే వృక్షం ఎలాగైతే పూలు, ఫలాలనిస్తుందో, అలాగే సదాచరణలు, సదలవాట్లు, సత్సంకల్పాలు, సచ్ఛీలతలు కూడా విశ్వాస శాఖలే.

## దైవమార్గం కాదన్న ఫలితం

ఈ హదీసులో దేవుని ఏకత్వ సాక్ష్యానికి అగ్రతాంబూలం ఇవ్వబడింది. అలాగే మార్గంలో ప్రజలకు ఇబ్బంది కలిగించే వస్తువులను తొలగించడం కూడా విశ్వాసంలోని భాగమే. ఈనాడు ప్రజలు సమస్త సృష్టికి మూలాధారమైన కర్తను గుర్తించకుండా, ఆయన చూపిన మార్గాన్ని అనుసరించకుండా ఇష్టానుసారం విచ్చలవిడిగా జీవిస్తున్నారు.

ఫలితంగా సమాజంలో ఎన్నో ఉపద్రవాలు, అనర్థాలు సంభవిస్తున్నాయి. మానవుడు దైవ మార్గదర్శకత్వాన్ని కాదని, స్వయం కల్పిత సిద్ధాంతాలు, స్వయం నిర్మిత దైవాలను తయారు చేసుకున్నాడు.

## దైవాన్ని నమ్మాలి

ఏ జీవికీ హాని తలపెట్టని, ప్రజలకు ఎలాంటి ఇబ్బంది కలగని సాత్విక, విజ్ఞాన దాయకమైన జీవితం గడపవలసిన మానవుడు సాటి మానవుల ధన, మాన ప్రాణాలకు రక్షణ లేకుండా చేస్తున్నాడు. మనిషికి మనిషే భయపడాల్సిన దుస్థితి ఏర్పడింది. దారిలో కంటకాలు తొలగించి, సాటి పాదచారులకు ఎలాంటి అసౌకర్యము కలుగకుండా చేయాల్సినవాడు దారికాచి, మాటువేసి మనుషుల ప్రాణాలను మట్టుబెడుతున్నాడు. దీనికంతటికి కారణం దైవాన్ని చిత్తశుద్ధితో నమ్మకపోవడమే, ప్రవక్తల మార్గదర్శకాలను అనుసరించకపోవడమే. తాను చేసే ప్రతి చర్యకు తనను సృష్టించిన సృష్టికర్త ముందు జవాబు చెప్పుకోవాలన్న భావం మనసులో ఉంటే ఏ ఒక్కరూ తప్పుడు మార్గంలో పయనించరు.

✦ ✦ ✦

# 21. మోక్ష మార్గం

**మానవులపై అల్లాహ్‌కు ఉన్న ప్రేమ అపారమైనది. అందుకే ఆయన దైవ ప్రవక్తల ద్వారా తన సందేశాన్ని మానవాళికి అందించాడు. దేవుని సందేశాలను పాటిస్తూ, దైవ ధర్మాన్ని ఆచరించే వారే ఇహ పర సౌఖ్యాలు పొందు తారని తెలిపే వ్యాసం.**

అల్లాహ్ అత్యంత కరుణామయుడు, ఆయన తన సృష్టిని అమితంగా ప్రేమిస్తాడు. మానవులంటే ఆయనకు అనంతమైన ప్రీతి, అందుకే మానవుల మార్గదర్శకం కోసం ఆయన తన హితోపదేశాలను అవతరింపజేశాడు. వారిలో నుంచి ఉత్తములను ఎన్నుకొని వారి ద్వారా మానవాళి అంతటికీ తన సందేశాన్ని, తన అభీష్టాన్నీ తెలియజేశాడు. దైవం తన సందేశం కోసం ఎన్నుకున్న ఉత్తమ మానవులనే దైవప్రవక్తలు అంటారు. ఏ మార్గం మంచిది, ఏ మార్గం చెడ్డది, ఏ మార్గంపై నడిస్తే మనిషి మంచివాడుగా, ఉత్తముడుగా రూపొందుతాడు. ఏ మార్గం మంచి వైపునకు, స్వర్గం వైపునకు తీసుకెళుతుంది అనే విషయాలన్నింటినీ దైవం తన ప్రవక్తల ద్వారా, వారిపై అవతరింపజేసిన తన గ్రంథాల ద్వారా మానవాళికి తెలిపాడు.

## దైవ ప్రవక్తలు

దైవం మానవ సృష్టి ప్రారంభమైనప్పటి నుంచి ఇప్పటి వరకు దాదాపు ఒక లక్షా ఇరవై నాలుగు వేలమంది దైవప్రవక్తలను మానవుల మార్గదర్శకం కోసం ప్రభవింప జేసినట్లు ఉల్లేఖనాల ద్వారా మనకు తెలుస్తోంది. అంటే, ఆది మానవుడు హజ్రత్ ఆదం అలైహిస్సలాంతో ప్రారంభమైన ఈ ప్రవక్తల పరంపర చిట్టచివరి దైవప్రవక్త ముహమ్మద్ ప్రవక్త సల్లల్లాహు అలైహివసల్లం వారితో ముగిసింది. ఎందుకంటే ముహమ్మద్ ప్రవక్త కంటే ముందు నియుక్తులైన ప్రవక్తలంతా ఒక జాతి కోసమో, ఒక ప్రాంతం వారి కోసమో నియమితులైన ప్రవక్తలు. కాని ముహమ్మద్ ప్రవక్త వారిని మాత్రం దైవం సమస్త

మానవాళి కోసం ప్రభవింపజేశాడు. ఆయన ఉపదేశాలు, బోధనలు కూడా ప్రళయ కాలం వరకూ విస్తరింపజేశాడు.

దైవధర్మం ఏ విధంగా సార్వజనీన ధర్మమో, ముహమ్మద్ ప్రవక్త (స) బోధనలు కూడా అంతే సార్వజనీనం, సర్వకాలికం. "మేము మా ప్రవక్తను సమస్త మానవాళి కోసం, ప్రళయ కాలం వరకు కారుణ్యంగా చేసి పంపాము" అనే దైవ వచనాలే దీనికి నిదర్శనం. అంటే ముహమ్మద్ ప్రవక్త (స) కేవలం ముస్లిం సమాజానికి మాత్రమే మార్గ దర్శకునిగా ప్రభవించలేదని, యావత్తు మానవ సమాజానికి మార్గదర్శకునిగా అవతరిం చారని మనకు తెలుస్తుంది.

✦ ✦ ✦

# 22. సృష్టినికాదు సృష్టికర్తను ఆరాధించండి

**అల్లాహ్ అంటే దేవుడు.. అందరికంటే అధికుడు అనే అర్థా లున్నాయి. ఈ సృష్టికి మూలకారకుడైన ఆ దైవాన్నే ఆరాధిం చాలి. జీవితం సార్థకం కావా లంటే దైవారాధన ఒక్కటే మార్గం. సకలచరాచర జగత్తుతో పాటు మన ఉనికికి కూడా మూలాధారమైన ఆయనను విస్మరించడం పాపమంటోంది ఖుర్ఆన్ బోధనల సారం..**

ఈ సమస్త సృష్టికి ఒకే ఒక కర్త ఉన్నాడు. ఆ సృష్టికర్తనే అరబ్బీ భాషలో అల్లాహ్ అంటారు. అల్+ఇలాహ్ అనే రెండు పదాల కలయిక అల్లాహ్. ఒకే దేవుడు అన్న అర్థం స్ఫురించేలా ఈ పదం ఏర్పడింది.

ఇలాహ్ అంటే ఆపత్కాలంలో ఆదుకునే వాడు, భయాందోళనలు కలిగినపుడు శాంతి, స్థిమితాలను ప్రసాదించేవాడు, కష్టాలు, కడగండ్లు కలిగినపుడు వాటిని తొలగించి, సుఖసంతోషాలను అనుగ్రహించేవాడు. ఆశ్రయమిచ్చేవాడు, కోరికలు తీర్చేవాడు అన్న అనేక అర్థాలతోపాటు ఈ పదానికి ఆధిక్యత, అందరికంటే ఆధిక్యత కలవాడు అనే అర్థం కూడా ఉంది. అంతటి ఆధిక్యం కలిగిన సర్వశక్తి సంపన్నుడైన ఆ ఏకైక దైవాన్నే ఆరాధించ మంటోంది ఇస్లామీ ధర్మశాస్త్రం.

## సృష్టికర్తను మరువకండి

మానవజాతి ప్రారంభం నుంచి నేటి వరకు దైవం అన్ని కాలాల్లో, అన్ని జాతుల వారి కోసం తన ప్రవక్తలను పంపాడు. పవిత్ర గ్రంథాలను అందించాడు. అటువంటి పవిత్ర గ్రంథమైన ఖుర్ఆన్‌లో దైవం ఇలా అంటున్నాడు. 'మానవులారా.. మిమ్మల్ని.. మీకు పూర్వం వారిని సృష్టించిన ఆ మీ ప్రభువును ఆరాధించండి. అప్పుడే మీకు రక్షణ కలుగుతుంది. మీకోసం భూమిని పాన్పుగానూ, ఆకాశాన్ని కప్పుగానూ చేసినవాడాయన. పైనుంచి వర్షాన్ని కురిపించి, రకరకాల పంటలు పండే ఏర్పాటు చేసి మీకు ఉపాధి

కల్పించినవాడు ఆయనే. ఈ సత్యాలు తెలుసుకున్న తరువాత ఏ ఇతర శక్తులనూ దైవానికి సమానులుగా నిలబెట్టకండి."

## ఆయనే సర్వస్వం

పవిత్ర ఖుర్ఆన్‌లో మరోచోట ఇలా ఉంది. "మానవులారా.. మీ పూజనీయుడు దైవం ఒక్కడే. కరుణామయుడు దయాసాగరుడైన ఆ దేవుడు తప్ప మీకు మరో దైవం లేనే లేదు. భూమ్యాకాశాల సృజనలో, రేయింబవళ్ల, చక్రభ్రమణంలో, సముద్రాలలో పయనిస్తూ మానవులకుప్రయోజనం చేకూర్చే ఓడలలో, దేవుడు పైనుంచి కురిపించే వర్షపు నీటిలో, తద్వారా ఆయన మృత భూమికి జీవం పోసే పనిలో పుడమిపై పలువిధాల జీవరాసుల్ని విస్తరింపజేసే సృష్టి నైపుణ్యంలో, వాయువుల సంచారంలో, నేలకు నింగికి మధ్య నియమ బద్ధంగా సంచరించే మేఘమాలికల్లో బుద్ధిమంతులకు దేవుని అస్తిత్వాన్ని, ఆయన ఏకత్వాన్ని సూచించే అనేక నిదర్శనాలు ఉన్నాయి. (బఖర 163, 164)

దైవం మహిమల గురించి స్పష్టమైన ఇన్ని నిదర్శనాలు కళ్ల ముందున్నా ఆ సృష్టి కర్తను వదిలి సృష్టి రాసుల్ని పూజించడం పాపమని దైవ గ్రంథం చెబుతోంది. కనుక సృష్టి రాసుల్ని కాకుండా సృష్టికర్తను ఆరాధించడంపైనే మానవుల ఇహ, పర సాఫల్యాలు ఆధారపడి ఉన్నాయి.

✦ ✦ ✦

# ౨౩. దేవుని వద్దకు చేర్చే అష్టవిధ సుగుణాలు

**దైవం మన నుంచి కోరేది ఫలాలు, పుష్పాలుకాదు.. సుగుణాలు నిండిన మనస్సును. దైవాన్ని ప్రసన్నం చేసుకోవడం ఎలా అని అడిగిన భక్తునికి ముహమ్మద్ ప్రవక్త ఏం చెప్పారో చూద్దాం.**

ప్రతి మానవుడూ ఇహలోకంలో సుఖవంతమైన, శాంతివంతమైన, సంతృప్తికర జీవనం గడపాలని కోరుకుంటారు. అలాగే మరణానంతరం పరలోకంలో కూడా శాశ్వత స్వర్గ సుఖాలు తనకు సొంతం కావాలని అభిలషిస్తాడు. ఇది ప్రతిమానవుని అంతరంగిక ఆకాంక్ష. దీనికోసం మానవుడు ఎన్నో సత్కార్యాలు చేయడానికి ప్రయత్నిస్తాడు. తనకు తెలిసిన సత్కార్యాలు ఆచరిస్తాడు. దైవాన్ని ప్రసన్నం చేసుకుంటే, ఇవన్నీ తన సొంతం అవుతాయని దైవ ప్రసన్నత పొందడానికి సాధ్యమైనన్ని ప్రయత్నాలు చేస్తాడు.

## దైవ ప్రీతి పొందే మార్గం

సమస్త సృష్టికి కర్త, సర్వాధికారి, సర్వశక్తిమంతుడు, సర్వోన్నతుడు ప్రభువు అయిన దైవాన్ని ప్రసన్నం చేసుకుంటే ఇహపరాల్లో ముక్తి మోక్షాలు లభించినట్టేనని, శాశ్వత ఆనంద నిలయమైన స్వర్గానికి అర్హులు కావచ్చని భావించిన ఒక వ్యక్తి ముహమ్మద్ ప్రవక్త (స) వారి వద్దకు వచ్చి దైవ ప్రవక్తా! దైవాన్ని ప్రసన్నం చేసుకునే, దైవ ప్రీతి పొందే మార్గం ఏమిటో చెప్పండి అని అభ్యర్థించాడు.

## ఆగ్రహంలో నిగ్రహించు

అప్పుడు ముహమ్మద్ ప్రవక్త (సల్లం) ప్రవచించారు. “నిష్కారణంగా ఏ ప్రాణిని చంపకు, నిష్కారణంగా ఒక ప్రాణిని చంపినట్లయితే మొత్తం మానవజాతిని చంపిన పాపం నీకు చుట్టుకుంటుంది. ఒక ప్రాణిని చంపిన కారణంగా దైవాగ్రహానికి గురై నరకానికి పోతావు. ఆగ్రహంలో నిగ్రహం వహించు. ఎట్టి పరిస్థితులలోనూ ఆగ్రహాన్ని

దరిచేరనీయకు. సర్వ జీవరాసుల పట్ల దయ, జాలి కలిగి ఉండు. జాలి గుండె లేని వాణ్ణి అల్లాహ్ ప్రేమించడు. సాధ్యమైనంత వరకూ క్షమాగుణాన్ని అలవరచుకో. ఇతరుల తప్పిదాలను నిండు మనసుతో క్షమించు. దైవం ఎంతో క్షమాగుణం కలవాడు. ఎట్టి పరిస్థితులలోనూ శాంతి మార్గాన్ని, ధర్మ మార్గాన్ని వీడకు. ఎల్లవేళల దైవనామాన్ని స్మరిస్తూ వుండు. ఆయన ముందు తప్ప ఎవరిముందు తలవంచకు. సత్యం తప్ప నీ నోట మరే మాట వెలువడరాదు. సత్యం నీ నిత్యజీవితంలో సూర్యునిలా ప్రకాశించాలి. ఈ సుగుణాలు అలవర్చుకున్నట్లయితే నువ్వు దైవ ప్రీతికి పాత్రడవు అవుతావు" అని ముహమ్మద్ ప్రవక్త (స) ప్రవచించారు. (బుఖారి, ముస్లిం, ఇబ్నెమాజ)

మానవులు దైవ ప్రేమను పొందాలన్నా, ముక్తి మోక్షాలకు అర్హులు కావాలన్నా పైన పేర్కొన్నటువంటి సుగుణాలు కలిగి ఉండడం ఎంతైనా అవసరం.

✦ ✦ ✦

# 24. దేవుని స్మరణే సంపద

**భౌతికమైన సుఖాలను ఆశించి మనిషి ఎప్పటికప్పుడు ఎన్నో విషయాలు మరిచి పోతూనే ఉన్నాడు. చివరకు సృష్టికర్త చేసిన మేళ్లను మరిచిపోయే మనిషికి కావలసిందేదో, అంతిమ సౌఖ్యం ఎక్కడ దొరుకుతుందో ఖుర్‌ఆన్ వివరిస్తోంది.**

మానవునిలో మతిమరుపును దూరం చేయడానికి దైవం మానవులకు ఓ చక్కని చిట్కా చెప్పాడు. అదే దైవనామస్మరణ. మానవ జీవితానికి సంబంధించిన ఏ రంగమూ దైవనామస్మరణకు వెలుపల ఉండకూడదు. ఈ విషయమే దైవం పవిత్ర ఖుర్‌ఆన్ గ్రంథంలో ఇలా వివరిస్తున్నాడు. 'ప్రజలారా! మీరు దైవాన్ని అత్యధికంగా స్మరిస్తూ ఉండండి. ఉదయ సాయంత్రాలు ఆయన పవిత్రతను కొనియాడుతూ ఉండండి' ఖుర్‌ఆన్‌లోని 'ఆరాఫ్', 'మునాఫికూన్' అధ్యాయాల్లో ఇలా ఉంది. 'మీరు మనసులో దైవానికి భయపడుతూ ఎంతో దీనంగా మీ దైవాన్ని స్మరించండి, ఏమరుపాటులో పడిన వారి మాదిరిగా మారిపోకండి. 'విశ్వసించిన ప్రజలారా! మీ సంతానం, మీ సంపద మిమ్మల్ని దైవనామస్మరణ నుంచి దూరం చేయకూడదు. ఒకవేళ మీరు దైవనామస్మరణ వదిలేసి ఏమరుపాటుకు గురైతే చాలా నష్టంలో పడిపోతారన్న సంగతిని మర్చిపోకండి. కాగా ఇమ్రాన్ అధ్యాయం ఇలా చెబుతోంది. 'కూర్చుని, నిల్చొని, పడుకుని దైవాన్ని స్మరించే బుద్ధిమంతులకు భూమ్యాకాశాల నిర్మాణంలో రేయింబవళ్ల మార్పుల్లో తప్పకుండా ఎన్నో సూచనలు కనిపిస్తాయి.

## ప్రవక్త బోధ

దైవనామస్మరణ మనిషిని చైతన్యవంతం చేస్తుందని ప్రవక్త ప్రవచించారు. దైవనామస్మరణ మనిషి హృదయంలో అతణ్ని గమ్యం వైపుకు నడిపించే జ్ఞానజ్యోతిని జనింపచేస్తుంది. ఆ జ్ఞానజ్యోతి అందరికీ మార్గదర్శకం చేస్తుంది. అజ్ఞాన తిమిరాలను

తరిమివేస్తూ వారిని లక్ష్యం వైపుకు నడిపిస్తుంది. మనిషి దైవాన్ని మర్చిపోయినప్పుడల్లా ఇది అతడికి గుర్తు చేసి కర్తవ్యం వైపుకు ప్రేరేపిస్తుంది. ప్రతి వస్తువును శుద్ధి చేసే మరో పదార్థం ఉంటుంది. అలాగే హృదయాలను మెరుగుపరిచేందుకు దైవనామ స్మరణ ఉంది. దైవశిక్ష నుంచి కాపాడడంలో కూడా దైవనామస్మరణకు మించిన సాధనం లేదు అని ప్రవక్త చెప్పేవారు. దైవనామస్మరణ విషయంలో కొంతమంది విశ్వాసులు ప్రవక్త వారిని అడిగిన ప్రశ్నలు, అందుకు ఆయన ఇచ్చిన సమాధానాలు ఇవి... 'మహా ప్రవక్తా! మనుషుల్లో గొప్పవాడెవరు? అని ప్రశ్నించినప్పుడు దీర్ఘాయుష్షు కలిగి ఉండి మంచి పనులు చేస్తున్నవారు. అని సెలవిచ్చారు ప్రవక్త(స).

'ప్రవక్తా! సత్కార్యాలు చేయాలంటే చాలా ఉన్నాయి కానీ అవన్నీ ఆచరించే శక్తి నాకు లేదు. అందుకని నేను స్థిరంగా ఆచరించడానికి వీలుగా, సదా జ్ఞాపకముండేలా సంగ్రహంగా ఉండే ఏదైనా ఒక మాట చెప్పండి' అని ఓ వ్యక్తి అడిగాడు. దానికి ప్రవక్త (సఅసం) - సమగ్రమైన, సంగ్రహమైన ఉపదేశం ఏమిటంటే నీనోట సదా దైవనామ స్మరణ వెలువడుతూ ఉండాలి అని సెలవిచ్చారు.'

✦ ✦ ✦

# 25. నమ్మిన వారే ఉన్నతులు

"ప్రజలారా! సమస్త మానవ జాతి రెండే రెండు వర్గాలుగా విభజించబడింది. ఒకటి: సచ్ఛీలురు, దైవభీతి కలవారు. వీరు దైవం దృష్టిలో గౌరవప్రదమైనవారు. రెండు: దుర్మార్గులు, క్రూరులు. వీరు దైవం దృష్టిలో నీచమైనవారు. ఈ విభజన తప్పిస్తే, మానవులంతా ఆదం అలైహిస్సలాం సంతానమే. దైవం ఆదిమానవుడైన ఆదంను మట్టితో సృష్టించాడు." అని ప్రవచించారు ముహమ్మద్ ప్రవక్త సల్లం. "ప్రజలారా! జాగ్రత్తగా వినండి. మీ అందరి దైవం ఒక్కడే. అరబ్ జాతీయులకు అరబ్బేతరుల పైగాని, అరబ్బేతర జాతీయులకు అరబ్బులపై గాని, తెల్లవాళ్లకు నల్లవాళ్లపైగాని, నల్లవాళ్ళకు తెల్లవాళ్లపై గాని ఎలాంటి ఆధిక్యత లేదు. ఒక్క దైవభీతి ఆధారంగా తప్ప మరే విధంగానూ ఎవరూ అధికులు కారు. ఎవరూ అధములుకారు. ఎవరైతే దైవానికి ఎక్కువగా భయపడతారో, నిజానికి వారే దైవం దృష్టిలో అత్యంత గౌరవనీయులు అని కూడా ముహమ్మద్ ప్రవక్త (సఅసం) వారు ఉపదేశించారు.

## అందరూ సమానమే

అంటే దైవం దృష్టిలో సమస్త మానవులూ సమానమే. పుట్టుక ఆధారంగా ఎవరూ అధములు కాదు. ఎవరూ అధికులు కాదు. ఈ అధికులు, అధములు అన్న భావన కేవలం మానవులు సృష్టించుకున్నదే. ఏ రకంగా చూసినా మనిషికి మనిషికి మధ్య అల్పాధిక్యతలు చూపే ఆధారాలు లేవు. ప్రతి మనిషీ జన్మతః ఒకే విధంగా జన్మిస్తాడు. అధికులనబడే వాళ్లు ఏ విధంగా తల్లి కడుపున జన్మిస్తారో, అల్పుడు, నీచుడు అనబడేవారు కూడా అదే విధంగా తల్లికడుపున జన్మిస్తారు. కళ్లు, కాళ్లు, చెవులు, ముక్కు, నోరు సమస్త దేహ నిర్మాణంలో ఇరువురి మధ్యా ఎలాంటి వ్యత్యాసమూ ఉండదు. ఇరువురూ ఒకే ఆకాశం కింద, ఒకే భూమి మీద నివసిస్తూ, ఒకే గాలిని పీలుస్తున్నారు. అసలు మనిషికీ మనిషికీ మధ్య వ్యత్యాసం చూపడానికి ఎలాంటి ఆధారమూ లేదు. ఒక్క మంచీ చెడుల విషయంలో తప్ప. మంచివాడు, సౌశీల్యవంతుడు దైవభక్తి పరాయణుడు మాత్రమే ఉన్నతుడు,

అధికుడు, గౌరవనీయుడు; దుష్టుడు దుర్మార్గుడు, ఏజాతిలో పుట్టినా నీచుడే, అల్పుడే. ఈ విషయమే పవిత్ర ఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది.

## హద్దులను చెరిపేయి

"మానవులారా..! మేము మిమ్మల్ని ఒకే స్త్రీ పురుషుల జంట ద్వారా పుట్టించాము. మీరు ఒకరినొకరు పరిచయం చేసుకోవడానికి, గుర్తించడానికి మాత్రమే మీలో జాతుల్ని, తెగల్ని సృజించాము. వాస్తవానికి మీలో ఎక్కువగా దైవభీతికలవారే అత్యంత గౌరవనీయులు" (పవిత్ర ఖుర్‌ఆన్).

ఈ వాక్యంలో కూడా దైవం, మానవులంతా ఒక్కటే అన్న సమగ్రభావనను విశదపరుస్తున్నాడు. కానీ మానవుడే ఈ విశాల భావనను వదిలేసి తన చుట్టూ చిన్న చిన్న హద్దులను గీసుకుంటున్నాడు. ఈ హద్దుల్లోపల ఉన్నవాళ్లు మాత్రమే తన వాళ్ళుగా, మిగతా వాళ్ళని పరాయి వాళ్ళుగా భావిస్తున్నాడు. కులం, మతం, వంశం, ప్రాంతం, ఆధారంగా గిరి గీసుకుని సంఘర్షించడం మూర్ఖత్వం తప్ప మరేమీ కాదు.

## దైవానిదే ఆధిక్యత

పవిత్ర ఖుర్‌ఆన్ ఈ వాస్తవాన్ని వెల్లడించిన తరువాత, ఒక మనిషికి మరో మనిషిపై ఏదైనా ఆధిక్యత ఉంది అంటే, అది కేవలం నైతికత ప్రాతిపదికనే ఉండాలంటోంది. అలాకాక పుట్టుక ఆధారంగా కొందరికి కొందరిపై ఆధిక్యత ఉండడం అన్యాయం, అధర్మం. ఎందుకంటే ఒక ప్రత్యేక జాతిలోనో, కులంలోనో జన్మించడమన్నది ఎవరి అధీనంలోనూ లేదు. కాని ఒక మనిషి తాను కోరిన భావాలను, విశ్వాసాలను ఏర్పరచుకొని, తాను కోరిన విధంగా చెయ్యగలడు. కాబట్టి ఎవరైతే దుష్కార్యాల జోలికి పోకుండా, నైతిక విలువలతో ఉంటూ, దైవం పట్ల భయభక్తులు కలిగి ఉంటారో, దైవ గ్రంథాన్ని దైవప్రవక్తలను విశ్వసిస్తూ, సన్మార్గంలో నడిచేవారు, సత్కర్మలు ఆచరించే వారే ఉన్నతులు, గౌరవనీయులు.

✦ ✦ ✦

# 26. సంకల్పమే ప్రధానం

**మనం ఇతరులకు ఏదైనా మేలు చేస్తే దాన్ని దేవునికి సమర్పించినట్టుగా భావించాలి. ఇతరులకు చేసిన చిన్న సాయాన్ని గొప్పగా భావించి, పొంగిపోకూడదు. ప్రతిఫలం ఆశించకుండా చేసిన పనులే జీవితాన్ని సార్థకం చేస్తాయన్నది ముహమ్మద్ ప్రవక్త (స) సందేశం.**

సంకల్పం పైనే ప్రతిఫలం ఆధారపడి ఉంటుంది. ఇద్దరు వ్యక్తులు చేస్తున్న పని చూసేవారికి ఒకేలా కనిపించినా పరలోకంలో వారికి లభించే పుణ్యఫలంలో మాత్రం చాలా వ్యత్యాసముంటుంది. ఉదాహరణకు ఒక వ్యక్తి పేదవారికి అన్నదానం చేశాడు.. దాహార్తిని తీర్చాడు.. ఆపదలో ఉన్నవారిని ఆదుకున్నాడు.. ఇంకా ఏవేవో గొప్ప గొప్ప సత్కార్యాలు చేశాడు. ఖచ్చితంగా ఇవే సత్కార్యాలను మరో వ్యక్తి కూడా ఆచరించాడు. కాని ఈ ఇరువురి సత్కార్యాలు ఒకేలా ఉన్నప్పటికి వీరికి లభించే ప్రతిఫలంలో మాత్రం భూమ్యాకాశాలంత తేడా ఉంటుంది. తన సత్కార్యాలకు గాను ఒకరికి పరలోకంలో చక్కని ప్రతిఫలం లభిస్తే, మరొకరికి రవ్వంత ప్రతిఫలం కూడా లభించదు. ఎందుకని? ఈ విషయాన్ని ముహమ్మద్ ప్రవక్త (సల్లం) వారు ఇలా విశదీకరించారు.

## సంకల్పాన్ని బట్టి ప్రతిఫలం

“మానవుల ఆచరణలన్నీ వారి మనో సంకల్పంపైనే ఆధారపడి ఉంటాయి. మానవుడు ఏ సంకల్పంతో పనులను ఆచరిస్తాడో, ఆ సంకల్పం ప్రకారమే అతడికి ప్రతిఫలం దొరకుతుంది. (బుఖారి)

అంటే మానవుడు చేసే ప్రతి సత్కార్యమూ అతడి ఉద్దేశ్యం పైనే ఆధారపడి ఉంటుందన్నమాట. తాను చేస్తున్న ఈ పనివల్ల పేదవాడికి మేలు కలిగి దైవం సంతోషిస్తే చాలని, ప్రజలు ఎవరు ఏమనుకున్నా దానితో తనకు నిమిత్తం లేదని భావించి కేవలం దైవ ప్రసన్నత, పరలోక ప్రతిఫలాపేక్షతో మాత్రమే కర్మలు ఆచరించిన వారికి తప్పకుండా

ప్రతిఫలం లభించి తీరుతుంది. పరలోకంలోనే కాదు, ఇహలోకంలో కూడా అలాంటి వ్యక్తికి గౌరవమర్యాదలు, సుఖశాంతులు ప్రాప్తిస్తాయి.

## ప్రదర్శనాబుద్ధి తగదు

అందుకు భిన్నంగా ఒక వ్యక్తి దాన ధర్మాలైతే చేస్తాడు కాని, అందరూ అతడ్ని పొగడాలని, అబ్బో చాలా దానకర్ణుడు అని ప్రజలు చెప్పుకోవాలని అతడు ఆశిస్తాడు. లేక ఎవరికైనా, ఏదైనా సాయం చేసి, అవకాశం దొరికినప్పుడు వారిని దెప్పి పొడుస్తాడు. తను చేసిన మేలుకు అవతలివారు ఎప్పుడూ కృతజ్ఞులై ఉండాలని, తన గురించి నలుగురిలో చెప్పుకోవాలని ఆశిస్తాడు. ఇలాంటి వ్యక్తికి అతను ఎంత గొప్ప సత్కార్యం చేసినా పుణ్యఫలం ఏమీ లభించదు. అతడు ఆశించిన విధంగా ప్రజలు అతడిని పొగుడుతారు. ప్రశంసిస్తారు. అంతవరకే. పరలోకంలో అతనికి ఎలాంటి ప్రతిఫలమూ లభించదు. పైగా ఈ దుర్గుణానికి ప్రతిఫలంగా శిక్షను చవిచూడవలసి ఉంటుంది.

## దానం మెట్ట తోటలా ఉండాలి

అన్ని సత్కార్యాలకూ ఇదే సూత్రం వర్తిస్తుంది. ఉదాహరణకు ప్రజలు తనను గొప్ప దైవభక్తుడు అనుకోవాలని ఎంత నిష్ఠతో దైవారాధన చేసినా అతడి ఆ దైవారాధన కూడా వృధా ప్రయాసే తప్ప, ప్రదర్శనాబుద్ధితో చేసే దైవరాధనను దైవం ఎంత మాత్రం స్వీకరించదు. పవిత్ర ఖుర్ఆన్‌లో దైవ వాక్కుఇలా ఉంది... "కొండరాతిపై మట్టిపొర ఏర్పడి ఉంది. భారీ వర్షం దానిపై కురవగా ఆ మట్టి కాస్తా కొట్టుకుపోయింది. చివరకు మిగిలింది ఉత్త కొండరాయి మాత్రమే. ఇలాంటి వారు తాము దానం చేస్తున్నామని భావించి చేసే పుణ్యకార్యాలవల్ల వారికి ఏ ప్రయోజనమూ కలుగదు. దీనికి భిన్నంగా తమ సంపదను చిత్తశుద్ధితో అల్లాహ్ సంతోషం పొందే ఉద్దేశ్యంతో వ్యయపరిచే వారి వ్యయాన్ని మెట్ట ప్రదేశంలో ఉన్న తోటతో పోల్చవచ్చు. భారీ వర్షం కురిస్తే అది రెట్టింపు పంట ఇస్తుంది. ఒకవేళ భారీ వర్షం కురవక సన్నని జల్లు పడినా అదే దానికి చాలు. మీరు చేసేదంతా అల్లాహ్ దృష్టిలో ఉంది." (అల్ బఖర 264, 265)

✦ ✦ ✦

# 27. మానవ సౌభ్రాతృత్వం

మానవులారా! మేము మిమ్మల్ని ఒకే స్త్రీ పురుషుల జంట ద్వారా పుట్టించాము. మీరు ఒకరిని ఒకరు పరిచయం చేసుకోడానికి మిమ్మల్ని జాతులుగా, తెగలుగా చేశాము. వాస్తవానికి మీలో అందరికంటే ఎక్కువ భయభక్తులు కలవారే దైవం దృష్టిలో అత్యంత గౌరవనీయులు, నిశ్చయంగా దైవం సర్వజ్ఞాని, సకల విషయాలూ తెలిసినవాడు.

పవిత్ర ఖురాన్ గ్రంథంలోని ఈవాక్యంలో దేవుడు మానవాళినంతటినీ సంబోధిస్తూ హితవు చెబుతున్నాడు. ప్రపంచంలో విద్వేషాలకు, సంక్షోభాలకు దారితీసే కులం, మతం, వర్ణం, దేశం, భాష జాతీయతలకు సంబంధించిన అన్ని రకాల రాగ ద్వేషాలనూ సంస్కరిస్తూ మూడు విషయాలను బోధించాడు. 1.మానవులంతా ఒకే మూలానికి చెందిన వారు. అంటే మానవ జాతి యావత్తు ఒకే స్త్రీ పురుషుల జంట ద్వారానే ఆవిర్భవించింది. 2. మూలం ఒకటే అయినప్పటికీ సృష్టికర్త అయిన అల్లాహ్ మానవాళిని జాతులుగా, తెగలుగా తీర్చిదిద్దడానికి కారణం, వారి మధ్య పరస్పర సహకారం, పరిచయాల కోసం, 3. మానవుల మధ్య గొప్పదనానికి, ఆధిక్యం ఔన్నత్యాలకు పునాదులు మంచితనం, నీతి నిజాయితీ, శీలం, భయభక్తులు మాత్రమే.

## అల్లాహ్ ఆదరణ

పవిత్ర హదీసు గ్రంథంలోని ఒక వాక్యంలో దైవ ప్రవక్త ఇలా సెలవిస్తున్నారు, ప్రజలారా! తెలుసుకోండి, మీ అందరి దేవుడు ఒక్కడే. మీలో ఎవరికీ ఎవరిపై ఆధిక్యత లేదు. ఎవరైతే దైవానికి ఎక్కువగా భయపడతారో వారే ఆయన దృష్టిలో అత్యంత గౌరవనీయులు, గొప్పవారు. ప్రజలారా! మీరంతా మీ పూర్వీకుల గురించి గర్వపడడం మానుకోవాలి, లేకపోతే వారు దైవం సమక్షంలో హీనమైన పురుగుకన్నా ఎక్కువగా అవమానానికి గురౌతారు. ప్రళయ దినాన దైవం మీ కులగోత్రాల గురించి కాని మీ జాతి గురించి గాని ప్రశ్నించడు. నీతి నిజాయితీ, శీలం భయభక్తులు కలవారినే ఆరోజు ఆయన గౌరవిస్తాడు. ఆదరణ చూపుతాడు..

## విశ్వ సౌభ్రాతృత్వం

మత విశ్వాసం మనుషులు సహజీవనం చేయడానికే దోహదపడాలి. కానీ వారి మధ్య అవరోధాలను సృష్టించడానికి ఉపయోగపడ కూడదు..భిన్నత్వంలో ఏకత్వం గల మన దేశంలో సర్వమానవ సహిష్ణుతా భావం, పరస్పర సదవగాహన జన సామాన్యంలో అంతర్వాహినిలా ప్రవహించాలి. సహనం, సంయమనం, సహజీవనంలాంటి సుగుణాలు జనించాలి. కుల మతాలు వేరైనా మానవత రీత్యా మనమంతా పరస్పరం అన్నదమ్ము లేనన్న వాస్తవాన్ని గుర్తించి ఒకరి మతాన్ని మరొకరు గౌరవిస్తే మనుషుల మధ్య దూరాలు తగ్గి మతసామరస్యం వెల్లివిరుస్తుంది. పవిత్ర ఖురాన్ ప్రబోధించిన విశ్వ మానవ సౌభ్రాతృత్వం ఆవిష్కృతమవుతుంది.

✦ ✦ ✦

# 28. మంచి నడవడికతో దేవుని సన్నిధి

**మంచి నడవడికతోనే దైవసన్నిధిని చేరుకోవడం సాధ్యం, ఇతరులకు సాయపడని వాళ్లు, వాగ్ధాన భంగం చేసేవాళ్లకు, దేవుని పేరుతో మోసాలకు పాల్పడేవాళ్ళకు దేవుని చేతిలో శిక్ష తప్పదు. నైతిక విలువలతో కూడిన జీవితమే ఇహపర సౌఖ్యం అందిస్తుందని తెలిపే వ్యాసం.**

హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం, ముహమ్మద్ ప్రవక్త (సం) ఇలాప్రవచించారు. 'మూడు రకాల మానవుల వైపు ప్రళయం రోజున దైవం కన్నెత్తి కూడా చూడదు. వారి పాపాలను క్షమించి, వారిని పరిశుద్ధపరచదు. పైగా వారికి తీవ్రమైన నరక శిక్షను విధిస్తాడు. వారిలో ఒకరకం మనిషి అవసరానికి మించి ప్రయాణ సామగ్రి ఉన్నా, తోటి ప్రయాణీకులకు వాటిని ఇచ్చి ఆదుకోడు. రెండో రకం మనిషి ప్రాపంచిక లాభాపేక్షతో రాజ్యాధినేతకు మద్దతిస్తూ ప్రమాణం చేస్తాడు. ఆ పాలకుడు ధనమిస్తే సంతోషిస్తాడు. ఇవ్వకపోతే ముఖం మాడ్చుకుంటాడు. మూడో రకం మనిషి సాయంత్రం వేళ తన వ్యాపార వస్తువులతో నిల్చొని, సర్వశక్తిమంతుడైన దేవుని సాక్షిగా చెబుతున్నాను. నేనీ సరుకును ఇంత ధరకు కొన్నాను అని అబద్ధం చెబుతాడు. అతను నిజమే చెబుతున్నాడని ప్రజలు నమ్ముతారు. తరువాత ముహమ్మద్ ప్రవక్త (సం) పవిత్ర ఖుర్ఆన్ లోని ఈ వ్యాక్యాన్ని పఠించారు. "కొందరు తమ వాగ్దానాలను, దేవుని విషయంలో చేసిన ప్రమాణాలను అతి స్వల్ప మూల్యానికి అమ్ముకుంటారు. ఇలా అమ్ముడుపోయిన వారికి పరలోకంలో ఎలాంటి ప్రతిఫలం లభించదు. దైవం వారితో మాట్లాడదు. చివరికి ప్రళయ దినాన వారివైపు కన్నెత్తికూడా చూడదు. వారిని పరిశుద్ధపరిచే ప్రసక్తి అంతకన్నా లేదు. పైగా వారికి నరకంలో అత్యంత వ్యధాభరితమైన శిక్షపడుతుంది."

(3-77) (బుఖారి, ముస్లిం)

## తోటివారిని ఆదుకోకుంటే....

ముహమ్మద్ ప్రవక్త (స) ఈ ప్రవచనంలో మూడు రకాల మనస్తత్వాలను ప్రస్తావించారు. ఒకటో రకం: అవసరానికి మించి ప్రయాణ సామగ్రి ఉన్నా కూడా, అవసరం ఉన్న తోటి ప్రయాణికులకు వాటిని ఇవ్వకపోవడం, వారిని ఆదుకోకపోవడం మానవత్వం అనిపించుకోదని, ఇలాంటి అమానవీయ చర్యలను దైవం హర్షించడని, పైగా ఇలాంటి నేరానికి పాల్పడ్డందుకు తీవ్రంగా శిక్షిస్తాడని సెలవిచ్చారు. నిజానికి ఇది ఒక ప్రయాణ సామగ్రి వరకే పరిమితం కాదు. నిత్య జీవితంలో అడుగడుగునా పాటించాల్సిన అమృత ప్రవచనం ఇది. ఎంతో మంది అవసరార్థులు, అభాగ్యులు నిత్య జీవితంలో మనకు తారస పడుతుంటారు. అలాంటి వారికి చేతనైన సాయం చేయడం మానవత్వం. చేయగల స్థోమత ఉన్నా పక్క వాడిని పట్టించుకోకపోవడం అమానవీయం, అనైతికం, నేరం. అందుకే ముహమ్మద్ ప్రవక్త (స) "నువ్వు కడుపునిండా తిని, నీ పక్కవాడు పస్తు లుంటే నీలో విశ్వాసమే లేదని, మానవత్వమే లేదని, నువ్వసలు మనిషివే కావని, ప్రళయ దినాన దైవం నీవైపు కన్నెత్తి కూడా చూడడని, తీవ్రంగా శిక్షిస్తాడని" హెచ్చరించారు.

రెండో రకం మనిషి స్వార్థం కోసం స్వలాభం కోసం అధికారంలో ఉన్న వారికి వత్తాసు పలుకుతూ తన పబ్బం గడుపుకుంటాడు. అతడి వల్ల తనకు మేలు జరిగే వరకూ అతడి ప్రతి చర్యనూ సమర్థిస్తూ మద్దతు పలుకుతాడు. అతడి వల్ల ఇక లాభం లేదనుకున్నప్పుడు తన పప్పులు ఉడకడం లేదనుకున్నప్పుడు ప్లేటు ఫిరాయిస్తాడు. ఇలాంటి ఊసరవెల్లి రాజకీయాలను మనం ఈనాడు కళ్లారా చూస్తున్నాం. ఇలాంటి కుటిల, స్వార్థపర, అవినీతిపరులకు కూడా వినాశం తప్పదని ముహమ్మద్ ప్రవక్త (సం) హెచ్చరించారు.

## ప్రమాణంతో మోసం

మూడో రకం మనిషి తన సరుకును అమ్ముకోవడానికి దైవం సాక్షిగా ప్రమాణాలు చేసి ప్రజలను నమ్మిస్తాడు. నాసిరకం సరుకును నాణ్యమైన సరుకని, నేను చాలా తక్కువ లాభానికే వ్యాపారం చేస్తున్నానని, ఇదిగో ఇంతకు కొని ఇంతకు అమ్ముతున్నానని దైవంపై

ప్రమాణం చేస్తాడు. కాని అదంతా ప్రజలను నమ్మించి, మోసం చేసి తన వ్యాపార ప్రయోజనాలు నెరవేర్చుకునేందుకే అతనలా చేస్తాడు. సర్వశక్తిమంతుడైన దైవంపై ప్రమాణం చేసిన కారణంగా ప్రజలు అతడి మాయమాటలను ఇట్టే నమ్మేస్తారు. దీనివల్ల అతనికి తాత్కాలిక ప్రయోజనం లభించినా, నిజమేమిటో నిలకడ మీద ప్రజలకూ తెలిసిపోతుంది. ఇలాంటి మోసకారులైన వ్యాపారులకు ఇహలోకంతో పాటు పరలోకంలో కూడా తీవ్ర వినాశనం పొంచి ఉంది. అందుకని ప్రాపంచిక జీవితంలో నైతిక ప్రమాణాలను పాటిస్తూ దైవభీతి, పాపభీతితో కూడిన జీవితం గడపడమే వివేక వంతుల లక్షణం.

✦ ✦ ✦

# 29. సత్ప్రవర్తనతో ఉత్తమఫలం

ధన వ్యామోహం మనిషిని పతనం దిశగా నడిపిస్తుంది. ధన సంపదల కన్నా నీతి, నిజాయితీ, ఉత్తమ నడవడి కలవారే, ఉత్తమ ఫలాన్ని పొందుతారనేది ప్రవక్త (సఅసం) సందేశం. సిరిసంపదల కోసం, అధికారం, హోదాల కోసం వెంపర్లాడే వారి సంఖ్య పెరిగి పోతున్నది. కానీ ఇవేవి మానవుడి గౌరవోన్నతులకు, శక్తి సామర్థ్యాలకు కొల మానాలు కావు. కోట్ల ఆస్తులున్నా మంచి ప్రవర్తన, నిజాయితీ లేకపోతే ఎవరికీ గౌరవ మర్యాదలు లభించవు. నీతి నిజాయితీ, ఉత్తమ నడవడితోపాటు, దైవ భీతి, దైవభక్తి ఉన్నవారు గౌరవనీయమైన స్థానం పొందుతారు.

## ప్రవక్త ప్రవచనాలు

ముహమ్మద్ ప్రవక్త (సం) తమ ఉపదేశాల్లో విశ్వాసం, నైతికత, సత్ప్రవర్తనలే విశ్వ మానవ కళ్యాణానికి ప్రాముఖ్యమైన అంశాలని ఉపదేశించారు. "నీతి నిజాయితీ, ఉత్తమ నడవడి కలవారే పరిపూర్ణ విశ్వాసులు" (అబూదావూద్, దారిమి)

"సత్ ప్రవర్తన గల వారే మానవుల్లో అందరికంటే ఉత్తములు" (బుఖారి, ముస్లిం) "ప్రళయదినాన విశ్వాసి కర్మలత్రాసులో తూయబడే వస్తువుల్లో అత్యంత బరువైనది అతని నైతికతే". (అబూదావూద్, తిర్మిజి) 'ఒకసారి ప్రవక్త అనుచరులు, "దైవప్రవక్తా! మానవుడికి అనుగ్రహించిన వాటిలో అన్నింటికంటే ఉత్తమమైనదేది?" అని ప్రశ్నిచారు. దానికి ప్రవక్త (సఅసం) "మంచి నడవడిక" (సత్ప్రవపర్తన) అని బదులిచ్చారు.

## సత్ప్రవర్తనతో..

ఎంతటి దైవభక్తులైనా, ఎన్ని ఆరాధనలు, పూజలు, వ్రతాలు చేసినా వారిలో నీతి, నిజాయితీ, మంచిప్రవర్తన లేకుంటే వారి భక్తి ప్రపత్తులన్నీ వృథా ప్రయాసే అవుతాయి. అందుకే పవిత్ర ఖుర్ఆన్ దైవారాధన (నమాజ్), దాన ధర్మాలతోపాటు, నైతిక ప్రవర్తన కలిగి ఉండాలని, సదాచరణలు ఆచరించాలని పదేపదే ఉపదేశించింది. సదాచరణ, సత్ప్రవర్తన ఉన్న మంచివారికి దైవం తోడుగా ఉంటాడు. వారికి సిరిసంపదల తోపాటు సాఫల్యానికి మార్గం సుగమం చేస్తాడు.

✦ ✦ ✦

# ౩౦. మంచితనం-పుణ్యఫలం

"దైవ ప్రవక్తా! మానవుడికి అనుగ్రహించిన వాటిలో అన్నిటికంటే ఉత్తమ మైనదేదీ"? అని కొందరు అనుచరులు ముహమ్మద్ ప్రవక్త(సఅసం)ను అడిగారు. అప్పుడు ప్రవక్త మహనీయులు, 'మంచి నడవడిక (సత్ప్రవర్తన)' అని సమాధానం చెప్పారు. దైవం మానవుడికి అసంఖ్యాకమైన వరాలను అనుగ్రహించాడు. అసలు మానవ సృజనే ఓ అద్భుతం. అలాంటి రూప లావణ్యం సృష్టిలోని మరే జీవరాశికీ లేదు. అతనికి జ్ఞానమనే వరాన్ని కూడా ఆయన ప్రసాదించాడు. ఇది కూడా మరే జీవికీ లేదు. ఇంత జ్ఞాన సంపదను పొందిన మానవుడు తన సత్ప్రవర్తనతో సమాజానికి ఒక వరంలా ఉపయోగపడాలి. సత్ప్రవర్తన గలవారు సమాజానికి నిజంగానే ఓ వరం అంటే అతిశయోక్తి కాదు.

## మంచి నడవడిక

దైవ విశ్వాసం తరువాత ఆచరణ, సదాచరణ, సత్ప్రవర్తనలకే అంతటి స్థాయి ఉందని ప్రవక్త సెలవిచ్చారంటే వాటికి ఎంత ప్రాముఖ్యం ఉందో అర్ధమవుతుంది. 'సత్ప్రవర్తన'ను విస్మరించి ఎన్ని పూజలు, పురస్కారాలు చేసినా, ఎన్ని నమాజులు చేసినా, ఎన్ని వ్రతాలు, ఎన్ని నోములు ఆచరించినా అవన్నీ వ్యర్ధ ప్రయాస తప్ప మరేమీ కాదు. నీతి, నిజాయితీ, సత్ప్రవర్తనల ద్వారానే విశ్వాసం పరిపూర్ణమవుతుంది. ముహమ్మద్ ప్రవక్త (సం) నీతి నిజాయితీలకు, సత్ప్రవర్తనకు ఎంతో ప్రాముఖ్యం ఇచ్చారు. 'మంచి నడవడిక గలవారే మానవులందరిలో ఉత్తములు'ని ఆయన ప్రవచించారు. 'ఒక దైవ విశ్వాసి తన సత్ప్రవర్తన, నీతి నిజాయితీల ద్వారా, రాత్రంతా మేల్కొని నఫిల్ (అదనపు) నమాజులు, పగలంతా ఉపవాస వ్రతం పాటించే భక్తుల స్థాయిని పొందగలడని' ముహమ్మద్ ప్రవక్త సెలవిచ్చారు. (అబూదావూద్, బుఖారి)

## నైతిక జీవనం

ఒకవేళ ఎవరైనా ప్రసన్నమైన ధార్మిక వేషధారణతో, విధిగా చేయవలసిన ఆరాధన లకు అదనంగా నఫిల్ నమాజులు, ప్రార్థనలు చేస్తూ, వ్రతాలు, నోములు ఆచరిస్తూ,

సమాజంలో మానవ సంబంధాల పట్ల దుష్ప్రవర్తనను అవలంబించే వారు, ఉద్యోగ, వ్యాపార, విషయాల్లో నీతికి, న్యాయానికి తిలోదకాలిచ్చేవారు, బాధ్యతలు విస్మరించేవారు. ఎంతటి ధార్మిక వేషధారణ చేసినా, ఎన్ని మంచి ఉపన్యాసాలు ఇచ్చినా, ఎన్ని ఆరాధనలు చేసినా, ఎన్ని ధార్మిక యాత్రలు చేసినా ఏమిటి లాభం? ముహమ్మద్ ప్రవక్త నీతి నిజాయితీలను, సత్ప్రవర్తనను విస్మరించి చేసే ఎలాంటి ధార్మిక కార్యానికైనా ధర్మబద్ధత లేదని, దాని వల్ల అతనికి ఒనగూడే ప్రయోజనం కూడా ఏమీ లేదని తేల్చి చెప్పారు. కావున మానవులు ఈ ప్రపంచంలో గౌరవ మర్యాదలు పొందాలన్నా, పరలోకంలో పుణ్యఫలాలు దక్కాలన్నా నీతి నిజాయితీలతో కూడిన నైతిక జీవితం గడపడం తప్పనిసరి. అలాంటి జీవితమే నిజమైన ధార్మిక జీవితం అనిపించుకుంటుంది.

✦ ✦ ✦

# 31. ధర్మబద్ధం... స్వర్గమార్గం

**వ్యాపారం అంటే మోసానికి పర్యాయపదంగా మారింది. నిజానికి ధర్మబద్ధమైన వ్యాపారం ఇహలోకంలో లాభాలు తెచ్చిపెడుతుంది. పరంలో స్వర్గాన్ని అందిస్తుంది. ముహమ్మద్ ప్రవక్త బోధించిన వ్యాపార ధర్మం ఇది.**

ఈ రోజుల్లో వ్యాపారమంటే దగా, మోసం, వంచన అనే అభిప్రాయం ఉంది. కొంత మేరకు ఇందులో వాస్తవం కూడా ఉంది. ఒక వ్యాపారి తన వ్యాపార పబ్బం గడుపుకోవడానికి వినియోగదారుణ్ణి పలు విధాలుగా మోసం చేయడాన్ని మనమీనాడు గమనిస్తూనే ఉన్నాం. అబద్ధం లేని వ్యాపారం అపజయాన్నే తెచ్చి పెడుతుందని నమ్ము తున్నాడు ఈనాటి వ్యాపారి. కాని ధర్మబద్ధమైన వ్యాపారంలో శుభం ఉందని, సత్య వ్రతుడైన వ్యాపారి ఇహలోకంలో లాభాలతో పాటు, పరలోకంలో స్వర్గాన్ని పొందుతాడని ముహమ్మద్ ప్రవక్త (సల్లం) వారు సెలవిచ్చారు.

## అసత్యంతో అశుభం

"మీ సామగ్రిని అమ్ముకోవడానికి అబద్ధాలు చెప్పకండి. అసత్య ప్రమాణాలు చేయకండి. అలా చేయడం వల్ల తాత్కాలికంగా మీ వ్యాపారం అభివృద్ధి జరిగినట్లు అనిపించినా చివరకు వ్యాపారంలో శుభాలు అంతరించి పోతాయి." అన్నారు ముహమ్మద్ ప్రవక్త (ముస్లిం).

"వ్యాపారంలో ఎప్పుడూ విశ్వసనీయత, అప్పగింత పట్ల విశ్వాస వైఖరి అవలం బించాలి. పనికిరాని వస్తువులను మాయ మాటలతో అమ్మిగాని, సాధారణ లాభం కంటే అత్యంత ఎక్కువ లాభం తీసుకుని గాని, అమ్మి మీ ధర్మబద్ధమైన సంపాదనను అధర్మ మైనదిగా చేసుకోకండి అని తెలుపుతూ సత్యవంతుడైన, నమ్మకస్తుడైన వ్యాపారి ప్రళయ దినాన ప్రవక్తలు, సత్యసంధులు, అమరగతులైన వారి సహచర్యంలో ఉంటాడు." అని సెలవిచ్చారు ముహమ్మద్ ప్రవక్త (సల్లం)". (తిర్మిజి)

ప్రవక్త మహనీయులు ఒకసారి ఇలా అన్నారు : 'ఉపాధి అన్వేషణలో, ధర్మసమ్మత మైన సంపాదన కోసం ప్రాతఃకాలాన్నే బయలుదేరండి. ఎందుకంటే, ఉదయాన్నే (ప్రార్థన తరువాత) చేసే పనుల్లో శుభాలు, లాభాలు సమృద్ధిగా ఉంటాయి. ధర్మసంపాదనతో జీవితం గడిపినవాడు నా సంప్రదాయాన్ని పాటించినవాడవుతాడు. నా సంప్రదాయాన్ని పాటించినవాడు తప్పక స్వర్గంలో ప్రవేశిస్తాడు. (తిర్మిజి)

దైవప్రవక్త ముహమ్మద్(స)వారి ఈ ప్రవచనాల ద్వారా మనకు అనేక విషయాలు తెలుస్తున్నాయి. ఈనాడు వ్యాపారులపై వినియోగదారులకు విశ్వాసంలేదు. అన్ని విషయాల్లో వినియోగదారుడు దోపిడీకి, మోసానికి గురవుతున్నాడు. కాబట్టి దైవప్రవక్త వారి ఈ సుభాషితాలను గనక దృష్టిలో ఉంచుకున్నట్లయితే, వినియోగదారుల నమ్మకాన్ని చూరగొనడంతోపాటు ఇహలోక శుభాలు, లాభాలు ఒనగూడుతాయి. దీనివల్ల ఎలాగూ పరలోకంలో మంచి ప్రతిఫలం లభిస్తుంది. అమ్మే వస్తువుల్లో కల్తీ చేయవద్దని, కొలతలు, తూనికల్లో మోసం చేస్తే వినాశనం తప్పదని, దీనికి మీరు దైవం ముందు సమాధానం చెప్పుకోవలసి ఉంటుందని ప్రవక్త చేసిన హితోపదేశాలను పాటిస్తే, నేటి మన సమాజంలో అపనమ్మకాలు, భయం అన్న మాటలకు తావు ఉండదు.

## ధర్మమైనదే వ్యాపారం

సాధ్యమైనంత వరకు వినియోగదారునికి మంచి వస్తువులు సమకూర్చడానికి ప్రయత్నించాలి. మీకు నమ్మకం లేని సామగ్రిని మీరసలు అమ్మనేకూడదు. ఒకవేళ వినియోగదారులు మిమ్మల్ని సలహా కోరితే సముచితమైన సలహాలు ఇవ్వాలి. తెలిసీ తెలియని సలహాలిచ్చి వారిని ఇబ్బందులకు గురిచేయకూడదు. పట్టుదలతో వ్యాపారం చేసి, బాగా సంపాదించుకోవడంలో తప్పులేదు. కాని అబద్ధాలు చెప్పి, అడ్డదారులు తొక్కి కల్తీ చేసి మాయలు మోసాలతో సంపాదించాలన్న దుర్బుద్ధి ఉండకూడదు. ఒకసారి ప్రజలు ముహమ్మద్ ప్రవక్త వారి సన్నిధిలో హాజరై, దైవప్రవక్తా! అన్నిటికన్నా శ్రేష్ఠమైన సంపాదన ఏది? అని అడిగారు. అప్పుడు ముహమ్మద్ ప్రవక్త ఇలా చెప్పారు. 'స్వహస్తాలతో సంపాదించింది, అబద్ధం, నమ్మక ద్రోహం లేని వ్యాపారం' అని సమాధానమిచ్చారు.

✦ ✦ ✦

# 32. దేవుని సన్నిధి పొందే మార్గం

**దేవుడు ప్రసాదించిన ఈ మానవ జన్మ మహోన్నతమైనది. విచక్షణా జ్ఞానాన్ని, మేధస్సును ఆయన మనకు వరంగా ప్రసాదించాడు. ఈ అమూల్యమైన జీవితం సద్వినియోగం కావాలంటే ధార్మికంగా జీవించాలి. అప్పుడే దైవ ప్రసన్నత కలుగుతుంది.**

హజ్రత్ అబూహురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం, ముహమ్మద్ ప్రవక్త (సం) ఇలా ఉపదేశించారు. 'మనిషి అనవసర విషయాలను, లాభం లేని పనులను త్యజించడం కూడా దైవ ధర్మ శుభాల్లో, దాని పరిపూర్ణతకు సంబంధించిన అంశమే'

(ఇబ్నెమాజ, తిర్మిజి)

అంటే, మనిషి దైవధర్మంలోని శుభాలను, లాభాలను, ప్రయోజనాలను సంపూర్ణంగా పొందాలంటే, అనవసర విషయాలకు, అర్థంపర్థం లేని ఉబుసుపోక కబుర్లకు, నైతికంగా, ధార్మికంగా ఏమాత్రం విలువలేని పనులకు, ప్రయోజనం లేని కార్యాలకు దూరంగా ఉండాలి.

## సద్వినియోగంతోనే సార్థకత

ఎందుకంటే, మానవుడు యావత్తు సృష్టికే మకుటంలాంటి వాడు. దైవం అతనికి అంతటి మహోన్నతమైన విలువను, గౌరవాన్ని, ఔన్నత్యాన్ని ప్రసాదించాడు. మనిషికి ఇంతటి మహత్తరమైన స్థానాన్ని ప్రసాదించిన పరమ ప్రభువు కోరేదేమిటంటే, మనకు ప్రసాదించిన సమయం, శక్తి సామర్థ్యాల సంపద అనవసరంగా, వృధాకాకుండా, సరైన మార్గంలో, సద్వినియోగం కావాలి. నైతికంగా, ఆధ్యాత్మికంగా ప్రగతిపథంలో దూసుకు పోతూ దైవప్రసన్నత, దైవ సామీప్యం పొందాలి'. ఇదీ పరమ ప్రభువు కోరిక.

## అందరి మేలు కోరాలి

పై ఉల్లేఖనంలోని అసలు సారాంశం ఇదే. కాబట్టి తమ విశ్వాసాన్ని ఈమాన్‌ను

పట్టిష్టం, పరిపూర్ణం చేసుకోవాలనుకునేవారు, తమ ధార్మిక సౌందర్యానికి, ధార్మిక, నైతిక సుగుణాలకు ఎలాంటి మచ్చ, లోటు రాకూడదని కోరుకునే వారందరూ పాపాలు దుష్కార్యాలు, అనైతికతలకు దూరంగా ఉండాలి. అంతే కాకుండా అన్ని రకాల అనవసర పనులకు, ప్రయోజనరహిత కార్యాలకు, ఉబుసుపోక కబుర్లకు, అనవసర సంభాషణలకు దూరంగా ఉండాలి. తమ అమూల్యమైన సమయాన్ని, దైవం ప్రసాదించిన అపార శక్తియుక్తుల్ని, మేధను, సత్కార్యాలకు, ప్రజలకు ఎంతో కొంత మేలు కలిగే పనులకు వినియోగించాలి.

## నిజమైన విజ్ఞులు

అంటే మనం చేసే ప్రతి పనీ, పలికే ప్రతి మాట, మనం వెచ్చించే ప్రతి సెకనూ ప్రాపంచిక ప్రయోజనాలతో పాటు, పరలోకంలో కూడా లాభం చేకూర్చేదై ఉండాలన్న మాట. అలాకాకుండా ఎవరైతే దైవం ప్రసాదించిన స్వేచ్ఛను, శక్తి సామర్థ్యాలను, అమూల్యమైన సమయాన్ని, ఏమరుపాటులో పడి దుర్వినియోగ పరుస్తారో, అలాంటి వారు, దైవం తమకు ఎంతటి విలువను, గౌరవాన్ని, ఔన్నత్యాన్ని, ఆధిక్యతను ప్రసాదించాడో గుర్తించలేకపోతున్నారని అర్థం చేసుకోవాలి. ఏమరుపాటులో పడి ఎంతటి అమూల్య సంపదను సర్వనాశనం చేసుకుంటున్నారో కూడా చాలా మంది తెలుసుకోలేకపోతున్నారు. ఎవరైతే ఈ యధార్థాన్ని గ్రహిస్తారో వారే నిజంగా విజ్ఞులు, వివేకవంతులూను. దైవం అందరికీ తమ స్వేచ్ఛను, శక్తీ సామర్థ్యాలను, సమయాన్ని అనవసర కార్యాల్లో వెచ్చించక, దైవాభీష్టకార్యాల్లో సద్వినియోగపరిచే భాగ్యాన్ని ప్రసాదించాలని కోరుకుందాం.

✦ ✦ ✦

# 33. దైవప్రశంస

**తోటి మానవ సోదరుల కష్టాలు తీర్చడంలో నిమగ్నమై ఉండేవారికి దేవుడు సహాయం చేస్తాడని ముహమ్మద్ ప్రవక్త (సఅసం)బోధించారు. ఈ బోధనల్లో ప్రతి పౌరుడు అర్థం చేసుకుని, ఆచరించవలసిన అంశాలెన్నో ఉన్నాయి. ఆనాటి ప్రవక్త ప్రవచన సారాంశం.**

సమాజంలో మానవుల మధ్య పరస్పర సంబంధ బాంధవ్యాలు ఎలా ఉండాలో వివరిస్తూ ముహమ్మద్ ప్రవక్త ఇలా బోధించారని హజ్రత్ అబూహురైరా (ర) తెలిపారు. "ఒక మనిషి మరో మనిషికి వచ్చిన ప్రాపంచిక కష్టాలలో, కనీసం ఒక కష్టాన్నైనా దూరం చేస్తే, దైవం ప్రళయదినాన అతని కష్టాల నుండి ఒక కష్టం దూరం చేస్తాడు. వస్త్రాలు లేని వారికి వస్త్రాలు సమకూరిస్తే అలాంటి వారికి దైవం పరలోకంలో ఆచ్ఛాదన కలుగచేస్తాడు, ఎవరైతే తోటి మానవసోదరుల కష్టాలు తీర్చడంలో నిమగ్నమై ఉంటారో, అలాంటి వారికి సహాయం చేయడంలో దేవుడు లీనమై ఉంటాడు, ఎవరైతే జ్ఞానసముపార్జన కోసం, దాని విస్తరణ కోసం కృషి చేస్తూ ఉంటారో వారి కోసం దైవం స్వర్గ మార్గాన్ని సుగమం చేస్తాడు. మరెవరైతే దైవగృహంలో సమావేశమై దైవగ్రంథం పఠిస్తారో, పఠించి ఇతరులకు వినిపిస్తారో, అలాంటి వారి హృదయాలకు శాంతి, సాంత్వన సమకూరుతాయి. సమాజంలో సామరస్య వాతావరణాన్ని సృజించే ఈ ప్రవచనం ఓ ఆదర్శం. ఈ ప్రవచనంలో చెప్పిన అంశాలను పరిశీలిద్దాం.

## తోటివారికి సాయపడాలి

మొదటిది, తోటివారి కష్టాలను దూరం చెయ్యడం. సాధ్యమైనంత మేరకు, తమకు చేతనైన రూపంలో సాటివారికి ప్రయోజనం చేకూరేలా సాయపడాలి. తరువాతి అంశం ఆచ్ఛాదన కలుగజేయడం. అంటే బాహ్యంగా శరీరానికి వస్త్రాలు కల్పించడంతో పాటు, ఆ వ్యక్తి పొరపాట్లను, తప్పిదాలను, ఇతరుల దృష్టికి రాకుండా దాచడం. సదరు వ్యక్తి

క్షంతవ్యం కాని నేరానికి పాల్పడితే అలాంటి పాపం అతడు చేయకుండా సాధ్యమైనంత మేరకు నిరోధించడానికి గట్టి ప్రయత్నం చేయాలి.

## అసలైన జ్ఞానం

తోటి మనషులకు సహాయపడడం. ఇది త్యాగభావాన్ని పెంపొందిస్తుంది. ఒక దైవవిశ్వాసి తన ధనాన్ని, సమయాన్ని ప్రతి కదలికను సాటి వారికి సహాయపడడంలో వెచ్చిస్తాడు. ప్రవచనంలోని మరో అంశం జ్ఞాన సముపార్జన, దాన్ని విస్తరించడం; ఒక మనిషి భౌతికంగా ఎంత విద్య అభ్యసించినా, ఎన్నెన్ని డిగ్రీలు పుచ్చుకున్నా, శాస్త్ర సాంకేతిక రంగాల్లో ఎంత ప్రగతి సాధించినా, నైతిక పరివర్తన సాధించకపోతే అలాంటి విద్య, అలాంటి జ్ఞానం బూడిదలో పోసిన పన్నీరు తప్ప మరేమీకాదు, తానేమిటి? తన ఉనికి వెనుకగల ఉద్దేశం ఏమిటి? సమాజంలో తన స్థానమేమిటి?

– మంచి చెడు, సత్యం అసత్యం, శీలం అశ్లీలం, జీవితం మరణం, మరణానంతర జీవితం, ప్రళయం, తీర్పు ఇత్యాది విషయాలను తెలిపేదే జ్ఞానం. అలాగే దైవగృహంలో సమావేశం కావడం, దైవగ్రంథ పారాయణ మాధుర్యాన్ని ప్రజలకు పంచడం చేయాలని ప్రవక్త మహనీయులు ప్రవచించారు. ఇది మానవుల మధ్య సామూహిక ఐక్యతను తెలుపుతుంది. ముహమ్మద్ ప్రవక్త ప్రవచనం ప్రకారం దైవగృహంలో సమావేశమై గ్రంథ బోధన చేసేవారి హృదయంపై శాంతి, సాంత్వన అవతరిస్తాయి. ఇలాంటి దైవ దాసులను గురించి దేవుడు తన సమక్షంలో ఉన్న దైవదూతల ముందు సగర్వంగా ప్రస్తావిస్తాడు, ప్రశంసిస్తాడు.

✦ ✦ ✦

# 34. ధర్మపథం.. ఇస్లాం

**సమాజంలో ప్రతి వ్యక్తికి హక్కులూ ఉంటాయి. బాధ్యతలూ ఉంటాయి. ముహమ్మద్ ప్రవక్త ప్రజల సామాజిక బాధ్యతలను గుర్తు చేస్తూనే దైవవాణి అయిన ఖుర్‌ఆన్ ప్రజలకు ఇచ్చిన హక్కులను గురించి కూడా తెలియ జేశారు. ఖుర్‌ఆన్ ఆధారంగా పౌరహక్కులు, బాధ్యతలను గురించీ..**

ముహమ్మద్ ప్రవక్త తన అంతిమ హజ్‌యాత్ర సందర్భంగా ప్రజలనుద్దేశించి ప్రసంగించారు. అందులో మానవుల హక్కులను గురించి, వ్యక్తిగత స్వేచ్ఛను గురించి విశదంగా తెలియజేశారు. ఇతరుల ఆస్తులను, సంపదను హరించడాన్ని ఇస్లాం పూర్తిగా నిషేధించింది. దేవుని న్యాయం స్పష్టంగా ఇలా ప్రకటిస్తుంది. "మీలో మీరు ఒకరి ఆస్తిని మరొకరు అన్యాయంగా, అక్రమంగా కబళించకండి" (ఖుర్‌ఆన్ 2-188) ఒకరి ధన ప్రాణాలను మరొకరు కబళించడాన్ని మాత్రమే కాకుండా, ఒకరి మాన మర్యాదలను, గౌరవ ప్రతిష్టలను మంటగలిపే చర్యలను సైతం నిషేధించారు. పవిత్ర ఖుర్‌ఆన్ ఇలా ఆదేశిస్తోంది. 'ఒక జాతి ప్రజలు మరో జాతి ప్రజలను అవహేళన చేయవద్దు. ఒకరికొకరు తమ ప్రతిష్టలకు భంగం కలిగించుకోవద్దు. మారు పేర్లతో ఒకరినొకరు పరిహసించు కోవద్దు. ఒకరివెనుక ఒకరు చెడుగా మాట్లాడుకోవద్దు. నిందలు వేసుకోవద్దు.

## వ్యక్తిగత జీవన భద్రత

ఇస్లాం ధర్మం పౌరుల వ్యక్తిగత జీవితాల్లో కల్పించుకోవడాన్ని కూడా నిషేధించింది. ఇతరులపై గూఢ చర్యానికి పాల్పడకండి. 'మీ స్వగృహం తప్ప, మరెవరి ఇంట్లోకి ఆ ఇంటి వారి అనుమతి లేనిదే ప్రవేశించకండి.' అని ఖుర్‌ఆన్ ప్రబోధిస్తుంది. ఏ వ్యక్తిని అయినా శిక్షించాలంటే అతని నేరం న్యాయస్థానంలో రుజువు కావాలని ఇస్లాం ధర్మం ఆదేశిస్తుంది. కేవలం అనుమానం మీద అరెస్టు చేసి, జైలులోకి నెట్టి తనపై మోపిన ఆరోపణలను ఖండించే అవకాశాన్ని ఇవ్వకపోవడం లాంటి చర్యలను ఇస్లాం సమ్మతించదు.

ప్రతి ఒక్కరి మత విశ్వాసాలను గౌరవించాలని ఆదేశిస్తూ ఈ హక్కును కాలరాసే చర్యలన్నింటినీ ఇస్లాం నిషేధించింది. ఇతర మతాలను దూషించడాన్ని కూడా ఇస్లాం అంగీకరించదు. మత విషయాలపై చర్చలను, వ్యాఖ్యలను ఇస్లాం నిషేధించదు. కాని ఈ చర్చలు సుహృద్భావ వాతావరణంలో జరగాలి.

✦ ✦ ✦

# 35. ప్రకృతి ధర్మం

**ప్రకృతికి అనుగుణంగా నడుచుకోవడం దైవ ధర్మాన్ని పాటించడమే అవు తుంది. సుఖమయ జీవితానికి అదే పూలబాట. క్రమశిక్షణతో కూడిన జీవితం, మహనీయులు చూపిన దారిలో నడుచుకోవడం, జీవితాన్ని సార్థకం చేస్తుంది.**

అఖండ బ్రహ్మాండమైన ఈ విశాల విశ్వం, అందులోని సమస్త సృష్టి, ఒక నియమానికి, కట్టుబాటుకు లోబడి ఎలాంటి అంతరాయం లేకుండా నిరంతరం ప్రశాంతంగా మనుగడ సాగిస్తున్నది. ఈ పుడమిపై ఉన్న వృక్ష జాతులు, పశుపక్ష్యాదులు, జంతు జాలాలు, సరీసృపాల జీవన రీతులు, ఆహారపు అలవాట్లు ఒక నిర్దేశిత నియమాల ప్రకారం సాగుతున్నాయి. ఈ నియమావళినే మనం సాధారణ పరిభాషలో ప్రకృతి ధర్మం అంటాం.

## ప్రశాంత లేమి

ఈ ప్రకృతి ధర్మంపై నడిచే ప్రతి వస్తువులోనూ మనకు శాంతి, సంతృప్తి సవ్యత స్పష్టంగా కనిపిస్తాయి. కానీ మానవుడిలోనే ఈ ప్రశాంతత, సమతౌల్యం కానరావడం లేదు. మానవుడు ప్రకృతి ధర్మంలోని వాస్తవాన్ని గుర్తించకుండా, దేవుడు ప్రసాదించిన స్వేచ్ఛను దుర్వినియోగపరచడమే అందుకు కారణం, ఈ కారణంగానే విశ్వంలోని సమస్త సృష్టిలో ప్రశాంతత కనిపిస్తుంటే బుద్ధికి, జ్ఞానానికి పెట్టింది పేరైన మానవ జాతిలో మాత్రం నిరంతరం అశాంతి, అలజడి, అపసవ్యత, అల్లకల్లోలాలు రాజ్యం చేస్తున్నాయి.

## దైవమార్గమే శరణ్యం

వాస్తవానికి మానవుడు సైతం మాతృగర్భంలో నుంచి బయటకు వచ్చిన ప్రారంభంలో ఈ ప్రకృతి ధర్మాన్నే అనుసరిస్తాడు. కాని తరువాత అతని తల్లిదండ్రుల శిక్షణ, అతని చుట్టూ ఉండే పరిసరాలు క్రమంగా అతడిని ధర్మానికి దూరం చేస్తున్నాయి. ఈ యధార్థాన్నే ముహమ్మద్ ప్రవక్త ప్రవక్త సల్లం వారు శిశువు జననం ప్రకృతి ధర్మం

ఇస్లాంపై సంభవిస్తుందని, తరువాత తల్లిదండ్రులు ఆ శిశువును ప్రకృతి ధర్మానికి దూరం చేస్తారని తెలిపారు. ఈ ప్రకృతి ధర్మానికి మానవుడు దూరం కాకుండా ఉండాలంటే, దైవ మార్గదర్శకత్వాన్ని అనుసరించాలని ఆయన సూచించారు.

## దారితప్పితే...

దైవం తన మార్గదర్శక సూత్రాలను గ్రంథాల రూపంలో తన ప్రవక్తల ద్వారా మానవాళికి అందించాడు. కనుక మానవుడు దైవం ప్రసాదించిన బుద్ధి, జ్ఞానాలను వినియోగించి ఏది దైవం ప్రసాదించిన ప్రకృతి ధర్మమో, ఏది మానవులు కల్పించుకున్న వికృత ధర్మమో తెలుసుకోవాలి. దైవ ప్రసాదితమైన స్వేచ్ఛ, బుద్ధి, వివేకాలను దుర్వినియోగ పరచి ప్రకృతి విరుద్ధమైన విశృంఖల జీవితం గడిపితే మానవ జీవితం ఈ ప్రపంచంలో అశాంతి, అసంతృప్తి అసంతులనాలమయమవ్వడమే కాక మరణానంతరం సంభవించే శాశ్వత పరలోక జీవితంలో కూడా సుఖశాంతులకు నోచుకోక నరక శిక్షను అనుభవించవలసి ఉంటుంది. అందుకే ప్రకృతి ధర్మమైన దైవ ధర్మాన్ని అనుసరించడమే సుఖశాంతుల జీవితానికి పూలబాట అని గుర్తించాలి.

✦ ✦ ✦

# 36. జ్ఞానం - దైవమార్గం

**విద్య, విజ్ఞానాలకు ఇస్లాం ధర్మం అధిక ప్రాధాన్యం ఇచ్చింది. ముహమ్మద్ ప్రవక్తకు అల్లాహ్ పంపిన మొదటి సందేశం విద్యను గురించే, జ్ఞానం దైవమార్గమని బోధించే ఖుర్ఆన్ వాణిలో విశేషాలు..**

ప్రాచీన కాలంలో విద్యా విజ్ఞానాల అవకాశాలు కొన్ని సంపన్న వర్గాలకు, అగ్రవర్ణాలకు, అగ్రకులాలకు మాత్రమే పరిమితమై ఉండేవి. జ్ఞాన సంపదపై వారికి మాత్రమే గుత్తాధిపత్యం ఉండేది. వారి దృష్టిలో ఇతర వర్గాలవారు, ముఖ్యంగా దళితులు, బడుగు బలహీన వర్గాల వారు విద్యాజ్ఞానాలు ఆర్జించడానికి అనర్హులు. స్త్రీ జాతికి కూడా విద్యా విజ్ఞానాలు నేర్చుకునే అధికారం, అనుమతి ఉండేదికాదు. కాని దైవం వారి కోసం కూడా జ్ఞాన ద్వారాలు తెరిచాడు. ఈ విధంగా దైవం ఇస్లాం ధర్మం ద్వారా విద్యావిజ్ఞానాలకు అత్యంతప్రాముఖ్యతనిచ్చి జ్ఞానార్జన సర్వసామాన్యం చేసి మానవాళికి గొప్ప మేలు చేశాడు.

## విద్య ఆవశ్యకత

మానవుల ఆచరణ, నడవడిక, ఆచార వ్యవహారాలు వారి ఆంతర్యాల్లో ఉండే విశ్వాసంపై ఆధారపడి ఉంటాయి. విద్య విజ్ఞానమే విశ్వాసానికి గీటురాళ్లు. మానవ ఆంతర్యంలో సక్రమమైన, సమగ్రమమైన, సంపూర్ణమైన, సుదృఢమైన విశ్వాసం వేళ్లూనుకోవాలంటే విద్య, విజ్ఞానాలను వీలైనంత ఎక్కువగా ఆర్జించడం అత్యంత ఆవశ్యకం. అందుకే ఇస్లామీ ధర్మం విద్య విజ్ఞానాలకు అంతటి ప్రాముఖ్యత ఇచ్చింది. అంతే కాకుండా విద్య విజ్ఞానాలు మనిషిని సంస్కరించి సంస్కారవంతుడిగా, గొప్పవాడుగా చేస్తాయి. విద్య మానవుల ప్రగతీ వికాసాలకు రాచబాటలు పరుస్తుంది. మహోన్నతమైన మానవతా విలువల్ని పెంపొందించి సభ్యత, సంస్కృతి, నాగరికతలకు పునాదులు నిర్మిస్తుంది. దీనికి

భిన్నంగా అవిద్య మానవుణ్ని అంధకార తిమిరంలో బంధించి ఆటవికునిగా, అనాగరికు నిగా తయారు చేస్తుంది.

## సృష్టికర్త పేరుతో...

నేటికి దాదాపు వేయిన్నర సంవత్సరాలకు పూర్వం అరేబియా దేశం అజ్ఞానపు కారుచీకట్లలో కొట్టుమిట్టాడుతూ ఉండేది. ఈ చీకటి తెరలను చీల్చి జ్ఞానకాంతులు ప్రసరింపచేయడానికి దేవుడు ముహమ్మద్ మహనీయుణ్ని తన ప్రవక్తగా ప్రభవింప చేశాడు. ముహమ్మద్ ప్రవక్తపై అవతరించిన తొట్ట తొలి దైవ సందేశం 'ఇఖ్రాబిస్మి రబ్బికల్లజీ... (చదువు నీ సృష్టికర్త పేరుతో..) అనే వాక్యంతో ప్రారంభమైంది. ముహమ్మద్ ప్రవక్త ఒకసారి విద్యావిజ్ఞానాల ప్రాముఖ్యతను నొక్కి చెబుతూ విద్యార్జన కోసం ఇంటి నుండి బయలుదేరిన వ్యక్తి మళ్లీ ఇంటికి తిరిగొచ్చేవరకు దైవ మార్గంలో ఉంటాడు అన్నారు. మరో సందర్భంలో ఆయన తల్లి ఒడినుండి సమాధిలోకి పోయే వరకూ విద్యార్జన చేస్తూనే ఉండాలని బోధించారు. అంటే విద్య ఆర్జించడమనేది కొన్నాళ్లే సాగించే తాత్కాలిక కార్యం కాదని, జీవితాంతం నిరంతరంగా కొనసాగవలసిన నిత్యనూతన కార్యకలాపం అని ముహమ్మద్ ప్రవక్త (సఅసం) వారి బోధనల వల్ల మనకు అర్థమవుతుంది.

✦ ✦ ✦

# 37. మహోన్నతం.. దైవధర్మం

**సృష్టి యావత్తు దైవం ఆదేశాలకు లోబడి నడుచుకుంటోంది. ఆయన అభీష్టానికి వ్యతిరేకంగా ఏదీ జరగదు. దైవధర్మాన్ని కాదని మరో ధర్మాన్ని వెతికే సాహసం ఎవరూ చేయకూడదు అన్న పవిత్ర ఖుర్‌ఆన్ ఉపదేశాల ఆధారంగా దైవ నియమాలు మానవుల బాధ్యతలను గురించి...**

ఈ సకల చరాచర సృష్టి యాధృచ్ఛికంగా, దానంతట అదే ఉనికి లోనికి రాలేదు. దీన్ని సృష్టించినవాడు ఒకడున్నాడు. ఆయనే అల్లాహ్, గాడ్, ఈశ్వర్, యెహోవా. పేరు ఏదైనా సృష్టికర్త మాత్రం ఒక్కడే. ఆయనకు భాగస్వాములు లేరు. ఆయనే ఈ సృష్టిలో ఉన్న సకల వస్తువులను, సకల ప్రాణులను పుట్టించాడు. జగానికి వెలుగునిచ్చే సూర్యుడు, వెన్నెల కురిసే చంద్రుడు, నక్షత్రాలు, గాలి, మేఘాలు, ఉరుములు, మెరుపులు, పర్వతాలు, అడవులు, క్రూరమృగాలు, జంతువులు అన్నింటినీ సృష్టించిన దైవం ఒక్కడే, సృష్టి యావత్తు ఆయన ఆదేశాలకు ఆజ్ఞలకు లోబడి నడుస్తోంది.

## దైవధర్మమే అంతిమమైనది

సూర్యోదయానికి, సూర్యాస్తమయానికి ఒక నియమం, ఒక సమయం నిర్ణయమై ఉంది. ఆ నియమానికి, ఆ సమయానికి సూర్యుడు పూర్తిగా లోబడి ఉన్నాడు. వీచే గాలికి, కురిసేవానకు కూడా కొన్ని నియమాలున్నాయి. ఆ నియమాలను అవి అతిక్రమించలేవు. దైవ నియమావళిని, దైవ చట్టాలను ధిక్కరించే శక్తి సామర్థ్యాలు ఎవరికీ లేవు. ఇదే విధంగా ఈ ప్రపంచంలో ఉన్న సమస్త వస్తువులకు, సకల ప్రాణికోటికీ ఒక నియమం, ఒక చట్టం ఉన్నాయి. ఇవన్నీ కూడా ఆ దైవ చట్టాలు, నిర్ధిష్ట శాసనాలకు లోబడి, పుట్టి పెరిగి వృద్ధి చెందుతూ, జీవిస్తూ ఉన్నాయి. ఈ విషయం పవిత్ర ఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది. 'దైవ ధర్మాన్ని కాదని, మీరు మరో ధర్మాన్ని వెదుకుతున్నారా? వాస్తవానికి భూమ్యాకాశాల్లో ఉన్న సమస్త జీవకోటి ఇష్టం ఉన్నా లేకపోయినా దైవాదేశాలకు లోబడి ఉన్నాయి. చివరకు అందరూ దైవం వద్దకు మరలిపోవలసిన వారే.'

మనిషి కూడా ఈ అనంత సృష్టిలోని ఒక భాగమే. అతన్ని కూడా ఆ దైవమే సృష్టించాడు. కాబట్టి, ఇతర సృష్టితాలలాగే అతనికీ ఓ నియమం ఉంది. మానవుడు పుట్టడానికి, మనగలగడానికి, మరణించడానికి ఒక చట్టం ఉంది. ఈప్రకృతి నియమాలకు అనుగుణంగానే అతడు జన్మించి, జీవిత కార్యాలను చక్కబెడతాడు. కళ్లతో చూడడం, చెవులతో వినడం, ముక్కుతో వాసన చూడడం, నాలుకతో రుచి చూడడం ఇవన్నీ దైవ నియమావళికి లోబడి అతను నిర్వర్తిస్తాడు.

## వ్యత్యాసాలు-సమానత్వాలూ

సృష్టి మొత్తంలో ఉన్న సమస్త జీవరాశులకు, మానవుడికీ మధ్య చాలా వ్యత్యాసం ఉంది. దైవం మనిషికి ఆలోచించే, అర్థం చేసుకునే, బుద్ధిని, వివేకాన్ని, విచక్షణా జ్ఞానాన్ని ప్రసాదించాడు. దాంతోపాటు అతనికి స్వేచ్ఛను ప్రసాదించాడు. వీటిని మనిషి సద్వినియోగం చేసుకోవచ్చు. దుర్వినియోగం కూడా చేసుకోవచ్చు. కాని మంచికి సత్ఫలితం, చెడుకు దుష్ఫలితం లభిస్తాయనే విశ్వాసం, విజ్ఞత అతడిలో ఉన్నట్లయితే ఆ మనిషి దైవం తనకు ప్రసాదించిన స్వేచ్ఛను, బుద్ధిబలాన్ని దుర్వినియోగం చేయడానికి సాహసించడు. ఎందుకంటే గుడ్డివాడు, కళ్లున్నవాడు సమానం కాలేరు కదా! ఈ విషయం పవిత్ర ఖుర్ఆన్‌లో ఇలా ఉంది. 'ఎక్కడన్నా విధేయులు, అవిధేయులు సమానం కాగలరా? వీరెప్పటికీ సమానం కాలేరు. దైవాన్ని విశ్వసించే వారు, దైవాన్ని తిరస్కరించే వారికంటే నిస్సందేహంగా శ్రేష్ఠులే. వారిరువురూ సమానం కారు.

✦ ✦ ✦

# 38. మానవత్వం ఇస్లాం మూలం

**సృష్టికర్త అయిన అల్లాహ్ మానవునికి వివేకం, విజ్ఞత ప్రసాదించాడు. అయినా మానవుడు మతోన్మాదం, కులతత్త్వం, ఉగ్రవాదంతో ప్రపంచాన్ని అల్లకల్లోలం చేస్తున్నాడు. దేవుని శాసనాల ముందు మానవుడు స్వీయకల్పిత సిద్ధాంతాలను, తారతమ్యాలను విడిచిపెట్టాలని ఖుర్ఆన్ చెబుతోంది. ప్రపంచ ప్రజలందరూ సమానమేనన్న ఇస్లాం ధర్మంలో విశేషంగా చెప్పిన మానవత్వం గురించి...**

సర్వ సృష్టికర్త అయిన అల్లాహ్ తన సమస్త సృష్టితాల్లో ఒక్క మానవుడికే అమూల్యమైన వైశిష్ట్యం ప్రసాదించి దైవదూతలతో మానవుడికి సలాం చేయించాడు. అతడి హృదయ జగత్తులో వివేక విజ్ఞతా జ్యోతుల్ని నింపాడు. వివేకంతో కూడుకున్న శక్తి యుక్తుల్ని ప్రసాదించాడు. సకల, సకార నకారాత్మక గుణగణాలను అతడి మనసులో జొప్పించాడు. ప్రపంచంలోని సర్వసుఖసౌభాగ్యాలను అనుభవించడానికి సమస్త సదుపాయాలూ కల్పించాడు. సకల సృష్టి మానవుడి అడుగులకు మడుగులొత్తే విధంగా అతడికి విధేయులుగా, లాభదాయకంగా మలిచాడు. మానవులంతా ఒకరి ఉనికిని మరొకరు గౌరవించుకుంటూ భువిలో న్యాయాన్ని స్థాపించాలని, ఈ భూమిపై దేవుని ఔన్నత్య పతాకం రెపరెపలాడించాలని, తాము స్వయంగా కల్పించుకున్న తారతమ్యా లను, ఉచ్ఛనీచాలను, స్వీయకల్పిత సిద్ధాంతాలను స్వయం తయారీ చట్టాలను దేవుని చట్టాల ముందు, దైవశాసనాల ముందు విడిచి పెట్టాలని ఖుర్ఆన్ చెబుతుంది.

## రెట్టింపు ప్రతిఫలం

భూ ప్రపంచంలో మానవుని ఉనికి మానవత్వాన్ని కాపాడడానికి మాత్రమే అని ఇస్లాం ధర్మం స్పష్టంగా చెబుతోంది. అందుకే మీలో ఎన్ని వైరుధ్యాలున్నప్పటికీ ఈ సూత్రాన్ని తప్పక పాటించాలని ఇస్లాం ధర్మశాస్త్రం విస్పష్టంగా ప్రకటించింది. ఎవరైతే

మానవాళి సంక్షేమం కోసం పాటుపడతారో వారికి రెట్టింపు ప్రతిఫలం దైవం ప్రసాదిస్తాడు- అంటుంది ఖుర్ఆన్. ఎప్పుడైతే మానవుడు సాటి మానవుడి గురించి ఆలోచిచడం, అతని బాగోగులు యోగక్షేమాలు పట్టించుకోవడం, సత్సంబంధాలు నెరపడం మానేశాడో అప్పుడే మానవ సమాజం పెడమార్గం పట్టింది. ఎప్పుడైతే మానవ హృదయంలో అతి పవిత్రంగా ఉండవలసిన మానవత్వానికి తప్పు పట్టడం ప్రారంభం అయిందో అప్పుడే ఆ హృదయంలో స్వార్థం పురుడు పోసుకుని జంతు లక్షణాలు ప్రస్ఫుటం కాసాగాయి. తత్ఫలితంగా మానవ సమాజంలో ఎక్కడ చూసినా సవాలక్ష అవలక్షణాలు చోటుచేసుకున్నాయి. శాంతి భద్రతలు కరువైపోయాయి. న్యాయం ప్రియమైపోయింది. కులతత్వం, మతతత్వం పెచ్చరిల్లాయి. మతోన్మాదం పడగవిప్పింది. ఉగ్రవాదం జూలు విదిల్చంది.

## దైవశాసనం

స్వయం కల్పిత చట్టాలను వదిలేసి దైవశాసనాల ముందు మానవుడు తలవంచినప్పుడు, అంటే దేవుని మార్గదర్శకత్వంలో నడిచినప్పుడు మాత్రమే మానవ సమాజంలో మంచి మార్పు, సంస్కరణ, న్యాయపాలన సాధ్యమవుతుంది. సర్వోన్నతుడైన దేవుని ఆదేశాలను పక్కన బెట్టి, మిడిమిడి జ్ఞానంతో ఆధునికతా మోజులో సర్వం నేనేనని దైవం ప్రసాదించిన పరిమిత స్వేచ్ఛను దుర్వినియోగం చేసిన ఫలితం అనుభవిస్తున్నాం. దురాచార, అనాచారాలు అనైతికతా రుగ్మతలు, అవినీతి అధర్మాలు, దౌష్ట్యాలు, దౌర్జన్యాలు, అసూయ స్వార్థాలు, ఇంకా ఇలాంటి అసంఖ్యాక దుర్మార్గాలు సమాజం నుంచి అంతం కావాలంటే మానవుడు తనలోని మానవత్వాన్ని మేల్కొలపాలని, ఈ యావత్ సృష్టిలో తన ప్రత్యేకతను, తన ప్రాముఖ్యతను, తన ఆదరణను, గొప్పదనాన్ని గుర్తెరిగి మసలుకోవాలని ఇస్లామీ ధర్మం చెబుతుంది. దైవ గ్రంథమైన పవిత్ర ఖుర్ఆన్, దేవుని ప్రవక్త అయిన ముహమ్మద్ ప్రవక్త బోధనల వెలుగులో మానవుడు జీవితం గడిపినప్పుడే మనిషి మనిషిగా మిగిలి మానవత్వానికి ఆదరణ లభిస్తుంది.

✦ ✦ ✦

# 39. ఇస్లాం తత్వం ధార్మికత

**సమాజ సంస్కరణ ధార్మిక బాధ్యత అని ఇస్లాం బోధిస్తుంది. చెడును ఎదిరించమని, మంచిని ప్రోత్సహించమని చెబుతుంది. సమాజంలో ప్రతి వ్యక్తికి ఉండే సామాజిక బాధ్యతల గురించి పవిత్ర ఖుర్‌ఆన్ ఇలా తెలియజెప్పింది..**

సమాజంలో పెచ్చరిల్లిన దుర్మార్గాల్ని రూపు మాపాల్సిన గురుతర బాధ్యత సంఘశ్రేయోభిలాషులపై ఉంటుంది. సమాజంలోని మంచివారు, సచ్ఛీలురు ముందుకొచ్చి సమాజ సంస్కరణ కోసం కృషి చేయడం అత్యంత అవసరం. దైవధర్మా వలంబీకులకైతే చెడును రూపుమాపడం వారి ధార్మిక బాధ్యత అయిపోతుంది. దైవ గ్రంథంలో దేవుడు ఇలా సెలవిస్తున్నాడు:

'మీలో ప్రజల్ని మంచి వైపుకు పిలిచేవారు, సత్కార్యాలు చెయ్యమని ప్రజలకు బోధించేవారు తప్పకుండా ఉండాలి. ఎవరైతే ఈ పనులు చేస్తారో వారే సాఫల్యం పొందుతారు'. ఈ దైవాదేశాన్ని ప్రతి ఒక్కరూ తమకు తాము అన్వయించుకోవాలి. సమాజం నుండి చెడును రూపుమాపడానికి, మంచికి మానవత్వానికి పట్టం కట్టడానికి శక్తి వంచన లేకుండా కృషిచేయాలి. తమ తమ పరిధుల్లో తమ తమ శక్తి సామర్థ్యాలను బట్టి ఈ మహత్కార్యాన్ని కొనసాగించాలి.

## విశ్వాసపు చివరిమెట్టు

'ప్రతి వ్యక్తి పక్కవాడిని సత్కార్యాలకై ప్రోత్సహించాలి. పరస్పరం సహకరించు కోవాలని' ముహమ్మద్ ప్రవక్త బోధించారు. అంతేకాదు సమాజ సంస్కరణ కోసం సమాజం నుండి చెడులను నిర్మూలించడం కోసం అవసరమైతే శక్తిని ఉపయోగించడాన్ని కూడా ఆయన వారించలేదు. మీలో ఎవరైనా ఏదైనా చెడు సంభవిస్తూ చూసినట్లయితే చేతితో ఆ చెడును రూపుమాపడానికి ప్రయత్నించండి. చేతితో ఆపే శక్తి మీలో లేకపోతే నోటి ద్వారా ఆ చెడును ఆపండి. నోటితోనూ చెప్పి ఆపే శక్తిలేకపోతే కనీసం మీ మనసు

లోనైనా ఆ చెడును అసహ్యించుకోండి. చెడును చూసి మీరు దాన్ని సహిస్తే, మీ మనసులో ఏవిధమైన ఏహ్య భావమూ వ్యక్తంకాకపోతే మీలో రవ్వంతైనా విశ్వాసం లేనట్లే లెక్క. కనీసం మనసులోనైనా ఏవగించుకోవడం విశ్వాసపు చివరి మెట్టు అని ముహమ్మద్ ప్రవక్త చెప్పారు.

## ధార్మిక విధి

సమాజంలో ఎన్నో చెడులు మన కళ్ల ముందే సంభవిస్తున్నాయి. అయినా మనం అవన్నీ సహించడానికే అలవాటు పడిపోయాం. లెక్కపెట్టడానికి వీల్లేనన్ని రుగ్మతలు మన సమాజాన్ని పట్టి పీడిస్తున్నాయి. సమాజంలోని మంచివారు, సచ్ఛీలురు మనకెందుకులే అని ఊరుకోకుండా ఈ రుగ్మతల నిర్మూలనకు సంఘటిత కృషి చేయాల్సిన ధార్మిక బాధ్యత వారిపై ఉంది. లేకపోతే ఈ చెడుల ప్రవాహం ఒకానొక రోజు వారిని కూడా ముంచెత్తు తుంది. పక్కిల్లు తగలబడుతుంటే మనం చూస్తు ఊరుకుంటామా? తగలబడేది వాడిల్లు, నష్టపోయేది వాడే అని మనం ఊరుకుంటే ఆ మంటలు మన ఇంటినీ కబళి స్తాయి. అందుకని చెడుచేసే వాడి చేయిపట్టి ఆపే బాధ్యత మనందరిపై ఉంది. మనం అలా చెయ్యకపోతే చెడుల దుర్గంధం సమాజమంతా పాకిపోతుంది. ఆ దుర్గంధం రాకుండా మనం ఎన్ని అత్తర్లు వాడినా, అత్తరు ముంచిన దూదిని ముక్కుల్లో పెట్టుకున్నా, మనం ఆ దుర్గంధాన్ని శుభ్రం చేయనంతవరకు ఎలాంటి అత్తరు పన్నీర్లూ మనల్ని రక్షించలేవు. అందుకని సమాజంలో మంచిని పెంచడం, చెడులను రూపు మాపడం మనందరి ధార్మిక విధి.

✦ ✦ ✦

# 40. దైవసృష్టి అద్భుతం

**దేవుడు ఒక్కడే, ఆయన సృష్టి అద్వితీయం. సృష్టికి ప్రతిసృష్టి చేయగలిగే నేర్పు మానవుడు సాధించినా అదంతా దైవప్రసాదితమే. ఖుర్‌ఆన్‌లోని నహ్లా సూరా అనే అధ్యాయంలో తేనెటీగ నుంచి మానవుడు నేర్చుకోవలసింది ఏమిటో వివరంగా ఉంది.**

దైవం జీవంలేని దాన్నుండి జీవమున్నదాన్ని, గుడ్డునుండి పక్షిని, పక్షి నుండి గుడ్డును, రేతస్సు నుండి మానవుణ్ని మానవుడి నుంచి రేతస్సును సృష్టిస్తాడు. (ఖుర్‌ఆన్).

దైవాన్ని తెలుసుకోవడానికి మొదట మానవుడు తన ఉనికి గురించి ఆలోచించాలి. తాను ఈ భూ ప్రపంచంలో ఎలా పుట్టి ఎలా పెరుగుతున్నాడో, తన జ్ఞానం ఎలా వృద్ధి చెందుతుందో, మానవ పోషణకు ఈ ప్రపంచంలో ఎలాంటి వసతులు, వనరులు ఏర్పాటయ్యాయో, ప్రశాంత చిత్తంతో పరిశీలించాలి. అప్పుడు ఇవే కాకుండా ఇంకా మరెన్నో స్పష్టమైన నిదర్శనాలు కళ్ళెదుట కనిపిస్తాయి.

## తేనెటీగ కథ

మానవుడు శాస్త్ర సాంకేతిక రంగాల్లో తన ఆవిష్కరణలకు తానే గర్వపడుతూ తనకంటే గొప్పవాడు లేడన్నట్లుగా ప్రవర్తిస్తున్నాడు. కానీ దైవ సృష్టితాలకు, మానవ సృజనలకు అసలు పోలికే ఉండదు. అయినా ఆ పాటి విజ్ఞానం కూడా మానవుడికి దైవం ప్రసాదించినదే. సృష్టికి ప్రతిసృష్టి చేయగల జ్ఞానాన్ని దైవమే మానవుడికి ప్రసాదించాడు. సృష్టిలోని ప్రతి జీవరాశిని దైవమే సృజించాడు. ఆయన అద్వితీయుడు. దైవ సృష్టితాల్లో తేనెటీగ ఒక అల్ప ప్రాణి. మానవారోగ్య సంరక్షణకు దైవం దీన్ని సృష్టించాడు. తేనెటీగ తన గృహాన్ని అరలు అరలుగా ఆరు కోణాలుగా నిర్మించుకుంటుంది. తేనెటీగలన్నీ ఒక పెద్ద ఈగకు లోబడి ఉంటాయి. కొండల్లో, గుట్టల్లో, పుట్టల్లో, చెట్ల తొర్రల్లో గుబురు పొదల్లో అవి తమ తుట్టెలను నిర్మిస్తాయి. తేనె పట్టుద్వారా మనకు తెలుపు, ఎరుపు,

పసుపు, రంగుల రకరకాల రుచుల తేనె లభిస్తుంది. తేనె దివ్య ఔషధంగా పనిచేస్తుంది. ఆయుర్వేద వైద్య విధానంలో తేనెది ప్రముఖ పాత్ర. దేవుడు తేనెటీగలకు ఎంతటి జ్ఞానం, బుద్ధి కుశలతలు ప్రసాదించాడో తెలుసుకోవాలంటే పవిత్ర ఖుర్ఆన్ గ్రంథం నహ్లా సూరా అధ్యయనం చేయాలి.

దైవం పవిత్ర ఖుర్ఆన్‌లో ఇలా అంటున్నాడు. "మేము ఆకాశాన్ని, భూమిని, ఈ రెంటి మధ్యనున్న సమస్తాన్నీ వృధాగా, ఆటవస్తువుగా సృష్టించలేదు. మానవుడికి చూడడానికి కళ్లు, వినడానికి చెవులు, మాట్లాడడానికి నోరు, మంచి చెడుల విచక్షణ చేయ డానికి బుద్ధిజ్ఞానాలను ప్రసాదించాము – దైవం; ధర్మాధర్మాలను బోధించడానికి ప్రవక్తలను పంపాడు. ప్రశాంత చిత్తంతో ఆలోచిస్తే దైవం ఈ విశ్వ వ్యవస్థను క్రమబద్ధంగా నడిపిస్తున్నాడని అర్థమవుతుంది. దేవుడున్నాడని, ఆయన ఒక్కడేనని మనస్ఫూర్తిగా నమ్మి దైవాదేశాల ప్రకారం మనుగడ సాగిస్తే ఇహలోకంలో, పరలోకంలో ముక్తి మోక్షాలు ప్రాప్తమవుతాయి.

✦ ✦ ✦

# 41. దైవం దృష్టిలో మానవుడు

**దేవుని పవిత్ర గ్రంథం ఖుర్ఆన్‌లో దైవం మానవుని గురించి ఎన్నో విషయాలు చెప్పాడు. మానవుణ్ని తాను బలహీనునిగానే పుట్టించానని, అయితే అదంతా అతనిని పరీక్షించడానికేనని వివరించాడు. ఖుర్ఆన్‌లో మానవునిపై దైవం చేసిన వ్యాఖ్యల ఆధారంగా ఆయన మనకు ప్రసాదించిన వరాలను నిలబెట్టు కునేందుకు మన కర్తవ్యాలను అర్థం చేసుకునే ప్రయత్నం...**

పరాత్పరుడైన దైవం మానవుణ్ని గురించిన అనేక వాస్తవాలను తన గ్రంథంలో విస్పష్టంగా పేర్కొన్నాడు. మానవుడు బలహీనుడుగానే పుట్టాడు. అతనిపై భారం వేయా లనే తలంపు దైవానికి ఎంతమాత్రం లేదు. మేము మానవుడికి వరాలను అనుగ్రహించి, మళ్లీ వాటిని లేకుండా చేస్తే అపనమ్మకస్తుడుగా కృతఘ్నుడుగా మారి పోతాడు. అనంతమైన దైవానుగ్రహాలను లెక్కించడం మానవుడి తరంకాదు. మనిషి ఏవిధంగా మంచిని కోరుకుంటాడో, అదే విధంగా చెడునూ కోరుకుంటాడు. చాలా తొందరపాటు ప్రాణి మానవుడు, దేవుని కరుణానుగ్రహాల నిధే గనుక మానవుడి చేతుల్లో ఉంటే అది ఎక్కడ ఖర్చయిపోతుందనే భయంతో దాన్ని అలాగే దాచి ఉంచుతాడు. నిజంగా మాన వుడు మహాపిసినారి. పెద్ద జగడాల మారి. మా అనుగ్రహాలను అతనికి ప్రసాదించి నప్పుడు ఇదంతా నా కృషివల్ల, నా విజ్ఞత మూలంగా సంక్రమించింది అంటాడు. కానీ ఇదొక పరీక్ష. చాలామంది ఈ వాస్తవాన్ని గ్రహించరు. మేము మానవుణ్ణి బలహీనుడిగానే పుట్టించాం. అతణ్ణి పరీక్షించాలని వినేవాడుగా, చూసేవాడుగా చేశాం. అతనికో దారి కూడా చూపాం. ఇక అతను కృతజ్ఞుడవుతాడో లేక కృతఘ్నుడుగా మారతాడో అది అతనిష్టం. మానవుడిపై ఆపదలు రాగానే అతడు అధికంగా అల్లాహ్‌ను స్మరిస్తాడు. కూర్చున్నా, నిలుచున్నా, పడుకున్నా ఏ స్థితిలో ఉన్నా దైవాన్ని స్మరిస్తూనే ఉంటాడు. దైవం ఆ ఆపదల్ని తొలగించగానే తానెన్నడూ అసలు దైవాన్ని వేడుకో లేద న్నంతగా ఆయన్ని మరచిపోతాడు.

## దైవమిచ్చిన వరాలు

దేవుడు మానవ సృష్టిలో ఈ బలహీనతల్ని ఎందుకు పెట్టాడని అనుమానం రావొచ్చు. ఓ మనిషి తన స్వహస్తాలతో ఏదైనా వస్తువు తయారు చేస్తే అందులో ఎలాంటి లోపమూ, ఎలాంటి వంకా ఉండకూడదని భావిస్తాడు. ఒకవేళ పొరపాటున ఏదన్నా లోపం తలెత్తినా, దాన్ని కావాలని మాత్రం చేయడు. ఒకవేళ స్వలాభం కోసం అలాచేస్తే చేయవచ్చు. అది వేరే విషయం.

మానవుడు ప్రయత్నం చేయడం, తాపత్రయ పడడం, లోపరహితంగా చేయాలని తంటాలుపడడం, ఇవన్నీ చేయగలడు గాని ఖచ్చితంగా అలా చేయాలన్న, చేయగలడన్న నిబంధన ఏదీలేదు. దైవం తన సృష్టిలో మానవుడికి ఓ విశిష్టమైన ప్రత్యేకతను ప్రసాదించినప్పటికీ అతనిలో ఈ లోపాలను పెట్టడం అతడిని పరీక్షించే నిమిత్తమే. ఈ లోపాలను అతడు స్వయంగా పూరించుకోవడానికే దైవం మానవుణ్ని సృష్టించేటప్పుడు, అంటే ఆదిమానవుడు హజ్రత్ ఆదం అలైహిస్సలాంలో ప్రాణం ఊదేటప్పుడే ఆయనకు జీవితం గడిపే జ్ఞానం ప్రసాదించి రుజుమార్గం చూపాడు. నిర్మలమైన హృదయాన్ని ప్రసాదించి మంచిచెడుల విచక్షణా జ్ఞానాన్ని ప్రసాదించాడు. బుద్ధిజ్ఞానాలతో పాటు ఆలోచించే, అర్థం చేసుకునే మేధస్సును కూడా ఇచ్చాడు. వినడానికి, వీక్షించడానికి చెవులు, కళ్లు ప్రసాదించాడు.

## మన కర్తవ్యం

మానవుడి మార్గదర్శకత్వానికి దైవం మహోన్నత గ్రంథం అవతరింప చేశాడు. ఆచరణాత్మక నమూనా కోసం ఎంతోమంది ప్రవక్తల్ని, రుషుల్ని ప్రభవింప చేశాడు. నిత్యజీవితంలోని ప్రతిక్షణం ఎలాగడపాలో తెలిపే మార్గదర్శక సూత్రాలు, గుణపాఠాలు హదీసుల రూపంలో ప్రజల మధ్యన సజీవంగా ఉన్నాయి. ఇక నిర్ణయాధికారం మానవుడి చేతుల్లోనే ఉంది. దేవుడు మానవుడిలో కొన్ని లోపాలుంచినప్పటికీ, నిజంగా అతణ్ణి ఎంతో ఉన్నతుడిగా, గుణవంతుడిగా, రూపవంతుడిగా తయారుచేశాడు. మనిషి తన లోపాలను పూరించుకుంటూ దైవాభీష్టానికి అనుగుణంగా పరిపూర్ణ మానవ విలువలు సంతరించుకున్న సంపూర్ణ మానవుడిగా రూపొందాలి. మనిషి కోసం ఇన్ని చేసిన దైవానికే వినమ్రంగా తలవంచి, దైవాదేశ పాలనలో జీవితం గడిపినట్లయి.

✦ ✦ ✦

# 42. జీవితం దైవ ప్రసాదితం

**సమస్త జీవులలో ఉత్తమమైన జీవితాన్ని దైవం మనకు ప్రసాదించాడు. మనం చేసే పని కేవలం స్వలాభాపేక్షతో ఉండకూడదు. సమాజం కోసం నిస్వార్ధంగా పనిచేయాలి. అలాంటి వారికే దేవుని అనుగ్రహం లభిస్తుందని తెలిపే వ్యాసం.**

సృష్టిలో ఉన్న అన్ని రకాల జీవులలో మానవుడే బుద్ధిజీవి, మరే జీవికీ లేని ప్రత్యేకతను దైవం మానవుడికి ప్రసాదించాడు. అందుకే ఒక దైవ విశ్వాసి జీవితం దైవభక్తి, దైవభీతి, సత్యం, సదాచారం, సౌశీల్యాలతో అలరారుతూ ఉంటుంది. దైవంపై విశ్వాసం లేని మనిషిలో ఇలాంటి సుగుణాలు ఉండవు. దైవ విశ్వాసి, సమస్త సృష్టికీ మూల కారకుడు ఒక్కడే అని, తన శక్తిసామర్థ్యాలు, జ్ఞానం దైవం ప్రసాదించిన అమానతు అని నమ్ముతాడు. దైవానుగ్రహంతో లభించిన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను తన ఇష్టానుసారం కాకుండా దైవాభీష్టం మేరకు వినియోగిస్తేనే తనపై అల్లాహ్ కరుణ ఉంటుందని విశ్వసిస్తాడు.

## దైవభీతి ఉండాలి

దైవం ప్రసాదించిన వనరులను సమాజ శ్రేయస్సుకు, లోక కల్యాణం కోసం వినియోగించాలి. అలా కాకుండా తన స్వార్థానికి, స్వప్రయోజనాలకు ఉపయోగిస్తే దైవానికి సమాధానం చెప్పుకోవలసి ఉంటుందన్న దైవ భీతి దైవవిశ్వాసిలో ఉంటుంది. అందుకే దైవవిశ్వాసి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను, ధనసంపదలను, అధికారాన్ని ప్రజా సంక్షేమం కోసం, ప్రజాసేవ కోసం వినియోగించాలి. పటిష్టమైన దైవ విశ్వాసమే అతడిని బాధ్యతాయుతునిగా తీర్చిదిద్దగలుగుతుంది. ప్రశ్నించేవారు ఎవరూ లేరనే భావం ఉన్నవారు, తమ ప్రాపంచిక జీవితాన్ని ఒక ఆటగా భావించి ఇచ్ఛానుసారం భయమూ, భక్తి లేకుండా విశృంఖలంగా జీవిస్తారు.

## దైవ ధర్మం

ముహమ్మద్ ప్రవక్త (సం) వారు"దైవం మిమ్మల్ని స్వేచ్ఛాజీవిగా సృష్టించి, విశ్వం లోని సమస్తాన్ని మీ పాదాక్రాంతం చేశాడు. కావున మీరు విశ్వంలో ఉన్న వనరులను సమాజ సంక్షేమానికి, మానవాళి సంస్కరణకు వినియోగించాలి. అలాగే భూమండలంపై దైవధర్మాన్ని స్థాపించాలని, భూలోకంలో విస్తరించి ఉన్న చెడును, అవినీతిని రూపుమాప డానికి నిరంతరం కృషి చేయాలని" ఉద్బోధించారు. ఇలా చేసిన వారే సాఫల్యం పొందుతారని, దీనికి భిన్నంగా వ్యవహరించి, దైవం ప్రసాదించిన వనరుల్ని దుర్విని యోగం చేస్తూ, బాధ్యతను విస్మరించిన వారికి ఇహలోకంలోనే కాకుండా పరలోకంలో కూడా కష్టాలు తప్పవని హెచ్చరించారు, దైవం ప్రసాదింంచిన స్వేచ్ఛను, శక్తి సామర్థ్యా లను ఆయన అభీష్టం మేరకు లోకకల్యాణం కోసం వినియోగించినవారు మాత్రమే ఇహలోకంలో గౌరవ మర్యాదలు పొందుతారు, అలాగే పరలోకంలో శాశ్వత అమర సుఖాలు వారికి లభిస్తాయి.

✦ ✦ ✦

# 43. ఖుర్ఆన్ హితవు

ముహమ్మద్ ప్రవక్త ఒకసారి దైవదాస్యం విషయంపై తనను సున్నితంగా మందలించి, దాని నిగూఢార్ధాన్ని విశదీకరించారని హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్ బిన్ అస్ అంటున్నారు. ప్రవక్త ఇలా అన్నారు: 'అబ్దుల్లా! ఏమిటి? నువ్వు పగలంతా ఉపవాసవ్రతం పాటిస్తావని, రాత్రంతా మేల్కొని నమాజులు (ప్రార్ధన) చేస్తావని విన్నాను. నిజమేనా? అని ప్రశ్నించారు. దానికాయన 'అవును నిజమే. మరి అదే కదా దైవ దాస్యం' అంటే? అని విన్నవించుకున్నారు.

## ప్రార్ధన.. విశ్రాంతి రెండూ ముఖ్యమే

అప్పుడు ముహమ్మద్ ప్రవక్త (సఅసం) ఆయనతో అలా చేయకు.. ఉపవాసాలు పాటించు, వాటిని వదిలికూడా వేయి. రాత్రులు ప్రార్ధన కూడా చేయి. విశ్రాంతి కూడా తీసుకో. ఎందుకంటే నీ శరీరానికి నీపై హక్కుంది. నీ అతిధికీ నీపై హక్కుంది. ఎవరైతే పగలంతా ఉపవాసాలతో, రాత్రంతా ప్రార్ధనలతో జీవితాంతం గడిపినా వారి ప్రార్ధనలు ఫలించినట్టు కాదు. దైవదాస్యపు హక్కు నెరవేరినట్లూకాదు. అందుకని నీవు నిజమైన దైవదాస్యం చెయ్యదలచుకుంటే దైవం, దైవ ప్రవక్త బోధించిన విధానాన్ని అవలంబించు. సంవత్సరానికోసారి రమజాన్ మాసంలో మాత్రం తప్పకుండా నెలరోజులు ఉపవాస వ్రతం పాటించు తర్వాత మాత్రం నెలకు మూడు రోజాలు పాటిస్తే సరిపోతుంది. ఇవి కూడా రమజాన్ ఉపవాసాల్లాగ విధి (ఫర్జ్) కాదు. కేవలం నఫిల్. నెలకు మూడు ఉపవాసాలు ఆర్యోగానికీ మేలు చేస్తాయి. అదనపు పుణ్యమూ లభిస్తుంది.

## వడ్డీలు తినకండి

కొలతల్లో తూనికల్లో మోసాలకు పాల్పడకండి. ప్రజల్ని పీడించకండి. లంచాలు తీసుకోకండి. నిజాయితీగా వ్యాపార లావాదేవీలు నడపండి. వడ్డీ తినకండి. అనాథల్ని ఛీత్కరించకండి. ఇవన్నీ ప్రాపంచిక విషయాల్లాగా కనిపిస్తున్నపటికీ దైవాభీష్టం ప్రకారం, చేస్తున్న కారణంగా ఇదంతా సంపూర్ణ దైవదాస్యంతో సమానం. మమతాను రాగాలతో

ముసలి తల్లివైపు ప్రేమగా చూడడం కూడా దైవదాస్యంతో సమానం. ప్రేమగా భార్య నోటికి ఒక ముద్ద అందివ్వడం కూడా ఆరాధనే. సమస్త మానవాళి ఇహపర సాఫల్యాల కోసం అంతిమంగా అవతరించిన పవిత్ర గ్రంథం ఖుర్‌ఆన్, అంతిమ దైవ ప్రవక్తగా సర్వమానవాళి కోసం ప్రభవించిన ముహమ్మద్ ప్రవక్త బోధనల వెలుగులో మనం నడిచినట్లయితే అదే మోక్షానికి నిజమైన మార్గం కాగలదు.

✦ ✦ ✦

# 44. నైతిక పరివర్తన

**వ్యసనాలు మనిషిలోని నైతికతను దెబ్బతీస్తాయి. అందుకే వాటిని దూరంగా ఉంచాలని ముహమ్మద్ ప్రవక్త స్పష్టం చేశారు. ఆయన ఆదేశాలను పాటించకపోతే చరమాంకంలో కష్టాలపాలు కావాల్సి వస్తుందనే విశ్వాసమే మనిషిని, సమాజాన్ని సక్రమ మార్గంలో నడిపిస్తుంది.**

నేటి మానవులు శాస్త్ర సాంకేతిక రంగాల్లో ఎంత అభివృద్ధి సాధించినప్పటికీ, నైతికంగా, సామాజికంగా, ధార్మికంగా అంతకంటే ఎక్కువ సమస్యలకు లోనవుతున్నారు. ఈ దుష్ప్రభావం కుటుంబ వ్యవస్థ, సామాజిక వ్యవస్థ తద్వారా యావత్ దేశం, ప్రపంచంపై పడుతోంది. దీని నివారణ కోసం ఎన్ని ఆధునిక ప్రయోగాలు చేపట్టినా ఆశించిన ప్రయోజనాలు నెరవేరడం లేదు. శారీరక, మానసిక సమస్యలు సమాజాన్ని పట్టిపీడిస్తున్నాయి. మద్యపానం, వ్యభిచారం, జూదం, లంచగొండితనం, రౌడీయిజం మొదలైనవి శారీరక రుగ్మతలైతే; అనైక్యత, అనైతికత, భయాందోళనలు, అభద్రత, ఈర్ష్యాద్వేషాలు, అవినీతి వంటివి మానసికమైనవి. వ్యక్తితో ప్రారంభమై కుటుంబాన్ని, తద్వారా సమాజాన్ని కబళించే ఏ చెడునయినా సామాజిక రుగ్మతగానే భావించాలి. ఈ రుగ్మతలను రూపుమాపడానికి ఎంతో మంది సంఘసంస్కర్తలు ఎన్నో విధాలుగా ప్రయత్నించారు. ఎన్నో ఉద్యమాలు చేపట్టారు. కానీ బలమైన సిద్ధాంతం లేకపోవడంతో అవి అంతగా సఫలం కాలేదు. దేవుడు ఉన్నాడని, ఆయన ఒక్కడే అని, ఆయన అన్నీ చూస్తున్నాడని, ఒకానొక రోజు ఆయన ముందు నిలబడి సమస్త కర్మలకూ సమాధానం చెప్పుకోవలసి ఉంటుందన్న భావన మానవుల అంతర్యాల్లో నాటుకుపోవాలి. అప్పుడు మాత్రమే సమాజంలో మనం చూస్తున్న రుగ్మతలు అంతరించిపోతాయి.

## ప్రవక్త ఆదేశం....

నేటికి దాదాపు వేయిన్నర సంవత్సరాలకు పూర్వం మక్కా నగరంలో మద్యపాన

నిషేధానికి సంబంధించి ముహమ్మద్ ప్రవక్త (సఅసం) చాటింపు వేయిస్తే, స్వయంగా మద్యం తయారీదారులు తమ ఇళ్లలోని సారాయి కుండలను స్వచ్ఛందంగా వీధుల్లో పగుల గొట్టారు. అప్పటికే మద్యం సేవించి ఉన్న వారు నోట్లో వేళ్లు జొప్పించి మరీ వాంతులు చేసుకున్నారు. నోటి దగ్గర ఉన్న సారా గ్లాసులను విసిరికొట్టారు. ముహమ్మద్ ప్రవక్త (సం) చాటింపు ప్రభావంతో పగులకొట్టిన కుండల కొద్దీ సారాయితో ఆనాడు మక్కా వీధులు ఏరులై పారాయి. ఆనాటి నుంచి మక్కాపురంలో సారాయి తయారు చేసేవారు, సేవించేవారు మచ్చుకయినా కనిపించలేదు. ఇదంతా ఆ బలీయమైన సిద్ధాంత ప్రభావం. దేవుడు ప్రశ్నిస్తాడన్న భావనే వారిలో అలాంటి నైతిక పరివర్తనకు నాంది పలికింది.

## దైవాదేశాలు..

పవిత్ర ఖుర్ఆన్‌లో ఇలా ఉంది. "దైవ విశ్వాసులారా! సారాయి, జూదం, దైవేతర ఆలయాలు, పాచికల జోస్యం ఇవన్నీ అసహ్యాకరమైన, పైశాచిక విషయాలు. కనుక వీటికి దూరంగా ఉండండి. మీ జీవితం సార్ధకమవుతుంది. మద్యం, జూదాల ద్వారా షైతాన్ మీ మధ్య విరోధం, విద్వేష బీజాలు నాటి మిమ్మల్ని దైవ దాస్యం, ప్రార్థనల నుంచి నిరోధించగోరుతున్నాడు. కనుక ఇకనైనా మీరు వాటిని మానుకోండి. దైవాదేశాలను, ఆయన ప్రవక్త హితోపదేశాలను పాటించండి. కాని మీరు గనుక వాటిని పాటించకుండా ముఖం తిప్పుకుంటే మాత్రం మీకే నష్టం. దైవాదేశాలను యథాతథంగా అందజేయడమే మాప్రవక్త బాధ్యత". (పవిత్ర ఖుర్ఆన్ : అల్ మాయిదా 90-92)

ఈ దైవాదేశాలను పాటిస్తే సృష్టికర్త అయిన దైవం ప్రశ్నిస్తాడన్న ఒకే ఒక విప్లవాత్మక భావన వ్యక్తి సంస్కరణకు, తద్వారా సమాజ సంస్కరణకు దోహదపడతాయి. ఫలితంగా సమాజంలోని సకల రుగ్మతలూ వాటంతట అవే సమసిపోతాయి. ఈ సిద్ధాంతమే సమాజంలోని సమస్త రుగ్మతల నివారణకు మూలమంత్రం.

✦ ✦ ✦

# 45. వెంట వచ్చేవి పాపపుణ్యాలే...

ఇది నాది... ఇది నీది అనే గొడవ ప్రతి ఒక్కరిలో కనిపిస్తూ ఉంటుంది, నిజానికి నాది ఏది? అనే ప్రశ్న వేసుకుంటే ఎంతో తెలుస్తుంది, మనిషి ఎంత ఆర్జించినా చివరికి వెంట తీసుకువెళ్ళేది మాత్రం పాపపుణ్యాలే అని చెబుతారు ప్రవక్త. ప్రపంచంలో బాధ్యత లను, ధర్మాలను నిర్వర్తిస్తూనే, సత్కర్మాచరణ, పాప పుణ్యాల వివేచనతో జీవితాన్ని సార్థకం చేసుకోవాలని ఇస్లాం ధర్మం చెబుతుంది.....

మానవుడు ప్రతీది నాది... నాది అంటాడు, గొప్పలకు పోతాడు అసలు ఏది సొంతం? ఈ విషయాన్ని ముహమ్మద్ ప్రవక్త(స) ఇలా వివరించారు; మనిషి నా సంపాదన నా ధనం, అని వాస్తవానికి దూరంగా మసలుకుంటున్నాడు. నిజానికి మన సంపదలో మూడొంతులు మాత్రమే మన సొంతం. అవి ఏంటో చూద్దాం...

## మిగిలినవి నీవికావు

ఒకటి: అతను తిని కాజేసింది. రెండు: ధరించి వదిలేసే దుస్తులు

మూడు: అతడు దైవ మార్గంలో వెచ్చించి, పరలోకం కోసం కూడబెట్టుకున్నది. ఇది కాక మిగిలింది ఇతరుల కొరకు విడిచి పెట్టేదే.. (ముస్లిం).

దీనికి అర్థం, మన సంపదలో మూడు భాగాలు మాత్రమే మనం అనుభవించ డానికి హక్కుదారులం అని తేటతెల్లం అవుతున్నది, మిగిలినవి మన వారసులకే దక్కుతాయి. వారసులు ఎవరికీ ఏమాత్రం ఉపయోగపడరు, అందుకే సంపాదనతో సత్కర్మలు ఆచరించి, దైవమార్గంలో దానిని వెచ్చించి, సమాజ సేవ చేస్తేనే పరలోకంలో అవి ఉపకరిస్తాయి.

## సత్కర్మలే నీకు తోడు

మానవుడు ఎంత ధనం సంపాదించినా. ఎంత సంపద చేకూర్చుకున్నా మరణించి నపుడు అవి అతని వెంటరావు. అతడీ లోకంలో ప్రాణప్రదంగా ప్రేమించే కుటుంబ సభ్యుల కోసం రెక్కలుముక్కలు చేసుకొని సంపాదించిన ఆస్తిపాస్తులు, బంధువులెవ్వరూ

అతని పరలోకానికి తోడుగా వెళ్ళలేరు కేవలం. జీవించి ఉన్నప్పుడు ఆయన చేసిన సత్కర్మలు మాత్రమే వెన్నంటి ఉంటాయి. (హదీసు).

**ఇదే విషయాన్ని వేదం ఇలా చెబుతుంది.**

అర్థా గృహిణి వర్ధంతే, శ్మశానం మిత్ర భాంధవా, సుకృతం, దుష్కృతం చైవ, గత్యంతి మను గత్యతిహిః

అంటే, మానవుడు ధన ద్రవ్యాదులు సంపాదించి దాచిపెడతాడు, వారు మరణించి నపుడు అవి ఇంట్లోనే ఉండిపోతాయి, బంధుమిత్రులు శ్మశానం వరకు వస్తారు, వెంట వచ్చేది పాపపుణ్యాలు మాత్రమే అని అర్ధం.

## పరలోక సాఫల్యమార్గం

కాబట్టి మానవుడు తాత్కాలికమైన వాటికోసం పాకులాడకుండా, భార్యాబిడ్డలు, బంధుమిత్రుల ధర్మాలను నేరవేరుస్తూనే దీర్ఘకాలిక ప్రయోజనాలు, శాశ్వత సాఫల్యాలను ప్రసాదించే పుణ్యకార్యాలపై దృష్టి సారించాలి. పరలోక సాఫల్యం కోసం పాటుపడాలి. ఇదే వివేకవంతుల లక్షణం.

✦ ✦ ✦

# 46. శాంతి సంతృప్తి

**శాంతితోనే సంతృప్తి. ప్రపంచ మానవుడికి ఇప్పుడు కావల సినవి శాంతి..... సంతృప్తి. ప్రపంచమంతా అశాంతితో మారణ హోమంలా మారడానికి, వైయుక్తిక జీవితంలో అంతులేని అసంతృప్తికి గురికావడానికి కారణం దైవ నియమావళిని దాటి ప్రవర్తించడమే అంటోంది ఇస్లామీ ధర్మం.**

ఈనాటి ఆధునిక మానవుడు శాస్త్ర సాంకేతిక రంగాల్లో అద్భుతమైన ప్రగతిని సాధిస్తున్నాడు. విలాస వంతమైన జీవితానికి అవసరమైన అత్యాధునిక సాధనా సంపత్తిని సమకూర్చుకుంటున్నాడు. అంబరాన్నంటే హర్మ్యాలు నిర్మించుకున్నా, సముద్ర గర్భాల్లో నివాసాలేర్పరచుకున్నా, చందమామను అందుకున్నా, మరెన్ని ఆధునిక అద్భుతాలు ఆవిష్కరించినా శాంతికీ, సంతృప్తికీ మాత్రం నోచుకోలేక పోతున్నాడు. మానవ సమాజం లోని ఏ రంగాన్ని చూసినా అశాంతికి, అలజడికి, అభద్రతలకు ఆలవాలమైపోయింది.

## ఆధ్యాత్మిక ఆహారం

దైవాదేశాల ప్రకారం, దైవ నియమావళి ప్రకారం కాకుండా గొంతెమ్మ కోరికలకు, మనోవాంఛలకు దాసుడై, మానవుడు స్వార్ధపరుడుగా మారి పోతున్నాడు. స్వార్ధం కోసం, స్వలాభం కోసం ఎంతటి అఘాయిత్యానికైనా పాల్పడుతున్నాడు. ఒకప్పుడు అడవి జంతు వుల్ని, క్రూరమృగాలను చూసి మనుషులు భయపడేవారు. కానీ ఈనాటి మనిషి తన లాంటి తోటి మానవుణ్ని చూసి భయంతో కంపించి పోతున్నాడు. దీనంతటికి కారణం మానవుడు దైవాన్ని సరైన అర్ధంలో విశ్వసించకుండా, దైవ నియమావళిని కాలరాయడమే నంటోంది ఇస్లామీ ధర్మం. మనిషి బతికి బట్టకట్టాలంటే భౌతికంగా అతడికి ఆహారం కావాలి.

అలాగే మనిషికి ఆత్మ కూడా ఉంది. ఆధునికతా మోజులో పడిన ఈ నాటి మానవుడు ఆత్మను గురించి, మనసును గురించి ఆలోచించడం లేదు. ఆత్మ సజీవంగా

ఉండాలంటే దానికి ఆధ్యాత్మిక ఆహారం కావాలి. అది లేకపోతే ఆత్మ చచ్చిపోతుంది.

## శాంతి.. సంతృప్తి

ప్రకృతి ధర్మాన్ని కాదని పక్షులు నీటిలో, చేపలు గాలిలో సంచరిస్తున్నాయా? దైవ నియమావళికి విరుద్ధంగా సంచరించడానికి అవి ఏ మాత్రం ప్రయత్నించినా అవి అశాంతికి లోనవుతాయి. అంతేకాదు. తమ ఉనికినే కోల్పోతాయి. ప్రకృతిలోని ప్రతి ప్రాణి, ప్రతి వస్తువు, ప్రతి పదార్థం కూడా దైవ నియమావళినే అనుసరిస్తున్నాయి. ఆకాశంలోని అసంఖ్యాకగ్రహాలు, నక్షత్రాలు, సూర్యచంద్రాదులు తమ తమ నిర్ణీత కక్ష్యల్లో పరిభ్రమిస్తూ తమ విధులను నిర్వహిస్తున్నాయి. యావత్తు విశ్వ వ్యవస్థ, అందులోని సకల చరాచర సృష్టి దైవనిర్ధేశానుసారం దైవ నియమావళికి కట్టుబడి ప్రశాంతంగా మనుగడ సాగిస్తున్నాయి. ఈ సంపూర్ణ దైవ నియమావళి పేరే ఇస్లామ్. ఇస్లాం అంటేనే శాంతి, విధేయత, సమర్పణ అని అర్థం. మనిషి సంపూర్ణంగా దైవం పట్ల విధేయతను పాటిం చడమే ఇస్లాం. అలా పాటిస్తేనే మానవుడికి శాంతి లభిస్తుంది. ఈనాడు ఎంత ధనం కూడబెట్టినా మానవుడు అశాంతికి లోనై శాంతి కోసం పరితపిస్తున్నాడు. ఏదైనా అద్భుతం జరిగి దేవుడు దివినుండి భువికి దిగివచ్చి 'ఓ మానవుడా నీకేం వరం కావాలో కోరుకో' అని అడిగితే సర్వం మరచిపోయి 'శాంతి... శాంతి... కావాలి' అని కోరు కుంటాడు.

మానవుడు శాంతి సౌభాగ్యాలతో, ఆత్మసంతృప్తితో, ప్రశాంతంగా జీవనం గడప దలచుకుంటే దైవ నియమావళి ప్రకారం తన జీవితాన్ని మలచుకోవడం తప్ప గత్యంతరం లేదు. **'అలా జిక్రిల్లాహి తత్మయిన్నల్ ఖులూబ్'** (పవిత్ర ఖుర్ఆన్)

✦ ✦ ✦

# 47. సత్యం మేలిమి ముత్యం

**సత్యం మహోన్నతమైనది. అది ఇహపరాలను సార్థకం చేస్తుంది. అసత్యాన్ని ఆశ్రయిస్తే చివరిలో దైవానికి సమాధానం చెప్పుకోవాల్సి ఉంటుంది.**

నిత్య జీవనంలో అసత్యానికి తావు లేకుండా ఎల్లప్పుడూ సత్యాన్నే పలుకడం నిజంగానే దైవకృప. కానీ ఈనాడు చాలా మంది సత్యాన్ని గురించి అంతగా పట్టించుకున్నట్లు కనిపించదు. తమ వ్యవహారంలో మాత్రం ఇతరులు అసత్యమాడకూడదని, నిక్కచ్చిగా ఉండాలని కోరుకుంటారు. తాము ఇతరుల వ్యవహారంలో ఎలా వ్యవహరిస్తున్నామో ఆత్మపరిశీలన చేసుకోరు. ఈ సత్యమనే సద్గుణాన్ని గురించి ముహమ్మద్ ప్రవక్త మానవులకు ఎటువంటి హెచ్చరికతో కూడిన సందేశాన్నిచ్చారో గమనించండి.

## మంచివైపు నడిపించే సత్యం

"సత్యం మానవుల్ని మంచి వైపుకు తీసుకుపోతుంది. మంచి అతడిని స్వర్గం దాకా తీసుకుపోతుంది. అలాగే అసత్యం మనిషిని చెడు వైపునకు తీసుకుపోతుంది. చెడు అతడిని నరకందాకా తీసుకుపోతుంది" అని ఉపదేశించారు. సత్యసంధతకు ఇంతటి ప్రాముఖ్యం ఉందని అందరికీ తెలుసు. నోరు తెరిస్తే అసత్యాలే పలికేవారు సైతం సత్యానికి మించిన సద్గుణం మరొకటి లేదని అంగీకరిస్తారు. అయినా కూడా ఆచరణలో మాత్రం పప్పులో కాలువేస్తారు. అసత్యాన్ని ఆశ్రయిస్తారు. తిమ్మిని బమ్మిని చేసి పబ్బం గడుపుకోవడానికి ప్రయత్నిస్తారు.

## అసత్యాన్ని ఆశ్రయిస్తున్నారా?

పరిస్థితిని కాస్త నిశితంగా గమనిస్తే ఈనాడు అసత్యం అన్నది చెడుల జాబితా నుంచి మినహాయింపు పొంది, అది ఒక కళగా రూపాంతరం చెందిందా అనిపిస్తుంది. సత్యానికి, అసత్యానికి కాస్త కూడా తేడా లేదా అనిపిస్తుంది. తమ పబ్బం గడుపుకోవడానికి చాలా మంది తమకు ప్రయోజనాన్ని, లాభం చేకూర్చిపెట్టే వస్తువుగా అసత్యాన్ని

ఆశ్రయిస్తారు. స్వార్థం, స్వలాభం కోసం ఎంత పెద్ద అసత్యాన్ని అయినా పలికేందుకు సంశయించరు.

## దైవం ఎదుట సమాధానం చెప్పాలి

కాని ముహమ్మద్ ప్రవక్త (సం) తమ సంతానానికి సైతం ఏదైనా వస్తువు ఇస్తానని ఆశ చూపి ఇవ్వకపోయినా అది తప్పే. ఈ అసత్యాన్ని గురించి కూడా రేపు దైవం ముందు సమాధానం చెప్పుకోవాల్సిందేనని చెప్పారు. పొరపాటున ఏదైనా అసత్యం దొర్లిపోయినట్లయితే దానికి చింతించి, పశ్చాత్తాపంతో దైవాన్ని క్షమాపణ వేడుకోవాలని ముహమ్మద్ ప్రవక్త హితవు పలికారు. ఈనాడు చాలామంది చిన్న చిన్న లాభాల కోసం అబద్ధాలాడుతుంటారు. ఇక వ్యాపారలావాదేవీలైతే అబద్ధాలాడందే లాభాలు గడించలేమన్నట్లుగా ప్రవర్తిస్తుంటారు. కొందరు అసత్యాన్ని వ్యాపార చాతుర్యంగా కూడా భావించి గర్వపడుతుంటారు. కాని సత్యవంతుడైన వ్యాపారి పరలోకంలో దైవ ప్రసన్నతకు పాత్రుడవుతాడు. అతడు ప్రజల హృదయాలను చూరగొంటాడు. ప్రజల దీవెనలు పొందుతాడని సెలవిచ్చారు ప్రవక్త (సఅసం).

## అసత్యంతో ఆందోళన

అందుకే ఏదైనా విషయం మీ మనసును కలచివేస్తే దాన్ని వదిలివేసి అంత రంగాన్ని కలవరపరచని విషయాన్ని గురించి ఆలోచించమని ఆయన (స) బోధించారు. అసత్యం, ఆందోళనకు, వ్యాకులతకు కారణమవుతుందని ప్రవక్త తెలియజేశారు. కనుక నిత్య జీవితంలో సదా సత్యం పలకడం వల్ల పరలోకంలో దైవ ప్రసన్నతకు పాత్రులవడమే కాకుండా ఇహలోక జీవితంలో ప్రజల ప్రేమకు పాత్రులయ్యే అవకాశం ఉంటుంది. ఇహపరాలలో సాఫల్యం కలిగించే సత్యం అంతటి మహోన్నతమైనది.

✦ ✦ ✦

# 48. తల్లి - స్వర్గం

తల్లి పాదాల కిందే స్వర్గం ఉందని ముహమ్మద్ ప్రవక్త ప్రవచించారు. తల్లి దండ్రుల సేవతోనే మానవ జన్మకు సార్ధకత లభిస్తుందని అన్ని మత గ్రంథాలూ సూచిస్తున్నాయి. వారి సేవ చేయని ఏపుణ్యకార్యమైనా వృధాయే అవుతుందని చెబుతారు. తల్లిదండ్రులపై ప్రేమా భక్తి కలిగిన వారే ధన్యులు. ఇస్లాం దృష్టిలో తల్లి స్థానం ఎంతో గొప్పది.

కృషి, పట్టుదల ఉంటే ఈ ప్రపంచంలో మనిషి ఏమైనా సాధించగలడు. సాధన మున పనులు సమకూరు ధరలోన అన్న విషయమూ మనకు తెలిసిందే. దైవంపై అచంచల విశ్వాసంతో, కార్యదీక్షతో, నిష్ఠతో అద్భుతాలు సాధించిన ఎందరో మహా మహుల జీవిత చరిత్రలూ మనకు తెలుసు. ఎంత సాధించినా ఏదో కోల్పోయినట్లు తపనచెందే వారి సంఖ్య కూడా స్వల్పం కాదు.

## ప్రవక్త సందేశం

ఒకసారి ఒకవ్యక్తి ముహమ్మద్ వారి సన్నిధిలో హాజరై"దైవ ప్రవక్తా!నేను నా తల్లిని నా భుజస్కంధాలపై మోసుకుంటూ మక్కా తీసుకువెళ్లి, దైవ గృహ సందర్శనం(హజ్) చేయించుకుని వచ్చాను. మరి నేను నా తల్లి రుణం తీర్చుకున్నట్లేనా?" అని ప్రశ్నించాడు. అప్పుడు ప్రవక్త మహనీయులు ఆ వ్యక్తితో– "నీ తల్లి నిన్ను ప్రసవించే సమయంలో పడ్డ ప్రసవ వేదనలోని ఒక్క వంతు రుణం కూడా తీరలేదు" అన్నారు. అంటే తల్లి రుణం ఏ రూపేణా తీర్చుకోలేనిది అని ప్రవక్త వారి సందేశం, కోట్లు కుమ్మరించినా మనిషి తీర్చుకోలేని రుణం అదే.

## సార్వజనీన సూత్రం

పిల్లలు తల్లి దండ్రుల్ని ఎంతగా బాధపెట్టినా, ఎంత మనోవేదనకు గురి చేసినా, వారు మాత్రం తమ పిల్లల తప్పుల్ని క్షమించివేయగలుగుతారు. వారి ప్రేమ, కరుణలను ఏవిధంగానూ వెలకట్టలేం. అందుకే దైవాన్ని తల్లిగా, తండ్రిగా భావించడం, తల్లివి నీవే,

తండ్రివి నీవే అని దైవాన్ని తల్లిదండ్రులతో పోల్చడం చాలా మతాల్లో చూస్తాం. మతమేదైనా నీతి సూత్రం మాత్రం ఒక్కటే. తల్లి దండ్రుల పట్ల నిరాదరణ కలిగిన వారికి స్వర్గ మార్గం లేదు.

## అమ్మ విలువ

సంతానం సాధ్యమైనంత వరకు తల్లిదండ్రుల సేవలో తరించాలి. అలా అని ఇతరుల్ని నిర్లక్ష్యం చేయడం కాదు. తల్లి దండ్రుల సేవ ద్వారా దేవుడు సంతానంపై రానున్న కష్టాలను దూరం చేస్తాడు. వారి జీవితాలను సుఖమయం చేస్తాడు. అందుకే పెద్దలు తల్లి, తండ్రి, గురువు అంటూ స్థాన నిర్ణయం చేశారు. క్రమంలో తల్లి స్థానమే ముందు వరుసలో ఉంది. ముహమ్మద్ ప్రవక్త (స) తల్లి పాదల కింద స్వర్గమున్నదని ప్రవచించారు. అంటే తల్లిని సేవిస్తేనే స్వర్గం ప్రాప్తిస్తుందని అర్థం. తల్లిదండ్రుల్ని పట్టించు కోకుండా ఎన్ని పుణ్యకార్యాలు చేసినా, ఎన్ని తీర్థయాత్రలు జరిపినా అంతా వ్యర్థం.

✦ ✦ ✦

# 49. అసలైన విజయం

**ఫలవంతమైన జీవితం అంటే ఏమిటి అనేది ఆధ్యాత్మిక జీవులకు అసలైన ప్రశ్న. భౌతిక విజయం ప్రధానమైనప్పటికీ పరలోక విజయమే సఫల జీవితం అని ఇస్లాం చెబుతున్నది. నిత్య జీవితంలో ఎన్ని కష్టాలు ఎదురైనా నియమబద్ధులై పరలోక విజయం కోసం ప్రయత్నించాలంటుంది ఇస్లాం.**

ఈ ప్రపంచంలో పుట్టిన ప్రతి మనిషి సుఖవంతమైన, ఫలవంతమైన, విజయవంత మైన జీవితం గడపాలని కోరుకుంటాడు. సంపదలు, మేడలు, కార్లు, హోదా అన్నీ కావాలని కోరుకుంటాడు. ఇవి కోరుకోవడంలో తప్పులేదు. అయితే ఫలవంతమైన, విజయవంతమైన జీవితం అంటే ఏమిటో గమనించాలి. కొందరు పైన పేర్కొన్న సకల సౌకర్యాలు సమకూరితే అది ఫలవంతమైన జీవితమని, విజయవంతమైన జీవితమని భావిస్తారు. ఇవి ఎవరికి సమకూరవో వారిది విఫల జీవితంగా తలుస్తారు. వాస్తవానికి ఇది భౌతిక ప్రధాన విజయమే. పరలోక విజయ సాఫల్యాలే నిజమైన విజయం, అసలైన సాఫల్యమని ఇస్లాం ధర్మశాస్త్రం ఉద్బోధిస్తుంది.

## పరీక్షా స్థలం

మానవుని ఆచరణలను బట్టే సాఫల్య, వైఫల్యాలు ఆధారపడి వుంటాయని, ఈ ప్రపంచమే ఒక పరీక్షా స్థలమని, కర్మలు ఆచరించే కార్యక్షేత్రమని ముహమ్మద్ ప్రవక్త (సల్లం) చెప్పారు. మానవుడు తన స్థితిని బట్టి పరీక్షను ఎదుర్కొంటున్నాడు. సంపదలు, హోదా, అధికారం తదితర సకల సౌకర్యాలు సమకూరినా, లేక కష్టాల పాలవుతూ దారిద్ర్యం అనుభవిస్తున్నా, వారు అదే స్థితిలో పరీక్షను ఎదుర్కొంటున్నారు. అసలు ఈ ప్రపంచంలో ఆచరించిన కర్మలకు నైతికంగా సరైన శిక్షగాని, బహుమానం కాని లభించవు. ఒకవేళ పొందినా, అది చాలా మితంగా ఉంటుంది. ఈ లోకంలో ప్రతి స్థితీ ఒక పరీక్షే.

## విద్యార్థి లాగా శ్రమించాలి

ప్రతి మనిషి పరీక్ష రాసే విద్యార్థిలా జాగ్రత్తగా మసలుకోవాలి. పరీక్ష రాయబోయే విద్యార్థి ఎలా శ్రమపడి, రాత్రి పగలు చదువుతాడో అలానే ప్రతి మనిషి కష్టపడాలి. విద్యార్థి శ్రమించి రాసిన పరీక్షలో సమాధానాలు సరియైనవో కాదో అతనికి తెలియదు. కాని ప్రతి మనిషి జయాపజయాల విషయంలో ఎలాంటి కర్మలను ఆచరించాలో ముందుగానే తెలియజేశారు. అంటే సమాధాన పత్రం ముందుగానే అందజేయబడింది. కనుక ప్రతి ఒక్కరు ఖుర్ఆన్, హదీసుల వెలుగులో ఇహలోక జీవితం గడిపితే, రేపటి శాశ్వత పరలోక జీవితంలో విజయ సాఫల్యాలు లభించి స్వర్గప్రాప్తికి అర్హత సాధించ వచ్చు.

✦ ✦ ✦

# 50. నమ్మినవారికి రక్ష

'నా ఆగ్రహంపై నా కారుణ్యం ప్రాబల్యం వహిస్తుంది.'

దైవం తన సింహాసనం (అర్ష్)పై ఉన్న తన గ్రంథంలో రాసుకున్న మాటలివి- దైవానికి తన దాసులపై ఉన్న హక్కు ఏమిటంటే వారు ఆయన్ని మాత్రమే ఆరాధించాలి. ఇతరుల్ని దైవాలుగా భావించడానికి వీల్లేదు. దాసులకు దైవంపై ఉన్న హక్కు ఏమిటంటే దైవం తన దాసులను శిక్షించకూడదు.

## పశ్చాత్తాపపడాలి

దైవం ఇలా అంటున్నాడు. 'ఓ ఆదం సంతానమా! నువ్వు నన్ను మరచిపోకుండా స్మరిస్తున్నంతకాలం, నా నుంచి శుభాలను ఆశిస్తున్నంత కాలం నీవు చేసే తప్పిదాలను నేను క్షమిస్తాను. నువ్వు నింగినంటే పాపాలు చేసినా, భూమి నిండిపోయే తప్పులు చేసినా నా దగ్గరికొచ్చి మళ్లీ చేయను క్షమించమని అర్థిస్తే నేను తప్పకుండా క్షమిస్తాను. కానీ నాకు భాగస్వాములుగా మరెవర్నీ నిలబెట్టవద్దు. అప్పుడు నిన్ను క్షమించను.' ఆదం సంతానమైన మానవులందరూ పాపులే. కాని పశ్చాత్తాపపడేవారు తప్ప.

ఒక దైవవిశ్వాసి ఒక పాపం చేసినప్పుడు అతని హృదయంపై ఓ నల్లని మచ్చ ఏర్పడుతుంది. అప్పుడు అతడు గనుక పశ్చాత్తాపపడి దైవాన్ని క్షమాపణ వేడుకుంటే ఆ మచ్చ తొలగిపోయి హృదయం పరిశుభ్రమవుతుంది. ఎవరైతే పశ్చాత్తాపపడకుండా, క్షమాపణ వేడుకోరో అలాంటివారి హృదయంపై ఆ మచ్చ విస్తరిస్తూ పోతుంది. చివరికి అది మొత్తం హృదయాన్ని కప్పివేస్తుంది. ఇలాంటి వారిని ఉద్దేశించి 'వారి హృదయాలకు ఒక రోగం పట్టుకుంది. వ్యధాభరిత శిక్షను అనుభవిస్తారు వారు' అని దివ్యఖుర్ఆన్‌లో దైవం హెచ్చరించాడు.

## దయామూర్తి అల్లాహ్

దైవం ఇలా సెలవిచ్చాడని ముహమ్మద్ ప్రవక్త (సఅసం) తెలిపారు. 'నా దాసులారా! మీపైదౌర్జన్యం చేయకూడదని నాకు నేనే తీర్మానించుకున్నాను. కనుక మీరు

కూడా ఒకరిపై ఒకరు దౌర్జన్యం చేసుకోకండి. నేను మార్గం చూపిన వారు తప్ప అందరూ మార్గవిహీనులే. కనుక మీరంతా మార్గం చూపమని నన్ను ప్రార్థించండి. నేను మీకు మార్గం చూపుతాను. నేను అన్నం పెట్టిన వాడు, నేను వస్త్రాలు ఇచ్చిన వాడు తప్ప అందరూ అన్నార్తులే, వస్త్ర విహీనులే. మీరు రేయింబవళ్లు పాపాలు చేస్తూ ఉంటారు. నేను క్షమిస్తూ ఉంటాను. కనుక క్షమించమని నన్నే వేడుకోండి నాకు హానిగాని, లాభంగాని మీరు కలిగించలేరు. కనుక నాకు భయపడండి'.

మీరందరూ, అంటే మానవులు, జిన్నాతులు మంచివారు, యోగ్యులుగా మారినా, నా రాజ్యం, నా అధికారం పెరగడం కాని, చెడిపోయినంత మాత్రాన తరగడం కాని జరగదు. మీ అందరికీ మీరు కోరుకున్నదంతా ఇచ్చివేసినా సముద్రంలో సూదిముంచి నంత కూడా నా వద్ద తరగదు. బాగా వినండి. మీరు చేసే పనులన్నింటికీ నేను లెక్క తీసుకుంటాను. దాని ప్రకారం ప్రతిఫలం ప్రసాదిస్తాను. కాబట్టి దైవానికి భయపడుతూ పరిశుద్ధ జీవితం గడపాలి. అప్పుడే దైవ కారుణ్యానికి పాత్రులు కాగలం.

✦ ✦ ✦

# 51. విశ్వాసానికి సాక్ష్యం

'మీరు చెడును చూస్తే చేత్తో ఆపే ప్రయత్నం చేయండి. చేత్తో ఆపే శక్తి లేకపోతే నోటితోనైనా దానిని ఆపే ప్రయత్నం చేయండి. నోటితో కూడా ఆపే శక్తి మీలో లేకపోయినట్లయితే కనీసం మీ మనసులోనైనా ఆ చెడును అసహ్యించుకోండి. ఇది విశ్వాసానికి చివరిమెట్టు. కనీసం చెడును చూసి మీలో అసహ్యం కూడా కలగకపోతే మీలో రవ్వంత కూడా విశ్వాసం లేదు' అన్నారు ముహమ్మద్ ప్రవక్త (సల్లల్లాహు అలైహివసల్లం).

## వివేకవంతుల లక్షణం

ప్రస్తుత సమాజంలో ఎటుచూసినా అసంఖ్యాక చెడులు రాజ్యం చేస్తున్నాయి. అవినీతి అక్రమాలు, హింసాదౌర్జన్యాలు, మద్యపానం, జూదం, వ్యభిచారం, భ్రూణ హత్యలు, మానభంగాలు, అశ్లీల కార్యకలాపాలు సర్వసాధారణమైపోయాయి. నేల నాలుగుచెరగులా వ్యాపించిన ఈ చెడుల పట్ల సర్వత్రా ఉదాసీనత, నిర్లిప్తత, 'మనకెందు కులే' అనే భావన వ్యక్తమవుతున్నాయి. కానీ ముహమ్మద్ ప్రవక్త మహనీయులు, 'మీరు ఏ మాత్రం చెడు చూసినా చేత్తో దాన్ని ఆపండి, బలప్రయోగం ద్వారా దాన్ని నిర్మూలించండి' అని పిలుపునిచ్చారు. ఒకవేళ అధికారంతో ఆపగలిగే శక్తి లేకపోతే, కనీసం నోటి ద్వారానైనా, అంటే మంచిమాటల ద్వారా హితబోధల ద్వారా చెడుకు వ్యతిరేకంగా ప్రచారం ద్వారా దాన్ని ఆపడానికి విశ్వ ప్రయత్నం చేయాలని ఉపదేశించారు. కనీసం మంచిమాటలు కూడా చెప్పే పరిస్థితులు లేనప్పుడు, మనసులోనైనా ఆ చెడు పట్ల వ్యతిరేకత, అసహ్యం, రోత వ్యక్తం కావాలి. చింత, విచారం కలగాలి. కానీ ఈ సమాజం ఏమైపోతే నాకెందుకులే అని అనుకోవడం వివేకవంతుల లక్షణం కాదు.

## హదీసు బోధ

చుట్టూ దుర్గంధం ప్రవహిస్తున్నప్పుడు ముక్కుమూసుకుని తనకిక దుర్వాసన రాదని భావించడం మూర్ఖత్వమే అవుతుంది. ఆ దుర్గంధాన్ని కనుక దూరం చేయకపోతే అది వారిని కూడా కబళించి వేస్తుంది. ఈ విషయాన్ని ముహమ్మద్ ప్రవక్త వారు ఇలా

సెలవిచ్చారు. 'దేవుడు ఒక ఊరి ప్రజలను సర్వనాశనం చేసిరమ్మని తన దూతలను పంపాడు. అప్పుడా దూతలు ఆ ఊరెళ్లి చూస్తే అక్కడ ఓ దైవభక్తుడు నిరంతర దైవధ్యానంలో లీనమై ఉన్నాడు. ఊరిని నాశనం చేస్తే ఈ భక్తుడు కూడా నాశనమవు తాడని భావించిన దైవదూతలు దైవం వద్దకు వెళ్లి ఆ విషయాన్ని విన్నవించారు. అప్పుడు దైవం, 'దూతలారా! నాకు సర్వము తెలుసు. ముందు ఆ భక్తుడి నుంచే శిక్షను ప్రారం భించండి. ఎందుకంటే అతడు తనచుట్టూ అన్యాయాలు, అక్రమాలు జరుగుతుంటే, సమాజంలో చెడు శరవేగంతో పెరుగుతుంటే, ఆ చెడును రూపుమాపే ప్రయత్నం చేయకుండా, తనంత తాను దైవధ్యానంలో నిమగ్నమైపోయాడు. తనచుట్టూ సమాజ మంతా ఏమైపోయినా పరవాలేదని తలచాడు. కనుక ముందు అతణ్ణే నాశనం చేయండి తరువాత మిగతా వారిని. అని ఆజ్ఞ ఇచ్చాడు. (మిష్కాత్)

సమాజంలోని చెడును నిర్మూలించే బాధ్యతను ప్రతి ఒక్కరూ తమ బాధ్యతగా గుర్తించాలి. ముహమ్మద్ ప్రవక్త (సఅసం) హదీసు బోధనల ప్రకారం సకల చెడుల నుంచి సమాజాన్ని ప్రక్షాళనం చేయాల్సిన బాధ్యత మనందరిపై ఉంది.

✦ ✦ ✦

# 52. విశ్వాసమే ధర్మానికి పునాదిరాయి

ఇస్లామ్ అనే పదం సలమ్ అనే మూలధాతువు నుంచి వచ్చింది. 'సలమ్' అంటే ఎలాంటి లోపం లేకుండా పరిపూర్ణతను సంతరించుకున్నది అని అర్థం. పవిత్ర ఖుర్ఆన్ గ్రంథంలోని రెండో అధ్యాయంలో మోషే ప్రవక్త (మూసా) తన జాతి వారికి ఓ గోవు గుణ విశేషాలను వివరిస్తూ.. 'ముసల్ల మ తుల్లా షియత ఫీ హా..' అంటారు. అంటే 'అది ఏ లోపమూ లేనిదై పరిపూర్ణ ఆరోగ్యాన్ని కలిగి ఉండాలి' అని. సూరె షూరా 98వ ఆయత్‌లో 'ఖల్బిన్ సలీల' అనే పర్యాయ పదం ఉపయోగించబడింది. అంటే 'ఎలాంటి మచ్చగాని, కపటంగాని, మర్మంగాని లేని నిర్మల హృదయం' అని అర్థం. హష్ర్ అధ్యాయం 23వ వాక్యంలో 'అస్సలాం' అనే పదం వాడబడింది. అంటే దేవుడు సకల లోపాలకు అతీతుడు, పరిశుద్ధుడు అని అర్థం.

ఇలా మనం తరచి చూస్తే 'ఇస్లాం' అనే పదానికి అర్థం అన్ని రకాల లోపాలకు అతీతమైన మచ్చలేని ధర్మం ఇస్లాం అని మనకు అర్థమవుతుంది. సృష్టికర్త అయిన అల్లాహ్ సకల లోపాలకు, బలహీనతలకు ఏవిధంగా అతీతుడో అలాగే ఆయన ధర్మం అయిన ఇస్లాం కూడా సకల లోపాలకు, బలహీనతలకు అతీతమైనది.

'సలమ్' అనే పదానికి మరో భావం 'సలామతి' అంటే భద్రత, నిశ్చింత అని అర్థం. ఆరోగ్యం, సంక్షేమం కూడా సలామతికి సరిపోయే అర్థాలే. అంటే అల్లాహ్ భద్రతను, సంక్షేమాన్ని సమకూర్చేవాడని, ఇస్లాం ధర్మం కూడా భద్రతను, క్షేమాన్ని, శాంతిని సమకూర్చే ధర్మం అని అర్థమవుతుంది.

అలాగే రాగిబ్ అనే పండితుడు 'సలామ్'కు అర్థం చెబుతూ 'రక్షణ కోసం ఎత్తయిన ప్రదేశానికి ఎక్కడం' అని చెబుతాడు. అంటే నిచ్చెన, లేక మార్గం. రక్షణ పొందడానికి ఉపయోగించే సాధన సంపత్తి అని అర్థం.

'ఇస్లామ్' అనే పదానికి మరో అర్థం ఏమిటంటే దాస్యం, విధేయత, స్వయం సమర్పణ, లొంగుబాటు అని. ఈ అర్థాల ద్వారా మనకు ఇస్లాంకు సంబంధించిన నాలుగు అంశాలు ప్రస్ఫుటమయ్యాయి.

1. ఇస్లాం అన్ని రకాల లోపాలకు, బలహీనతలకు అతీతమైన ధర్మం.

2. అది మానవాళికి శాంతిని, భద్రతను, సంక్షేమాన్ని సమకూర్చిపెట్టే ధర్మం.

3. తాము భద్రంగా ఉంటూ ఇతరులను కూడా భద్రంగా, క్షేమంగా ఉన్నత నైతిక శిఖరాలపైకి గొనిపోయే ధర్మం.

4. ఇస్లాం మానవులను సృష్టికర్త అయిన విశ్వప్రభువుకు పూర్తి విధేయులు చేస్తూ వారిని ఇహలోకంలో అన్నిరకాల దాస్యాల నుంచి విముక్తుల్ని చేసి కేవలం ఒకే ఒక్క సర్వేశ్వరుడికి దాసులుగా ఉంచే ధర్మం. ఈ ఒక్క సద్గుణమే సమస్త మానవ జాతిని సకల రుగ్మతలకు దూరంగా ఉంచగలుగుతుంది.

ఇస్లాంతో పాటు ఈమాన్ (విశ్వాసం) కూడా తోడై ఉండాలి. 'ఈమాన్' అనేది 'అమన్' అనే మూల ధాతువు నుంచి వచ్చిన పదం. దీనికి ఒక అర్థం సాంత్వన, నిశ్చింత. ఎలాంటి భయభీతులు, విచారం, బెంగ గాని లేనటువంటి శాంతియుత వాతావరణం అని. మరో అర్థం విశ్వసించడం, అంగీకరించడం, గుర్తించడం అనేది. ఈ విశ్వాసంలో ఈ భరోసాలో ఎలాంటి అనుమానానికి తావు ఉండదు. అంటే ఒక విషయాన్ని బుద్ధీ జ్ఞానాల ద్వారా, జ్ఞానేంద్రియాల ద్వారా తెలిస్తేనే విశ్వసిస్తామనే వాదనకు ఇందులో తావులేదు.

అందుకే ఇస్లాం ధర్మాన్ని స్వీకరించడానికి మొట్టమొదటి షరతు ఈమాన్ (విశ్వాసం) ఇది లేకుండా ఏ వ్యక్తీ ఇస్లాం ధర్మంలోకి ప్రవేశించలేడు. ఈమాన్ ఉంటేనే ఇస్లాం ఉన్నట్లు. ఈమాన్ (విశ్వాసం) లేకుండా ఇస్లాం లేదు. విశ్వాస రహితమైన ఇస్లాంకు అర్థమే లేదు. అదొక జీవంలేని మృత కళేబరంతో సమానం.

దేవుని ఉనికిని విశ్వసించడం ఇస్లాం మౌలిక సిద్ధాంతం. దేవుని ఏకత్వం, ఆయన గుణ విశేషాలపై విశ్వాసమే నిజమైన సరియైన విశ్వాసం. ఈ విశ్వాసం పవిత్ర ఖుర్ఆన్ బోధనలకు అనుగుణంగా ఉండాలేగాని మనిషి సొంత ఆలోచనల కలగూరగంపగా ఉండటానికి వీల్లేదు.

అంటే దేవునిపై విశ్వాసంలేని ఇస్లాం, ఇస్లాం కాజాలదని, అది సుగంధ పరిమళం లేని పూవుతో సమానమని మనకు అర్థమవుతుంది. అందుకు ఖుర్ఆన్ వ్యాఖ్యాతలు ఇస్లాం రెండు రకాలుగా ఉంటుందని చెప్పారు. ఒకటి కేవలం నోటి ద్వారానే విశ్వసిం

చామని చెప్పడం. అంటే హృదయ పూర్వకంగా చిత్తశుద్ధితో విశ్వసించడం కాదన్నమాట. రెండు– హృదయ పూర్వకంగా, మనోవాక్కాయ కర్మల ద్వారా చిత్తశుద్ధితో విశ్వసించడం, కేవలం నోటి ప్రకటన ద్వారా కాకుండా హృదయ పూర్వకంగా విశ్వసించిన ఒక విశ్వాసి తన మాటల ద్వారా, చేతల ద్వారా తనను తాను నిరూపించు కుంటాడు. ఏదైతే చెబుతాడో దాన్నే ఆచరిస్తాడు. అతని మాటలు, చేతలు అతని విశ్వాసాన్ని బలపరుస్తాయి. అలా కాకుండా కేవలం నోటితో పలికి, హృదయంతో స్వీకరించకుండా ఉన్న ఆచరణలు బూడిదలో పోసిన పన్నీరే కాగలవు. అందుకే దేవుడు తన గ్రంథంలో 'ప్రజలారా! మీరు పూర్తిగా ధర్మంలో ప్రవేశించండి. అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తకు విధేయులుకండి' అని బోధించాడు. (అల్ బఖర 208) ఎందుకంటే ఆయన తన ధర్మాన్ని మనకోసం అవతరింపజేశాడు. మనకే పరిపూర్ణం చేశాడు.

ఇస్లాంను తన ధర్మంగా సమ్మతం చేశాడు. ఎవరైతే ఈ ధర్మాన్ని హృదయ పూర్వకంగా విశ్వసించి, సదాచరణలు చేస్తారో వారే ఇహలోకంలోనూ, పరలోకంలోనూ విజయ శిఖరాలను అధిరోహించ గలరు. కాబట్టి విశ్వాసమే ధర్మానికి పునాదిరాయి.

✦ ✦ ✦

# 53. కృతజ్ఞత

భూమ్యాకాశాల నిర్మాణంలో, రేయింబవళ్లు ఒకదాని వెంట ఒకటి చేసే నిరంతర పయనంలో, ప్రజా బాహుళ్యానికి ఉపయోగపడే వస్తువులు మోసుకుంటూ నదుల్లో, సముద్రాల్లో సంచరించే ఓడలలో, పైనుంచి కురిపించే వర్షపు నీటితో దైవం మృతభూమికి ప్రాణం పోస్తాడు. ఈ ఏర్పాట్ల ద్వారా భూమిపై వివిధ ప్రాణుల్ని వర్ధిల్లజేస్తాడు. వాయువుల సంచారంలో, భూమ్యాకాశాల మధ్య దైవాదేశాలకు కట్టుబడివున్న మేఘమాలికల్లో ప్రజలకు అసంఖ్యాక సూచనలు కనిపిస్తాయి. కానీ ప్రజలు కృతజ్ఞతలు చెల్లించడం మాత్రం బహు అరుదు. (బఖర 163)

## ఆరాధనకు ఆత్మ

కృతజ్ఞత అనేది ఆరాధనకు ఆత్మలాంటిది. కృతజ్ఞత లేని ఆరాధన బూడిదలో పోసిన పన్నీరులాంటిది. అది మనకు ఎలాంటి మేలును, లాభాన్ని చేకూర్చలేదు. కృతజ్ఞత అంటే చేసిన మేలును మనస్ఫూర్తిగా అంగీకరించి, దాన్ని మాటిమాటికీ జ్ఞాపకం చేసుకోవడం. మేలు చేసిన వారి పట్ల ప్రేమాభిమానాలు కలిగి ఉండడం. ఆచరణ ద్వారా మనం వారి ఇష్టానికి వ్యతిరేకంగా ప్రవర్తించబోమని నిరూపించడం. మానవుడికి జరిగే మేళ్లలో దేవుడు చేసిన మేలు మరువరానిది. మనకు ఏది లభించినా ఆయన వల్లనే లభించింది. అసలు మనకు ఉనికిని ప్రసాదించిది ఆయనే. అఖండమైన ఈ సృష్టిలో మానవుడనే ఈ అత్యల్పజీవికోసం పరమ ప్రభువు ఎన్నెన్ని ఏర్పాట్లు చేశాడో గమనిస్తే మానవ హృదయం కృతజ్ఞతాభావంతో ఉప్పొంగుతుంది. వాస్తవానికి ఈ మొత్తం సృష్టిని దైవం మానవుడి కోసమే సృష్టించాడంటే అతిశయోక్తి కాదు.

ఆయన ఉపకారాలను లెక్కించడం సాధ్యమయ్యే పని కాదు. చిన్న ఉదాహరణ గమనించండి... మనం పీల్చే ప్రతిశ్వాస ఊపిరితిత్తుల్లోకి పోయి మన ప్రాణానికి నవ్యతను, తాజాదనాన్ని చేకూర్చుతుంది. ఈ ఒక్క మేలుకే మనం దైవానికి ఎంతో రుణపడాల్సి ఉంటుంది. ఉచ్ఛ్వాస నిశ్వాసలు రెండూ దైవానికి కృతజ్ఞతలు చెల్లించుకో వాల్సిన బాధ్యతను గుర్తు చేస్తూ ఉంటాయి.

## విశ్వాసం-జ్ఞాపకం

దైవం చేసిన మేళ్లను, ఉపకారాలను అనుక్షణం గుర్తుచేసుకుంటూ ఉండాలి. అప్పుడే ఆయనపట్ల మన హృదయంలో కృతజ్ఞతాభావాలు ఉప్పొంగుతాయి. ఎవరి హృదయంలో అయితే ఈ కృతజ్ఞతాభావం ఉండదో వారి హృదయంలో విశ్వాసం (ఈమాన్) స్థిరంగా లేదని అర్థం. దీనికోసం మొట్టమొదట మనం మనస్ఫూర్తిగా దేవుని ఉపకారాలను అంగీకరించాలి. ఆయనే అసలైన అనుగ్రహశాలి అని దృఢంగా నమ్మాలి. ఈ ప్రపంచంలోని సమస్తాన్ని చివరికి ఈ శరీరాన్ని, అందులోని శక్తి సామర్థ్యాలను ప్రసాదించి, వాటిని వినియోగించే విధానాన్ని కూడా ఆయన ఎరుకపరిచాడు. ఈ విషయాలన్నీ మరచిపోయి, ఆయన చూపిన దైవధర్మాన్ని పూర్తిగా పాటించకుండా కొన్ని వ్యక్తిగత సాంప్రదాయాలకే పరిమితం చేసుకున్నాం. దీని ఫలితంగానే ఆయన వాగ్దానం చేసిన అనేక శుభాలకు మనం దూరమైపోతున్నాం. దాని దుష్ఫలితాలను కూడా అనేక రూపాల్లో అనుభవిస్తున్నాం. తరచుగా కరువు కాటకాలు, భూకంపాలు, వరదలు, అంటువ్యాధులు, యుద్ధాలు విపత్తులు వచ్చిపడుతున్నాయి. ఇదంతా దైవాగ్రహమే అని చెప్పక తప్పదు. ఆయన ఆజ్ఞలను శిరసావహిస్తూ ఆయన పట్ల కృతజ్ఞతతో జీవితం గడిపినట్లయితే ఇహలోకంలో, పరలోకంలో రక్షణ పొందే అవకాశం ఉంది.

✦ ✦ ✦

# 54. దేవుని ఆజ్ఞ... అమానత్

మనకు ఈ జన్మను ప్రసాదించిన దైవం అభీష్టం మేరకు మనం నడుచుకోవాలి. దాన్నే అమానత్ అంటారు. దేవుని అభీష్టానికి భిన్నంగా నడుచుకుంటే ఇప్పుడు మనల్ని ఎవరూ ప్రశ్నించకపోవచ్చు... దేవుని సమక్షంలో మాత్రం మనం సమాధానం చెప్పుకోవలసి ఉంటుంది.

భూమ్యాకాశాలు పర్వతాలపై మేము 'అమానత్' అంటే అప్పగింతను నెరవేర్చే బాధ్యతను మోపినప్పుడు అవి ఈ బాధ్యతను స్వీకరించడానికి భయపడి నిరాకరించాయి. అయితే మానవుడు ఈ బాధ్యతను మోయడానికి ముందుకు వచ్చి తన భుజాల పైకెత్తుకున్నాడు.

## అమానత్ అంటే..

అమానత్ అంటే ఒక వ్యక్తి ఇతరులపై నమ్మకంతో ఏదైనా వస్తువుగాని, లేక ధనాన్ని గాని భద్రపరచినపుడు దాన్ని భద్రంగా దాచి, దాని యజమాని అడిగినపుడు నిజాయితీగా ఆ వస్తువును లేక ధనాన్ని తిరిగి అప్పగించడాన్ని సాధారణంగా అమానత్ అంటారు. కాని పైన పేర్కొన్న పవిత్ర ఖుర్ఆన్ వాక్యంలో ఉపయోగించిన 'అమానత్' అన్న పదానికి అంతకంటే ఎంతో విస్తృతమైన అర్థం ఉంది. ఈ వాక్యంలో దైవాదేశాలను శిరసావహించి, ఆయన అభీష్టానికి అనుగుణంగా జీవితాన్ని గడిపేందుకు స్వీకరించే బాధ్యతాభారాన్ని 'అమానత్' అని వర్ణించారు. ఈ బాధ్యతా భారాన్ని మోయడానికి భూమ్యాకాశాలతో సహా ఏ వస్తువుకు లేని శక్తిని దైవం మానవుడికి ప్రసాదించాడు. దీంతోపాటు దైవం మానవుడికి స్వయం నిర్ణయాధికారం, విషయ స్వీకార స్వేచ్ఛ, మంచి చెడుల విచక్షణాజ్ఞానం, ప్రకృతి రహస్యాలను శోధించి, సాధించి వాటిని వినియోగించు కునే తెలివిని, శక్తి సామర్థ్యాలను కూడా ప్రసాదించాడు. మనిషి కోరితే ఈ అమానతుకు సంబంధించిన బాధ్యతలను నెరవేర్చవచ్చు. లేదా దీన్ని తిరస్కరించి ఇష్టమెచ్చినట్లు వ్యవహరించనూవచ్చు.

## సృష్టికర్త ఆయనే

ఇహలోకంలో ఈ విషయమై అతనిని ఎవరూ ప్రశ్నించకపోవచ్చు. పరలోకంలో మాత్రం ఈ బాధ్యతాభారాన్ని గురించి మనిషి తప్పకుండా ప్రశ్నించబడతాడు. మానవుడు ఈ సృష్టిలోని ఏ వస్తువుకు కర్తకాడు. సమస్త సృష్టికి కర్త పరాత్పరుడైన అల్లాహ్ మాత్రమే. చివరకు మానవుడు తన దేహానికి, ఆత్మకు కూడా యజమాని కాదు. అతనికి కాళ్లు చేతులు, కళ్లు చెవులు, బుద్ధీ వివేకాలు, అన్నీ దైవం ప్రసాదించిన అమానతులు. కాబట్టి మనిషి వీటిని దైవాభీష్టం ప్రకారం వినియోగిస్తే తాను స్వీకరించిన అమానత్ బాధ్యతభారాన్ని నెరవేర్చినట్లవుతుంది.

## సమాధానం చెప్పకోవాలి

ప్రతి మనిషికీ దైవం అతని శక్తిమేరకే అమానత్ బాధ్యతలు అప్పగించాడు. ఉదాహరణకు సంతానం ఒక అమానత్. తల్లిదండ్రుల అజాగ్రత్త, అలక్ష్యాల కారణంగా వారు చెడిపోతే, దైవమిచ్చిన అమానతు (సంతానం) విషయంలో తమ బాధ్యతను సరిగ్గా నిర్వర్తించలేదని అర్థం. ఈ విషయమై పరలోకంలో సమాధానం చెప్పుకోవలసి ఉంటుంది.

✦ ✦ ✦

# 55. సంతృప్తే నిజమైన సంపద

**మనిషి వృద్ధుడయినప్పటికీ రెండు గుణాలు మాత్రం యవ్వనాన్ని, శక్తినీ సంతరించుకుంటూనే ఉంటాయి. అవి ధన వ్యామోహం, ఇంకా బతకాలనే కోరిక. మన దగ్గర ధనంతో నిండిన రెండు మైదానాలు, పంట పొలాలు ఉన్నా మూడోది కావాలని కోరతాం.**

ఆశ మానవ సహజం. ఆశలేని మానవులు ఈ ప్రపంచంలో ఎవరూ ఉండరు. ఆశ లేకపోతే మనిషికి శ్వాస ఆడదు. కాని ఆశ అత్యాశగా, దురాశగా మారితేనే కష్టం. అందుకే ఏది మితిమీరకూడదని, ప్రతి దానికి హద్దు ఉండాలన్నది ముహమ్మద్ ప్రవక్త (స) ప్రవచనం.

## ఆశాజీవి

ఆశ పలు రకాలు. వీటన్నింటికీ కేంద్ర బిందువు, మూలం ధనాశ. ఇది చాలా తీవ్రమైనది. ఎంత సంపాదించినా ధన దాహం తీరదు. ఈ విషయమై ప్రవక్త మహనీయులు "మనిషి వృద్ధుడయినప్పటికీ ధన వ్యామోహం, ఇంకా బతకాలనే కోరిక మాత్రం యవ్వనాన్ని, శక్తినీ సంతరించుకుంటూనే ఉంటాయి." అలాగే "మానవుడి వద్ద ధనంతో నిండిన రెండు మైదానాలు, పంట పొలాలు ఉన్నప్పటికీ, అతడు మూడోది కావాలని కోరతాడు. మానవుడి కడుపు మట్టితోనే నిండుతుంది. అందుకే దైవం వైపుకు మరలి, తన దృష్టిని, తన ధ్యాసను దైవం పైనే లగ్నం చేసిన దాసులపై దైవం తన కరుణానుగ్రహాలు వర్షింపజేస్తాడు" అని ముహమ్మద్ ప్రవక్త సెలవిచ్చారు. (బుఖారి, ముస్లిం)

## ధర్మ సంపాదన

సంతృప్తిని మించిన సంపద లేదన్న ప్రవక్త ప్రవచనాన్ని సదా గుర్తుంచుకోవాలి. అలాగని అసలేమి సంపాదించకూడదనే విపరీత అర్థాలను తీయడం సరికాదు. ధర్మ

సమ్మతమైన మార్గంలో ఎంత సంపాదించినా తప్పు లేదంటుంది ధర్మశాస్త్రం. ఇతరుల నెత్తిపై చేయి పెట్టకుండా, ఇతరుల హక్కులు కొల్లగొట్టకుండా, అన్యాయం, అక్రమాలకు పాల్పడకుండా ధనార్జన చేయడం ధర్మసమ్మతమే. అలాంటి సంపదను కుటుంబానికి, బంధుమిత్రులకు, పేదలకు, అనాధలకు దానం చేయడం వంటి మంచి పనులకు వెచ్చించాలి. నిజానికి ఇలాంటి సత్కార్యాల్లో వ్యయం చేసిందే మనం కూడబెట్టుకున్నదని గ్రహించాలి.

## దైవం కోసం వెచ్చించాలి

వాస్తవానికి మానవుడి సంపాదనలో మూడు భాగాలే అతనివి. 'తాను తిని కాజేసింది. తొడిగి చించివేసింది, దైవ ప్రసన్నతా మార్గంలో వెచ్చించి పరలోకం కోసం కూడబెట్టుకొన్నది." ఇది కాక మిగిలినదంతా అతని సంపాదన కాదు. అదంతా ఇతరుల కోసం విడిచిపెట్టేదే. అతను కూడా ఏదో ఒక రోజున ఇదంతా వదిలేసి వెళ్ళి పోవలసిన వాడే. కావున మనిషి ఎప్పుడూ ధనాశపరుడిగా జీవిరచకూడదు. ఉన్నదాంట్లోనే సంతృప్తి చెందాలి. ధర్మసమ్మతంగా సంపాదించినా అది నిజానికి తనది కాదని, అందులో ఇతరుల హక్కు కూడా ఉందని భావించి, మంచి పనుల్లో ధనాన్ని ఖర్చు చేయాలి. ఈ విధంగా మధ్యేమార్గాన్ని అవలంబిస్తూ ధార్మిక జీవితం గడిపితే, ఇహలోకంలో శాంతి, సంతృప్తులు, పరలోకంలో శాశ్వత స్వర్గం వారి సొంతమవుతుంది.

✦ ✦ ✦

# 56. అల్లాహ్ ఇచ్చిన వరం

మనిషి ఆరోగ్యంగా ఉంటేనే తన ధర్మాన్ని సక్రమంగా నిర్వర్తించ గలుగుతాడు. అందుకే ఆరోగ్యం పట్ల ఏ మాత్రం ఉపేక్ష తగదని, మనం ఆరోగ్యంగా ఉంటే మనతో పాటు ఇతరుల శ్రేయస్సుకు కృషి చేసే వీలుందని అల్లాహ్ చెప్పాడు.

జీవులందరికీ అల్లాహ్ (సృష్టికర్త) ప్రసాదించిన గొప్ప వరం ఆరోగ్యం, అందుకే మనందరం ఆరోగ్యాన్ని కాపాడుకోవాలి. చెదపురుగులు ఏవిధంగా ఉద్గ్రంధాలనే తింటాయో, అలాగే ఆరోగ్యం విషయంలో మనం చూపే ఏ కొద్ది నిర్లక్ష్యమైనా అది మన జీవితాన్నే నాశనం చేస్తుంది. అందుకే 'ఆరోగ్య పరిరక్షణలో ఏమాత్రం అలసత్వం చూపకూడదని" ముహమ్మద్ ప్రవక్త (సం) ప్రజలకు బోధించారు.

## అనారోగ్యం ఓ శత్రువు

మానవుడు తన జీవిత కాలంలో ఎన్నో పనులు చక్కబెట్టాలి. అలాగే ఎన్నో బాధ్యతలు నెరవేర్చాలి. ఇవన్నీ సక్రమంగా, సజావుగా నిర్వర్తించాలంటే, శరీరంలో సత్తువ ఉండాలి. బుద్ధి-వివేకాల్లో బలం ఉండాలి. సంకల్పంలో స్థిరత్వం ఉండాలి. ఆశయాల్లో ఔన్నత్యం ఉండాలి. అందుకే ప్రవక్త మహనీయులు ముహమ్మద్ (సం) "ఇలాంటి నైతిక రుగ్మతలు, మనసులోని సమస్యలు మీ జీర్ణాశయాన్ని తలకిందులు చేస్తాయని, జీర్ణాశయం చెడిపోతే, ఆరోగ్యం ఒక శత్రువును కొని తెచ్చుకున్నట్లే" అని ప్రవచించారు.

## దివ్య ఔషధం

మరొక సందర్భంలో ముహమ్మద్ ప్రవక్త 'నిరాడంబరంగా ఉండండి. మధ్యేమార్గాన్ని అవలంబించండి. ఆరోగ్యాన్ని పరిరక్షించుకుంటూ, నిత్యం సంతోషంగా, ఉల్లాసంగా మెలగండి" అని ప్రబోధించారు. (మిష్కాత్)

ప్రాతఃకాలపు నిర్మలమైన గాలి ఆరోగ్యానికి దివ్య ఔషధంగా ఉపకరిస్తుంది కాబట్టి ప్రాతఃకాల నమాజ్ (ప్రార్ధన) తరువాత ప్రకృతి వెదజల్లే స్వచ్ఛమైన, నిర్మల గాలులను ఆస్వాదించడానికి వ్యాహ్యాళి (తోట)కి వెళ్లాలని ముహమ్మద్ ప్రవక్త (స) ఉపదేశించారు.

స్వయంగా ప్రవక్త మహనీయులు తోటలో విహరించడానికి ఎంతో ఇష్టపడేవారు. ఆయన స్వయంగా తోటలోకి వెళ్లి కాలక్షేపం చేసేవారు. ఇషా నమాజ్ తరువాత అంటే రాత్రి సుమారు 8, 9 గంటలు దాటిన తరువాత అత్యవసరం అయితే తప్ప జాగరణ చేయ డాన్ని, కబుర్లు చెప్పుకుంటూ కూర్చోవడాన్ని ఆయన వారించారు.

## ఆరోగ్యంతోనే ముక్తీ, మోక్షం

దైవ ప్రవక్త మహనీయులు ఇలా ఆరోగ్యానికి సంబంధించి అనేక విషయాలు బోధించారు. సమయానికి మితాహారం, కంటి నిండా నిద్ర అవసరమని, ఏది మితి మీరకూడదని, ప్రతి పనిలో మధ్యేమార్గాన్ని అవలంబించాలన్నారు. నెలకు మూడు రోజులు గాని, లేదా వారానికి ఒక రోజు గాని ఉపవాసం పాటించాలని, ప్రవక్త మహనీయులు చేసిన ఉపదేశం నేటి మానవ సమాజానికి ఎంత అవసరమో, నేటి సమాజాన్ని చూస్తే అర్థమవుతుంది. మానవుడు పుట్టింది మొదలు మరణించే వరకు జీవితానికి సంబంధించిన అన్ని రంగాలకు పరిపూర్ణ మార్గదర్శకత్వం ముహమ్మద్ ప్రవక్త (సం) బోధనల్లో మనకు కనిపిస్తుంది. ఆ మార్గదర్శకత్వాన్ని ఆయన ఉపదేశాలను మానవాళి స్వీకరించినట్లయితే సపూర్ణ ఆయురారోగ్యాలతోపాటు ఇహ, పరలోకాల్లో ముక్తి మోక్షాలకు అర్హులై సాఫల్యం పొందుతారనడంలో సందేహం లేదు.

✦ ✦ ✦

# 57. మంచి మనసే ఆస్తి

**ఇస్లాం ధర్మ సౌధానికి మూలస్థంభాల్లో ఒకటైన జకాత్‌కు ముహమ్మద్ ప్రవక్త చెప్పిన మరో భాష్యం..**

నేటి మానవుడు నిద్రలేచింది మొదలు రాత్రి పడుకునేవరకు ధనార్జనే ధ్యేయంగా జీవితం గడుపుతున్నాడు. మంచి చెడు, నీతి న్యాయాలను పక్కన పెట్టి రూకలు గడించడమే రూలుగా పెట్టుకున్నాడు. ధనవ్యామోహంలో పీకల దాకా కూరుకుపోయిన మనిషి ఇహలోకంలో, పరలోకంలో ఆ ధనం ఏమేరకు ఉపకరిస్తుందో ఆలోచించడం లేదు. ఇహలోక జీవితం అశాశ్వతమని, ఇక్కడ ఎంత సంపద కూడబెట్టినా చివరికి రిక్తహస్తాలతో వెళ్లవలసిందే అనే వాస్తవాన్ని మనిషి గుర్తించడం లేదు. ఒకవేళ సంపాదించినా ఆ సంపదను మంచి పనులకోసం, పుణ్యకార్యాల కోసం వెచ్చించకుండా ఇష్టానుసారం మనసుకోరే గొంతెమ్మ కోరికల పరిపూర్తికి ఖర్చుపెడుతుంటాడు. కానీ ఈ ప్రపంచంలో ఎన్నికోట్లు గడించినా అవి సత్కార్యాలకు చిత్తశుద్ధితో వినియోగించకపోతే పరలోకంలో అతడు నిరుపేదగా మారిపోతాడని ముహమ్మద్ ప్రవక్త (స) బోధించారు.

## సంపన్నుల దుస్థితి

'ఎవరికైతే దైవం ధన సంపదలు ప్రసాదించాడో, వారు విస్తృతంగా సత్కార్యాలకు ఆ ధనం వెచ్చిస్తూ పుణ్యంకోసం దైవంపై భారం వేసిన వారు తప్ప, మిగతా ధనవంతులంతా పరలోకంలో కడు బీదవారైపోతారు' అని ప్రవక్త ప్రవచించారు. అంటే ఈ ప్రపంచంలో మనిషి ఎంత ధనం సంపాదించినా, కోట్లకు పడగలెత్తినా బాధల్లో ఉన్న సాటిమనిషి కోసం ఎంతో కొంత ఆ ధనం వ్యయపరచకపోతే పరలోకంలో అది అతడికి ఏమాత్రం ఉపకరించదు. సాధారణంగా ధనవ్యామోహం మనిషికి దైవంపట్ల ఏమరుపాటును కలిగిస్తుంది. అలాంటి మనిషి దైవవిధేయతకు దూరంగా ఉంటాడు. ఫలితంగా ప్రళయదినం నాడు అతడి పుణ్యకార్యాలు పాపకార్యాలకంటే చాలా తక్కువగా ఉంటాయి. ధనపిపాస అతడిని సత్కార్యాలు చేయనివ్వకపోగా, అనేక పాపకార్యాల్లో కూరుకుపోయేలా

చేస్తుంది. ఈ కారణంగా చాలామంది ధనవంతులు పరలోకంలో తీవ్ర పరాభవాన్ని ఎదుర్కోవాల్సి రావచ్చు. ఈ పరాభవం నుండి మనల్ని మనం రక్షించుకో వాలంటే ముహమ్మద్ ప్రవక్త బోధనలను ఆచరించడం తప్ప వేరే మార్గం లేదు.

## ప్రవక్త బోధ

అందుకని ఆర్థికస్థోమత కలిగినవారు ప్రతి సంవత్సరం క్రమం తప్పకుండా తమ ధనానికి జకాత్ చెల్లించాలి. నిరుపేదలు, అనాధలు, లేమికి గురైన బంధువులు, మిత్రులు, వితంతువులకు, ఆపదలో ఉన్న ఇరుగు పొరుగువారికి విశాల హృదయంతో సాయం అందించాలి. అనాథ పిల్లల అన్నవస్త్రాలకు, విద్యాబుద్ధులకు తమ ధనాన్ని వెచ్చించాలి. వితంతు మహిళలకు, వికలాంగులకు శాశ్వత ప్రాతిపదికపై సహాయం అందించాలి. వివాహ వయసు వచ్చిన నిరుపేద యువతుల వివాహానికి ఆర్థిక సహాయం అందించాలి. ప్రకృతి వైపరీత్యాలు సంభవించి ప్రజలు నిరాశ్రయులైనప్పుడు తక్షణ సాయంగా అన్న వస్త్రాలు అందించి, నివాసాలు ఏర్పాటు చేయడం, ఆర్థికంగా వారు నిలదొక్కుకోగలిగేలా విశాల హృదయంతో విస్తృత ప్రాతిపదికన ఆదుకోవడం సంపన్నుల బాధ్యత అని బోధిస్తూనే ముహమ్మద్ ప్రవక్త క్రమం తప్పకుండా జకాత్ చెల్లించే వారికి దైవం పరలోక స్వర్గ వనాల్లో ప్రవేశం కల్పిస్తాడనే శుభవార్తను అందజేశారు.

✦ ✦ ✦

# 58. సృష్టి సమస్తం దేవుని లీల

'మానవులారా! మిమ్మల్ని.. మీకు పూర్వం వారిని సృష్టించిన ఆ సృష్టికర్తను ఆరాధించండి. దీని ద్వారానే మిమ్మల్ని మీరు రక్షించుకునే అవకాశం ఉంది. మీకోసం భూమిని పాన్పుగాను, ఆకాశాన్ని కప్పుగాను సృష్టించినవాడు, పైనుంచి వర్షాన్ని కురిపించి తద్వారా అన్ని రకాల పంటలు పండే ఏర్పాటు చేసి మీకు ఉపాధి కల్పించిన వాడు ఆయనే. ఇది మీకు తెలిసినప్పుడు ఇతరుల్ని అల్లాహ్‌కు (సృష్టికర్తకు) సమానులుగా నిలబెట్టకండి. (దివ్యఖుర్‌ఆన్ 2:21,22)

## ఆయన అన్నీ ఇచ్చాడు.. మరి నీవు?

ఎవరైతే భూమ్యాకాశాలను, అందులోని సమస్త సృష్టిరాశులను సృష్టించి, మానవాళికి మంచి జీవితాన్ని ప్రసాదించాడో ఆయనే నిజానికి మానవులందరి దైవం, యజమాని, ప్రభువు, పరిపోషకుడు. ఎందుకంటే ఆయనే మానవుల ఇహలోక జీవితం సుఖవంతంగా, శాంతివంతంగా, ఫలప్రదంగా గడచిపోవడానికి ఈ లోకంలో ఎన్నో ఏర్పాట్లు చేశాడు. మానవుడు అడగకుండానే అన్నీ సమకూర్చి పెట్టాడు. విశ్వవ్యవస్థలో ఉన్న ప్రతి ఒక్కటి మానవుడి కోసమేనంటే అతిశయోక్తి కాదు. కాని మానవుడు మాత్రం అల్లాహ్ (సృష్టికర్త) కోసం కావాలి.

## సమస్తం దైవానుగ్రహం

ఈ సృష్టిలోని ఏ ఒక్క వస్తువునూ మానవుడు సృష్టించలేదు. భూమ్యాకాశాలు, సూర్యచంద్రాదులు, గ్రహనక్షత్రాలు, సముద్రాలు, పర్వతాలు, వర్షమూ, వాయువు, మేఘాలు, పక్షులు, జంతువులు, కీకారణ్యాల్లో సంచరించే ప్రాణులు, సముద్ర గర్భాల్లో సంచరించే ప్రాణులు, ఎన్నెన్నో జీవ నిర్జీవ వస్తు ప్రాణులు ఒక్క మానవుడి ప్రయోజనం కోసం ఎలా ఉపయోగపడుతున్నాయో గమనిస్తే మహోన్నతుడైన దేవుని (అల్లాహ్) మహిమ కళ్లెదుట స్పష్టంగా కనపడుతుంది. దేన్నో సృష్టించడం పక్కన పెడితే చివరకు మానవుడు తన శరీరానికి, ఆత్మకు కూడా యజమాని కాదు. సమస్తమూ దైవం

మానవుడికి అనుగ్రహించినవే. మానవుడి శ్రేష్టత, అతని బుద్ధీ, వివేకాలు అన్నీ దైవం ప్రసాదించినవే.

## అహం... అశాంతి

దైవం తరపున ఇన్ని వరాలు, అనుగ్రహాలు పొందిన మానవుడు ఆ సృష్టికర్తకు కృతజ్ఞతలు చెల్లించడం శ్రేష్ట జీవరాశిగా అతని ప్రధాన విధి. కాని దురదృష్టవశాత్తు మానవుడు వాస్తవాన్ని గుర్తించకుండా అంతా నేనే అన్న అహంకారంతో విర్రవీగుతూ దైవం తనకు ప్రసాదించిన స్వేచ్ఛాధికారాలను, వరానుగ్రహాలను దుర్వినియోగం చేస్తున్నాడు. భూమ్యాకాశాల్లో, ఈ రెండింటి మధ్య వున్న వ్యవస్థలో అశాంతికి కారణమవుతున్నాడు. నిజానికి దైవం మానవుణ్ని ఈ భూమండలంపై తన ప్రతినిధిగా పుట్టించాడు. అంటే మనమంతా ఆయన ఆజ్ఞలకు బద్ధులమై, ఆయన మనకోసం సృష్టించిన వాటిని ఆయన ఆజ్ఞల ప్రకారం మాత్రమే వినియోగించాలన్నమాట. మరో విధంగా చెప్పాలంటే ఇవన్నీ దైవం మనకు అప్పగించిన అప్పగింతలు. మనం దేనికీ సొంతదారులం కాదు.

## దైవం ప్రశ్నిస్తాడు...

మన సంపద, మన సంతానం, మన అధికారం, మన శక్తి సామర్థ్యాలు సమస్తమూ దేవుని అప్పగింతలే. ఆయనే మనకు ఈ అన్నీ ప్రసాదించాడు. అందుకని మన సంపద, సంతానం, అధికారం శక్తి సామర్థ్యాలు సమస్తమూ దైవం కోసం, దైవ ధర్మం కోసం, మానవాళి శ్రేయో సాఫల్యాల కోసం మాత్రమే వినియోగమవ్వాలి, మనపై మన పూర్వీకులపై ఇన్ని వరాలు కురిపించి, ఇన్ని శుభాలు ప్రసాదించిన దైవాన్ని కాదని, ఇష్టానుసారం ప్రవర్తిస్తే దైవం ఈ విషయమై ప్రశ్నిస్తాడన్న యదార్థాన్ని మరువరాదు. మిమ్మల్ని ధరణిపై తన ప్రతినిధిగా నియమించిన దైవం మీకు అనుగ్రహించిన వరాలను గురించి తప్పక ప్రశ్నిస్తాడు. విధేయులకు బహుమానం, అవిధేయులకు శిక్ష తప్పకుండా వుంటుంది. కనుక ఇవన్నీ తెలిసిన బుద్ధిజీవి అయిన మానవుడు ఇహపరలోకాల ముక్తి.. మోక్షాలకు శక్తి వంచన లేకుండా ప్రయత్నించడం అవసరం.

✦ ✦ ✦

# 59. నమాజుతో జన్మ సఫలం

**ముస్లింలకు అత్యంత పవిత్రమైన రోజు శుక్రవారం. ఆరోజున చేసే నమాజుకు విశేష ఫలితం ఉంటుంది. శుక్రవారం విశిష్ట తను, ఆరోజు నమాజు నిర్వహించాల్సిన విధి విధానాలను తెలుపుతున్నాము.**

వారంలోని ఏడు రోజుల్లో శుక్రవారానికి ఒక ప్రత్యేకత ఉంది. ముస్లిం సోదరులు శుక్రవారాన్ని అమితంగా గౌరవిస్తారు. ఎందుకంటే సూర్యుడు ఉదయించే రోజుల్లో కెల్లా శుక్రవారం రోజు మహా విశిష్టమైనదని ముహమ్మద్ ప్రవక్త ప్రవచించారు. శుక్రవారం రోజునే ఆది మానవుడు ఆదం (అలై)ను దేవుడు సృష్టించాడు. ఆ రోజునే ఆయన స్వర్గంలోకి ప్రవేశించారు. మళ్లీ అదేరోజు భూలోకంలో నియామకం చేశాడు. ఆ రోజునే (శుక్రవారం) ప్రళయం రానుంది. (ముస్లిం)

## పాపాలను హరించే నమాజు

దైవ ప్రతినిధులుగా మానవులు ఈ భూ ప్రపంచంలో నిర్వర్తించవలసిన బాధ్యతల గురించి, సామాజిక జీవితంలో వారు పోషించవలసిన పాత్రను గురించి, మానవుడు పుట్టింది మొదలు మరణించే వరకు లభించిన జీవితకాలంలో, జీవన సమస్త రంగాల్లో వ్యవహరించవలసిన తీరుతెన్నులను గురించి శుక్రవారం రోజున జరిగే ప్రత్యేక సమావేశంలో ఖుర్ఆన్ హదీసుల వెలుగులో బోధిస్తారు. మనిషిని, మంచి కార్యాల వైపునకు ప్రోత్సహించి, చెడు నుంచి దూరం చేయడమే శుక్రవారం నాటి ఖుత్బా ప్రత్యేకత. ఆ రోజు ఆచరించే నమాజు వారం రోజుల పాపాలను హరించేస్తుందని ముహమ్మద్ ప్రవక్త సెలవిచ్చారు. అయితే పూర్తి విశ్వాస చైతన్యంతో, నియమ నిష్టలతో చేసినప్పుడే అది సాధ్యం. నియమ నిష్టలను పాటిస్తూ చైతన్య స్ఫూర్తితో శుక్రవారం నమాజుకు వెళ్లే వ్యక్తి చెడుల్లో, పాపాల్లో కూరుకుపోయే అవకాశమే లేదు. అందుకే నమాజు సమస్త పాపాలను దూరం చేస్తుందని ప్రకటించింది పవిత్ర ఖుర్ఆన్.

## దైవ స్మరణలో సాఫల్యం

శుక్రవారం అజాన్ పిలుపు వినగానే మసీదుకు వెళ్లడానికి త్వరపడాలి. వ్యాపారాలు ఇతర పనులు అన్నీ మానుకోవాలి. ఏకాగ్రతతో ఖుత్బా (ప్రసంగం) వినాలి. నిష్టగా నమాజ్ చేయాలి. నమాజ్ పూర్తయిన తర్వాత తిరిగి వ్యాపార కార్యకలాపాల్లో పాల్గొనవచ్చు. పవిత్ర ఖుర్ఆన్‌లో ఇలా ఉంది : "శుక్రవారం రోజు నమాజు కోసం అజాన్ పలికినప్పుడు వెంటనే మసీదుకు బయలుదేరండి. వ్యాపారాలు వదిలేసి పరుగిడండి. విషయం గ్రహించగలిగితే మీకు ఇదెంతో ఉత్తమమైంది. నమాజు పూర్తికాగానే మీమీ కార్యకలాపాలకు భువిపై విస్తరించండి. దేవుని అనుగ్రహాన్ని (ఉపాధి) అన్వేషించడంలో లీనమవ్వండి. దైవాన్ని అధికంగా స్మరించండి. మీకు సాఫల్యం ప్రాప్తమయ్యే అవకాశం ఉంది." (జుమా : 9-10)

## శుక్రవారం శుభఘడియ

శుక్రవారం రోజున ఒక శుభఘడియ ఉంది. ఆ ఘడియలో దాసుడు చేసిన ప్రతి ప్రార్ధన స్వీకరించబడుతుంది. (బుఖారి)

ఈ ఘడియకు సంబంధించి రెండు ఉల్లేఖనాలున్నాయి. ఈ రెండూ ఈ శుభఘడియకు వర్తిస్తాయి. ఒకటి -ఇమాం ఖుత్బా వినిపించడానికి వేదికమీదకి వచ్చినప్పటి నుంచి నమాజు పూర్తయ్యే వరకు. రెండు -శుక్రవారం సూర్యుడు అస్తమించే సమయం వరకు. (అంటే మగ్రిబ్ వరకు) కనుక ఈ రెండు సమయాల్లో అత్యంత వినయ విధేయతలతో గడపటం ద్వారా పరలోక సాఫల్యానికి చేరువ కావచ్చు.

✦ ✦ ✦

# ౬౦. ప్రళయదినం

**ప్రళయదినం సంభవించిన రోజున ఈ ప్రపంచం అంతమై పోతుందని ఖుర్ఆన్ చెబుతుంది. దీని తరువాత మరోకొత్త ప్రపంచం ఉనికిలోకి వస్తుంది. మానవులందరూ అక్కడ దేవుని ముందు హాజరవుతారు. ప్రపంచంలో మంచి పనులు చేసిన వారికి బహుమానం, చెడు కార్యాలకు పాల్పడిన వారికి కఠిన దండన విధిస్తాడు దేవుడు. అక్కడ శిక్ష అయినా, బహు మానం అయినా శాశ్వతమైనవి. ఇంకా ప్రళయదినం గురించి ఖుర్ఆన్ చెప్పిన విశేషాలు ఇలా ఉన్నాయి..**

దైవంపై విశ్వాసమున్నప్పుడే ప్రళయంపై విశ్వాసం పరిపూర్ణం అవుతుంది. ప్రళయదినం పట్ల విశ్వాసం మనిషి మస్తిష్కంలో నాటుకుపోతే మానవజీవితాల్లో విప్లవాత్మకమైన మార్పులు చోటుచేసుకుంటాయి. ప్రళయం పట్ల విశ్వాసం మానవుల నడవడికి, జీవన గమనానికి పవిత్రమైన దశ, దిశలను నిర్ధేశిస్తుంది. మంచిని ప్రేమించే వారుగా, ప్రోత్సహించే వారుగా, చెడును అసహ్యించుకునేవారుగా, దాన్ని నిరోధించే వారుగా తీర్చిదిద్దుతుంది. మానవుల్లో దైవభీతిని, దైవభక్తిని, పరలోక చింతనను పాదుకొల్పుతుంది. ప్రళయం పట్ల నమ్మకం మానవులను దైవాదేశాలకు కట్టుబడేవారుగా, సత్యధర్మ పథంలో స్థయిర్యంగా నడిచేవారుగా మలుస్తుంది.

## కర్మలపత్రం

ప్రళయ దినాన ప్రతి మనిషి చేతిలో అతడి కర్మల పత్రం ఉంటుంది. అతడు చేసిన చిన్నా పెద్ద పనులు, మంచిచెడ్డ పనులు, పాప పుణ్యాలు ఆ పత్రంలో రికార్డు అయి ఉంటాయి. దైవభీతితో జీవితం గడిపిన పుణ్యాత్ములకు ఆ రోజు వారి కర్మలపత్రం వారి కుడిచేతికి ఇస్తారు. పాపాత్ములకు ఎడమ చేతికి ఇస్తారు. లెక్కలపత్రం కుడిచేతికి అందినవారు ఆరోజు అమితంగా ఆనందిస్తారు. ఎడమ చేతికి లెక్కల పత్రం అందినవారు

దౌర్భాగ్యులు. పవిత్ర ఖుర్‌ఆన్ గ్రంథంలో ఇలా ఉంది. “అదే –మీరు హాజరుపరచబడే ప్రళయదినాన మీ రహస్యాలేవీ దాగి ఉండవు. అప్పుడు కర్మలపత్రం కుడిచేతితో అందు కున్న వ్యక్తి ‘చూడండి నా కర్మల పత్రాన్ని చదవండి నా లెక్క నాకు తప్పక లభిస్తుందని నేను అనుకుంటూ ఉండేవాడిని’. అంటాడు. అతడు తనకు ఇష్టమైన భోగభాగ్యాలలో ఓలలాడుతూ ఉంటాడు. అత్యున్నత స్వర్గవనాల్లో విహరిస్తాడు. అక్కడ వారు కోరుకున్నది దొరకుతుంది. హాయిగా తినండి తాగండి ప్రపంచ జీవితంలో మీరు చేసుకున్న కర్మలకు ప్రతిఫలంగా.

ఎడమచేతితో లెక్కల పత్రం అందుకున్న వ్యక్తి ‘అయ్యో! ఈ కర్మల పత్రం నాకు ఇవ్వకుండా ఉంటే, నా లెక్క నాకు తెలియకుండా ఉంటే ఎంత బాగుండును. నాకు ప్రాపంచిక మరణమే అంతిమం అయివుంటే ఎంత బాగుండేది. నా ఆస్తిపాస్తులు నాకీ రోజు పనికి రాకుండా పోయాయే! నా అధికారమూ నన్ను రక్షించలేదే’ అని వాపోతాడు. అప్పుడు ఇలాంటి ఆజ్ఞ వస్తుంది. అతడ్ని పట్టుకుని మెడకు కంఠపాశం బిగించి నరకంలో పడవేయండి. సర్వోన్నతుడు, మహోన్నతుడైన దైవాన్ని ఇతడు విశ్వసించలేదు. నిరుపేదలకు అన్నం పెట్టడం కాని, పెట్టమని ప్రోత్సహించడం కాని చేసేవాడు కాదు. కాబట్టి ఇక్కడి అతడి దుఃఖాల్లో పాలు పంచుకునే స్నేహితుడు ఎవడూ లేడు. అతడికక్కడ గాయాల కడుగు తప్ప తినడానికి, తాగడానికి మరేమీ లేదు. దాన్ని పాపాత్ములు తప్ప మరెవ్వరూ తినరు. (అల్‌హాఖ్ఖా 18–38)

దైవాన్ని, పరలోకాన్ని, ప్రళయదినాన్ని విశ్వసించని వారికోసం ఇలాంటి అనేక హెచ్చరికలున్నాయి ఖుర్‌ఆన్‌లో. మానవుల్లో ప్రళయం పట్ల విశ్వాసం దృఢంగా నాటుకు పోతే ఇప్పుడు మనం ప్రపంచంలో చూస్తున్న అన్ని చెడులూ క్రమంగా అంతరించి పోతాయి.

✦ ✦ ✦

# 61. ప్రపంచం... పరలోకం

**ప్రపంచ జీవితంలోని ఈ వస్తు సంపద అంతా పరలోకం ముందు చాలా స్వల్పమైనది. నిజానికి ఈ ప్రపంచ జీవితం ఒక తమాషా ఆట. ఈ ఆటలో నష్టపోకుండా ఉండా లంటే పరలోక చింతనతోనే ఇక్కడి జీవితం గడపాలి అని ఇస్లాం ధర్మం బోధిస్తుంది. ముహమ్మద్ ప్రవక్త జీవితం ఆధారంగా ప్రపంచ జీవితం.. పరలోక చింతనను గురించి...**

ఒకరోజు హజ్రత్ ఉమర్ (ర) ముహమ్మద్ ప్రవక్త (స) ఇంటికి వెళ్లారు. అప్పు డాయన ఖర్జూరపు ఈనెలతో అల్లిన చాపపై పడుకుని ఉన్నారు. దానిపై మరే పడక లేదు. చాప గుర్తులు ఆయన శరీరం మీద కనపడుతున్నాయి. తల కింద ఖర్జూరపు బెరడుతో నింపిన తలగడ ఉంది. ముహమ్మద్ ప్రవక్తను ఈ స్థితిలో చూసిన ఉమర్– 'దైవ ప్రవక్తా! మీ అనుచర సమాజానికి సిరిసంపదలు ప్రసాదించమని దైవాన్ని ప్రార్థించండి. దైవం రోమన్లకు పారశీలకు పుష్కలంగా సిరిని ప్రసాదించాడు. దాని కసలు వారు అర్హులే కారు. అయినప్పటికీ దైవం వారికి ఐశ్వర్యం ప్రసాదించాడు' అన్నారు. దానికి ప్రవక్త "ఉమర్! ఏమిటి నువ్వు కూడా అలా ఆలోచిస్తున్నావు? వారు ఇహలోక జీవితంలోనే భోగభాగ్యాలు ప్రసాదించబడిన ప్రజలు. వారితో మనకు పోలికా.. వారికి ఇహలోక సౌఖ్యాలు మనకు పరలోక సౌఖ్యాలు ఉంటే నీకు సమ్మతం కాదా?" అని చిరునవ్వుతో అడిగారు.

ముహమ్మద్ ప్రవక్త ఎప్పుడూ నిరాడంబర జీవితాన్నే కోరు కున్నారు. దైవం తన ప్రవక్త కోసం మక్కా లోయను బంగారంతో నింపివేస్తానన్నప్పుడు ఆ మహానీయుడు 'ప్రభూ.. నాకు దాని అవసరంలేదు. నేను ఒకరోజు కడుపునిండా భోజనం చేస్తే మరోరోజు పస్తు ఉండాలి. ఎందుకంటే కడుపునిండా తిని నిన్ను స్తుతించడం నీకు కృతజ్ఞతలు తెలపడం! పస్తున్న రోజు ఆ అనుభూతితో నిన్ను స్మరించడం, నిన్ను దీనంగా వేడుకోవడం జరగాలి. దేవా! నాకు, నా అనుచర సమాజానికి అవసరమైన మేరకే ఉపాధినివ్వు' అని కోరుకున్నారు.

## ప్రవక్త జీవితం ఆదర్శం

అంటే, ప్రాపంచిక సంపదను పూర్తిగా త్యజించాలని కాదు. ధర్మ సంపాదనతో, ధర్మానికి లోబడి ఇహలోక సుఖాలను అనుభవించే అనుమతి ఉంది. పరలోకానికి ప్రాధాన్యత నివ్వడమంటే ప్రపంచంతో కనీస సంబంధాలు కూడా ఉండకూడదని కాదు. ముహమ్మద్ ప్రవక్త ప్రవచనం ప్రకారం మనిషి ప్రపంచంతో కనీస సంబంధం కూడా కలిగి లేకపోతే అది దైవభక్తి పరాయణత అనిపించుకోదు. పైగా ఈ వైఖరి వైరాగ్యం అవుతుంది. దైవధర్మంలో వైరాగ్య భావనకు అసలు తావేలేదు. అందుకని ప్రపంచం, పరలోక జీవితాల పట్ల తారతమ్యం, సమతౌల్యం పాటిస్తూ ధర్మసమ్మతంగా ఎంత సంపాదించినా తప్పులేదు. ఆ ధర్మసంపాదనతో దైవం హక్కులు, మానవుల హక్కులు నెరవేరుస్తూ ధర్మబద్ధ జీవితం గడిపితే ఇహలోకంలో, పరలోకంలో సాఫల్యం సిద్ధిస్తుంది.

✦ ✦ ✦

# 62. ఇహం కాదు పరమే శాశ్వతం

**ప్రాపంచిక సౌఖ్యాలకు ప్రాధాన్యం ఇస్తున్న నేటి మనిషి పరలోక చింతన లేకుండా గడుపుతున్నాడు. పరలోక చింతనే జీవితాన్ని సార్థకం చేస్తుందని పవిత్ర ఖుర్‌ఆన్ చెబుతున్నది. పరలోక చింతన ఆవశ్యకతను వివరించే వ్యాసం.**

మరణానంతరం పరలోకంలో స్వర్గ నరకాలను చూస్తాం. అక్కడి కష్టసుఖాలు పొందుతాం. దైవ్రపవక్తలు, దైవ గ్రంథాలు తెలిపిన వాస్తవాలను మనం అక్కడ వీక్షిస్తాం. అనుభవిస్తాం. ఈ ప్రపంచం, దీనిలోని ప్రతి వస్తువూ అశాశ్వతం, అసంపూర్ణమే కాకుండా నశించేది, అంతరించేదే. ఇహలోకానికి భిన్నంగా పరలోకం, అక్కడి ప్రతి వస్తువూ శాశ్వతం, అనంతం, పరిపూర్ణం. మానవుడు కూడా అక్కడికి చేరిన తరువాత శాశ్వతుడు అవుతాడు. సచ్ఛీలురైన దైవదాసులకు అక్కడ అనుగ్రహించే వరాలు కూడా శాశ్వతం, అనంతం. 'అతాఅన్ గైరమబ్‌జూజ్' అంటోంది పవిత్ర ఖుర్‌ఆన్. అంటే దైవ ప్రసాదితాలు ఎన్నటికీ అంతం కావు అని అర్థం.

## పరకలోక శిక్ష

అలాగే దుష్టులు, దుర్మార్గులకు వారి తలబిరుసుతనం కారణంగా దైవశిక్ష వారిపై పడుతుంది. వారి కష్టాలు, యాతనల పరంపర కొనసాగుతూ ఉంటుంది. అది ఎన్నటికీ అంతం కాదు. నరక వాసులను గురించి దైవగ్రంథంలో ఇలా ఉంది: 'వారు శాశ్వతంగా నరకంలోనే పడి ఉంటారు. నరకవాసులు ఎన్నటికీ ఆ నరకం నుంచి బయటికి తీయ బడరు. మరణం ద్వారానైనా శిక్షను తప్పించుకుందామంటే, నరకవాసులకు అక్కడ మరణం కూడా సంభవించదు. వారి శిక్షను తగ్గించడం కూడా జరగదు.' (పవిత్ర ఖుర్‌ఆన్)

## పరలోక ఔన్నత్యం

దైవం తన గ్రంథాల ద్వారా, తన ప్రవక్తల ద్వారా ఇహ, పర లోకాల యదార్థాన్ని ఇంత స్పష్టంగా వివరించినప్పటికీ, మానవులు దీన్ని తమాషాగానే భావిస్తారు. ఇహలోకం సజీవంగా అనుక్షణం వారి కళ్లముందే ఉంటూ, పరలోకం మాత్రం గుప్తంగా ఉండటం

వల్ల అసంఖ్యాకులు ఇహలోక కాంక్షలకే ప్రభావితమవుతున్నారు. ఇది మానవుని సహజ బలహీనత. దైవం తరపున వచ్చిన దైవప్రవక్తలంతా, మానవుల ఈ బలహీనతను దూరం చేయడానికి అహరహం కృషి చేశారు. ప్రపంచం ముందు పరలోకం స్థాయిని విడమరచి చెప్పారు. కానీ మనుషుల్లో పెద్దగా మార్పు రాలేదు. దీనిక్కారణం కళ్లముందు కనిపించే ఇహలోకానికి, పరలోకం కంటే ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వడమే.

ఈ విషయాన్నే దైవం తన గ్రంథంలో ఇలా పేర్కొన్నాడు. 'మీరు ప్రాపంచిక జీవితానికే ప్రాధాన్యం ఇస్తున్నారు. కాని పరలోకం ఎంతో శ్రేష్ఠమైనది. ఈ విషయం గతంలో ఇబ్రాహీం అలైహిస్సలాం, మూసా అలైహిస్సలాంలపై అవతరించిన గ్రంథాల్లో కూడా చెప్పబడింది.' (అల్ ఆలా 15,19)

## శాశ్వత లోకం పరలోకం

ఖుర్ఆన్‌లో ఇలా ఉంది: 'ప్రవక్తా వారికి చెప్పండి. ఈ ప్రాపంచిక సౌఖ్యాలు క్షణ భంగురం, బుద్బుధప్రాయం. దైవభక్తి పరాయణులకు పరలోక జీవితమే అత్యంత శ్రేష్టమైనది. శాశ్వతమైనది'. (నిసా 76)

మరోచోట 'ఇహలోక జీవితం ఒక క్రీడ, ఒక తమాషా మాత్రమే. పరలోక జీవితమే అసలయిన జీవితం. భయభక్తులు కలవారికి పరలోక నివాసమే శ్రేష్టమైనది'. అని ఉంది. (ఖుర్ఆన్)

మరొక చోట 'ఈ ప్రాపంచిక జీవితం మూన్నాళ్ల ముచ్చట మాత్రమే. శాశ్వత నివాసం పరలోకమే'. (మోమిన్ 38)

'అవిశ్వాస వైఖరిని అవలంబించి, తిరస్కరించిన (ద్రోహులకు) వారికి పర లోకంలో తీవ్ర నరక శిక్ష ఉంది. అయితే దైవ విశ్వాసులకు దైవ ప్రసన్నత, మన్నింపు ప్రాప్తమవుతాయి. ఈ ప్రాపంచిక జీవితం ఒక ఆట, తమాషా తప్ప మరేమీ కాదు.' (హదీద్ 20)

మొత్తానికి దైవప్రవక్తలు, దైవ గ్రంథాలు మానవుల మార్గదర్శకం కోసం, శాశ్వత పరలోక జీవితంలో వారి సాఫల్యం కోసం ఏ సూత్రాలకు ప్రాధాన్యం ఇచ్చారో, వాటిలో ఇహలోకాన్ని అవసరం మేరకు వాడుకుంటూ, సర్వం ఇహలోకమే అని కాకుండా, పరలోకాన్ని అత్యధికంగా ప్రేమించాలన్నది ప్రధాన సూత్రం. ఎందుకంటే నిజమైన సాఫల్యం పరలోక సాఫల్యమే.

✦ ✦ ✦

# ౬౩. పరలోక విశ్వాసం

పరలోక విశ్వాసం అనాది నుంచీ ఉంది. పుట్టినది మొదలు గిట్టే వరకు మనం చేసే పనులకు ఆ లోకంలో సంజాయిషీ ఇచ్చుకోవాలనే ఆలోచన మనకు జీవితంలో దిశానిర్దేశం చేస్తుంది. జన్మకు సార్థకత చేకూరుస్తుంది.

ధార్మిక విశ్వాసాల్లో పరలోక విశ్వాసానిది ప్రముఖపాత్ర. పరలోకం పట్ల విశ్వాసం లేని మనిషి దైవ విశ్వాసి కాలేడు. ఆదిమానవుడు ఆదం అలైహిస్సలాం మొదలు కొని, ముహమ్మద్ ప్రవక్త సల్లల్లాహు అలైహి వ సల్లం వరకూ ప్రభవించిన దైవ ప్రవక్తలందరూ పరలోక విశ్వాసాన్ని బోధించారు. మానవుడి పరలోక విశ్వాసం ఎంత పటిష్టంగా ఉంటే, అతడి ఇహలోక జీవితం కూడా అంతే అర్థవంతంగా, వివేక వంతంగా ఉంటుంది.

## పరలోక విశ్వాసంతో పాపభీతి

పరలోక విశ్వాసం మనిషిని బాధ్యతాయుతునిగా, జవాబుదారీతనం కలవాడుగా తయారు చేస్తే, పరలోక తిరస్కారం బాధ్యతారహితునిగా, ఎవరికీ జవాబు చెప్పుకునే అవసరం లేదనే ధిక్కారిగా తయారు చేస్తుంది. ఫలితంగా మనిషి ప్రాపంచిక వ్యామోహ పరుడిగా, మనోవాంఛల దాసుడిగా మారిపోతాడు. ఎలాంటి నైతిక కట్టుబాట్లనూ అతను అంగీకరించడు. నైతికం, అనైతికం, న్యాయం, అన్యాయం, నీతి, అవినీతి అన్నవేవీ అతను పట్టించుకోడు. ప్రతి విషయాన్ని ప్రాపంచిక ప్రయోజనాలతో ముడిపెట్టి, స్వార్థపరుడిగా, భోగలాలసుడిగా తయారవుతాడు. కళ్లెంలేని గుర్రంలా ప్రవర్తిస్తాడు. ఇదంతా కూడా పరలోకాన్ని తిరస్కరించడం వల్ల లేదా విస్మరించడం వల్ల కలిగే పర్యవసానం. దీని ఫలితంగా ఇహలోకంలో తాత్కాలిక ప్రయోజనాలు అతి స్వల్పంగా ఒనగూడినా, అంతిమంగా అతనికి వినాశనం తప్పదు. ఇక పరలోకంలోనైతే తీవ్ర పరాభవం, ఘోరమైన శిక్షలు చవిచూడవలసి ఉంటుంది.

## మూర్తీభవించే మానవత్వం

దీనికి భిన్నంగా, పరలోక విశ్వాసం మనిషిని మానవత్వం మూర్తీభవించిన మానవుడిగా తీర్చిదిద్దుతుంది. పరలోకాన్ని నమ్మేవారు, ఇహలోక జీవితం అశాశ్వతమని,

ఇక్కడ చేసే ప్రతి పనికి, పలికే ప్రతి మాటకు పరలోకంలో దైవం ముందు సమాధానం చెప్పుకోవలసి ఉందన్న భయంతో జీవితం గడుపుతారు. అందుకని మాట్లాడే ప్రతిమాటా వెనుకా ముందు ఆలోచించుకొని, ఆచితూచి మాట్లాడతారు. ఏ పని చెయ్యాలన్నా ఇది ధర్మమా, అధర్మమా? న్యాయమా, అన్యాయమా? అని ఆలోచించి మరీ ఆ పనిచేస్తారు. ఎందుకంటే మూన్నాళ్ల ముచ్చట అయిన ఈ ఇహలోక జీవితంలో బతికిన కొన్నాళ్లయినా తమ మాటల ద్వారా, చేతల ద్వారా ఇతరులను నొప్పించడం, వారి మనసులు గాయపరచడం, ఆర్థికంగా, మానసికంగా, శారీరకంగా వారిని వేధించడం చేయక, దైవం 'దైవ ప్రవక్త (సం) చూపిన మార్గంలో నడుచుకొని, శాశ్వతమైన, అనంతమైన పరలోక జీవితంలో స్వర్గ సౌఖ్యాలు అనుభవించాలని భావిస్తారు. ఎందుకంటే, ఎవరి మాటల వల్ల, చేతల వల్ల ప్రజలు మానసికంగా, శారీరకంగా గాయపడతారో, వారికి పరలోక విశ్వాసం లేదని, పరలోకంలో వారికి తీవ్రమైన శిక్షలు తప్పవని ముహమ్మద్ ప్రవక్త (సం) హెచ్చరించారు.

## జీవితానికి దిశానిర్దేశం

అసలు, పరలోకాన్ని విశ్వసించడం, విశ్వసించకపోవడం పైనే మనిషి జీవన వైఖరి ఆధారపడి ఉంటుంది. పరలోకాన్ని విశ్వసిస్తే దాని ప్రభావం అతని జీవితంలో స్పష్టంగా కనిపిస్తుంది. పరలోకాన్ని నమ్మేవాడు ఎప్పుడూ దైవానికి భయపడుతూ, బాధ్యతాయుత మైన జీవితాన్ని గడుపుతాడు. ఈ విశ్వాసం లేనివాడు తాను ఎవరికీ జవాబుదారు కానన్న అహంకారంతో బాధ్యతారహితంగా ఇష్టమొచ్చినట్లు వ్యవహరిస్తాడు. ఈ విషయాలను దృష్టిలో పెట్టుకుని ప్రతి మనిషి ఆత్మ పరిశీలన చేసుకోవాలి. మన క్రియా జీవితంలో పరలోక విశ్వాసానికి సంబంధించిన ప్రభావం ప్రతినిత్యం కనిపిస్తూ ఉండాలి. మానవ సహజ బలహీనతల కారణంగా ఏవైనా లోటుపాట్లు ఉన్నట్లయితే, వాటిని సవరించుకుంటూ పవిత్రఖుర్ఆన్ చివరి అధ్యాయాన్ని శ్రద్ధాసక్తులతో పారాయణం చేయాలి. పరలోకం పట్ల సమాజంలో సరైన అవగాహన కల్పించినట్లయితే, సకల రుగ్మతలూ దూరమై, ప్రజలు బాధ్యతాయుతులైన పౌరులుగా రూపొందుతారనడంలో సందేహం లేదు.

✦ ✦ ✦

# 64. క్షమాపణ గొప్ప గుణం

**ఎటువంటి పాపికైనా క్షమాపణ ఉంటుంది... పశ్చాత్తాపం పొందితే!!! అయితే ఏది నిజమైన పశ్చాత్తాపం..పాపాన్ని వదిలి దైవమార్గంలోకి మారిన వ్యక్తి ఎలా ఉంటాడు... అతను చివరకు పొందేది ఏమిటి.. ప్రవక్త (సఅసం) చెప్పిన కథ ఇది...**

నిరాశ ఎవ్వరికైనా శోభించే లక్షణం కాదు. అందులోనూ దైవకారుణ్యం పట్ల నిరాశ మనిషిని తిరస్కారం వైపుకు తీసుకుపోతుంది. మానవ జీవితంలో తప్పులు, పొరపాట్లు జరగడం సహజం. తప్పు తెలుసుకుని పశ్చాత్తాపం చెందడం, ఇకముందె న్నడూ అలాంటి తప్పిదాలకు పాల్పడబోనని దైవం ముందు క్షమాపణలు కోరడం వివేకవంతుల లక్షణం.

## ప్రవక్త చెప్పిన కథ

ముహమ్మద్ ప్రవక్త ప్రజలను నిరాశ వల్ల కలిగే అనర్థాలు, వినాశాల నుంచి రక్షించడానికి ఒక వింత కథను వినిపించారు. దీనివల్ల దైవాన్ని విశ్వసించిన ప్రజలు తమ జీవితంలోని ఏదో ఒక దశలో తమ పాపాలకు సిగ్గుపడి, చిత్తశుద్ధితో దేవుని ముందు సాగిలపడి క్షమాపణలు వేడుకుంటే ఆయన తప్పకుండా క్షమిస్తాడన్న గుణపాఠం లభి స్తుంది. పూర్వకాలంలో ఒక వ్యక్తి ఉండేవాడు. అతడు తొంబైతొమ్మిది హత్యలు చేశాడు. ఇకనైనా పరివర్తన చెందుదామని అతడు ఒక సాధువును ఆశ్రయించి 'అయ్యా! నేను ఇప్పటి వరకు ఎన్నో హత్యలు చేశాను. ఇప్పుడు పరివర్తన చెందుదామనుకుం టున్నాను. అయితే దేవుడు నా క్షమాపణను స్వీకరిస్తాడా?' అని అడిగాడు. దానికా సాధువు, 'లేదు, లేదు. నీ క్షమాపణ స్వీకరించడానికి ఇప్పుడు ఎలాంటి అవకాశం లేదు' అని చెప్పాడు. దీంతో ఆ వ్యక్తి నిరాశ చెంది ఆ సాధువును చంపేశాడు.

## క్షమాపణ.. ఎల్లప్పుడూ

తరువాత అతడు కొందరి సలహా మేరకు మరో ధార్మిక పండితుడి దగ్గరకు వెళ్లి తన పరిస్థితిని తెలియచేస్తూ ఇన్ని హత్యలు చేసిన నన్ను దైవం కరుణిస్తాడా? ఆయన నా క్షమాపణను స్వీకరిస్తాడా.... నా పాపాలకు నిష్కృతి ఉందా అని అడిగాడు. అప్పుడా పండితుడు 'ఎందుకు లేదు? క్షమాపణా ద్వారాలు ఎల్లవేళలా అందరికోసం తెరుచుకునే ఉన్నాయి. అయితే ఇక్కడి వాతావరణమూ, పరిసరాల ప్రభావం నీకంతగా అనుకూలంగా లేవు. కాబట్టి ధార్మిక చింతన ఎక్కువగా కలిగిన ఫలానా ఊరికి నీవు వెళ్లిపో. అక్కడి ధార్మిక ప్రజలతో కలిసి కొత్త జీవితం ప్రారంభించు. మళ్లీ ఇక్కడికొచ్చావంటే నిన్నీ వాతావరణం ప్రభావితం చేసే అవకాశం ఉంది. వెళ్లిపో' అన్నాడు.

## పశ్చాత్తాపమే ప్రధానం

మారిన మనసుతో ఆ హంతకుడు ఊరు విడిచి బయలుదేరాడు. మధ్యమార్గం లోనే అతనికి మృత్యువు ఆసన్నమైంది. అప్పుడు దైవకారుణ్య దూతలు, యాతనా దూతలూ వాదులాడుకోసాగారు. 'ఇతడు వంద హత్యలు చేసిన హంతకుడని, పశ్చాత్తాపం చెందినా ఇంకా ఒక్క పుణ్యకార్యమైనా చెయ్యలేదని యాతనా దూతలంటే 'కాదు, ఇతను అన్ని పాపాలు చేసినా పరివర్తన చెంది, దేవుని సమక్షంలో క్షమాపణ వేడుకుని మారిన మనసుతో మంచి వైపుకు వస్తున్నాడని కారుణ్యదూతలు వాదించారు. అంతలో మరో దైవదూత మానవాకారంలో అక్కడికొచ్చాడు. 'ఈ వ్యక్తి తన స్థానం నుంచి బయలుదేరి, చేరవలసిన గమ్యం వరకు ఉన్న దూరాన్ని కొలిస్తే ఇతడు చేరవలసిన గమ్యమే దగ్గరగా ఉంది. కనుక అతని ఆత్మను కారుణ్య దూతలే స్వాధీనం చేసుకోవాలి. అని ఆ దైవదూత తీర్పునిచ్చాడు. చెడుపనులు చేస్తున్నవారు, తాము ఇప్పటికే ఎన్నో చెడులు చేశామని, ఇక మంచి పనులు చేసినా ప్రయోజనం ఏముందిలే అని నిరాశ పడకూడదు. జరిగిన పొరపాట్ల పట్ల పశ్చాత్తాపం చెంది, మంచి మనసుతో మంచి పనులు చేస్తే దైవం తప్పకుండా క్షమించి కరుణిస్తాడు' అని ముహమ్మద్ ప్రవక్త(స) సెలవిచ్చారు.

✦ ✦ ✦

# 65. పశ్చాత్తాపం

**తప్పు చేయడం మానవ సహజం. అది తప్పు అని తెలిసినప్పుడు పశ్చాత్తాపపడి తీరవలసిందే. ఇస్లామీ సాంప్రదాయం పశ్చాత్తాపం చెందవలసిన పద్ధతుల్ని గురించి కూడా చర్చిస్తుంది. దీనినే 'తౌబా' అంటారు. ఇస్లాంలో తౌబాని గురించి చేసిన వర్ణనలు, ఆ పద్ధతుల గురించి..**

పశ్చాత్తాపం దైవానికి దగ్గర చేస్తుంది. దైవాన్ని విశ్వసించేవారు పొరపాటు జరిగే ప్రతిసారి పశ్చాత్తాపం చెందవలసిందే అని ధార్మికులు హెచ్చరిస్తూ ఉంటారు. మానవుడి ఈ బలహీనతను బాగా ఎరిగిన దేవుడు తన పవిత్ర గ్రంథంలో 'విశ్వాసులైన ఓ ప్రజాలారా! మీరు పూర్ణహృదయంతో దైవాన్ని క్షమాపణ వేడుకోండి. మీ దేవుడే మీ పాపాలను క్షమించి కాలువలు ప్రవహించే స్వర్గ ఉద్యానవనాల్లో మిమ్మల్ని ప్రవేశపెడతాడు' అని చెప్పాడు.

## బుద్ధిపూర్వకంగా చేయకూడదు

తప్పుచేసినవాడు, లేక తన ఆత్మకు అన్యాయం చేసుకున్నవాడు తరువాత తప్పు తెలుసుకుని క్షమాభిక్ష పెట్టమని దైవాన్ని అర్థిస్తే, అతడు దైవాన్ని క్షమించేవాడని, కరుణామయుడని తెలుసుకుంటాడు. పొరపాట్లు జరగడం తప్పులు దొర్లడం మానవ సహజం. కాని ఒక దైవవిశ్వాసి తనవల్ల అపరాధం జరిగిందని తెలిసిన మరుక్షణమే పశ్చాత్తాపం చెంది దైవాన్ని క్షమాపణ వేడుకుంటాడు. బుద్ధిపూర్వకంగా మళ్లీమళ్లీ తప్పులు చేయకుండా తప్పుల్ని సరిదిద్దుకునేవారిని దైవం మన్నిస్తాడు. దానికి కొన్ని షరతులు ఉన్నాయి. చేసిన తప్పును అంగీకరించి, సిగ్గుపడాలి. మళ్ళీమళ్లీ అలాంటి తప్పు జరగకుండా జాగ్రత్తపడాలి. ఇక ముందు ఇలాంటి తప్పులు ఎన్నడూ చేయనని స్థిరసంకల్పం చేసుకోవాలి. అలాకాకుండా చేసిన తప్పు సమర్థించుకోవడానికి సాకులు, వంకలు వెతకడం, ఒక తప్పు కప్పిపుచ్చుకునేందుకు మరో తప్పు చేయడం చేసేవారికి

పశ్చాత్తాప భాగ్యం (తౌబా) లభించదు. ఇలాంటి వారు వ్యక్తం చేసే పశ్చాత్తాపానికి విలువే ఉండదు.

## పశ్చాత్తాపం ఎలాపొందాలి?

పశ్చాత్తాపంలో రెండు రకాలున్నాయి. మొదటిది నేరుగా దైవంతో సంబంధ మున్నవి. అంటే నమాజులు నెరవేర్చాలి. రోజా ఉపవాసాలు పాటించాలి. జకాతు (ఆర్థిక దానం) చెల్లించాలి. హజ్ యాత్ర చేయాలి. ఇవన్నీ దైవం హక్కులు వీటి విషయంలో ఏదైనా తప్పులు దొర్లితే పొరపాట్లు జరిగితే దేవుడు క్షమిస్తాడు. కాని తోటి మానవులతో సంబంధమున్న నేరాలను స్వయంగా వారే క్షమించనంతవరకు దైవం కూడా క్షమించదు. అంటే తోటి ప్రజల హక్కుల్ని హరించడం, ఒకరిపై ఒకరు చాడీలు చెప్పడం, నిందలు మోపడం, అప్పు తీసుకుని ఎగ్గొట్టడం, అనాథల ఆస్తిని కబళించడం, ఒకరిని గురించి చెడుగా ప్రచారం చేయడం లాంటి తప్పులకు ఆయా వ్యక్తుల నుండి క్షమాపణ కోరుకువాలి. ఎవర్నెవర్ని ఏమేమి అన్నాడో, ఎవరెవరి అప్పులు ఎగ్గొట్టాడో, ఎవర్ని గురించైతే చెడుగా ప్రచారం చేశాడో వారి వద్దకు వెళ్లి నావల్ల ఇలాంటి తప్పు జరిగిపోయింది, క్షమించమని అడగాలి. ఇది నిజమైన పశ్చాత్తాపం. ఇస్లామీ పరిభాషలో దీన్ని 'తౌబా' అంటారు.

దైవానికి తన దాసులంటే ఎంతో ప్రేమ. దాసుడు ఎన్ని తప్పులు చేసినప్పటికీ వాటిని అంగీకరించి, సిగ్గుపడి పశ్చాత్తాపం చెందుతూ దైవం వైపుకు మరలితే ఆయన తన కరుణా కటాక్షాలతో అతణ్ని కరుణిస్తాడు. ఆయన తన సృష్టిని అమితంగా ప్రేమిస్తాడు. దైవం హక్కుల్లో ఏవైనా తప్పులు దొర్లినా ఆయన కరుణిస్తాడు గాని, తోటి మానవుల హక్కుల విషయంలో మాత్రం జాగ్రత్తగా ఉండి దైవాన్ని క్షమాపణ వేడుకుంటూ దైవభీతితో, జవాబుదారీతనంతో జీవితం గడిపితే దైవం తప్పక కరుణిస్తాడు.

✦ ✦ ✦

# ౬౬. పశ్చాత్తాపంతోనే దేవుని కరుణ

**తప్పు చేయడం మానవ సహజమే అయినా అందుకు దైవ భీతితో నిజంగా పశ్చాత్తాపం చెందాలి. దైవానికి అదే సమ్మతం. వేరే వారికి అపకారం కలిగించే తప్పులు చేసినప్పుడు, అపకా రానికి గురైన వారిని క్షమాపణ వేడాలి. అప్పుడే దేవుని కరుణ లభిస్తుంది.**

తప్పుచేయని మానవులెవరూ ఈ భూప్రపంచంపై ఉండరు. ఉదయం లేచింది మొదలు, రాత్రి పడుకునే వరకూ, తెలిసో, తెలియకో మానవుడి వల్ల తప్పులు దొర్లి పోతూనే ఉంటాయి. కానీ తప్పును గ్రహించిన తరువాత, దాన్ని సరిదిద్దుకొని, పశ్చాత్తాపం చెందే వాడే మానవోత్తముడని ముహమ్మద్ ప్రవక్త (సం)ప్రవచించారు. పశ్చాత్తాపం చెందడం అంటే, కేవలం లెంపలేసుకోవడం కాదు. చేసిన తప్పు పట్ల మనస్ఫూర్తిగా, చిత్తశుద్ధితో పశ్చాత్తాపం చెందాలి. దైవభీతితో కూడిన పశ్చాత్తాపాన్నే దైవం అంగీక రిస్తాడు. అతని తప్పులను మన్నిస్తాడు. అలా కాకుండా ఒకవైపు తప్పులు చేస్తూ, మరోవైపు పశ్చాత్తాపం చెందడం అంటే, అలాంటి పశ్చాత్తాపానికి అర్థమే లేదు. ఇది తలబిరుసు తనంతో కూడిన వైఖరే కాకుండా, దేవుని క్షమాగుణాన్ని అపహాస్యం చేయడం కూడా!

## దేవుని క్షమాపణ వేడాలి

అందుకే పశ్చాత్తాపం మూడు షరతులపై ఆధారపడి ఉందన్నారు ముహమ్మద్ ప్రవక్త (సం). ఒకటేమిటంటే, మనిషి తాను చేసింది తప్పు అని మనస్ఫూర్తిగా అంగీకరించి, సిగ్గుపడాలి. రెండు : ఆ తప్పు మళ్ళీ పునరావృతం కాకుండా, అంతటితో దాన్ని విసర్జించాలి. మూడు: మళ్ళీ ఇక ఎప్పుడూ దానిజోలికి పోనని స్థిర నిర్ణయం తీసుకోవాలి. జరిగిందేదో జరిగిపోయిందని, మళ్ళీ మళ్ళీ ఇలాంటి తప్పుచేయనని దైవం ముందు సాగిలపడి మనస్ఫూర్తిగా క్షమాపణ వేడుకుంటే దైవం మన్నిస్తాడు. అదికూడా నేరుగా దైవంతో సంబంధం కలిగి ఉన్న పాపాలను మాత్రమే ఆయన క్షమిస్తాడు. అలాకాకుండా తనలాంటి ఇతర మానవులతో సంబంధం కలిగి ఉన్న తప్పిదాలను మాత్రం స్వయంగా వారు క్షమించనంత వరకూ దైవం కూడా క్షమించడు.

## తప్పును ఒప్పుకోవాలి

మీరు మరొకరి సొమ్మును అన్యాయంగా, అక్రమంగా కాజేశారనుకోండి. లేక ఎవరినైనా అనవసరంగా దుర్భాషలాడారు. లేక నిరాధారమయిన ఆరోపణలు, నిందలు మోపారు. లేక ఎవరిపైనైనా దౌర్జన్యం జరిపారు. ఈ పాపాలన్నింటికీ, అన్యాయానికి, దౌర్జన్యానికి, నిందలకు, గురైన పీడితుల వద్దకు వెళ్లి, మనస్ఫూర్తిగా వారినుంచి క్షమాపణ వేడుకోవాలి. వారు క్షమిస్తేనే దైవం కూడా క్షమిస్తాడు. అందుకే మీతోటి మానవ సోదరుల పట్ల బాధ్యతగా మసలు కోవాలని, వారి హక్కులకు ఎలాంటి భంగం కలిగినా, దానికి మీరు దైవంముందు సమాధానం చెప్పుకోవలసి ఉంటుందని, దైవాగ్రహానికి గురికావలసి ఉంటుందని ముహమ్మద్ ప్రవక్త వారు హెచ్చరించారు. ఈ విధంగా తప్పు తెలుసుకుని, పశ్చాత్తాపం చెంది. ఇకనుండి ఎలాంటి తప్పులకు, పాపాలకు పాల్పడనని, చిత్తశుద్ధితో స్థిరనిర్ణయం తీసుకున్న వ్యక్తి యొక్క గత పాపాలను దైవం మన్నించి వేస్తాడు. ఎందుకంటే దైవం అత్యంత కరుణామయుడు.

దైవ కారుణ్యం ఎలా ఉంటుందో వివరిస్తూ దైవప్రవక్త ముహమ్మద్ (స) ఒక ఉదాహరణ చెప్పారు. ఒక స్త్రీకి పాలు తాగే చంటి పిల్లాడున్నాడు. ప్రాణం కన్నా మిన్నగా ఆమె తన కొడుకుని ప్రేమించేది. పొరపాటుగా ఎక్కడో ఆ పిల్లవాడు తప్పిపోయాడు. దీంతో ఆ తల్లి బిడ్డకోసం వెదకని ప్రదేశం లేదు. కనపడ్డ పిల్లవాణ్ణల్లా గుండెలకు హత్తుకొని పాలు పట్టేది. అంటే ఒక రకంగా కన్నకొడుకు ప్రేమలో ఆమె పిచ్చిదైపోయిందన్నమాట. అలాంటి తల్లికి ఒకవేళ కన్నకొడుకు లభిస్తే ఆ తల్లి తన కొడుకుని చేజేతులా అగ్ని గుండం లోకి విసిరి వేస్తుందా' అని తన అనుచరులను ప్రశ్నించారు. అప్పుడు వారు "దైవ ప్రవక్తా! ఆ తల్లి అలా ఎన్నటికీ చేయదు. స్వయంగా ఆమె విసిరివేయడం కాదు గదా, పిల్లాడు తనంత తాను నిప్పులో పడబోయినా కూడా, ఆమె తన ప్రాణాలకు తెగించి తన బిడ్డను కాపాడుకుంటుంది. ఒక్క క్షణకాలమైనా ఆమె వెనుకా ముందు ఆలోచించదు" అని సమాధానమిచ్చారు. అప్పుడు ప్రవక్త (సం) "ఆ తల్లికి తన బిడ్డపై ఎంత ప్రేమ ఉందో, అంతకంటే అనేక రెట్లు ఎక్కువగా దైవానికి తన దాసుల పట్లప్రేమ ఉంది" అని సెలవిచ్చారు. కాబట్టి అలాంటి దైవ ప్రేమకు నోచుకోవాలంటే, సమాజంలో సాటి మానవ సోదరుల హక్కులను గౌరవిస్తూ, పొరపాటుగానో, గ్రహపాటుగానో ఏమైనా తప్పులు దొర్లిపోతే, వాటి క్షమాపణ కోసం దైవసన్నిధిలో వినమ్రులై వేడుకుంటూ ఉండాలి.

✦ ✦ ✦

# 67. కారుణ్య గుణం

**పవిత్ర ఖుర్ఆన్ గ్రంథంలో ఇలా ఉంది... దేవుడు శిష్టవచనాన్ని దేనితో పోల్చాడో మీరు గమనించారా? ఒక మేలుజాతి వృక్షం ఉంది. దానివేళ్లు నేలలో బాగా లోతుకు దృఢంగా పాతుకు పోయాయి. దాని శాఖలు నింగిదాకా విస్తరించాయి. అనుక్షణం అది తన ప్రభువాజ్ఞతో సుమధుర ఫలాలు అందజేస్తుంది. ప్రజలు గుణపాఠం నేర్చుకునేందుకే దేవుడు ఇలాంటి ఉదాహరణలు ఇస్తున్నాడు..**

దైవం మానవాళికి చేసిన మేళ్లు అనంతమైనవి. ఆయన మనకు ప్రసాదించిన బుద్ధీజ్ఞానాలు, శక్తి సామర్థ్యాల కారణంగానే మనిషి ప్రకృతిని తనకు అనుకూలంగా మలచుకోగలుగుతున్నాడు. ఆదికాలం నుంచి నేటివరకు ఈ ప్రకృతి మనిషి ఆలోచనలకు, ఆచరణలకు ఆలవాలంగా ఉంటూ వస్తోంది. ప్రకృతిలో అడవులు, దైవం ప్రసాదించిన అమూల్య వరం. అడవులు కేవలం మానవ జీవిత అవసరాలకే కాకుండా అత్యున్నత జీవన విలువలు కూడా సమకూరుస్తాయి.

## దైవ కారుణ్యానికి తార్కాణం

దేవుని సృష్టిలో వృక్షాలకు అత్యున్నత స్థానం ఉంది. దేవుని పోషణా గుణానికి, ఉపాధి కల్పన లక్షణానికి వృక్షాలు మంచి తార్కాణాలు. పవిత్ర ఖుర్ఆన్‌లో మరోచోట ఇలా ఉంది. 'ఆయనే ఆకాశం నుంచి వర్షం కురిపించి రకరకాల మొక్కలు మొలకెత్తిస్తు న్నాడు. తిరిగి ఆ మొక్కల నుంచి పచ్చని పొలాలు, వృక్ష సంపదను పైకి తెస్తున్నాడు. వాటిద్వారా పొరలు, పొరలుగా ఒకదానిమీద ఒకటి పడి ఉండే ధాన్యపు గింజల్ని, కాయల్ని పండిస్తున్నాడు. ఈ చెట్లు పుష్పించి, పళ్లు కాసి, పండే తీరు పరికించి చూడండి. విశ్వసించే వారికి ఇందులో అనేక సూచనలున్నాయి అడవులు నిజానికి దైవం యొక్క అనంత కారుణ్యానికి ఆయన మహత్తుకు మహోన్నత తార్కాణం. మన జీవితాలకు,

అడవులకు అవినాభావ సంబంధం ఉంది. స్వర్గంలో అందమైన వృక్షాలు, మధురమైన పళ్లు, ఫలాలు ఉంటాయన్న వర్ణనలు పవిత్ర ఖుర్‌ఆన్‌లో ఉన్నాయి.

## ప్రవక్త ప్రవచనం

చెట్లు నాటడం ఓ సదఖా (ఉత్తమదానం) అని ముహమ్మద్ ప్రవక్త సెలవిచ్చారు. చెట్లను నాటడం మానవులకు, అనంతమైన ప్రయోజనాలు చేకూరుస్తుందని చెబుతూ మదీనాలోని హజ్రత్ సల్మాన్ ఫార్సీగారి తోటలో స్వయంగా ఓ చెట్టును నాటారు. కనుక మానవ మనుగడకు ఇతోధికంగా తోడ్పడుతున్న అడవులను పరిరక్షించుకోవాల్సిన అవసరం నేడు ఎంతైనా ఉంది. వృక్షాలు మనిషికి జననం నుంచి మరణం వరకు తోడునీడగా ఉంటాయని, వాటిని నాశనం చేయడమంటే, మనిషి స్వయంగా వినాశనం కొని తెచ్చుకోవడమే అని ప్రవక్త బోధించారు. ఇంకా ఆయన ఇలా అన్నారు.. 'ఎవరైతే ఓ మొక్కను నాటుతారో తరువాత అది పెరిగి పెద్దదయ్యే వరకు దాన్ని సంరక్షిస్తారో, వారు చేసిన సత్కార్యానికి ప్రతిఫలంగా దైవం స్వర్గంలో వారికోసం ఓ చెట్టును నాటుతాడు.

✦ ✦ ✦

# 68. స్నేహమే నిజమైన సంపద

**స్నేహానికి మించిన ధర్మకార్యం ప్రపంచంలో లేదు. ఇతరులను ప్రేమించని వారికి, స్నేహితులు లేనివారికి జీవితంలో ఎన్ని ఉన్నా నిరుపయోగమే అంటారు ప్రవక్త (సఅసం). స్నేహధర్మాన్ని పాటిస్తేనే ఇహం పరం ఉంటాయి.**

మానవ సమాజంలో పరస్పర ప్రేమానురాగాలు వెల్లివిరియాలంటే ప్రతి ఒక్కరూ స్నేహధర్మాన్ని నిర్వర్తించాలి. స్నేహ సౌభ్రాతృత్వాలే మంచి సమాజ నిర్మాణానికి నాంది. ఒక దైవ విశ్వాసి సంపూర్ణ ప్రేమ మూర్తి అయి ఉండాలి. ఇతరులను ప్రేమించని వారిలో మంచితనం ఉండదని, ప్రజలకు దూరంగా ఉండేవారు దౌర్భాగ్యులని ముహమ్మద్ ప్రవక్త (సం) చెప్పారు. దురదృష్టవంతులంటే సంపద లేని వారు కాదని, స్నేహితులు లేనివారే నిజమైన దురదృష్టవంతులని ఆయన ప్రవచించారు. "శరీరంలో ఒక అవయవానికి జబ్బు చేసినా, లేదా గాయమయినా మిగతా శరీర అవయవాలన్నీ ఆ బాధలో, ఆవేదనలో పాలు పంచుకుంటాయి. ఇది శరీర ధర్మం. అలాగే ప్రజలు కూడా ఒక స్నేహితుడు జబ్బు పడినా, అతనికి కష్టం వచ్చినా స్పందించాలి. అతడిని పరామర్శించాలి. అతని కష్టాలను దూరం చేయడానికి ప్రయత్నించాలి. ఇది స్నేహ ధర్మం అన్నారు ముహమ్మద్ (స). (హదీస్)

స్నేహితుడు కష్టాల్లో ఉంటే ఆదుకోవడమే కాదు, అతనిలో లోపాలు ఉంటే సంస్కరించడానికి ప్రయత్నించాలి. ఇది కూడా స్నేహధర్మంలోని భాగమే. ముహమ్మద్ (స) ఇలా ప్రవచించారు. "మీలో ప్రతి ఒక్కరూ మీ సోదరునికి దర్పణం (అద్దం) లాంటి వారు. అందుకని మీరు మీ సోదరునిలో ఏదైనా లోపాన్ని చూసినా, చెడును గమనించినా, దానిని దూరం చేయడానికి, సంస్కరించడానికి ప్రయత్నించాలి." (తిర్మిజి) అలాగే మిత్రునిలోని లోపాలను కూడా ఎలాంటి హెచ్చుతగ్గులు లేకుండా వివేకంతో, సందర్భాన్ని బట్టి మాత్రమే అతనికి తెలియజేసి సంస్కరించడానికి కృషిచేయాలి.

## దైవం కోసం స్నేహం

ఒక మిత్రుడు మరొక మిత్రుని పట్ల చిత్తశుద్ధితో, వాత్సల్యంతో, విశ్వసనీయతతో, శ్రేయోభిలాషతో, సానుభూతితో మెలగాలి. ఎవరయితే దైవం కోసం స్నేహ ధర్మాన్ని పాటిస్తారో, దైవం కోసమే ఒకర్నొకరు కలుసుకుంటారో అలాంటి వారికి ప్రళయ దినాన దైవం తన సింహాసనం ఛాయలో చోటు కల్పిస్తాడనడం నిస్సందేహం.

✦ ✦ ✦

# 69. కపటం.. దైవ ధిక్కారం

**మనలోని దుర్గుణాలు కేవలం మనకు మాత్రమే హాని చేయవు. ఇతరులపై కూడా ప్రభావం చూపుతాయి. అందుకే కపటం వంటి దుర్గుణం మహా ప్రమాదకరమైనదని ఖుర్‌ఆన్ పేర్కొంది. కపటాన్ని దైవధిక్కారంగా కూడా అభివర్ణించింది.**

విశ్వాసానికి, కాపట్యానికి మధ్య భూమ్యాకాశాలకున్నంత అంతరం ఉంది. విశ్వాసం వెలుగయితే, కాపట్యం కటిక చీకటి. విశ్వాసానికి, అవిశ్వానికి పొత్తు కుదరనట్లే, విశ్వాసానికి, కపటానికి కూడా జత కుదరదు. అలాగే అవిశ్వాసి బహిరంగంగానే తిరస్కరిస్తే కపటి మాత్రం బయటికి లౌక్యం ఒలకపోస్తూ లోలోన కుట్రలు పన్నుతుంటాడు. ఈ విధంగా అవిశ్వాసి కంటే, కపటి ఒకింత ఎక్కువ ప్రమాదకారి. ఇలాంటి గోముఖ వ్యాఘ్రాలు మనకు సమాజంలో అడుగడుగునా తారస పడుతుంటారు. పైకి తేనె పలుకులు, లోన విషపు గుళికలు.

## కపటం.. దైవ తిరస్కారం

నిజానికి కపటమనేది మానవుడు పూర్తిగా దిగజారిపోయిన ఒక హీనస్థితి. అంటే మనిషి మనస్ఫూర్తిగా, హృదయ పూర్వకంగా దైవాన్ని దైవ ధర్మాన్ని విశ్వసించకుండానే, కొన్ని కారణాల వల్ల తనను తాను విశ్వాసిగా ప్రకటించుకోవలసి వచ్చిన దుస్థితి. ముహమ్మద్ ప్రవక్త (సం) కాలంలో అబ్దుల్లా ఇబ్నె ఉబియ్యి లాంటి ప్రఖ్యాత కపటుల పరిస్థితి కూడా ఇదే. ఈ కపటం నిజానికి ఎంతో నీచమైన దైవ తిరస్కారం (కుఫ్ర్). ఇలాంటి కపటుల గురించే పవిత్ర ఖుర్‌ఆన్ ఇలా చెప్పింది. 'ఇలాంటి కపటులు తప్పని సరిగా నరకంలోని అత్యంత అధమ స్థానంలో పడవేయబడతారు. అలాగే కొన్ని దుర్గుణాలు, దురలవాట్లు ప్రత్యేకంగా కపటులకే పరిమితమై ఉంటాయి. అవి వారి ప్రత్యేక లక్షణాలు. అవి వారికి మాత్రమే పరిమితం. ఒక విశ్వాసిపై కనీసం వాటి నీడ కూడా పడడానికి వీల్లేదు.

## ఈ నాలుగు లక్షణాలుంటే..

ముహమ్మద్ ప్రవక్త (సం) ఇలా ప్రవచించారు. : 'ఎవరిలోనైతే నాలుగు లక్షణాలు గోచరిస్తాయో అతను పరమ కపటి. మరెవరిలోనైతే వాటిలోని ఒక లక్షణం ఉంటే, అతనిలో కపటంలోని ఒక గుణం ఉన్నట్లు లెక్క. అతను దాన్ని మానుకునేంత వరకూ ఆ స్థితిలోనే ఉంటాడు. ఆ నాలుగు లక్షణాలు ఇవి : అతని వద్ద ఏదైనా అమానత్ (అప్పగింత) ఉంచినపుడు అతడు దానిలో నమ్మక ద్రోహానికి పాల్పడతాడు. నోరు విప్పితే అబద్దాలు పలుకుతాడు. వాగ్దానం చేస్తే దాన్ని భంగపరుస్తాడు. ఎవరితోనైనా విభేదాలేర్పడి వాదులాటకు దిగితే అసహ్యంగా నోరుపారేసుకుంటాడు. (బుఖారి, ముస్లిం)

## నాలుగు కపటాలు

ఒక విశ్వాసికి 'కుఫ్ర్' (దైవ తిరస్కారం) 'షిర్క్' (బహుదైవారాధన) నిషేధం. ఒక విశ్వాసి కపటాలు లేకుండా పవిత్రంగా ఉండడం ఎంత తప్పని సరో అదేవిధంగా కపటుల లాంటి జీవితం, కపటపు ఆచరణల దుర్గంధం నుంచి తనను తాను సురక్షితంగా పవిత్రంగా రక్షించుకోవడం కూడా అంతే అవసరం. ముహమ్మద్ ప్రవక్త (సం) ఈ హదీసుల్లో కపట గుణాల్లో నాలుగింటిని ప్రముఖంగా ప్రస్తావించారు. 1. ఖియానత్, 2. అసత్యం, 3. వాగ్దానభంగం, 4. దుర్భాష. ఎవరిలో ఈ నాలుగు దుర్గుణాలు ఉంటాయో అతను తన పూర్తి జీవితంలో సంపూర్ణ కపటి. దైవం ఈ దుర్గుణాల నుంచి ప్రజలను రక్షించుగాక.

✦ ✦ ✦

# 70. మంచిని పెంచు... చెడును తుంచు

**కళ్లు మూసుకుని నిరంతరం దైవ చింతనలో ఉన్నంత మాత్రాన వారికి దైవకృప లభిస్తుందనుకోలేం. నీ చుట్టూ జరుగుతున్న చెడును అడ్డుకోకుండా..ఆక్షేపించకుండా ఉంటే ఆ దైవం నిన్ను క్షమించదు. భక్తితో పాటు బాధ్యతను సైతం నిర్వర్తించాలని తెలిపే వ్యాసం.**

పూర్వం ఒక ఊరిలో గొప్ప దైవ భక్తుడు ఉండేవాడు. రేయింబవళ్లు దైవ ధ్యానంలో కాలం గడుపుతూ పవిత్రమైన జీవితం గడిపేవాడు. ఆ ఊరి జనం ఎన్ని విధాల చెడు దారులు పట్టినా ఆయన మాత్రం చెడు ఛాయ కూడా తనపై పడకుండా జాగ్రత్త పడుతూ దైవ ప్రార్ధనలో లీనం అయి వుండేవాడు. రెప్పపాటు కాలం కూడా వృధా చేయక దైవారాధనే ఊపిరిగా జీవించేవాడు.

## అంతటి భక్తుడ్ని ఏం చేయగలం?

పలు విధాల చెడు మార్గాల్లో నడుస్తూ, తమ వినాశాన్ని చేజేతులా కొనితెచ్చు కుంటున్న ఆ ఊరిని నాశనం చేసేందుకు దైవం తన దూతలను పంపాడు. దైవదూతలు ఆ ఊరికి చేరుకుని చూస్తే అక్కడొక గొప్ప భక్తుడు నిరంతర దైవ ధ్యానంలో నిమగ్నమైవున్నాడు. ఊరిని నాశనం చేయడానికి వచ్చిన దైవదూతలు, ఈ ఊరిలో ఇంత గొప్ప దైవ భక్తుడున్నాడే! క్షణకాలం కూడా వృధా చేయక నిరంతరం దైవధ్యానంలో తరిస్తున్నాడే! ఈ ఊరిని ఎలా నాశనం చేసేది? అని తర్జనభర్జన పడి దైవ దూతలు వెనుతిరిగి వెళ్లి పోయారు. "దేవా! ఆ ఊరిలో ఒక గొప్ప భక్తుడున్నాడు. అతడు నిరంతరం నీ ధ్యానంలోనే తరిస్తున్నాడు. అంతటి భక్తుణ్ని మేమేనాడు చూడలేదు. అల్లాహ్! ఇలాంటి భక్తుడు వున్న ఊరిని మేమెలా నాశనం చేయగలం? అతణ్ని గురించి తమకు నివేదించు కుందామని మేము వెను తిరిగి వచ్చాము." అని విన్నవించుకున్నారు దూతలు.

## చెడును చూసి ఊరుకోవడం తప్పే

అప్పుడు అల్లాహ్... నాకు సర్వమూ తెలుసు. మీరు మళ్లీ వెళ్లి ఆ ఊరి వినాశనాన్ని

ప్రారంభించండి. ఆ శిక్ష ఆ భక్తుని నుంచే ప్రారంభం కావాలి. ఎందుకంటే చుట్టూ ఉన్న జనం అంతా చెడుల్లో కూరుకుపోయి, భ్రష్టు పట్టి పోతుంటే ఆ భక్తుడు మాత్రం తనకేమీ పట్టనట్టు ధ్యానంలో పడిపోయాడు. ప్రజల్ని చెడు నుంచి, పాపాల నుంచి కాపాడాలన్న బాధ్యతను అతడు విస్మరించాడు అని సెలవిచ్చాడు దైవం. సమాజంలో మంచిని, సత్కార్యాలను పెంపొందించి, చెడులను, దుష్కార్యాలను నిరోధించాలని ఉపదేశిస్తూ ముహమ్మద్ ప్రవక్త (సం) వారు ఈ సంఘటనను ఉదాహరించారు.

## ఉపేక్షించడం బాధ్యతారాహిత్యం

నేడు సమాజంలో అసంఖ్యాక చెడులు రాజ్యమేలుతున్నాయి. వీటిని నిర్మూలించడానికి ప్రయత్నించకుండా ఎవరికి వారు వ్యక్తిగత సత్కార్యాలకే పరిమితమై, సమాజం పట్ల తమ బాధ్యతను విస్మరిస్తే, అలాంటి సత్కార్యాలను దైవం ఎంత మాత్రం గుర్తించదు. మీరు గనుక చెడును చూస్తే చేత్తో ఆపాలని, చేత్తో ఆపే శక్తి లేకపోతే కనీసం మనసులోనైనా ఆ చెడును అసహ్యించుకోవాలని, చెడులను చూస్తున్నా మీలో రోత, అసహ్యం కలగక పోతే మీలో విశ్వాసం లేదని ముహమ్మద్ ప్రవక్త (సం) ప్రవచించారు. కనుక ఎవరికి వారు తాము ఎంతో కొంత సత్కార్యాలు చేసుకుంటున్నామని సమాజం ఎటుపోతే మాకేంటని అనుకుంటే కుదరదు. నమాజు, రోజా (ఉపవాసాలు) జకాత్, హజ్ లాంటి విధులతో పాటు అమర్ బిల్ మారూఫ్ నహీ అనిల్ మున్కర్' అంటే మంచిని పెంపొందించడం, చెడును నిరోధించడం అన్న విధిని కూడా దైవ విశ్వాసులు నెరవేర్చవలసి ఉంది.

## విశ్వాసుల కర్తవ్యం

“మానవ సమాజ సంస్కరణ కోసం ఇకపై రంగంలోకి తీసుకు రాబడిన ఉత్తమ సమాజం మీరే. మీరు మంచిని ప్రోత్సహిస్తారు. చెడును నిరోధిస్తారు. దైవాన్ని విశ్వసిస్తారు.” అంటున్నాడు దైవం పవిత్ర ఖుర్ఆన్‌లో. కనుక ఏ ఉద్దేశంతో ఈ ఉత్తమ సమాజాన్ని ఉనికిలోకి తేవడం జరిగిందో, ఆ ఉద్దేశాన్ని నెరవేరుస్తూ సమాజంలో మంచిని పెంపొందించడానికి, చెడును రూపుమాపడానికి ప్రయత్నిండం దైవ విశ్వాసుల, ఉత్తమ మానవుల ప్రథమ కర్తవ్యం.

✦ ✦ ✦

# 71. చెడును చెరిపే మార్గం

**చెడును నిర్మూలించడం సమాజంలో ప్రతి ఒక్కరి బాధ్యత అని ముహమ్మద్ ప్రవక్త సెలవిచ్చారు. చెడును అడ్డుకునేందుకు ఆయన మూడు మార్గాలను సూచించారు. ఆ మార్గాలలో చెడును అడ్డు కుంటే మంచిని పెంపొందించినట్టే అని తెలిపే వ్యాసం.**

ఈనాడు మన సమాజంలో అసంఖ్యాకమైన చెడులు ప్రబలిపోతున్నాయి. వాటిని నిర్మూలించవలసిన బాధ్యత సంఘ శ్రేయోభిలాషులందరిపైనా ఉంది. అయితే దైవాన్ని విశ్వసించే వారిపై ఈ బాధ్యత ఒకింత ఎక్కువగా ఉంది. కానీ చాలా మంది ఈ గురుతర మైన బాధ్యత పట్ల ఏమరుపాటు వహిస్తూ 'మనకెందుకులే' అనే ధోరణి అవలంబిస్తు న్నారు. అదీ.. ఇదీ అనే తేడా లేకుండా, మానవ జీవితంలోని సమస్త విభాగాలూ ఈ చెడులకు ప్రభావితమవుతున్నాయి. ఫలితంగా మానవ సమాజం తీవ్రమైన అశాంతికి, అభద్రతకు, భయాందోళనలకు లోనవుతోంది. మానవ జీవితం దుర్లభమై పోతోంది. ఈ చెడుల కారణంగా వ్యక్తిలో, కుటుంబంలో, సమాజంలో శాంతి భద్రతలు, ప్రేమాను రాగాలు కరువై, అశాంతి, ఈర్ష్యా ద్వేషాలు చోటుచేసుకుంటున్నాయి.

## చెడుకు దూరం సుమా!

మానవ సమాజం ఈ రుగ్మతల నుంచి సురక్షితంగా, సుభిక్షంగా ఉండాలంటే దైవం, దైవ ప్రవక్తల హితోపదేశాల వైపు దృష్టిసారించవలసిన అవసరం ఉంది. దైవోప దేశం పవిత్ర ఖుర్ఆన్‌లో ఇలా ఉంది. ప్రజల్ని మంచి వైపుకు పిలిచేవారు, సత్కార్యాలు చెయ్యమని ఆజ్ఞాపించేవారు, చెడుపనుల నుంచి వారించేవారు కొందరు తప్పకుండా ఉండాలి. అలాంటి వారు మాత్రమే ఇహపరలోకాల్లో సాఫల్యం పొందేవారు (ఆలిమ్రాన్ 104) ఒక ప్రవచనంలో ముహమ్మద్ ప్రవక్త (సం) ఇలా ఉపదేశించారు. 'సమాజంలో ఏదైనా చెడుపని జరుగుతున్నట్లు మీరు గమనిస్తే ఆ చెడును చేత్తో ఆపడానికి ప్రయత్నిం చాలి. అంతటి శక్తి లేకపోతే, ఆ చెడుకు వ్యతిరేకంగా గళం విప్పి దాన్ని నిరోధించడానికి ప్రయత్నించాలి. చెడుకు వ్యతిరేకంగా నోరు విప్పే పరిస్థితులు కూడా లేకపోతే, మనసు

లోనైనా ఆ చెడుపట్ల రోత, అసహ్యం కలగాలి., ఆచెడు సమసిపోతే బాగుండునన్న బలమైన కాంక్ష మనసులో వ్యక్తమవ్వాలి. ఇది విశ్వాసంలోని అత్యల్ప స్థాయి విశ్వాసం.' (నసాయి)

## నిర్మూలనకు మూడు సూత్రాలు

ముహమ్మద్ ప్రవక్త (సం) ఈ ప్రవచనంలో ప్రతి చెడు, ప్రతి దుర్మార్గాన్ని నిరోధించ డానికి, దాన్ని మార్చడానికి సాధ్యమైనంత మేర శక్తి వంచన లేకుండా కృషి చేయాలని బహిరంగ ఆదేశం ఇచ్చారు. దీనికి సంబంధించి మూడు దశలను ప్రస్తావించారు. 1. బలమూ, అధికారమూ ఉండి దాని ద్వారా ఆ చెడును ఆపగలిగితే బలప్రయోగంతో, అధికారంతో దాన్ని నిరోధించాలి. 2. ఒకవేళ బలాధికారాలు మన చేతుల్లో లేకపోయి నట్లయితే, నోటి ద్వారానైనా, ప్రచార సాధనాల ద్వారానైనా, పరస్పర చర్చల ద్వారానైనా, మంచి మాటల ద్వారానైనా దాన్ని నిరోధించడానికి సంస్కరించడానికి ప్రయత్నించాలి. 3. పరిస్థితులు దీనికి అనుకూలించకపోతే, చెడుకు వ్యతిరేకంగా మాట్లాడటానికి కూడా అవకాశం లేకపోతే, కనీసం ఆ చెడును మనసులోనైనా చెడుగా భావించాలి. ఇది విశ్వాసానికి చివరి దశ. ఆ చెడును రూపుమాపాలన్న బలమైన కోరిక మనసులో పుట్టాలి. ఫలితంగా మనసు ఆ చెడు రూపుమాసిపోవాలని దైవాన్ని ప్రార్థిస్తూ అయినా ఉంటుంది.

## మంచికి దైవం చేరువ

మానవ సమాజంలో మంచిని విస్తరింప చేయడం, చెడులను నామరూపాల్లేకుండా చేయడమనే గురుతరమైన బాధ్యతను విస్మరించడం ధార్మికంగానే కాకుండా, నైతికంగా కూడా నేరం అవుతుంది. దీని పర్యవసానం ఇహలోకంలో, పరలోకంలో రెండు చోట్లా అనుభవించవలసి ఉంటుందని మరువరాదు. ఈ విషయమై ముహమ్మద్ ప్రవక్త (సం) మరో ప్రవచనంలో ఇలా హెచ్చరించారు. 'ఎవరి అధీనంలో నా ప్రాణముందో ఆ దైవం సాక్షిగా చెబుతున్నాను. మీరు తప్పకుండా మంచి పనులను గురించి ఆదేశిస్తూ ఉండండి. చెడుల నుంచి ప్రజల్ని వారిస్తూ ఉండండి. మీరు గనక ఇలా చేయకపోతే దైవం తన శిక్షను అవతరింపజేసే అవకాశం ఉంది. అప్పుడు మీరు ఆయన్ని ఎంతగా వేడుకున్నా, ఆయనతో ఎంతగా మొరపెట్టుకున్నా ఏమీ ప్రయోజనం ఉండదు. దైవం మీ వేడుకోలును ఆలకించడు. స్వీకరించడు' (హదీస్). దైవం మానవ సమాజాన్ని అన్ని రకాల చెడుల నుంచి కాపాడాలని కోరుకుందాం.

✦ ✦ ✦

# 72. సహనంతో దైవకృప

**సహనం దైవిక లక్షణం. సహనంలేని మనిషి సవాలక్ష సమస్య లతో సతమత మవుతాడు, ఆగ్రహం మానవుడి ఆగర్భ శత్రువు. ఆగ్రహానికి లోనైన మనిషి శరీరంపై, ఆత్మపై అదుపు కోల్పో తాడు, సహనభావం, సహనశీలం, సహన ఫలం గురించి పవిత్ర ఖుర్ఆన్ ఇలా అంటోంది.**

సహనాన్ని అరబిక్ భాషలో సబ్ర్ అంటారు. ఈ పదంలో చాలా విస్తృతమైన భావం ఇమిడి ఉంది. 'సబ్ర్' అంటే మనిషి ఆగ్రహానికి ఆవేశకావేషాలకు, తొందరపాటుకు స్వస్తి పలకడం. తన భావోద్రేకాలను, మనో వాంఛలను అదుపులో పెట్టుకోవడం. భయ, ప్రలోభ, ప్రమాదాలు ఎదురైనప్పుడు సహన స్థయిర్యాలు కనబరచడం. ఆగ్రహం, ఆవేశం కట్టలు తెంచుకున్నప్పుడు, ఉద్రేకం తారాస్థాయికి చేరిన సమయాల్లో విచక్షణ కోల్పోయి తప్పుడు నిర్ణయాలు తీసుకోకుండా విజ్ఞతను ప్రదర్శించడం కూడా సహనమే. ఏదైనా ఒక లక్ష్యాన్ని సాధించాలనుకున్నప్పుడు ఉత్సాహంతో తొందర పడకుండా నిదానించి నిర్ణయం తీసుకోవడం సహనం.

## దైవవాణి

పవిత్ర ఖుర్ఆన్ గ్రంథంలో సహనం గురించి అనేక ప్రవచనాలు ఉన్నాయి. 'సహనం ద్వారా, నమాజ్ ద్వారా దైవ సహాయాన్ని అర్థించండి. దైవం సహనం వహించే వారి వెంట ఉంటాడు. ఓ ప్రవక్తా! సహనం వహించు నిస్సందేహంగా దేవుని వాగ్దానం సత్యమైనది. 'సహనం వహించండి. సహనం వహించి, భయభక్తులతో మెలిగే వారికి తమ ప్రభువు వద్ద గొప్ప ఫలం ఉంటుంది. పవిత్ర ఖుర్ఆన్ గ్రంథంలో 'సబ్ర్' (సహనం) అనే పదం కనిపించే ప్రతిచోట గమనించినట్లయితే ఈ పదంలో ఎంతో విశాలమైన, విస్తృతమయిన భావం కనిపిస్తుంది. ఖుర్ఆన్ చెప్పిన విషయాలను దృష్టిలో ఉంచుకుని మనిషి ఏవిధమైన మనోకాంక్షలకు, కవ్వింపు చర్యలకు తప్పుడు కార్యాలకు పాల్పడకుండా సాత్విక జీవనం గడిపినట్లయితే అది గొప్ప సహన కార్యమనిపించుకుంటుంది.

## ప్రవక్త సందేశం

ఒక మనిషి మరో మనిషిని అకారణంగా దూషిస్తున్నాడనుకోండి. తిట్లు తినే మనిషి తిరిగి తానూ తిట్టగలడు. మాటకు మాటా అనగలడు. అయినా సహనం వహించి నట్లయితే, ఉద్రిక్తత పెరిగి ఘర్షణకు దారితీసే ప్రమాదం నివారించిన వాడవుతాడు. అందుకు అతడికి దైవం దగ్గర గొప్ప ప్రతిఫలం దొరుకుతుంది. సమాజ ప్రశంసలూ అతనికే దక్కుతాయి. అందుకే ముహమ్మద్ ప్రవక్త ఇలా అన్నారు. కుస్తీలో ప్రత్యర్థిని చిత్తు చేసేవాడు బలవంతుడుకాదు. ఆగ్రహం కలిగినప్పుడు సహనం వహించేవాడే నిజమైన శూరుడు.

✦ ✦ ✦

# 73. అమూల్య సుగుణాలు

ఈభూమిపై శ్వాసించే ప్రతి మనిషీ తాను ఉన్నత స్థాయిలో ఉండాలని, సుఖ సంతోషాలు నిండిన జీవితం తనకు దక్కాలని సిరి సంపదలతో పాటు, అందచందాలు కూడా తన సొంతం కావాలని కోరుకుంటాడు. ఈ కోరికల పరిపూర్తికి ధర్మసమ్మతమైన మార్గాల్లో ప్రయత్నించడం తప్పుకాదు. అయితే తాను ఆశించిన సుఖసంతోషాలు, ఐశ్వర్య సౌందర్యాలు తనకు దక్కకుండా మరొకరికి ప్రాప్తమైనప్పుడు, ఇతరులపై ఈర్ష్య చెందడం, వారి పట్ల అసూయను పెంచుకోవడం ధర్మసమ్మతం కాదు..

## అంతం చేసే అసూయ

మనకు లేనిది ఇతరులకు ఉంటే మనిషి ఈర్ష్య చెందుతాడు. ఈదుర్గుణాన్ని దూరం చేయడానికి ముహమ్మద్ ప్రవక్త (సం), "ధన సంపదల విషయంలో మీరు మీకంటే గొప్పవారిని చూడకండి, ఒకవేళ అలా చూసినట్లయితే, మీ మనసులో వారి పట్ల అసూయ, జనించే అవకాశం ఉంటుంది, కావున మీరు మీకంటే తక్కువ స్థాయి కలవారిపై దృష్టి సారించండి, దీనివల్ల మీకు వారి పట్ల అసూయకు బదులు సహన గుణం, కృతజ్ఞత భావం జనిస్తుంది"అని ఉపదేశించారు. (బుఖారి, ముస్లిం)

## సద్గుణాలు రెండు

ముహమ్మద్ ప్రవక్త (స) ఇంకా ఇలా సెలవిచ్చారు, "ఏ వ్యక్తిలోనైతే రెండు సుగుణాలు ఉంటాయో దైవం అతని పేరును కృతజ్ఞులు, సహనవంతుల జాబితాలో రాస్తాడు, ఆ రెండు గుణాలు ఏమిటంటే? ఎవరైతే ధార్మిక, నైతిక విషయాల్లో తన దృష్టిని తనకంటే ఉత్తములు, ఉన్నతులైన వారిపై ఉంచుతాడో వారిని విధేయిస్తాడో, ప్రాపంచిక విషయాల్లో తనకంటే తక్కువ స్థాయి కలిగిన పేదసాదలు, దీనజనులపై పెట్టి, దైవం కేవలం తన కృపాకటాక్షాల వల్ల మాత్రమే వీరికంటే ఎక్కువ ఇహలోక వరాలను తనకు ప్రసాదించాడని భావిస్తాడో, అలాంటి వ్యక్తి దైవం దగ్గర కృతజ్ఞులు, సహనవంతుల్లో పరిగణించబడతాడు. మరెవరైతే ధార్మిక విషయాల్లో తనకంటే తక్కువ స్థాయి వారిని చూసి ప్రాపంచిక పరంగా తనకంటే ఉన్నతులపై దృష్టి పెట్టి తనకు లభించని ఇహలోక వరాల

పట్ల విచారిస్తూ బాధపడతాడో, అలాంటి వాడు దైవం దగ్గర కృతజ్ఞతలు , సహనవంతుల జాబితాలో రాయబడడు. (తిర్మిజి)

## ఆత్మ సంతృప్తి

'సహనం, కృతజ్ఞత', విశ్వాసానికి, దైవంతో సంబంధానికి చెందిన అమూల్యమైన రెండు సుగుణాలు, ఏమనిషిలో ఈ రెండు సుగుణాలు మిళితమై ఉంటాయో, అతనికి పతాకస్థాయి విశ్వాస భాగ్యం లభించి, సంపూర్ణ ధార్మిక సంపద లభించినట్లే; కావున ఒక మంచి మనిషి దృష్టి ఎప్పుడూ విశ్వాసం, నైతికత సదాచరణ లాంటి సుగుణాల్లో తనకంటే మెరుగ్గా ఉన్నవారిపై ఉండి, వారినే అనుకరించాలి.

✦ ✦ ✦

# 74. సహనంతో అల్లాహ్ సాంగత్యం

**దైవ విశ్వాసికి ఉండవలసిన లక్షణాల్లో సహనం చాలాప్రధానమైనది. సహన వంతులను అల్లాహ్ అమితంగా ప్రేమిస్తాడు. సహనానికి ప్రతిఫలంగా వారికి లెక్కలేనంత ప్రతిఫలం బహూకరిస్తాడు.**

సహనవంతులతో అల్లాహ్ మైత్రీ చేస్తాడు. వారికి స్వర్గం అనుగ్రహిస్తాడని పవిత్ర ఖుర్ఆన్‌లో ఉంది. పవిత్ర ఖుర్ఆన్ సహనానికి ఇంతటి ప్రాముఖ్యత ఇవ్వబట్టే, ముహమ్మద్ ప్రవక్త (సం) 'సహనం కంటే మంచిది, గొప్పది, ప్రయోజకరమైనది, అయిన ఏ వస్తువు ఎవరికీ ప్రసాదించబడలేదు' అని ఓ సందర్భంలో ప్రవచించారు.

## నిగ్రహం.. ప్రశాంత చిత్తం

అరబ్బీ భాషలో సహనాన్ని 'స్రబ్' అని అంటారు. ఈ 'స్రబ్' అన్న పదానికి చాలా విస్తృతమైన అర్థం ఉంది. మనిషి తన భావోద్రేకాలను, మనోవాంఛలను అదుపులో పెట్టుకోవడం, ఆగ్రహావేశాలకు లోనైన సమయంలో నిగ్రహం పాటించడం, భయం, ప్రలోభం ఎదురైనప్పుడు ఏ మాత్రం తొణకక స్థిరత్వాన్ని ప్రదర్శించడం, ఎన్ని ఆపదల పర్వతాలు విరుచుకుపడ్డా మేరుపర్వతంలా నిలకడను కలిగి ఉండడం... ఇవన్నీ సహనం కోవలోకే వస్తాయి. ఆవేశకావేశాలు మనిషిని చుట్టుముట్టినప్పుడు, వాటిని అణిచి పెట్టడం, ఉద్రేక సమయాల్లో తప్పటడుగులు వేయకుండా, తప్పుడు నిర్ణయాలు తీసుకోకుండా ఉండగలగడం కూడా సహనమే. ప్రశాంతంగా ఆలోచించి తీసుకున్న నిర్ణయాలను సమర్ధవంతంగా అమలు చేయగలగడం కూడా సహనమే.

## నిజమైన సహనం

పవిత్ర ఖుర్ఆన్‌లో ఎక్కడెక్కడ 'స్రబ్' అన్న పదం వాడబడిందో గమనిస్తే అందులో ఎంతటి విస్తృతార్థం ఉందో మనకు దోహదపడుతుంది. ఉదాహరణకు ఒక మనిషి మనల్ని బాధపెడుతున్నాడనుకుందాం... లేక మనపై తప్పుడు ఆరోపణలు, నిందలు వేస్తున్నాడని

భావిద్దాం. నిరాధారంగా మానసిక క్షోభకు గురిచేస్తున్నాడనుకోండి, తిరిగి మళ్లీ మనం అతడి బండారం బయట పెట్టి ప్రజల్లో అతడి నిజ స్వరూపాన్ని ఆవిష్కరించి అతడిని నవ్వులపాలు చేయగల శక్తి మనకు ఉండి కూడా, మనం అతడి దౌర్జన్యాలను సహిస్తే అది అత్యున్నత స్థాయి 'సహనం' అనిపించుకుంటుంది. ఇలాంటి సహనానికి తప్పకుండా అత్యున్నతస్థాయి ప్రతిఫలమే లభిస్తుంది. అతికొద్ది సమయంలో నిజానిజాలు ప్రజలకు తెలిసిపోతాయి. ఇలాంటి సహనవంతులకు ఇహలోకంలో గౌరవ మర్యాదలు, పరలోకంలో స్వర్గప్రాప్తి లభిస్తుంది.

## ప్రతిఫలం తథ్యం

ఒక్కోసారి ఫలానా మనిషి నిన్ను అవమానంపాలు చేస్తున్నాడు. నిన్ను కష్టాలకు గురి చేస్తున్నాడు. కాబట్టి నువ్వు కూడా అతడిపట్ల అలాగే ప్రవర్తించు అని అంతరంగం పోరు పెడుతూ ఉంటుంది. కాని అలా చేస్తే దైవానుగ్రహానికి దూరమవుతామేమోనని భావించి సహనం వహిస్తే, అలాంటి బాధను భరించగలిగినందుకు తప్పకుండా తగిన ప్రతిఫలం లభించి తీరాలి. లభిస్తుంది కూడా. కాబట్టి సర్వకాల సర్వావస్థల్లో, కీడు చేసిన వారికి కీడే చెయ్యమని మనసు చెప్పే మాట వినక, దాన్ని భరిస్తూ మేలు చేసే గుణాన్ని అలవరుచుకోవడం, సహనాన్ని వీడకపోవడం విశ్వాసుల లక్షణం.

✦ ✦ ✦

# 75. దైవభక్తికి చిహ్నం

**నిర్మలంగా లేని మనసుతో ఎన్నిసార్లు దైవప్రార్థన చేసినా ఏమీలాభం ఉండదు. స్వచ్ఛమైన మనస్సుతో చేసిన చిన్న మంచిపని కూడా ఆ వ్యక్తిని శాశ్వతంగా స్వర్గవాసిని చేస్తుంది. ప్రతిదినం నమాజ్ చేసినా, నఫిల్, రోజాలు పాటించినా సత్ప్రవర్తన లేకపోతే నరకానికి పోవలసిందేనని ముహమ్మద్ ప్రవక్త చెప్పారు. నిజమైన దైవభక్తిని చెప్పిన ఇస్లామీ కథలు..**

ఓ రోజు హజ్రత్ ఉమర్(రజి) వద్దకు ఓ మనిషి వచ్చి ఫలానా మనిషి చాలా మంచివాడు. గొప్ప దైవభీతిపరుడు అంటూ ప్రశంసించాడు. అతని మాటలు విన్న హజ్రత్ ఉమర్ అయితే నీకు, అతనికి మధ్య ఎప్పుడైనా ఏదైనా వ్యవహారం నడిచిందా? అని ప్రశ్నించారు. అందుకు అతను లేదని చెప్పాడు. 'పోనీ ఏదైనా ప్రయాణంలో మీరిద్దరూ కలిసి ప్రయాణించారా?' అని మళ్లీ ప్రశ్నించారాయన. దానిక్కూడా లేదనే సమాధానం ఇచ్చాడా వ్యక్తి. 'మరి నువ్వు నీకు తెలియని విషయాల గురించి ఎందుకు మాట్లాడు తున్నావు?' అన్నారు హజ్రత్ ఉమర్.

## విశ్వాసానికి సేవలు భాష్యం

బాహ్యావేషధారణ, నమాజ్, రోజాలు అధికంగా చేసేవారిని చూసి వారు చాలా మంచివారని, నీతివంతులని, శీలవంతులని అనుకోలేం. కొంతమంది ఎప్పుడు చూసినా దైవభక్తిలో లీనమై ఉంటారు. కానీ తోటి మానవుల పట్ల వారి ప్రవర్తన, వ్యవహారశైలి ఏమంత సంతృప్తికరంగా ఉండదు. మరికొంతమంది పూర్తిగా దైవభక్తిలోనే మునిగిపోయి సంప్రదాయ దుస్తుల్లో ఎంతో గొప్ప దైవభక్తులుగా కనిపిస్తారు. కానీ ప్రపంచ వ్యవహారాల్లో వారంతా పెద్ద మోసగాళ్లుగా, వంచకులుగా బయటపడతారు. 'ధర్మంవేరు, ప్రపంచం వేరు' అన్న తప్పుడు భావనే వారి ప్రవర్తనకు మూలకారణం. ఇస్లామీ ధర్మశాస్త్రం తోటి మానవుల పట్ల సత్ప్రవర్తన లేకపోతే వారి ఆరాధనలన్నీ బూడిదలో పోసిన పన్నీరే అని

హెచ్చరిస్తోంది. మీరు కడుపునిండా తిని, పొరుగు వారు పస్తుపడుకుంటే మీలో రవ్వంత కూడా విశ్వాసం లేదని అర్థం అన్నారు ముహమ్మద్ ప్రవక్త (స).

## స్వర్గనివాసి.. నరక నివాసి

ఓ సారి ఓ వ్యక్తి ప్రవక్త వద్దకు వచ్చి, ఫలానా స్త్రీ చాలా భక్తిపరురాలు, ఎన్నెన్నో నఫిల్ నమాజులు, రోజాలు చేస్తుంది. దైవభక్తిలో ఆమె ఎంతో ప్రసిద్ధిగాంచింది. కానీ తన నోటిద్వారా పొరుగువారిని బాధపెడుతుంది. అని చెప్పాడు. అయితే ఆమె నరకానికే పోతుంది అని ప్రవక్త చెప్పారు. మళ్లీ ఆ వ్యక్తి 'ప్రవక్తా! మరో స్త్రీ చాలా అరుదుగా నమాజులు చేస్తుంది. రోజాలు కూడా అరుదుగానే పాటిస్తుంది. అప్పుడప్పుడు కొన్ని జున్నుముక్కలు మాత్రమే దానం చేస్తుంది. అయితే ఆమె ఏనాడూ ఎవరినీ పొరపాటుగా కూడా ఒక్కమాట అనదు. ఎవరి మనసు నొప్పించదు. ఇరుగుపొరుగువారు ఆమెపట్ల సంతోషంగా ఉన్నారు' అన్నాడు. 'ఆమె స్వర్గనివాసి' అని చెప్పారు ప్రవక్త. తోటిమానవుల పట్ల సానుభూతి, సత్ప్రవర్తనలే దైవభక్తికి, నైతికతకు, దైవప్రసన్నతకు, పరలోక సాఫల్యానికి ఉపయోగపడతాయి.

✦ ✦ ✦

# 76. కరుణ ఉంటేనే దైవానుగ్రహం

**ప్రేమ, దయ, కరుణ నిండిన హృదయం దైవానికి ఎంతో ప్రీతిపాత్రం, సాటి మనుషులపట్ల మాత్రమే కాదు.. సకల జీవరాశి పట్ల కూడా కరుణ కలిగి ఉన్నవారే సుఖశాంతులతో ఉండడంతో పాటు దైవానుగ్రహం పొందు తారని తెలిపే గాథ.**

దైవం అత్యంత కరుణామయుడు. కారుణ్యం ఆయన ప్రత్యేక గుణం. రహ్మాన్, రహీం అన్న ఆయన పేర్లే ఆయన ప్రత్యేక గుణ విశిష్టతను తెలుపుతున్నాయి. ఏ మనిషి హృదయంలోనైతే ఈ కారుణ్య గుణం ఉంటుందో అతను దైవ ప్రీతికి పాత్రుడవుతాడు. సృష్టిలో సమస్త జీవరాసుల పట్ల జాలి, దయ, కరుణ కలిగి వుండాలని, ముఖ్యంగా నోరు లేని జీవాల పట్ల దైవానికి భయపడుతూ ఉండాలని కారుణ్యమూర్తి ముహమ్మద్ ప్రవక్త (సల్లం) ఉపదేశించారు. హ్రజత్ అబూహురైరా ఉల్లేఖనం ప్రకారం ముహమ్మద్ ప్రవక్త ఒక సంఘటన వివరించారు.

## కరుణామూర్తి

ఒక వ్యక్తి మండు వేసవిలో ఎటో వెళుతున్నప్పుడు మార్గమధ్యంలో అతనికి తీవ్రమైన దాహం వేసింది. గొంతెండుకు పోయి నాలుక పిడచకట్టుకు పోతున్న సమయంలో అతనికో బావి కనిపించింది. కాని నీళ్లు తోడడానికి తాడు బకెట్టు లాంటి సాధనమేదీ లేదు. గొంతు తడపక పోతే ప్రాణం పోయే పరిస్థితిలో అతడు బావిలోకి దిగి దాహం తీర్చుకుని పైకెక్కి వచ్చేశాడు. పైకి రాగానే తీవ్రమైన దాహంతో నాలుక బయటకు చాచి, వగరుస్తూ, మధ్యమధ్యలో బురద నాకుతూ కనిపించిందో కుక్క అతనికి. ఆ కుక్క పరిస్థితి చూసి అతనికి జాలి కలిగింది. అది కూడా తనకు లాగానే దాహంతో బాధపడుతోందని అతనికి అర్థమైంది. వెంటనే అతను మళ్లీ బావిలోనికి దిగి తన కాలి మేజోళ్లను నీళ్లలో తడిపి వాటిని నోట కరచుకుని పైకొచ్చి ఆ కుక్కకు తాగించాడు.

## కరుణ ఉంటేనే దేవుని కృప

మండు వేసవిలో, ప్రయాణంలో ఉన్న మనిషి అదే దాహంతో నాలుక పిడచకట్టుకు పోతున్న స్థితిలో ఎంతో కష్టం మీద బావిలో దిగి, ఎక్కి, గమ్యానికి చేరుకోవాలని, విశ్రాంతి తీసుకోవాలని భావిస్తాడు. కాని దాహంతో అల్లాడుతున్న కుక్క కోసం సాహసించి బావిలోకి మళ్ళీ దిగి కాలి మేజోళ్లు తడుపుకుని, వాటిని నోట కరుచుకుని కుక్క దాహం తీర్చాలంటే ఆ హృదయంలో జాలి, దయ, సానుభూతి వుండాలి. ఆ కారుణ్య హృదయాన్నే దైవం చూస్తాడు. ఈ హదీసులో కూడా దైవం ఆ వ్యక్తి హృదయంలోని దయను, కరుణను చూసి అతని కార్యానికి ముగ్ధుడై అతన్ని క్షమించి వేశాడు.

## సుగుణాలతో జన్మ సార్ధకం

అందుకని ప్రతి మనిషి తన హృదయంలో దయ, జాలి, కరుణ, సానుభూతి అన్న సుగుణాలను జనింపచేసుకుంటే, మనుషుల కాకుండా జంతువులు, పశు పక్ష్యాదుల పట్ల కూడా ఈ సుగుణాలు చూపేవాడుగా మనిషి తయారౌతాడు. మానవుడి మనసులో కాఠిన్యమన్నది రాక్షసగుణం. ఎవరి మనసులోనైతే కాఠిన్యం ఉంటుందో, రూపంలో అతడు మానవుడైనా గుణంలో రాక్షసుడే. కాబట్టి మనిషి మానవత్వమున్న మానవుడిగా రూపొందాలంటే, ప్రతి మనిషి తన హృదయంలో దయ, జాలి, కరుణ, సానుభూతి లాంటి సుగుణాలను పెంపొందించుకోవాల్సిన అవసరం ఉంది.

✦ ✦ ✦

# 77. ఇన్షా అల్లాహ్.. దైవ కృప

**అంతా నా చేతిలోనే ఉంది... నేను ఏమైనా చేయగలను అను కోవడం పొరపాటే అవుతుంది. ముహమ్మద్ ప్రవక్త (సఅసం) అలా మాట్లాడేముందు 'ఇన్షా అల్లాహ్' దైవం తలిస్తే అనమని ఉపదేశించారు. అంటే దైవ సహాయం ఉంటే నేను ఈ పని తప్పకుండా చేయగలుగుతాను అనుకో వడమే. ఇన్షా అల్లాహ్ అనే మాట గొప్పతనాన్ని గురించి ఖుర్ఆన్ కథనం...**

ఓ రైతు తన చేలో గోధుమ పంట వేశాడు. చేను ఏపుగా పెరిగి కోతకి వచ్చింది. ఆ చేనులో ఒక పక్షి గూడు కట్టుకుని పిల్లల్ని పొదిగింది. తల్లి పక్షి పొద్దస్తమానం ఆహారాన్వేషణలో బయటికి వెళ్లి సాయంత్రానికి గూటికి చేరేది. తల్లి రాగానే పిల్లలన్నీ దాని రెక్కల కిందికి దూరి ఉదయం నుంచి సాయంత్రం వరకు జరిగిన విషయాలన్నీ దానికి చెప్పేవి. ఒకరోజు రైతు పొలం వద్దకు వచ్చి చేను కోతకొచ్చేసింది, రేపు కోసేయాలి అనుకుంటూ వెళ్లిపోయాడు. ఈ మాటలు విన్న పక్షి పిల్లలకు భయం వేసింది. రైతు చేను కోస్తే తమ గూడు చెదిరిపోతుంది. ఏ గద్దలో రాబందులో తమను తన్నుకుపోతాయన్న భయం పట్టుకుంది. రాత్రి తల్లిరాగానే ఈ విషయం చెప్పి మనం ఈ రాత్రికి రాత్రే ఎటన్నా ఎగిరిపోవాలి. లేకపోతే రేపొద్దున్నే రైతు చేను కోసేస్తాడు అని చెప్పాయి.

## మానవ ప్రయత్నం

తల్లి పక్షి ఈ మాటలు విని మీరేమీ భయపడకండి. రైతు ఈ చేనును రేపు కోయలేడు అని ధైర్యం చెప్పింది. మళ్లీ తెల్లవారి రైతు చేను వద్దకు వచ్చి ఈ రోజు కూలీలు దొరకలేదు. రేపు తప్పకుండా కోస్తాను, అనుకుని వెళ్లిపోయాడు. దీంతో పిల్లలకు మళ్లీ భయం పట్టుకుంది. తల్లి పక్షి రాగానే 'రేపు తప్పకుండా కూలీలను తీసుకువచ్చి చేను కోసేస్తాడట' అని చెప్పాయి. తల్లి పక్షి మళ్లీ, రేపు కూడా ఆ చేను కోయలేడు. మీరు నిశ్చింతగా ఉండండి అని ధైర్యం చెప్పింది. దీంతో పిల్లపక్షులు స్థిమితపడ్డాయి. తెల్లవారిన తర్వాత మళ్లీ రైతు చేను వద్దకు వచ్చి 'కూలీలెవరూ మాట వినడం లేదు. ఎవరి పనుల్లో

వారున్నారు. 'ఇన్షా అల్లాహ్' దైవం తలిస్తే రేపు నేను ఒంటరిగానైనా చేను కోస్తాను.' అంటూ వెళ్లిపోయాడు. సాయంత్రం తల్లి పక్షి వచ్చీరావడంతోనే పిల్లలను అడిగింది. 'ఈ రోజు మళ్లీ రైతు వచ్చాడా? అని. వచ్చాడమ్మా! ఇన్షా అల్లాహ్ రేపు నేను ఒంటరిగానే చేను కోస్తానని బీరాలు పలుకుతూ పోయాడు. ఇంత పెద్ద చేను ఒక్కడే ఎలా కోస్తాడమ్మా' అంటూ నవ్వాయి పిల్లపక్షులు. కానీ తల్లిపక్షి మాత్రం ఇలా అంది. 'ఇక మనం ఎటైనా ఎగిరిపోయి వేరేగూడు చూసుకోవాల్సిందే. రేపు ఈ చేను ఉండదిక.'

## దైవం తోడుంటే..

పిల్లలన్నీ ఆశ్చర్యపోయాయి. అదేమిటమ్మా! ఇన్నాళ్లూ అతను కూలీల ద్వారా కోస్తాడంటే, కోయలేదన్నావు. మరి ఒంటరిగానే కోస్తానంటే నువ్వు భయపడుతు న్నావేంటి? అని ప్రశ్నించాయి. 'అవును. రేపు అతను చేను కోయగలడు. మీరు గమనిం చారా.. ఈ రోజు అతను ఇన్షాఅల్లాహ్ అన్నాడు. ఆ మాట అనడం వల్ల అతనికి అల్లాహ్ సహాయం లభిస్తుంది. దేవునిపై భరోసాతో ఒంటరిగానైనా సరే పని ప్రారంభిస్తే, ఆ పనికి దైవసహాయం తోడవుతుంది' అని చెప్పి ఆ పక్షి తన పిల్లలతో సహా మరోదిక్కుకు ఎగిరి పోయింది.

✦ ✦ ✦

# 78. మంచికి చెడుకు మాషాఅల్లాహ్

ఈ రోజు జరిగిన కీడు.. రేపు మన మంచికే దారితీయవచ్చు. దైవం చేసే ప్రతి పనికి కారణముంటుంది. తాత్కాలికంగా బాధ కలిగినా అదీ మంచికే... ఇదీ దైవ నిర్ణ యమే అని సరిపుచ్చుకోవడం బుద్ధిమంతుల లక్షణం. మంచికైనా, చెడుకైనా దైవాన్ని నమ్ముకోవాలని తెలియచెప్పే కథ...

సుఖ సంతోషాలు, కష్ట నష్టాలు, మంచి చెడులు, ఆపదలు, విపత్తులు ఏది సంభవించినా అది దైవం తరపునుండే అనేది దైవ విశ్వాసుల నమ్మకం. దైవం ఎవరికోసం ఏది తలుస్తాడో అదే చేస్తాడు. సంతోషకరమైన వార్త విన్నప్పుడు, ప్రశంసాపూర్వకంగా 'మాషా అల్లాహ్' అనే పద బంధాన్ని వాడుతూ ఉంటారు.

## ఓ రాజు కథ..

పూర్వం యుద్ధరంగంలో ఒక రాజుకు తన చేతి వేలు తెగిపోయింది. రాజుగారి వేలు తెగిన విషయం రాజ్యంలో పొక్కిపోయింది. ప్రజలు తండోప తండాలుగా వచ్చి రాజుగారిని పరామర్శించి వెళుతున్నారు. అలాగే ప్రధాన మంత్రి కూడా రాజుగారిని పరామర్శించి మాషా అల్లాహ్.. దైవం తాను తలచింది చేస్తాడు. అందులోనే శుభం కూడా ఉంది అన్నాడు. ప్రతి విషయానికి అది కష్టమైనా, నిష్ఠురమైనా అలా అనడం ఆయన అలవాటు. కానీ రాజుగారికి తీవ్రమైన కోపం వచ్చింది. వెంటనే ప్రధానమంత్రిని తన కొలువు నుండి తొలగించమని ఆదేశించాడు. క్షణాల్లో రాజాజ్ఞ ఆచరణ రూపందాల్చింది. ఈ ఆజ్ఞవిన్న ప్రధానమంత్రి 'మాషా అల్లాహ్' దైవం తాను తలచింది చేస్తాడు. అందులోనే శుభం ఉంది. అని ఇంటిముఖం పట్టాడు. ఇంతలో అతన్ని రాజ్యం నుండి కూడా బహిష్కరించమని మరో ఆజ్ఞ జారీ చేశాడు రాజు. ఈ ఆజ్ఞ కూడా విన్న మంత్రికి ఇంటికి కూడా వెళ్ళకుండా రాజ్యం విడిచి వెళ్లిపోయాడు. అక్కడికే తన కుటుంబాన్నికూడా పిలిపించుకున్నాడు.

## తెగిన వేలు కాపాడింది

అప్పుడప్పుడూ రాజు తన చేతిని చూసుకుని చాలా బాధ పడేవాడు. ఓసారి

రాజుకు వేటకు వెళ్లాలనే కుతూహలం కలిగింది. అడవిలో ఓ అందమైన లేడి కనిపించేసరికి దాన్ని సజీవంగా బంధించాలని రాజు తన అశ్వాన్ని దౌడు తీయిస్తూ దాన్ని వెంబడించాడు. ప్రాణభయంతో లేడి అడవిలో అడ్డదిడ్డంగా పరుగులు పెడుతోంది. అంతే వేగంతో రాజుగారి అశ్వం కూడా దాన్ని తరుముతోంది. ఈ క్రమంలో వెంట ఉన్న రక్షణదళం బాగా వెనకబడిపోయింది. వారు రాజును సమీపించలేకపోయారు. కీకారణ్యంలో లేడి అదృశ్యమైపోయింది. రాజుగారు దాన్ని తరుముతూ తరుముతూ అలసిసొలసి నిరాశతో ఓ చెట్టుకింద మేనువాల్చి నిద్రలోకి జారుకున్నాడు. మెలకువ వచ్చి చూసే సరికి అక్కడి పరిస్థితి కోలాహలంగా వింత వింతగా ఉంది. కులదేవతకు నరబలి ఇవ్వడానికి అక్కడ ఏర్పాట్లు జరుగుతున్నాయి. పసుపుకుంకుమలు చల్లి రాజుగారిని బలిపీఠం ఎక్కించారు. కానీ కులదేవత పూజారి, రాజును బలి ఇవ్వడానికి తిరస్కరిం చాడు. కారణం అతడి చేతికి ఓ వేలు తెగి ఉండడమే. దీంతో వారు రాజును వదిలి వేశారు. చివరకు రాజు బతుకు జీవుడా అనుకుంటూ రాజధానికి చేరుకున్నాడు.

## ప్రతిపనిలో ఓ పరమార్థం

'మాషాఅల్లాహ్' లోని మర్మం తెలిసొచ్చిన రాజు వెంటనే ప్రధానమంత్రి ఎక్కడున్నా వెతికి సగౌరవంగా తీసుకు రమ్మని ఆదేశించాడు. ప్రధానమంత్రి రాగానే రాజు అతడికి నమస్కరించి, కౌగలించుకుని, సింహాసనంపై తనపక్కనే కూర్చోబెట్టుకున్నాడు. నా వేలు తెగిననప్పుడు మీరు నన్ను సహనం వహించమని, దైవం ఏది చేసినా మన మంచికే చేస్తాడన్న మీ వాక్కు నిజమైంది. మరి నేను మిమ్మల్ని పదవిలోంచి తీసేసి బహిష్కరించి నప్పుడు కూడా మీరు అదే మాట అన్నారు.. దీనికి కారణం ఏమిటి అని ప్రశ్నించాడు రాజు. రాజా! మీరు నన్ను పదవి నుంచి తొలగించకుండా, బహిష్కరిం చకుండా ఉండి ఉంటే నేను కూడా మీతోపాటు వేటలో పాల్గొనేవాణ్ని. మీరు లేడి కోసం ఎంతటి కీకారణ్యంలోకి వెళ్లినా నేను మీ వెన్నంటే ఉండేవాణ్ని. ఎలాగూ మీ వేలు తెగిపోయి ఉండడం వల్ల బలినుండి మీకు విముక్తి లభిస్తుంది. నాలో ఏ లోపమూ లేదు. కాబట్టి వాళ్లు నన్ను బలిపీఠంపైకి ఎక్కించేవాళ్లు. నేను బలైపోయేవాణ్ని అన్నాడు.

✦ ✦ ✦

# 79. హక్కులను గుర్తిస్తే సమాజం స్వర్గధామం

ఇస్లాం ధర్మంలో దేవుని హక్కులు, మానవుని హక్కులు అని రెండు విభాగాలున్నాయి. నమాజు, (దైవప్రార్థన) రోజా (ఉపవాసం) ధ్యానం, హజ్ యాత్ర మొదలైనవి దేవుని హక్కులు అనబడతాయి. ఆర్థిక అంశాలతో సహా, మానవ సంబంధాలకు చెందిన వ్యవహారాలన్నీ మానవుల హక్కుల కిందికి వస్తాయి. మానవుల హక్కులు నెరవేర్చకుండా, కేవలం దేవుని హక్కులు నెరవేర్చినంత మాత్రాన ప్రయోజనం లేదు.

అంటే, సమాజంలో మనకు ఉదయం లేచిన దగ్గర నుండి, రాత్రి పడుకోబోయే వరకు ఎందరితోనో రకరకాల అవసరాలు కలుగుతుంటాయి. ప్రతి సందర్భంలోనూ ఎదుటి వారి పట్ల సత్ప్రవర్తన కలిగి ఉండడం, ఇచ్చిపుచ్చుకోవడాల్లో, లావాదేవీల్లో, పరస్పర సహాయ సహకారాలు అందించుకోవడం, తమ మాటల ద్వారా గాని, చేతల ద్వారా గాని ఎదుటి వారికి భౌతికంగా, మానసికంగా ఎలాంటి కష్టం, నష్టం కలగకుండా ప్రవర్తించడమే వారి హక్కులు నెరవేర్చడమంటే.

దేవుని హక్కులు నెరవేర్చడంలో ఏవైనా లోపాలు జరిగితే, దైవం క్షమిస్తాడు. కాని మానవుల హక్కులు కొల్లగొడితే మాత్రం క్షమించడు. సంబంధిత వ్యక్తిని కలిసి అతని హక్కును అతనికి చెల్లించి, క్షమాపణ వేడుకోనంత వరకూ, హక్కుల ఉల్లంఘనకు పాల్పడిన వ్యక్తిని దైవం కూడా క్షమించడు. అందుకని సమాజంలో చాలా బాధ్యతగా మసలుకోవాలి. తుళ్ళిపడి ఎవరినీ మాట జారకూడదు. బలం, ధనం, అధికారాలున్నాయని, బలహీనులపై దౌర్జన్యానికి పాల్పడకూడదు. అలాచేస్తే తన నిస్సహాయత కారణంగా ప్రస్తుతానికి బలహీనుడు ఏమీ చేయలేక పోవచ్చు. కాని దైవంమాత్రం తప్పకుండా శిక్షిస్తాడు.

నేడు సమాజంలో మానవుల మధ్య ఉండవలసిన స్థాయిలో సంబంధాలు లేక పోవడం, ప్రేమరాహిత్యం, ఒకరిపై ఒకరికి అపనమ్మకాలు, పరస్పర ఈర్ష్యా ద్వేషాలు, కుట్రలు కుతంత్రాలు - ఇవన్నీ పరస్పరం హక్కుల్ని గుర్తించకపోవడం వల్లనే అంటే అతిశయోక్తికాదు. సాధారణ జీవుల్ని పక్కనబెడితే, ఆధ్యాత్మిక వేషధారణతో, నిత్యదైవ ధ్యానంలో గడిపే పెద్ద మనుషులు కూడా మానవుల హక్కుల పట్ల సరైన శ్రద్ధవహించరు. మానవుల హక్కుల్ని విస్మరించి, ఎంత ఆధ్యాత్మికత ఒలకబోసినా ప్రయోనం ఉండదు.

ఉదాహరణకు, ఒక వ్యక్తి దైవప్రార్థన కోసం మసీదుకు వెళుతున్నాడనుకుందాం. దైవప్రార్థన సమయం కూడా సమీపించింది. త్వరత్వరగా పెద్ద పెద్ద అంగలతో వెళుతున్నాడు. అంతలో దారిలో ఒకదారిన పొయ్యే దానయ్య ప్రాణా పాయ స్థితిలో ఉన్నాడు. అలాంటి సమయంలో అతడు ప్రాణాపాయ స్థితిలో ఉన్న వ్యక్తికి ఏదైనా సహాయం అందించి, (వైద్య) తరువాత అతడు ప్రార్థన సమయం మించిపోయి నప్పటికీ ప్రార్థన చేసుకుంటే, అతడు మానవుల హక్కులూ నెరవేర్చినవాడవు తాడు, దేవుని హక్కులూ నెరవేర్చినవాడవుతాడు. ప్రార్థన ఎప్పుడో ఆలస్యంగా చేసినందుకు దైవం అతణ్ణి ఏమీ అనడు. పైగా తన దాసుణ్ణి కాపాడినందుకు అతణ్ణి అభినందించి ఉత్తమ ప్రతిఫలం ప్రసాదిస్తాడు.

ఒకవేళ అతడు గనక ఎవరెక్కడపోతే నాకుందుకులే అని, తన ప్రార్థన సమయం మించిపోతోందని భావించి ముందుకు సాగిపోతే, దైవం ఎంతమాత్రం సంతోషించడు. పైగా ఒక మానవుడు కష్టాల్లో ఉంటే, అత్యవసరంగా అతణ్ణి ఆదుకోనందుకు అతణ్ణి ప్రశ్నిస్తాడు, శిక్షిస్తాడు. అలాగే ఒకర్ని తిట్టినా, కొట్టినా, దౌర్జన్యం చేసినా, అలా దౌర్జన్యానికి గురైన వారు స్వయంగా అతణ్ణి క్షమించనంత వరకు దైవం కూడా అతణ్ణి క్షమించడు.

అందుకుని సమాజంలో మానవుల మధ్య సత్సంబంధాలు నెలకొనాలంటే, పరస్పరం హక్కుల్ని, బాధ్యతల్ని గుర్తించాలి. పరస్పరం ఒకర్నొకరు స్నేహపూర్వకంగా పలకరించుకోవడం కూడా ఒకరిపై ఒకరికున్న హక్కే. ఒక వ్యక్తి అపమార్గాన వెళుతుంటే, అతణ్ణి సన్మార్గాన పెట్టడానికి చేసే ప్రయత్నం కూడా ఆ వ్యక్తి పట్ల అతనికున్న హక్కు. కాబట్టే సంఘంలో ప్రతి ఒక్కరూ ఒకరిపట్ల ఒకరికున్న హక్కుల్ని గుర్తించి, బాధ్యతాయుతంగా మసలుకుంటే సమాజం నిజంగా స్వర్గధామమవుతుందనడంలో సందేహంలేదు.

✦ ✦ ✦

# 80. నిరంతర పరీక్ష.. విశ్వాసమే రక్ష

ఒకసారి ఇస్రాయేలు జాతికి చెందిన ముగ్గురు వ్యక్తులను పరీక్షించదలచి దైవం తన దూతను వారి వద్దకు పంపాడు.

వారిలో ఒకడు కుష్టురోగి, మరొకడు బట్టతలవాడు, మూడోవ్యక్తి గుడ్డివాడు. దూత మానవాకారంలో కుష్టురోగి వద్దకు వచ్చి అతని కోరికను అడిగి తెలుసుకుని, మృదువైన చర్మాన్ని, ఒక చూడి ఒంటెను ఇచ్చాడు. ఈ ఒంటెద్వారా నీకు శుభం కలుగు తుందని చెప్పి వెళ్లిపోయాడు దైవదూత. బట్టతల ఉన్న వ్యక్తి తనకు చక్కటి తలకట్టు కావాలని కోరుకున్నాడు. దైవదూత అతనికి చక్కని తలకట్టుతోపాటు ఒక చూడి ఆవును ఇచ్చాడు. ఆ తరువాత గుడ్డివాడి వద్దకు వెళ్లి అతనికి చూపుతోపాటు చూడి మేకను ప్రసాదించి దీనిద్వారా నీకు శుభం కలుగుతుందని ఆశీర్వదించి దైవదూత వెళ్లిపోయాడు. అతి త్వరలోనే వాళ్ల పశుసంపద విపరీతంగా పెరిగిపోయింది. వారు సంపన్నులుగా మారిపోయారు.

## కృతజ్ఞతకు బహుమానం

కొంతకాలానికి దైవదూత కుష్టురోగిగా వేషం వేసుకుని పూర్వం కుష్టువాడిగా ఉన్న ధనవంతుడి దగ్గరకు వెళ్లాడు. 'అయ్యా... నేనొక రోగిని, పేద బాటసారిని. దేవుని పేర నాకు ఒక ఒంటెను దానం చెయ్యండి' అంటూ అడిగాడు. అప్పుడా సంపన్నుడైన పూర్వపు కుష్ఠురోగి 'పోపోవయ్యా నీలాంటి వాళ్లందరికీ దానంచేస్తూపోతే నా గతేంకాను' అని కసిరాడు. అప్పుడు దైవదూత 'దైవం నీ రోగం దూరం చేసి నీకిన్ని సిరిసంపదలు ప్రసా దిస్తే, ఈ రోజు కాదంటావా?' అని అడిగాడు. అందుకు 'అదేంకాదు.. ఈ సంప దంతా నా తాతలు, తండ్రులు నుంచి నాకు సంక్రమించింది' అంటూ బొంకాడు. 'కాదు.. నువ్వు అబద్ధం చెబుతున్నావు. దైవం నిన్ను మళ్లీ పూర్వస్థితికే తెచ్చుగాక' అని శపించి వెళ్లిపోయాడు దైవదూత.

ఆ తర్వాత బట్టతల వ్యక్తి వద్దకు వెళ్లాడు. అతను నుండి అలాంటి సమాధానమే రావటంతో అతన్ని కూడా అలాగే శపించాడు. కూడా ఇలాగే శపించి చివరిగా పూర్వం గుడ్డివాడిగా ఉన్నవాని దగ్గరికి గుడ్డివానిగానే వెళ్లి దానం ఇమ్మని అడిగాడు. అప్పుడతను,

గుడ్డివాళ్ల బాధలు నాకు తెలుసు. దేవుడు నాకు చక్కని చూపునిచ్చాడు. బాబూ.. నీకెన్ని మేకలు కావాలో తీసుకెళ్లు. దేవుని పేరుతో నువ్వేది కోరుకుంటే అది తీసుకెళ్లు. నాకే అభ్యంతరం లేదు. ఇదంతా దేవుడు ప్రసాదించిందే' అన్నాడు. అంధుని రూపంలో ఉన్న దైవదూత అతనితో ఇలా చెప్పాడురు. 'దేవుడు మీ ముగ్గుర్నీ పరీక్షించాడు. ఈ పరీక్షలో నువ్వు మాత్రమే నెగ్గావు. దైవం నిన్ను మెచ్చుకున్నాడు. నీ ఇద్దరు మిత్రులు మాత్రం దేవుని క్రోధాన్ని కొని తెచ్చుకున్నారు. నీ సిరిసంపదలను నీవే హాయిగా అనుభవించు. నీకు మేలు కలుగుతుంది' అని చెప్పి వెళ్లిపోయాడు.

మహమ్మద్ ప్రవక్త (సఅసం) ప్రవచించిన ఈ హదీసు అందరికీ చక్కని గుణపాఠం. దైవం ఈ సృష్టిలో దేన్నీ వృథాగా పుట్టించలేదు. ఏ ఆధారం లేని నిరుపేదలను, వికలాంగులను శ్రీమంతులను పరీక్షించడానికే సృష్టించి ఉంటాడు. అందుకే నిలకడ లేని ఆరోగ్యాన్ని, ఈ రోజు ఉండి రేపు పోయే ధనాన్ని, అధికారాన్ని చూసుకుని మనిషి విర్రవీగడం మాని దైవమార్గంలో తన సంపదను ఖర్చుచేయాలి.

✦ ✦ ✦

# 81. గురుశిష్యుల బంధం

**గురుశిష్యుల అనుబంధానికి ఓ ప్రత్యేకత ఉంది. గురువులకు విధేయులుగా ఉన్న శిష్యుల్ని, గురువుకు మించిన శిష్యుల్ని ఎంతో మందిని గురించి చరిత్రలో విని ఉన్నాం. అలాంటి ఓ గురుశిష్యుల గాథ ఇది....**

దైవప్రవక్త అనుచరుల్ని సైతం ప్రవక్త ముందు పెద్దగా గొంతెత్తి మాట్లాడకూడదని దేవుడు ఆదేశించాడు. అనుచరులు ఎప్పుడూ దైవ ప్రవక్తతో పెద్ద పెద్దగా మాట్లాడడం గాని, వాదులాడడం గాని చేసే వారు కాదు. ప్రపంచ విజేతగా కీర్తిపొందిన యూనాన్ చక్రవర్తి సికిందర్‌ను తండ్రి ఔన్నత్యం గొప్పదా.. గురువు ఔన్నత్యం గొప్పదా అని ప్రశ్నిస్తే నా తండ్రి నన్ను ఈ లోకంలోకి తీసుకొచ్చాడు. కానీ నా గురువు నన్ను, నా స్థానాన్ని ఆకాశానికెత్తాడు అని సమాధానమిచ్చాడు.

## శిష్యుని మొండితనం

ఓ సారి ఓ గురుశిష్యులిద్దరు లోకాభిరామాయణం మాట్లాడుకుంటూ దారివెంట పోతున్నారు. గురువు పట్ల ఎంతో వినయ విధేయతలు కలిగిన ఆ శిష్యుడు, గురువు గౌరవార్థం అతనికంటే ఓ అడుగు వెనకే నడుస్తూ, ఆయన మాటలు వింటూ అనుసరిస్తున్నాడు. ఎందుకంటే, కొడుకు తండ్రితో, శిష్యుడు గురువుతో సరితూగలేడు కదా! అలా వెళుతుండగా దారి మధ్యలో ఓ వాగు అడ్డొచ్చింది. అప్పుడు గురువు శిష్యుడికి జాగ్రత్తలు చెబుతూ, తాను ముందుగా వాగులోకి దిగాడు. అయితే శిష్యుడు వెంటనే గురువుగారి చెయ్యి పట్టుకుని ఒడ్డుకులాగి 'గురువుగారూ! ముందుగా నేను దాటుతాను, తరువాత మీరు రండి' అన్నాడు వినయంగా. లేదు లేదు. నేనే ముందు దాటుతాను. అనవసరంగా నన్నెందుకు ఆపావు. సభ్యత సంస్కారం లేవా? అంటూ మందలించాడు గురువు. లేదు గురువు గారూ! నేనే ముందు దాటుతాను అన్నాడు శిష్యుడు. ఇలా కొద్దిసేపు నేనంటే నేనని వాదులాడుకున్నారు. చివరికి గురువే కాస్త మెత్తబడి సరే నువ్వే దాటు

ఏం చేస్తాం అంటూ శిష్యుడిని అనుమతించాడు. గురువు అనుమతి పొందిన శిష్యుడు సంతోషంగా తానే ముందుగా వాగు దాటాడు. తరువాత గురువు కూడా దాటాడు.

## అతని ఆంతర్యం ఇది..

మొత్తానికి గురుశిష్యులిద్దరూ వాగు దాటి ఓ చెట్టుకింద కూర్చున్నారు. అప్పుడు గురువు 'నీకు తలబిరుసుతనం బాగా వుంది. నా మాట వినకుండా నాతో వాదులాడి నా కంటే ముందు నువ్వే వాగు దాటి నీ మాటే నెగ్గించుకున్నావు. గురువు పట్ల ఇలాంటి అవిధేయత పనికిరాదు అన్నాడు కాస్త కోపంగా. గురువు గారూ! నేనైతే కేవలం మీ హక్కును, నా బాధ్యతను నెరవేర్చాను. అంతే తప్ప మీ పట్ల అవిధేయత చూపలేదు అని చెప్పాడు శిష్యుడు వినయంగా. 'అదెలా' అని అడిగాడు గురువు ఆశ్చర్యంగా. 'అసలే వర్షాకాలపు రోజులు, వాగు ఉధృతంగా ప్రవహిస్తోంది. వాగు దాటాలంటే కొద్దిగా ప్రాణభయం కూడా ఉంది. అందుకని ఒకవేళ కొట్టుకుపోయే ప్రమాదం సంభవిస్తే నేనొక్కణ్ణే కొట్టుకుపోతాను. ఒకవేళ మీరు ముందు దాటి ఆ ప్రమాదం మీకు సంభవిస్తే మీతో పాటు వేలమందిని ముంచేసిన వాణ్ణి అయ్యేవాడిని అన్నాడు శిష్యుడు.

అదెలా? అన్నాడు గురువు మరికాస్త ఆశ్చర్యంగా. నా లాంటి వేలమంది శిష్యులు కలసి మీలాంటి ఓ గురువును తయారు చేయలేరు. అదే మీరు చల్లగా ఉంటే నాలాంటి విద్యార్థుల్ని ఎన్ని వేలమందినైనా తయారు చేయగలరు అన్నాడు శిష్యుడు. శిష్యుని మాటలు విన్న గురువు అమితానందభరితుడై శిష్యుణ్ణి మనసారా దీవించి, అతడి ఉన్నతి కోసం దైవాన్ని ప్రార్థించాడు. ఆ శిష్యుడు సికిందర్ చక్రవర్తి, గురువు అరిస్టో.

✦ ✦ ✦

# 82. తల్లిదండ్రుల సేవ

ముహమ్మద్ ప్రవక్త (సఅసం) తల్లి దండ్రుల సేవలోనే మోక్షముందని, తల్లిదండ్రులను సేవించని సంతానం స్వర్గప్రవేశానికి అర్హులుకాదని ప్రకటించారు. తల్లిపాదాల క్రింద స్వర్గమున్నదని తండ్రి స్వర్గానికి ప్రధాన ద్వారమని ఉద్భోదించారు. మానవ సమాజంలో తల్లిదండ్రులకున్న స్థానమేమిటో అందరికీ తెలిసిన విష యమే.అయినా ఈనాటి మానవ సంతితిలో వారికేపాటి గౌరవ మర్యాదలు లభిస్తున్నాయో కూడా జగమెరిగిన సత్యమే. కొంతమందిని మినహాయిస్తే, చాలా మంది తల్లిదండ్రుల్ని సేవిచడంలో, వారి శేషజీవితం సుఖవంతంగా శాంతిమంతంగా గడవడంలో తమవంతు పాత్రను ప్రేమపూర్వకంగా, బాధ్యతా భావంగా నిర్వహించడంలో చాలా వరకు ఏమరు పాటు కనబరుస్తున్నారు. సంతాన ప్రేమ సమృద్ధిగా, కావలసినంత స్థాయిలో వృద్ధ తల్లి దండ్రులకు అందడం లేదు. ముహమ్మద్ ప్రవక్త బోధనలతో ప్రేరణ పొందిన షర్ఫుద్దీన్ అనే భక్తుడు తల్లి సేవలో ఎలా తరించాడో చూడండి.

## షర్ఫుద్దీన్ కథ

ప్రతి రోజూ రాత్రి కాగానే తల్లికి పాలు తాగించడం షర్ఫుద్దీన్ దినచర్య. కానీ ఒక రోజు మేకల పాలు పితకడంలో ఆలస్యమైన కారణంగా తను పాలు పితికి పాలగ్లాసుతో తల్లి దగ్గరికెళ్ళే సరికి ఆ వృద్ధ మాతకు నిద్ర పట్టేసింది. పాలకోసం తల్లిని లేపితే నిద్రాభంగం కలుగుతుందనే ఉద్దేశ్యంతో, ఆమె ఎప్పుడు లేస్తే అప్పుడు పాలు తాగించాలని పాల గ్లాసుతో తలగడ దగ్గరే నిల్చుండి పోయాడు షర్ఫుద్ధిన్. తల్లి పాలు తాగనిదే తను కూడా ఏమీ తాగేవాడు కాదు, అలా దాదాపు ఏ అర్ధరాత్రో మెలుకువ వచ్చి చూస్తే తనయుడు పాలగ్లాసుతో నిలబడి ఉన్నాడు. ఆ దృశ్యం చూసిన ఆ తల్లి కళ్లు చెమరు స్తుండగా, తనకింతటి ఉత్తమ సంతానాన్ని ప్రసాదించినందుకు దైవానికి కృత జ్ఞతలు తెలుపుకుంది. అప్పుడామె హృదయాంతరాళాల్లో నుండి పెల్లుబికి వచ్చిన ప్రార్థనా తరంగం షర్ఫుద్దీన్‌ను ముంచివేసింది. ఆమె సంతృప్తిగా పాలు తాగి, తనయుడి తల నిమురుతూ, నువ్వు కూడా పాలు తాగు అని ఆశీర్వదించింది. ఈ విధంగా తల్లి సేవలో తరించి షర్ఫుద్ధిన్ ఇస్లామీయ చరిత్రలో ఓ గొప్ప పండితుడిగా విరాజిల్లాడు.

✦ ✦ ✦

# 83. తల్లిదండ్రుల సేవే స్వర్గమార్గం

**తల్లిపాదాల చెంత స్వర్గమున్నదని, తండ్రి స్వర్గానికి సింహ ద్వారమని ప్రవచించారు ముహమ్మద్ ప్రవక్త (స). ఇహ లోకంలో గౌరవప్రదమైన జీవితం కావాలన్నా పరలోకంలో దైవప్రసన్నత కావాలన్నా తల్లిదండ్రుల సేవలో తరించాలని సూచించారు.**

ఎవరైతే తల్లిదండ్రులను ప్రేమిస్తూ.. సేవ చేస్తారో, వారి మనసు కష్టపెట్టకుండా, వారికి ఏ లోటు రాకుండా చూసుకుంటూ వారి దీవెనలు పొందుతారో, ధర్మసమ్మతమైన వారి ప్రతి ఆదేశాన్ని తు.చ. తప్పక పాటిస్తారో, అలాంటి సంతానానికి స్వర్గం లభిస్తుంది. వారి ఆయుష్షు పెరుగుతుందని ముహమ్మద్ ప్రవక్త సెలవిచ్చారు. ఇహలోకంలో గౌరవప్రదమైన జీవితం గడపాలన్నా పరలోకంలో దైవ ప్రీతికి పాత్రులు కావాలన్నా తల్లిదండ్రులను సేవించడం తప్పనిసరి. తల్లిదండ్రుల సంతోషంలోనే దైవ సంతోషం ఇమిడి ఉంది. తల్లిదండ్రులను పట్టించుకోకుండా దైవ సంతోషాన్ని పొందడం అసాధ్య మని ఆయన స్పష్టం చేశారు. మీరు ఎన్ని మంచి పనులైనా చేయండి.. తల్లిదండ్రులపట్ల సత్ప్రవర్తనతో మెలగకపోతే, వారి బాగోగులు పట్టించుకోకపోతే, వృద్ధాప్యంలో వారికి సేవ చేయకపోతే, మీరు చేసే సత్కార్యాలన్నీ బూడిదలో పోసిన పన్నీరే అవుతాయి. ప్రళయదినాన ఏ సత్కార్యమూ మీకు ఉపకరించదు.

## తల్లిదండ్రులే మీ స్వర్గనరకాలు

తల్లిదండ్రులే మీ స్వర్గం. తల్లిదండ్రులే మీ నరకం అని ప్రవచించారు ప్రవక్త. అంటే వారిపట్ల సత్ప్రవర్తన కలిగి ఉంటే, వారి సేవలో తరిస్తే మీరు స్వర్గానికి అర్హులవు తారు, వారి పట్ల అవిధేయత కనబరచి, వారిని పట్టించుకోకపోతే నరకానికి ఆహుతి అవుతారని అర్థం. కనుక తల్లిదండ్రులకు సేవలు చేస్తూ కృతజ్ఞులుగా ఉండాలి. నిజానికి మన ఉనికికి కారణభూతులు తల్లిదండ్రులే. వారి సంరక్షణలోనే, వారి వాత్సల్యపూరిత

పెంపకంలోనే మనం పెరిగి ఇంతవారమయ్యాము. వారు ఎన్నో కష్టాలను భరించి, అసాధారణ త్యాగాలు చేసి, అసమానమైన ప్రేమను చూపి, మనల్ని పెంచి పోషించారు. మన కోసం వారి సుఖాలను త్యాగం చేశారు. ప్రాణం కన్నా మిన్నగా మనల్ని సాకారు. అందుకు మన హృదయం వారి పట్ల విశ్వాసంతో కృతజ్ఞతతో, గౌరవంతో, ప్రేమాను రాగాలతో ఉప్పొంగి పోవాలి. మన గుండెలోని అణువణువు కృతజ్ఞతా భావంతో నిండిపోవాలి.

## వారికి కృతజ్ఞులై ఉండాలి

అందుకే దైవం తనకు కృతజ్ఞతలు చెల్లించడంతో పాటు తల్లిదండ్రులకుకృతజ్ఞులై ఉండాలని హితవు పలికాడు. కాని ఈనాడు తల్లిదండ్రుల పట్ల ఏ స్థాయిలో కృతజ్ఞత ఉండాలో అది కనపడటం లేదు. తమ శక్తి సామర్థ్యాలన్నీ ధారపోసి సంతానాన్ని ప్రయోజ కులుగా తీర్చిదిద్దిన తర్వాత సంతానానికి తల్లిదండ్రులే భారమవుతున్నారు. వృద్ధాప్యంలో వారిని కనిపెట్టుకుని ఉండాలి. వారి అవసరాలు తీర్చి వారికి సేవలు చేయాలి. తల్లిదండ్రు లను సేవించడం మావిధి, మా బాధ్యత అని భావించే వారు చాలా అరుదుగా కనపడు తున్నారు.

మీరు తల్లితండ్రులను సేవించనిదే స్వర్గానికి పోలేరని ముహమ్మద్ ప్రవక్త (సం) వారు సెలవిచ్చారు. తల్లిపాదాల చెంత స్వర్గం ఉన్నదని, తండ్రి స్వర్గానికి సింహద్వారమని ప్రవచించారు. కాబట్టి ఇహలోకంలో గౌరవప్రదమైన జీవితం కావాలన్నా, పరలోకంలో దైవ ప్రసన్నత చూరగొనాలన్నా తల్లిదండ్రుల సేవలో తరించడం తప్పనిసరి.

✦ ✦ ✦

# 84. తల్లిదండ్రులను సేవిస్తేనే దేవుని కరుణ

మేము మానవునికి తల్లిదండ్రుల పట్ల సద్భావంతో మెలగాలని ఉపదేశించాము. అతని తల్లి అతణ్ణి ఎంతో శ్రమతో తన గర్భంలో పెట్టుకొని మోయడానికి, పాలు మాన్పించడానికి, ఆమెకు ముప్పై మాసాలు పట్టాయి. చివరికి అతను తల్లి ద్వారా సంపూర్ణ శక్తిని పొందాడు.

ఒకసారి ఓ వ్యక్తి ముహమ్మద్ ప్రవక్త వారి వద్దకు వచ్చి "ఓ ప్రవక్తా! నా సేవకు, సత్ప్రవర్తనకు అందరి కంటే ఎక్కువగా అర్హులెవరు?" అని ప్రశ్నించాడు. నీ తల్లి అని సమాధానమిచ్చారు ముహమ్మద్ ప్రవక్త. ఆ వ్యక్తి మూడు సార్లు ఇదేమాట అడిగాడు, మూడు సార్లు దైవప్రవక్త 'నీ తల్లి' అని సమాధానమిచ్చారు. నాలుగో సారి ప్రశ్నించినప్పుడు మాత్రం 'నీ తండ్రి' అని సమాధానమిచ్చారాయన. ముహమ్మద్ ప్రవక్త ఈ సమాధానం వల్ల తల్లిదండ్రుల ప్రాముఖ్యం, ముఖ్యంగా తల్లి స్థానం ఏమిటో స్పష్టంగా అర్ధమవుతోంది. తల్లి పాదాల చెంతనే స్వర్గమున్నదని, తల్లిని సేవించనిదే నువ్వు స్వర్గాన్ని చేరుకోలేవని కూడా ప్రవక్త సెలవిచ్చారు. మరో ప్రవచనంలో, దైవం నీ పట్ల ప్రసన్నుడు కావాలంటే నువ్వు నీ తండ్రి మాట వినాలని, ఆయన్ని ప్రసన్నం చేసుకోవాలని ప్రవక్త బోధించారు.

## ఇది సంతానం బాధ్యత

తల్లి దండ్రుల పట్ల కృతజ్ఞతగా మెలగాలని, వారిని ఏమాత్రం బాధపెట్టరాదని, వారి ప్రతి అవసరాన్ని సంతోషంగా తీర్చాలని, వారికి సేవలు చేయాలని, వృద్ధాప్యంలో వారిని మరింత శ్రద్ధగా, ప్రేమగా చూసుకోవాలని ముమహమ్మద్ ప్రవక్త ఉద్బోధించారు. ఈ సృష్టిలో దైవం తరువాత స్థానం తల్లిదండ్రులదే. అన్ని మత ధర్మాలూ తల్లిదండ్రుల్ని గౌరవించాలని, వారికి సేవ చేయాలని చెబుతున్నాయి. సంతానం తల్లిదండ్రుల పట్ల ఉత్తమరీతిలో వ్యవహరించాలని, వారికి విధేయత చూపాలని, వారికి సేవలు చేయాలని ముఖ్యంగా తల్లిని కంటికి రెప్పలా చూసుకోవాలని పవిత్ర ఖురాన్ గ్రంథం చెబుతోంది. 'మీరు తల్లిదండ్రులతో మంచిగా, మర్యాదగా వ్యవహరించండి. కసురుకుంటూ వారికి

సమాధానం చెప్పకండి. వారితో వినమ్రంగా మర్యాదగా మాట్లాడండి. మృదుత్వం, దయాభావం కలిగి వారిముందు అణుకువతో ఉండండి. దేవా! వీరిపై కరుణచూపు. బాల్యంలో వీరు నన్ను ఎలా కరుణతో వాత్సల్యంతో పెంచి పోషించారో అలాగే వీరిపట్ల కూడా కరుణచూపు అంటూ ప్రార్థిస్తూ ఉండండి. సమాజంలో ప్రతి ఒక్కరూ తల్లి దండ్రుల్ని గౌరవించి, వారికి సేవలు చేసి వారి అవసరాలు తీర్చి ఉత్తమ సంతానంగా ఇహలోకంలో, పరలోకంలో ఉత్తమ ప్రతిఫలం పొందడానికి ప్రయత్నించాలి.

✦ ✦ ✦

# 85. మానవసేవ

**పరోపకారం ద్వారానే దైవానుగ్రహ భాగ్యం మనకు లభిస్తుంది. ఇలాంటి సత్కార్యాలకే దైవం సంతసించి, తన అనుగ్రహ భాగ్యాన్ని కలుగజేస్తాడు. శాశ్వతంగా స్వర్గంలో వసింపజేస్తాడు.**

ప్రళయ దినాన దేవుడు మానవుడిని ఉద్దేశించి, 'ఆదం సంతానమా! నేను వ్యాధి గ్రస్తుడిగా ఉంటే నీవు పరామర్శించడానికి రాలేదేం? అని ప్రశ్నిస్తాడు. అప్పుడు మానవుడు, 'దేవా! మీరు వ్యాధిగస్తులు కావడం ఏమిటి? మీరు సకలలోకాలకు ప్రభువు కదా! అందరికీ స్వస్థత చేకూర్చువారు మీరే కదా! నేను మిమ్మల్ని పరామర్శించడం ఏమిటి? అని విన్నవించుకుంటాడు. అప్పుడు దైవం 'నా ఫలానా దాసుడు వ్యాధిగ్రస్తుడైతే నువ్వు పరామర్శించలేదు, పరామర్శించి, ధైర్యవచనాలు చెబితే నన్ను దర్శించేవాడవని' అంటాడు దైవం.

## దైవ దర్శనం

'మానవుడా! ఆకలవుతోంది అన్నం పెట్టమని నేను నిన్ను అర్ధిస్తే అన్నం పెట్టలేదు అంటాడు దైవం. దేవా! అందరికీ అన్నం పెట్టేవాడివి, అందరి అవసరాలు తీర్చేవాడివి నీవు, నేను నీకు అన్నం పెట్టడమేమిటి? అని అంటాడు మానవుడు. అప్పుడు దైవం, 'నా ఫలానా దాసుడు ఆకలితో అలమటిస్తూ అన్నం పెట్టమని నీ గుమ్మం ముందుకు వచ్చినప్పుడు నువ్వు అతనికి అన్నం పెట్టి ఆకలి బాధను తీర్చి ఉంటే, నన్నక్కడే దర్శించుకునే వాడివని నీకు తెలియదా? అంటాడు. దైవం మళ్లీ మానవుడా! నేను నిన్ను వస్త్రాలు అడిగాను. నువ్వు వస్త్రాలు ఇవ్వలేదు అంటాడు. మానవుడు, 'దేవా! అందరికీ వస్త్రాలు ప్రసాదించి, సమస్త అవసరాలు తీర్చేవారు మీరు, మీకు వస్త్రాలు ఎలా ఇవ్వ గలను' అని అంటాడు దాసుడు. అప్పుడు దైవం, నా ఫలానా దాసుడు శరీరాన్ని కప్పు కోవడం కోసం వస్త్రం అడిగితే ఇవ్వలేదు. ఇచ్చి ఉంటే నా అనుగ్రహాన్ని పొందే వాడివి అంటాడు దైవం (ముస్లిం, అబూహురైరా)

## పరోపకారమే ముక్తి మార్గం

మానవ సేవ ఎంతటి మహత్తర సేవో ఈ ప్రవచనాల ద్వారా మనకు అర్థమవుతోంది. నేటి సమాజంలో ఎందరో వ్యాధిగ్రస్తులు, అన్నార్తులు, దుస్తుల్లేని అభాగ్యులు మనకు తారసపడుతుంటారు. ఇలాంటివారు ఇంటి గుమ్మం ముందుకు వచ్చి భిక్షాందేహి అని అనగానే మనం చాలా నిర్లక్ష్యంగా వెళ్లు వెళ్లమని ఈసడించుకుంటాం. సహాయానికి అర్హులైన ఎందరో అభాగ్యులు మన కళ్లకు కనిపించినా, మనం వాళ్లను పట్టించుకోకుండా ముందుకు సాగుతాం. కానీ, అన్నార్తుల ఆకలి బాధను తీర్చడం, దాహార్తుల దాహం తీర్చడం, దుస్తులు లేని వాళ్లకు దుస్తులను సమకూర్చడం, వ్యాధిగ్రస్తుల్ని పరామర్శించి, వీలైతే వారికి వైద్య సదుపాయాల్ని కల్పించడం వంటి సత్కార్యాలు మనల్ని దైవానికి చేరువ చేస్తాయి. ఆర్తులను కాదని మనం ఎన్ని యాగాలు, ధ్యానాలు చేసినా, ఎన్ని నోములు, వ్రతాలు పాటించినా యోగం సిద్ధించదు. పరలోకంలో దైవ దర్శనభాగ్యం లభించదు. కాబట్టి మానవసేవలోనే మానవ ముక్తి మోక్షాల రహస్యం దాగుందనే సత్యాన్ని గ్రహించాలి.

✦ ✦ ✦

# 86. సత్యస్ఫూర్తి.... ప్రేమమూర్తి

ఈ రోజు ఒక సుదినం..... మహనీయులు ముహమ్మద్ ప్రవక్త జన్మదినం. ముహమ్మద్ అంటే ప్రశంసనీయుడు అని అర్థం. ఇచ్చిన మాట నిలబెట్టుకోవడం, ప్రజలందరితో ప్రేమగా, వాత్సల్యంతో, నిష్పక్షపాతంగా, నిష్కర్షగా న్యాయంగా వ్యవహరించడం లాంటి సుగుణాల వల్ల ఆయన సాదిఖ్ (సత్యసంధుడు) అని, అమీన్ (విశ్వసనీయుడు) అని పేరుపొందారు. ఈనాటి ప్రపంచ పరిస్థితులు, పరిణామాల దృష్ట్యా ఇస్లామీ ఉద్యమ సందేశ ప్రదాత అయిన ముహమ్మద్ ప్రవక్త బోధనలను ఆయన జన్మదినం సందర్భంగా పునశ్చరణ చేసుకోవడం సముచితం.

## ఆనాటి వ్యవస్థ

ముహమ్మద్ ప్రవక్త జన్మించేనాటికి అరేబియా దేశమంతా అనాగరికత, ఆటవికత రాజ్యమేలుతున్నాయి. దేశవాసులంతా బహుదేవతారాధకులు: మూఢనమ్మకాలు ఎక్కువ. రాళ్ళురప్పలను, చెట్టుపుట్టలను, శరీసృపాలను, సరిగ్గా చెప్పాలంటే వింతగా కనిపించిన ప్రతి వస్తువునూ పూజించేవారు. భూతప్రేత పిశాచాలను శకునాలను గాఢంగా నమ్మేవారు. దోపిడీలు, దొంగతనాలు, లూటీలు, అత్యాచారాలు ప్రబలిపోయాయి. ఆడపిల్లలను పురిట్లోనే చంపేసేవారు. జూదం, మద్యపానం విచ్చలవిడిగా సాగేవి. వ్యభిచారం సర్వసాధారణ విషయమై పోయింది. నైతికంగా దిగజారిన నాటి సామాజిక వ్యవస్థ పతనానికి గురైంది. తెగల వ్యవస్థ పటిష్టంగానే ఉన్నప్పటికీ సరైన ధార్మిక అవగాహన, రాజకీయ చైతన్యం లేక నీరుగారిపోయింది. పతనావస్థకు గురైన ఆ జాతిని చైతన్య పరచడానికి నడుం బిగించారు ముహమ్మద్ ప్రవక్త (స).

## బోధనలు

ఈ సకల చరాచర సృష్టికి కర్త ఒక్కడేనని, మరణానంతర జీవితం, పరలోకం ఉన్నాయని ఆయన చెప్పారు. మానవులంతా ఒకే తల్లిదండ్రుల సంతానమైనందున మానవాళి అంతా పరస్పరం సోదరులేనని బోధించారాయన. తల్లిదండ్రులను గౌరవించాలని, వారి పట్ల విధేయతా భావం కలిగి ఉండాలని, బంధువులు, బాటసారులు,

అనాథలు, వితంతువులు, నిస్సహాయుల పట్ల బాధ్యతల్ని సక్రమంగా నెరవేర్చాలని, సంఘంలో ఒక మనిషికి మరో మనిషిపై ఉండే విద్యుక్త ధర్మాల పట్ల ఉపేక్ష కూడదని, ఈ బాధ్యతల్ని సక్రమంగా నిర్వర్తించకపోతే నాగరికత పునాదులు కదిలి పోతాయని చెప్పారాయన. అన్యాయం, అధర్మ సంపాదనలకు ఒడిగట్టవద్దని, ధనాన్ని అనవసరంగా, వృధాగా వ్యయపరచకండని కూడా చెప్పారాయన. వ్యభిచారం దరిదాపులకు కూడా పోవద్దు. నిష్కారణంగా ఏ ప్రాణినీ చంపకూడదు. ప్రజల ధన మాన ప్రాణాలు సురక్షితంగా లేని సమాజం ప్రగతి పథంలో పయనించజాలదు. ఇచ్చిపుచ్చు కోవడాలు, వ్యాపార లావాదేవీలు, లెక్కపత్రాలు, కొలతలు చాలా కచ్చితంగా ఉండాలి. అహం, స్వార్థాలను దరిచేరనీయొద్దు. పరస్పర మానవ సంబంధాలు సక్రమంగా, ఆనంద మయంగా ఉండాలంటే స్వార్థం, అహం, గర్వాలను త్యజించాలి. సాటి మానవుల్ని తమకన్నా అధములుగా, నీచులుగా, తక్కువవారుగా భావించడం విడనాడాలి అంటూ విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని విస్పష్టంగా ప్రకటించారు ముహమ్మద్ ప్రవక్త. మహిళలను గౌరవించాలి, న్యాయం, ధర్మం, సత్యాలు సమాధి అవుతున్నప్పుడు దుష్టశిక్షణ, శిష్టరక్షణ కోసం అవసరమైతే కరవాలం ఎత్తడానికి కూడా అనుమతి ఇచ్చారాయన. సత్యం, ధర్మం, న్యాయాల కోసం అన్యాయం, అధర్మం దౌర్జన్యాలను ఎదిరించి ఆయన చేసిన బద్ర్, ఉహద్, కందక పోరాటాలు రణరంగానికే మానవతను నేర్పాయి. మానవ ప్రేమ ఆయన ఆంతర్యంలో ప్రతిధ్వనించే సంగీతం, పశుత్వం నుంచి మనిషిని మనిషిగా మలచడమే ఆయన ఉద్యమ ధ్యేయం, ఆయన జీవిత పరమార్థం. ఆలోచనల్లో, మాటల్లో, చేతల్లో మానవ శ్రేయస్సే ఆయనకు ఏకైక ప్రేరణ. మార్గదర్శక సూత్రం.

✦ ✦ ✦

# 87. కారుణ్యమూర్తి ముహమ్మద్ ప్రవక్త (స)

**మానవజాతి సంస్కరణకు ఎందరో మహనీయులు, రుషులు, ప్రవక్తలు ఈ భూమిపై జన్మించారు. దైవం ద్వారా ఎన్నికయిన లక్షా ఇరవై నాలుగు వేల సంఘ సంస్కర్తలే దైవ ప్రవక్తలుగా వినుతికెక్కారు. అలాంటి ప్రవక్తలలో చివరి దైవ ప్రవక్త.. ముహమ్మద్ ప్రవక్త (సఅసం). ఆ మహనీయుని జయంతి సందర్భంగా జరుపుకునేదే మిలాదున్నబీ.**

ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం ఇతర ప్రవక్తలలాగా ఒక ప్రాంతానికి, ఒక జాతికి, ఒక దేశానికి పరిమితం కాదు. ఆయన విశ్వప్రవక్త, సమస్త మానవ జాతికీ మార్గదర్శకంగా, కారుణ్యంగా దైవం నియమించాడు. ఆయన వ్యక్తిత్వంలో పరిపూర్ణత, ఆదర్శం మనకు కనిపిస్తాయి. అందుకే 'యావత్తు విశ్వ మానవాళిని ఆయనను (సం) అనుసరించమని, విధేయించమని దైవం ఆదేశించాడు. ప్రవక్త విధేయతే తన విధేయత అని స్పష్టపరిచాడు. (పవిత్ర ఖుర్ఆన్ నిసా 80)

## సత్యసంధుడు ప్రవక్త

ముహమ్మద్ ప్రవక్త (సం) నేటికి వేయిన్నర సంవత్సరాల క్రితం ఆమినా, అబ్దుల్లా దంపతులకు సౌదీ అరేబియాలోని మాక్కాలో జన్మించారు. ప్రవక్త(స) బాల్యం నుంచే సుగుణాల రాశిగా, అమీన్ (విశ్వసనీయుడు) సాదిఖ్ (సత్యసంధుడు)గా ప్రజల చేత ప్రశంసలందుకున్నారు. ఆయనకు ఊహ తెలిసే నాటికి దేశం అజ్ఞానాంధకారంలో కూరుకుపోయి, అనాగరికత, ఆటవికత రాజ్యమేలుతున్నాయి. ఆనాటి ప్రజలు నిజ దైవాన్ని, దైవోపదేశాన్ని, ప్రవక్తల బోధనల్ని విస్మరించి, అజ్ఞానంలో జీవిస్తున్నారు. అలాంటి తరుణంలో ముహమ్మద్ ప్రవక్త (సం) పతనావస్థలో ఉన్న మానవ జాతిని చైతన్య పరిచి, వారిని తీర్చిదిద్దడానికి నడుం బిగించారు.

## జ్ఞానమే జీవితం

సమస్త సృష్టికి కారణమయిన సర్వసృష్టి కర్తనే ఆరాధించమని, విగ్రహారాధనను,

బహుదైవారాధనను వ్యతిరేకించమని చెప్పేవారు. ఈ విధానం ప్రారంభంలో వ్యతిరేకతకు గురయినా, చివరికి సత్య సందేశం దశదిశలా విస్తరించింది. ప్రవక్త సమాజంలోని రుగ్మతలను, అసమానతలను రూపుమాపడానికి అహరహం శ్రమించారు. మానవులందరినీ సమాన దృష్టితో చూడాలని ఆయన బోధించారు. 'విద్యను ఆర్జించడం ప్రతి ఒక్కరి విధి' అని; జ్ఞానం జీవితం.. అజ్ఞానం మరణం అని, జ్ఞాన సంపన్నులు, జ్ఞాన విహీనులు సమానం కాలేరని స్పష్టం చేశారు. ప్రతి ఒక్కరూ తమ సంతానానికి విద్య నేర్పాలని, అది ముందుతరాల సంక్షేమానికి నాంది పలుకుతుందని బోధించారు. అలాగే అనాథలను ఆదరించని వారు పాపాలు చేసినట్లేనని, వారిని ఆదరించి, సంరక్షించే వారు స్వర్గార్హులన్నారు.

## ఆచరణ లేని బోధ వ్యర్థం

ప్రవక్త ప్రజలకు బోధించిన ప్రతి విషయాన్ని స్వయంగా ఆచరించేవారు. ఆచరణ లేని బోధ జీవంలేని కళేబరం లాంటిదని చెప్పేవారు. ప్రవక్త మహనీయులు విలాసవంతమైన జీవితం గడపడానికి అవకాశం ఉన్నా, నిరాడంబర జీవితానికే ప్రాధాన్యం ఇచ్చేవారు. రెండు కర్జూరాలు, గ్లాసు నీళ్లు తాగి రోజులు గడిపేవారు. తన పనులతో పాటు ఇంట్లో పనులు కూడా చేసేవారు. దుష్టశిక్షణ, శిష్టరక్షణ కోసం తప్ప కరవాలం ఎత్తడానికి వీలు లేదని శాసించారు. యుద్ధ రంగంలో ఆయన సైన్యం పాటించిన యుద్ధ నీతి అజరామరం. ప్రజలకు దైవ సందేశం అందజేసిన నేరానికి, సత్యం, ధర్మం, న్యాయాలను బోధించినందుకు ఆయన్ను 'తాయిఫ్' అనే ఊరిలో రక్తసిక్తమయ్యేలా కొట్టారు. దారున్నద్వలో ఆయనను హతమార్చడానికి కుట్రపన్నారు. నమాజ్‌లో ఉన్నప్పుడు పశువుల పేగులను మెడలో వేసేవారు. ఇలా ఎంత హింసించినా ముహమ్మద్ ప్రవక్త వారు సహనాన్ని వీడలేదు. మానవుల సంక్షేమానికి, వారి ఇహపర ముక్తిమోక్షాలకు దైవం.. ముహమ్మద్ ప్రవక్త ద్వారా తన సందేశాన్ని పంపాడు. ఆ మహనీయుని సందేశాన్ని ఆయన జయంతిని పురస్కరించుకొని అయినా మనం తెలుసుకోవడానికి, ఆయన బోధను సర్వ సామాన్యం చేయడానికి ప్రయత్నించాలి. తద్వారా మనం దైవ సందేశాన్ని ఆచరించి ముక్తి మోక్షాలకు పాత్రులవుదాం.

✦ ✦ ✦

# 88. దారిచూపే ప్రవక్త

**ఇహలోకంలో మనం చేసే ప్రతి పనికి దేవుని ఎదుట సమాధానం చెప్పు కోవాలి. ఆ భావనే సమాజాన్ని సక్రమ మార్గంలో పయనింపజేస్తుంది. మనందరికీ దారి చూపే మార్గదర్శి లేకుంటే ఎంత ప్రతిభ ఉన్నా అది పరిపూర్ణం కాదు. అటువంటి మార్గదర్శే ముహమ్మద్ ప్రవక్త...**

మనిషి ఎంతటి మేధావి అయినా సంపూర్ణ జ్ఞాని మాత్రం కాదు. అందుకే మనం నిర్మించుకున్న ఈ వ్యవస్థ అనేక సమస్యలతో సతమతం అవుతున్నది. ఈ సమస్యల నుంచి బయటపడేందుకు ప్రతి ఒక్కరికీ మార్గదర్శకం అవసరం. ఆ మార్గదర్శకుడు సర్వజ్ఞాని, సర్వాంతర్యామి అయిన దైవం తరఫున వచ్చినవాడైతేనే సరైన మార్గం చూపగలడు.

## దేవుని దాసులు...

మానవుడి ఈ అవసరాన్ని తీర్చేందుకే దైవం తన మార్గదర్శక సూత్రాలను ఆవిష్కరించాడు. మానవులలో ఉత్తమోత్తమమైన దాసులను ఎంచుకొని, వారి ద్వారా మానవాళికి మార్గం చూపాడు. ఈ విధంగా దైవంచే ఎన్నిక కాబడిన మహర్షులు, ప్రవక్తలు నాటి నుంచి నేటి వరకు అన్ని కాలాల్లో, అన్ని దేశాల్లో, అన్ని జాతుల్లో దాదాపు ఒక లక్షా ఇరవై నాలుగు వేల మంది జన్మించారని ధార్మిక గ్రంథాలు చెబుతున్నాయి. ఈ మహర్షులు లేక ప్రవక్తల పరంపరలో చిట్టచివరి మహర్షే, చిట్టచివరి ప్రవక్తే ముహమ్మద్ ప్రవక్త (స).

## ఆదర్శ మూర్తులు

ప్రవక్తలందరూ సత్య సంధతను, నైతిక ప్రమాణాలను బోధించారు. పరిశుద్ధమైన మానవ జీవితానికి, సదాచార సంపన్నమైన మానవ సమాజానికి కావలసిన మౌలిక సూత్రాలను మానవాళికి తెలియజేశారు. ముహమ్మద్ ప్రవక్త కంటే ముందు వచ్చిన ప్రవక్తలు కూడా యావత్ ప్రపంచంలో విస్తరించి, తమ జాతికి, తమ అనుయాయులకు

ఉత్తమ నైతిక ప్రమాణాలను, వాటి భిన్న కోణాలను తమ బోధనల ద్వారా అందించారు. ఉన్నత జీవన ప్రమాణాలను ఆచరణాత్మకంగా చూపి ఆదర్శంగా నిలిచారు. మానవ జీవితానికి సంబంధించిన సకల నైతిక సూత్రాలను సంపూర్ణంగా విశదీకరించి, వాటిని ఆచరించడంతో పాటు, అందరినీ ఆ దారిలో నడిపించిన మహనీయుడు ముహమ్మద్ ప్రవక్త. అందుకే దైవం "ముహమ్మద్ ప్రవక్త జీవితంలో మానవాళికి సంపూర్ణ మార్గదర్శకం ఉంది." అని తన గ్రంథంలో పేర్కొన్నాడు. ముహమ్మద్ ప్రవక్త కూడా "నేను ఉత్తమ నైతిక ప్రమాణాల పరిపూర్తి కోసం పంపబడ్డాను" అని స్వయంగా చెప్పుకున్నారు.

## మార్గదర్శకం అనివార్యం

మానవ సమాజం ఎటువంటి రుగ్మతలు లేకుండా నీతిమంతంగా, న్యాయంగా, ధర్మబద్ధంగా, సుఖశాంతులతో విలసిల్లాలంటే మానవునికి దేవుని మార్గదర్శనం తప్పని సరి. మానవులు తమ బుద్ధి బలంతో ఎన్ని పథకాలు రచించినా, ఎన్ని నివారణోపాయాలు చేపట్టినా, సంపూర్ణ మార్గదర్శనం లేనిదే అవన్నీ నిష్ఫలం, చివరకు మనం అంతా మరణించే వాళ్లమే. దేవుని ఎదుట హాజరు కావలసిన వాళ్లమే. ఇహలోకంలో మనం చేసే ప్రతి పనికీ ఆయనకు సమాధానం చెప్పుకోవలసి ఉంటుంది. దైవానికి ఇలా జవాబుదారీగా ఉండాలనే భావనే మనల్ని, మన సమాజాన్ని అన్ని రకాల చెడుల నుంచి కాపాడుతుంది.

✦ ✦ ✦

# 89. మంచిని బోధించిన ముహమ్మద్ (సం)

మానవజాతి సంస్కరణకు, సముద్ధరణకు ఈ ప్రపంచంలో అనేకమంది మహనీయులు, సంస్కర్తలు, ప్రవక్తలు ప్రభవించారు. అలాంటి సంస్కర్తల్లో ముహమ్మద్ ప్రవక్త కూడా ఒకరు. ఈయన దైవంచేత నియమితులైన చిట్టచివరి దైవప్రవక్త. అజ్ఞానాంధకార విషవలయంలోపడి కొట్టుమిట్టాడుతున్న మానవజాతిని మహోన్నతంగా తీర్చిదిద్దిన మహనీయుడీయన. నేటికి దాదాపు వేయిన్నర సంవత్సరాల నాడు, నేటి సౌదీ అరేబియాలోని 'మక్కా' అనే నగరంలో ఆమినా, అబ్దుల్లా అనే పుణ్య దంపతులకు జన్మించారు. పుట్టుకకు పూర్వమే తండ్రిని, ఆరేళ్ల ప్రాయంలో తల్లిని కోల్పోయిన ముహమ్మద్(స) వారిని తాతయ్య, ఆయన తదనంతరం బాబాయి పెంచి పోషించారు.

వేయిన్నర సంవత్సరాలకు పూర్వమంటే, ఆనాటి సమాజం ఎంత అనాగరికంగా ఉండేదో ఈనాటి ఆధునికలకు తెలియని విషయమేం కాదు. నాటి సమాజంలో లేని దుర్మార్గమంటూ లేదు. అలాంటి ఆటవిక సమాజాన్ని, నిరక్షరాసి అయిన ముహమ్మద్ ప్రవక్త దైవ మార్గదర్శకాల వెలుగులో సమూలంగా సంస్కరించి, ఒక సత్సమాజాన్ని ఆవిష్కరించారు.

ప్రవక్త జననానికి పూర్వం నాటి సమాజంలో 'కఱ్ఱగలవాడిదే బఱ్ఱె' అన్నచందంగా బలవంతుడు బలహీనుణ్ణి పీక్కుతినేవాడు. స్త్రీల హక్కుల విషయం అలా ఉంచి, వారికంటూ ఓ వ్యక్తిత్వం ఉందన్న విషయాన్ని కూడా అంగీకరించేవారు కాదు. స్త్రీని హీనంగా, అంగడిసరుకుగా భావించేవారు. అలాంటి జాతిని అన్నిరంగాల్లో సంస్కరించి, వారిని మంచి మానవులుగా తీర్చిదిద్దిన ఘనత ముహమ్మద్ ప్రవక్తకే దక్కింది.

ఈ నేపథ్యంలో ఈనాటి మన నాగరిక సమాజ స్థితిగతుల్ని విశ్లేషిస్తే మనకు నిరాశే మిగులుతుంది. శాస్త్ర సాంకేతిక రంగాల్లో మనం అద్భుతమైన ప్రగతిని సాధించామనడంలో ఎలాంటి అతిశయోక్తిలేదు. కాని నైతికంగా, సామాజికంగా, ధార్మికంగా, రాజకీయంగా మనం పతనం అంచుల్లో ఉన్నాం. నేటి మన సామాజిక వ్యవస్థలో ఏ రంగమూ సంతృప్తికరంగా లేదు. అధికార, రాజకీయ వ్యవస్థలో అవినీతి, లంచగొండి

తనం, స్వార్థం, స్వలాభం, ఆశ్రితపక్షపాతం పెచ్చరిల్లాయి. అధికారం, రాజకీయం ప్రజాసేవకేనన్న పవిత్రభావం తుడిచిపెట్టుకుపోయి, అక్రమంగా కోట్లు గడించడానికి రాజమార్గమైపోయింది. సమాజంలో నైతికత అడుగంటిపోయి, పాశ్చాత్య పోకడలు, పబ్‌క్లబ్ సంస్కృతి వెర్రితలలు వేస్తున్నాయి. ఫలితంగా అశ్లీలత, అనైతికత ప్రబలి సాంస్కృతిక విధ్వంసానికి దారితీస్తున్నాయి.

చివరికి ఆధ్యాత్మిక రంగంలోనూ అతివాదం ముదిరి మతోన్మాదంగా రూపాంతరం చెందింది. మతం మనిషికి మంచివైపు మార్గదర్శకం చేసేబదులు, అసహనం, హింసవైపు కొనిపోతోంది. సమాజంలో సామాజిక, ఆర్థిక అసమానతలు కొంతమందిని తీవ్రవాదం వైపుకు, ఉగ్రవాదం వైపుకు తీసుకువెళుతున్నాయి. మొత్తానికి నేటి మన సమాజంలోని అన్ని రంగాల్లో ఆనాటి ఆటవిక, అనాగరిక లక్షణాలే గోచరిస్తున్నాయంటే తప్పుకాదు. ఇలాంటి పరిస్థితిలో ఈనాటి మన సమాజానికి కూడా ముహమ్మద్ ప్రవక్త బోధనల అవసరం ఎంతైనా ఉంది. ఆయన బోధనల ప్రకారం మానవులు తమ సృష్టికర్తను మాత్రమే ఆరాధించాలి. ఎప్పుడూ సత్యమే పలకాలి. తోటి మానవ సోదరులను ప్రేమించాలి. స్త్రీలను గౌరవించాలి. ఎట్టి పరిస్థితిలోనూ నీతిని, న్యాయాన్ని విడిచిపెట్టకూడదు. అనాథలను, వృద్ధులను ఆదరించాలి. తల్లిదండ్రులను సేవించాలి. ఉద్యోగ వ్యాపారాల్లో బాధ్యతగా, నిజాయితీగా తమ విధులను నిర్వర్తించాలి.

నిత్యం అన్ని రంగాల్లో దైవానికి భయపడుతూ కర్మలు ఆచరించాలి. ఇక్కడ మనం చేసే ప్రతి పనికి, పలికేప్రతిమాటకు రేపు దైవం ముందు సమాధానం చెప్పుకోవాలన్న విషయాన్ని మరువకూడదు. ఈ విధమైన భావనే మనిషిని మంచివాడుగా, నిజాయితీపరుడిగా తీర్చిదిద్దగలుగుతుంది. ఇలాంటి బాధ్యతా భావాన్నే, జవాబుదారీతనాన్నే ముహమ్మద్ ప్రవక్త ప్రజల మనసులో నూరిపోసి ఓ చక్కని సత్సమాజాన్ని ఆవిష్కరించారు. అందుకే ఆయన మానవాళికి ఆదర్శమయ్యారు.

✦ ✦ ✦

# ౧౦. ప్రవక్త చెప్పిన పంచ సూత్రాలు

ఈ ప్రపంచంలో మన జీవితం ఎలాంటి ఆటుపోటులు లేకుండా సాఫీగా సాగాలంటే మనం కొన్ని సిద్ధాంతాలను పాటించాలి. ఆ సిద్ధాంతాలు స్వయం కల్పితాలు కాకుండా దైవం చెప్పినవి అయి ఉంటే జీవితం సార్థకం అవుతుంది. మరి కారుణ్యమూర్తి మహాప్రవక్త ముహమ్మద్ (స) 5 విషయాలు తెలియజేశారు.

## ఆ అయిదు విషయాలు

1. నిషిద్ధాలకు (హరాంకు) దూరంగా ఉండండి. మీరు భక్తిపరులవుతారు.
2. దైవం మీ అదృష్టంలో రాసిన దానిపట్ల తృప్తి పడండి. మీరు ఎవరి అవసరంలేని సంపన్నులైపోతారు.
3. మీ ఇరుగు పొరుగు వారితో సత్ప్రవర్తన కలిగి ఉండండి. మీరు విశ్వాసు లవుతారు.
4. ఇతరులు మీ పట్ల ఎలాంటి వైఖరి అవలంబించాలని మీరు కోరుకుంటారో, మీరూ ఇతరుల పట్ల అలాంటి వైఖరినే ప్రదర్శించండి. మీరు నిజమైన, పరిపూర్ణమైన విశ్వాసులవుతారు.
5. అధికంగా నవ్వకండి. దీనివల్ల మీ హృదయం నిర్జీవమవుతుంది.

ముహమ్మద్ ప్రవక్త (స) ప్రవచించిన ఈ అయిదు ముఖ్య విషయాలను పాటిస్తే ఈనాటి మన సమాజం అన్నిరకాల రుగ్మతల నుంచి బయటపడుతుంది. ఇందులో సందేహమేలేదు. మొదట హరాంకు దూరంగా ఉండమన్నారు ముహమ్మద్ ప్రవక్త. అలాచేస్తే గొప్ప దైవభక్తి పరులవుతారన్నారు. అంటే సృష్టికర్తను వదిలి సృష్టిరాశుల్ని పూజించడం, తల్లిదండ్రుల ఆదేశాలను ధిక్కరించడం హింసా దౌర్జన్యాలు, రక్తపాతం, హత్యాకాండ, జూదం, మద్యపానం, వ్యభిచారం, అనాధల ఆస్తిని కొల్లగొట్టడం, అశ్లీలం, వడ్డీ, కొలతల్లో దగా, ఇతరుల మతవిశ్వాసాలను దెబ్బతీయడం, మొదలైనవన్నీ హరాం, అంటే నిషేధాలు. వీటికి దూరంగా ఉండడం నిజంగా గొప్ప ఆరాధన, అందుకే వీటికి దూరంగా ఉంటే దైవభక్తిపరులైనట్లే అని ప్రవక్త సూచించారు.

ఇక రెండవ విషయానికొస్తే.. మనిషిని పుట్టించిన దైవం ఎవరికి ఏమివ్వాలో అతని విధిరాతలో రాశాడు. అతని అదృష్టంలో దైవం ఎంత రాస్తే అంత తప్పక లభిస్తుంది. ఎవరు ఎన్ని ప్రయత్నాలు చేసినా దాన్ని పెంచడం కాని తగ్గించడం కాని చెయ్యలేరు. ఈ విషయాన్ని విశ్వసించి ఉన్నదాంట్లోనే తృప్తిపడే వారి మనసులో ఓ విధమైన మనశ్శాంతి, ప్రశాంతత లభిస్తుంది. అందుకే ఇలాంటి వారిని ప్రవక్త వారు ఎలాంటి అక్కరలేని సంపన్నులన్నారు.

మూడు, నాలుగు విషయాలు ఏమిటంటే ఇతరులు, మనల్ని ప్రేమించాలని, గౌరవించాలని ఎలాగైతే కోరుకుంటామో, మనం కూడా వారిపట్ల అలానే మసలుకోవాలి. ఎవరి దుష్కార్యాల కారణంగా అతడి పొరుగువారు సురక్షితంగా ఉండరో అతడు విశ్వాసి కాదు అన్నారు ప్రవక్త మరో హదీసులో. ఒకరి ధన మాన ప్రాణాలపై మీ నోటి ద్వారా కాని, చేతి ద్వారా కాని ఎలాంటి దాడి చేయకండి. మీ ధన మాన ప్రాణాలపై ఎవరూ దాడి చేయకూడదని మీరు కోరుకున్నట్లే ఇతరులపట్ల కూడా మీరు అదే వైఖరి అవలంబించాలన్నది నాలుగో సూత్రం. అధికంగా నవ్వడమనేది ఐదో సూత్రం. అంటే దైవ నామ స్మరణలో హృదయం సజీవంగా ఉంటుంది. దైవాన్ని విస్మరించి, ప్రాపంచిక వినోదంలో మునిగి తేలడం వల్ల హృదయం నిర్జీవమయ్యే ప్రమాదం ఉంది. దైవాన్ని విస్మరించి భయభక్తులు లేకుండా ప్రవర్తించడం, భయభక్తులు లేకుండా పగలబడి నవ్వడం మరణంతో సమానమని హెచ్చరించారు ముహమ్మద్ ప్రవక్త(స). ఈ విషయాలను అవగతం చేసుకొని, ఆచరించిన వారే సాఫల్యం పొందేవారు.

✦ ✦ ✦

# 91. వరాలను విస్మరిస్తే వైఫల్యమే

**మానవ జీవితంలో వరాలు ఉంటాయి.. శాపాలు ఉంటాయి. శాపాలను వరంగా మార్చుకోవడం మన చేతుల్లోనే ఉంది. ఎలా అనేది ఇస్లాం ధర్మం వివరిస్తోంది...**

పరిస్థితులు ఎప్పుడూ ఒకేలా ఉండవు. ముందు ముందు ఎదురుకాబోయే అయిదు స్థితులకు ముందుండే దశలను వరాలుగా భావించమని ముమహమ్మద్ ప్రవక్త బోధించారు. అవి.. 1.వృద్ధాప్యానికి ముందు యవ్వనాన్ని వరంగా భావించాలి.అలాగే 2. లేమికి ముందు కలిమిని,3. పనుల ఒత్తిడికి ముందు తీరికను,4.అనారోగ్యానికి పూర్వం ఆరోగ్యాన్ని 5.మరణానికి పూర్వం జీవితాన్ని వరంగా భావించాలి..

## యవ్వనాన్ని సద్వినియోగం చేసుకోవాలి

కరిగే మంచులాంటి మానవ జీవితంలో, బాల్యం, యవ్వనం, వృద్ధాప్యాలు అనివార్యమైనవి. బాల్యం, యవ్వనం పోతేరావు, వృద్ధాప్యం వస్తే పోదు. యవ్వనంలో ఉన్న వ్యక్తి దేశం కోసం, సమాజం కోసం ఏమైనా చేయడానికి శక్తిసామర్థ్యాలు కలిగి ఉంటాడు. యవ్వనం సన్నిగిల్లితే, గోళ్ళు గిల్లుగింటూ ఇంట్లో కూర్చోవలసిందే. కాలం ఎవరి కోసం ఆగదు. యవ్వన కాలమంతా వృధా అయ్యాక, వృద్ధాప్యంపైనబడ్డాక ఎంత వగచినా లాభం లేదు.

అందుకే వృద్ధ్యాప్యం రాకపూర్వమే యవ్వనాన్ని మేలైన వరంగా భావించి సద్వినియోగం చేసుకోమని ప్రవక్త బోధించారు. ఇందులో ఆరోగ్యాన్ని జాగ్రత్తగా కాపాడుకోమనే పరోక్ష సందేశం కూడా ఉంది. మాయదారి రోగం వచ్చిందంటే దయా దాక్షిణ్యం లేకుండా ఒంట్లోని శక్తినంతా హరించేస్తుంది. తరువాత ఉత్తి చేతుల్తో దైవం ముందు హాజరయ్యే పరిస్థితి దాపురిస్తుంది. అందుకే యవ్వనం, ఆరోగ్యం ఈ రెండింటి సాయంతో శక్తియుక్తులన్నీ ధారపోసి పరలోక సాఫల్యత కోసం పాటుపడాలి.

## వరాలను గుర్తించాలి

ఓడలు బళ్లు కావచ్చు.... బళ్లు ఓడలు కావచ్చు. అందుకే నాలుగు డబ్బులున్నాయి కదాని గర్వంతో విర్రవీగకూడదు. దైవం ప్రసాదించిన ధనసంపదలను దైవ మార్గంలోనే ఖర్చు చేయాలి. లేమికి ముందు కలిమిని మహాభాగ్యంగా భావించాలి. దాతృ స్వభావుల్ని దైవం కరుణిస్తాడని, అతని సంపద వృద్ధిచేస్తాడని ప్రవక్త అన్నారు. ఇక మూడో వరం ఒత్తిడికి పూర్వం తీరిక. జీవితం ఓ పరీక్షా సమయం. సమయం పూర్తి అయిన తర్వాత అన్ని ప్రశ్నలకు సమాధానం తెలిసినా రాయడం సాధ్యం కాదు. మృత్యువు కబళించే లోపలే జీవితమనే పరీక్షలో నెగ్గేందుకు, పరలోకంలో పనికి వచ్చే సత్కర్మలను ఆచరించాలి.

ప్రాపంచిక వ్యామోహంలో, ఆటపాటల్లో పడి, అనవసర విషయాల్లో తలదూర్చి జీవితశేషాన్ని వృధాభరితం చేసుకోవడం అజ్ఞానమే కదా! అందుకే ముహమ్మద్ ప్రవక్త (స) ఈ అయిదు స్థితులకు ముందు వున్న సమయం అయిదు వరాలని, వాటిని సద్వినియోగం చేసుకోవాలని చెప్పారు.

✦ ✦ ✦

# 92. 'జకాత్' సారం

**దైవమార్గంలో విధిగాచేసే దానాన్ని జకాత్ అంటారు. పవిత్ర ఖుర్ఆన్ గ్రంథంలో ఎనభైరెండు చోట్ల జకాత్ చెల్లించమని గట్టిగా తాకీదు ఉంది. జకాత్ చెల్లించే వారినే నిజమైన విశ్వాసులుగా పవిత్ర ఖుర్ఆన్ పరిగణిం చింది. ఖుర్ఆన్ చెప్పిన జకాత్ సారాంశం.**

'దేవుడు మీకు ఏ ధనంపై అధికారం ఇచ్చాడో ఆ ధనాన్ని మీరు దైవమార్గంలో ఖర్చుపెట్టండి' అంటూ ఈ ప్రపంచంలో మనిషికి ఉనికినిచ్చిన దేవుడు మనిషి ఎలా సంపాదించాలి, ఎలా ఖర్చుపెట్టాలి అనే విషయాలు కూడా తన గ్రంథంలో తెలియ జేశాడు.

## నిషిద్ధ మార్గాలు

1. లంచం, దౌర్జన్యం అన్యాయం, అపహరణ మార్గాల ద్వారా (బఖర 188) 2. దొంగతనం ద్వారా (మాయిదా 38) 3. విగ్రహాల ద్వారా (మాయిదా 90) 4. కొలతల్లో, తూనికల్లో మోసం చేసి (అత్తఫీఫ్ 1-3) 5. అనాథల సొమ్మును కాజేసి (నిసా1) 6. జూదం, పాచికల ద్వారా (మాయిదా 90) 7. సారాయి వ్యాపారం ద్వారా (మాయిదా 90) 8.అసభ్యం, అశ్లీలతలను వ్యాపింపజేయడం ద్వారా (నూర్-19), 9. వడ్డీ వ్యాపారం ద్వారా (బఖర 277), 10. వ్యభిచార వృత్తి ద్వారా (నూర్ 33), 11. జ్యోతిష్యం, పాచికలు, జ్యోస్యాల ద్వారా (మాయిద 90)

## దైవవాణి చెప్పిన తోవ

ధన సాయానికి అర్హులైన వారిని, ధనం ఖర్చుపెట్టే మార్గాలను ఖుర్ఆన్ సూచిం చింది. 1.తల్లిదండ్రులు, బంధువులు, అనాథలు, ఇరుగు పొరుగు వారు. (నిసా), 2. అర్థించేవారు, వికలాంగులు (జారియాత్ 10), 3. అప్పు ఇవ్వడం (బఖర) 4. జకాత్ చెల్లించడం (తౌబ 6). 5. దానధర్మాలు చేయడం. (బఖర 27) 6. బాటసారులను ఆదు

కోవడం (తౌబా) ధనికులు తమ సంపదనుండి జకాత్ తప్పనిసరిగా తీసి నిరుపేదలకు, అనాధలకు, వితంతువులకు, బాటసారులకు ఇంకా అవసరమైన వారికి దైవ సంస్థాపనా మార్గంలో కృషిచేస్తున్న వారికి ఇవ్వవలసి ఉంటుంది. కనీసం ఏడున్నర తులాల బంగారం లేదా దాని విలువకు సమానమైన డబ్బు ఒక ఏడాదిపాటు కలిగి ఉన్న వారు రెండున్నర శాతం జకాత్ చెల్లించాలి. వ్యవసాయ రాబడి నుండి తీసే జకాత్‌ను 'ఉ్ష్' అంటారు. వర్షాధారంతో పండేపంట నుంచి ఇరవైశాతం, కృత్రిమ నీటి పారుద లతో పండే పంట నుంచి పది శాతం 'ఉ్ష్' తీసి దైవమార్గంలో దానం చేయాలి. ఇలా ప్రతిధనికుడు, ప్రతి భూస్వామి తన సంపదనుండి జకాత్, ఉ్ష్‌లను తీసి పేదసాదలకు అందజేయాలి. సమాజంలోని ఆర్థిక అసమానతలు తొలగించడానికి ఇస్లాం చూపిన మార్గం ఇది.

✦ ✦ ✦

# 93. మహత్తర మాసం రమజాన్

**సకల శుభాల మాసం అయిన రమజాన్ మాసం వచ్చేస్తోంది. ఈ నెల పొడుపుతో ప్రారంభమయ్యే రమజాన్‌ను భక్తి శ్రద్ధలతో జరుపుకునేందుకు ముస్లిం సోదరులు సమాయత్తమవుతున్నారు. రమజాన్ నెల విశిష్టతలు, పరమార్థాలను గురించి రంజాన్ నెలకు ఘనస్వాగతం పలుకుతూ ముహమ్మద్ ప్రవక్త (సఅసం) బోధించిన రమజాన్ నెల ప్రత్యేకతలు:**

చూస్తూ ఉండగానే వరాల వసంతమైన రమజాన్ మాసం రానే వచ్చింది. పట్టణాలు, గ్రామాలలోని మసీదులన్నీ నమాజీలతో కళకళలాడం ప్రారంభమైంది. ఇస్లామీ ధర్మశాస్త్రంలో ఈ మాసానికి ఎనలేని ప్రాముఖ్యముంది. సంవత్సరం మొత్తంలో ఈ మాసానికున్న ప్రాముఖ్యం మరే మాసానికి లేదు. రమజాన్ మాసానికి ఘన స్వాగతం పలకడానికి గాను దానికి ముందు మాసమైన షాబాన్ మాసం నుంచే మనసును సిద్ధంగా ఉంచుకోండని ముహమ్మద్ ప్రవక్త ప్రజలకు పిలుపునిచ్చారు. ఆయన షాబాన్ మాసంలో కూడా అత్యధికంగా ఉపవాసాలు పాటించేవారు. షాబాన్ మాసం చివర్లో ముహమ్మద్ ప్రవక్త ప్రజలనుద్దేశించి ఇలా ఉపదేశించారు. 'ప్రజలారా! బాగా వినండి. మీకోసం ఒక మహత్తరమైన మాసం రాబోతుంది. ఆ మాసం ఉపవాసాలను దైవం మీపై విధిగా నిర్ణయించాడు. ఆ మాసంలో స్వర్గంలోని ద్వారాలన్నీ తెరిచి ఉంటాయి. ఆ మాసంలో ఎవరైనా ఒక సత్కార్యాన్ని సంతోషంతో అంతర్ ప్రేరణతో చేసినట్లయితే ఆ సత్కార్యం ఇతర మాసాల్లో 'విధి'గా చెయ్యవలసిన ఒక కార్యంతో సమానంగా పరిగణించబడు తుంది. అలాగే ఎవరైనా ఆ మాసంలో విధిగా చెయ్యవలసిన ఒక కార్యాన్ని నిర్వహించి నట్లయితే అది ఇతర మాసాల్లో 70 విధులను నిర్వహించిన దానితో సమానంగా పరిగణిం చడం జరుగుతుంది.'

## రమజాన్‌కు స్వాగతం

రమజాన్ మాసం సహనం చూపాల్సిన మాసం, సహనానికి ప్రతిఫలంగా స్వర్గం లభిస్తుంది. ఇది సమాజంలోని నిరుపేదల పట్ల సానుభూతి చూపవలసిన మాసం. ఎవరైతే రమజాన్ మాసం శుభాలను కోల్పోతారో వారు అత్యంత దురదృష్టవంతులు అని ముస్లిం, బుఖారీల్లోని హదీసుల ద్వారా తెలుస్తోంది. అత్యంత శ్రద్ధాసక్తులతో, భయభక్తులతో రమజాన్ మాసానికి ఘనస్వాగతం పలకడానికి సన్నద్ధం కావాలి. హజ్రత్ ఆయేషా గారి ఉల్లేఖనం ప్రకారం రమజాన్ మాసం నెలవంకను చూసి ఇలా ప్రార్థించాలని ముహమ్మద్ ప్రవక్త సెలవిచ్చారు. 'అల్లాహు అక్బర్' అల్లాహుమ్మ అహిల-హు అలైన బిల్ అమ్‌ని వల్ ఈమాని, వస్సలామతి వల్ ఇస్లామి వత్తౌఫీఖి లిమాను హిబ్బువతర్‌జారబ్బునా వరబ్బుకల్లాహ్' – దేవుడు అందరికంటే గొప్పవాడు. దేవా! ఈ చంద్రుణ్ణి మా పట్ల శాంతి, విశ్వాసంగల శ్రేయస్కరమైన శాంతి నెలవంకగా ఉదయింపజేయి. నీకు అభీష్టమైన, ప్రీతికరమైన పనులు చేసేలా మమ్మల్ని కటాక్షించు. ఓ నెలవంకా! నీ ప్రభువూ, మా ప్రభువూ అల్లాహ్‌యే.

## రమజాన్ సంకల్పం

రమజాన్ ఉపవాస వ్రతం ప్రారంభించడానికి సంకల్పం ఇలా చేసుకోవాలని, విరమణ సమయంలో ఈ ప్రార్ధన చేయాలని ముహమ్మద్ ప్రవక్త ఉపదేశించారు.

**ఉపవాస సంకల్పం :** నవయ్‌తు మిన్ సౌమి గదన్ (రేపటి ఉపవాసానికి సంకల్పించుకుంటున్నాను)

**ఉపవాస విరమణ సమయంలో :** అల్లాహుమ్మ లకసుంతు వబిక ఆమంతు, వ అలైక తవక్కల్‌తు, వ అలారిజ్‌ఖిక అఫ్‌తర్‌తు. (ప్రభూ! నీ కోసం ఉపవాసాన్ని పాటించాను. నిన్నే నమ్ముకున్నాను. నీవు ప్రసాదించిన ఆహారంతోనే వ్రతాన్ని విరమిస్తున్నాను).

✦ ✦ ✦

# 94. ఉపవాసం అల్లాహ్‌కు ప్రియం

**రమజాన్ మాసపు ఉపవాసాలు మొదలయ్యాయి. ఆకాశంలో సూర్యుడు ఉన్నంత వరకు ఏ విధమైన ఆహారం తీసుకోకుండా రమజాన్ రోజాలు ఆచరించడం ఇస్లాం సంప్రదాయం. అల్లాహ్‌కు ప్రియమైన ఈ ఉపవాసం పాటించడంలో నియమాలు.. నిబంధనలు..**

పవిత్ర రమజాన్ మాసపు ఉపవాసాలను ప్రాజ్ఞత వచ్చి, తనను నమ్మే స్త్రీ పురుషులందరిపై అల్లాహ్ విధిగా నిర్ణయించాడు. ఆరోగ్యవంతులైతే తప్పకుండా ఉపవాసం (రోజా) ఉండాలి. ఎందుకంటే పవిత్ర ఖుర్‌ఆన్‌లో దేవుడు 'విశ్వసించిన ఓ ప్రజలారా! ఉపవాసం మీపై విధిగా నిర్ణయించడమైనది. ఇదే విధంగా పూర్వం దైవ ప్రవక్తల్ని అనుసరించిన వారికి కూడా రోజా విధిగా ఉండేది. దీనివల్ల మీలో భయభక్తులు జనించే అవకాశం ఉంది' అని సెలవిస్తున్నాడు. ఈ ఉపవాసాలను తిరస్కరించిన వారు విశ్వాసాన్ని కోల్పోయి మత భ్రష్టులు, మార్గ భ్రష్టులు అవుతారు.

## ఉపవాస నియమాలు

ఉపవాసం (రోజా) ఉండదలచిన వారు తెల్లవారుజామున సూర్యోదయానికి ముందే నాలుగు ఐదు గంటల మధ్య అన్నపానీయాలను సేవించాలి. దీన్ని 'సహెరి' అంటారు. తరువాత సాయంత్రం సూర్యాస్తమయం అయ్యేంత వరకూ పచ్చి మంచి నీరయినా ముట్టకూడదు. సూర్యాస్తమయం కాగానే ఉపవాసాన్ని విరమిస్తారు. దీన్ని 'ఇఫ్తార్' అంటారు. ఉపవాసం ఉండేవారు తప్పకుండా 'సహెరి' చేయాలి. అంటే తెల్లవారుజామున తినాలి, తాగాలి. ఆకలిగా లేకపోయినా కొద్దిగానైనా తినడం ఉత్తమం. కనీసం మంచినీళ్లయినా తాగాలి. దీనివల్ల ఉపవాసంలో అలసట అనిపించదు. రాత్రే ఉపవాస సంకల్పం చేసుకోవడం మంచిది. సహెరి చేయడంలో నిదానం కనబరచాలి. ఇఫ్తార్ చెయ్యడంలో త్వరపడాలి. అంటే సూర్యాస్తమయం తర్వాత ఆలస్యం చేయకూడదు.

అబద్ధాలు, చాడీలు అన్ని వేళలా అధర్మమే అయితే ఉపవాస సమయంలో వీటిని మరీ కఠినంగా మానుకోవాలి. చెడు మాటలకు, చెడు చేష్టలకు దూరంగా ఉండాలి. ఎవరైతే ఉపవాసం ఉంటూ కూడా అబద్ధాలు పలికితే అటువంటి వారు దైవం కోసం ఉపవాసం ఉండడం కాక ఆకలి దప్పులతో పడి ఉండడంతో సమానం. ఇటువంటి ఉపవాసుల పట్ల దేవునికి ఏ మాత్రం ఆసక్తి ఉండదు.

## ఉపవాస కవచం

ఉపవాసం ఒక కవచం లాంటిది. అందుకని ఎవరైనా ఉపవాసం ఉంటే వారు అసభ్య పనులు, అసభ్య ప్రేలాపనలు చేయకూడదు. అజ్ఞానంతో ఎవరైనా తిట్టినా, కయ్యానికి కాలు దువ్వినా తాము ఉపవాసం ఉన్నామనే విషయాన్ని వారు జ్ఞాపకం ఉంచుకోవాలి. దానధర్మాలు అధికంగా చేయాలి. పవిత్ర గ్రంథం ఖుర్ఆన్‌ను వీలైనంత ఎక్కువగా పారాయణం చెయ్యాలి. అల్లాహ్ పవిత్ర నామాన్ని స్మరిస్తూ జపిస్తూ ఉండాలి. ముహమ్మద్ ప్రవక్త వారిపై సలాములు పంపుతూ ఉండాలి. అంటే దరూదెషరీఫ్ పఠిస్తూ ఉండాలి. ఖర్జూరపండుతో ఉపవాసాన్ని విరమించాలి. ఖర్జూరం లేని పక్షంలో మంచినీళ్లతో ఇఫ్తార్ చేయడం ఉత్తమం. ఉపవాసం ఉన్నవాళ్లు కళ్లకు సుర్మా పెట్టుకోవచ్చు. శరీరానికి, తలకు నూనె రాసుకోవచ్చు. చల్లదనం కోసం తలస్నానం కూడా చేయవచ్చు. మిస్వాక్ (దంత ధావనం) చెయ్యవచ్చు. సుగంధ ద్రవ్యాలు పూసుకోవచ్చు. వాటి వాసన కూడా చూడవచ్చు. మన ప్రమేయం లేకుండా దానంతటఅదే వాంతి అయిపోయినా రోజాకేమీ భంగం వాటిల్లదు. దోమగాని, ఈగ గాని యాదృచ్ఛికంగా లోపలికి పోయినా రోజాకేమీ నష్టం జరగదు. అత్యవసర పరిస్థితుల్లో వైద్య అవసరాల కోసం శరీరం నుంచి రక్తం తీయడానికి కూడా అనుమతి ఉంది. మానవ సహజ బలహీనతలు, వారి కష్ట సుఖాలను బాగా ఎరిగిన దేవుడు రమజాన్ మాసపు ఉపవాసా లను విధిగా నిర్ణయించినప్పటికీ కొందరికి మినహాయింపు ప్రసాదించాడు. చిన్న పిల్లలు, బాటసారులు అంటే ప్రయాణంలో ఉన్నవారు, వ్యాధిగ్రస్తులు, వృద్ధులు, గర్భవతులు, బాలింతలు, మతి స్థిమితం లేని వారు, అపరిశుద్ధావస్థలో ఉన్న మహిళలు ఇటువంటి వారికి ఉపవాసం నుంచి మినహాయింపు ఉంది.

## చేయకూడని పనులు

ఇకపోతే ఉపవాస కాలంలో ఏదన్నా వస్తువు నోట్లో వేసుకొని నమలడం గాని, ముఖ్యంగా ముక్కుల్లోకి నీళ్లు పీల్చేటప్పుడు, పుక్కిలించేటప్పుడు మితిమీరి వ్యవహరించకూడదు. నోట్లో లాలాజలాన్ని పోగుచేసి మింగకూడదు. నిందలు, అభాండాలు వేయకూడదు. అసభ్యంగా మాట్లాడకూడదు. అలాంటి మాటలు వినకూడదు. ఉపవాసం వల్ల బాధ కలుగుతుందన్న భావాన్ని ప్రదర్శించకూడదు. ఉపవాసం ఉండి మసిబొగ్గుతో, పేస్టుతో, పళ్లపొడితో పళ్లు తోమకూడదు. గుసుల్ చేయడం వాజిబ్ అయినప్పటికీ (స్నానం చేయడం తప్పని సరి అయినప్పటికీ) తెల్లవారిన తర్వాత చేయవచ్చులే అని నిర్లక్ష్యం వహించకూడదు. ఇవన్నీ మక్రూ అంటే అవాంఛనీయ విషయాలు.

ఉపవాసాన్ని భంగపరిచేవి మరికొన్ని పనులు కూడా ఉన్నాయి. అవేమిటంటే, ఉపవాసం ఉండి కావాలని బుద్ధిపూర్వకంగా తినడం, తాగడం, సంభోగించడం వల్ల ఉపవాసం భంగమై పోతుంది. ఉపవాసాన్ని భంగపరచడం మహాపాపం, భంగమైన ఉపవాసాలను ఖజా చేయడంతో పాటు పరిహారం కూడా చెల్లించాలి. అంటే ఒక్కో ఉపవాసానికి పరిహారంగా రెండు నెలలు ఎడతెగకుండా ఉపవాసాలు పాటించాలి. లేకపోతే అరవై మంది నిరుపేదలకు రెండు పూటలా కడుపునిండా భోజనం పెట్టాలి. ఉద్దేశపూర్వకంగా వాంతి చేసుకున్నా ఉపవాసం భంగమవుతుంది. లేక వచ్చే వాంతిని ఆపి మింగినా భంగమవు తుంది. ఉపవాస నియమాలను క్షుణ్ణంగా తెలుసుకుని రమజాన్ పవిత్ర దినాలను అల్లాహ్ స్మరణతో గడపండి.

✦ ✦ ✦

# 95. నిర్మల తేజం.. రమజాన్

పవిత్ర రమజాన్ మాసంలో విశ్వాసుల కర్తవ్యాలను ఖుర్ఆన్ వివరించింది. రమజాన్ మాసపు పవిత్రతను గురించి పలు సందర్భాల్లో ముహమ్మద్ ప్రవక్త స్పష్టం చేశారు. రమజాన్ మాసపు ప్రత్యేకతలు, పవిత్రతకు కారణాలు, ఈ మాసంలో విశ్వాసుల కర్తవ్యాలను గురించి..

శుభప్రదమైన పవిత్ర రమజాన్ మాసం విశ్వాసభాగ్యం పొందిన యావత్తు మానవ సమాజాన్ని తన కరుణా కటాక్ష వీక్షణాలలో ఓలలాడిస్తోంది. మానవ సహజ లోపాలను సరిదిద్దుకోవాలనుకునేవారు, పాపపంకిల జీవితాలను పరిశుద్ధ పరుచుకోవాలనుకునే వారు, సత్కార్యాభిలాషులైన సచ్ఛీలురు ఈ మాసపు పరిశుద్ధతను ఆస్వాదించవచ్చు. శుభసుగంధాలు వెదజల్లే పవిత్ర రమజాన్ మాసాన్ని సముచితమైన హుందాతనంతో స్వాగతం పలకడానికి షాబాన్ మాసం నుంచే మనసును సిద్ధపరుచుకో వాలని ముహమ్మద్ ప్రవక్త ప్రవచించారు. అత్యంత శ్రద్ధాభక్తులతో రమజాన్ నెలవంకను చూసి ఇలా ప్రార్థించమని ముహమ్మద్ ప్రవక్త ఉపదేశించారు. 'ఓ దేవా! ఈ నెలవంకను మాకోసం శాంతి భద్రతల నెలవంకగా, ఇస్లాం నెలవంకగా ఉదయింపచేయి. నీకు ప్రీతికరమైన పనులన్నీ చేసే భాగ్యాన్ని మాకు అనుగ్రహించు. ఓ నెలవంకా! నీ దేవుడూ, మా దేవుడు అందరి దేవుడు అల్లాహ్ మాత్రమే'

## పవిత్రతకు మూడు కారణాలు

పవిత్ర రమజాన్ మాసంలో ఆరాధనల పట్ల ప్రత్యేకమైన శ్రద్ధను, ప్రేమను పెంపొందించుకుని రోజా వ్రతం పాటించాలి. ఫర్జ్, సున్నత్, నఫిల్‌లు మాత్రమే కాకుండా ప్రత్యేకంగా అదనపు తరావీ నమాజ్‌లు ఆచరిస్తూ సత్కార్యాలు, పుణ్యకార్యాలు అధికంగా చేయడానికి ప్రయత్నించాలి. ఈ మాసం ఔన్నత్యానికి, గొప్పతనానికి సంబంధించి పవిత్ర ఖుర్ఆన్‌లో మూడు కారణాలు ఉన్నాయి. మొదటి కారణం: సమస్త మానవాళికి మార్గ దర్శక గ్రంథమైన పవిత్ర ఖుర్ఆన్ ఈ మాసంలోనే అవతరించింది. రెండోది మానవుల మానసిక, ఆధ్యాత్మిక వికాసానికి పూలబాటలు పరిచే ఉపవాస వ్రతం

ఈ మాసంలోనే విధిగా పాటించాలి. మూడో కారణం వేయి మాసాలకన్నా విలువైన రాత్రిగా భావించే 'లైలతుల్ ఖద్ర్' ఈ మాసంలోనే ఉన్నది. కాబట్టి ఈ పవిత్ర మాసంలో దైవంతో మన సంబంధాలు పటిష్టపరుచుకోవాలి.

## ఇతరులను ప్రేరేపించాలి

రమజాన్ మాసంలో దేవుడు తన సింహాసనాన్ని మోసే దైవదూతలతో 'మీరు మీ సేవలు, ఆరాధనలు వదిలేసి ఉపవాసం పాటించేవారి ప్రార్థనలకు తథాస్తు పలకండి' అని ఆదేశిస్తాడు. ఇంతటి ఔన్నత్యం కలిగిన ఈ పవిత్ర మాసంలోని శుభఘడియల్లో స్వయంగా పుణ్యకార్యాలు ఆచరించడమే కాకుండా, ఇతరుల్ని కూడా మృదుభాషణతో వివేక విజ్ఞతలతో సత్కార్యాల వైపు ప్రేరేపించాలి. ఇలా చేయడం వల్ల సమాజ వాతా వరణంలో దైవభక్తి భావాలు అంకురించి ఎల్లెడలా పవిత్రత వెల్లివిరుస్తుంది. ఈ మాసంలో స్వర్గద్వారాలు తెరిచి ఉంటాయి. నరక ద్వారాలు మూసి ఉంటాయి. షైతానులు బంధితులై ఉంటారు. దైవం తరపున పిలిచేవాడొకడు ఎలుగెత్తి పిలుస్తాడు. 'మంచిని, మేలును కాంక్షించే ఓ మనిషీ ముందుకు రా, చెడును కీడును తలపోసే ఓ మనిషీ ఆగిపో' అని ప్రకటిస్తాడు. రమజాన్ మాసంలో ప్రతిరాత్రి దేవుడు ఎంతోమంది నరకవాసులకు నరకం నుంచి విముక్తి కలిగిస్తాడు. ఈ పవిత్రమాసంలోని ప్రతి క్షణాన్ని సద్వినియోగం చేసుకోవడం వివేకవంతుల లక్షణం.

✦ ✦ ✦

# 96. ఫిత్రాదాన పరమార్థం ఉపవాసదోష పరిహారం

మనసా, వాచా, కర్మణా ఉపవాస వ్రతం పాటించేవారిని 'సత్కార్యాలప్రతిరూపం' అనవచ్చు. వారి బాహ్య శరీరంలో పవిత్రాత్మ ప్రతినిత్యం జాగృతమై ఉంటుంది. వ్రతం పాటించే వారు అసత్యాలు, చాడీలు, అసభ్య పలుకులు, ఇతరుల మనసు నొప్పించడం, వారి హక్కుల్ని హరించడం వంటి పనులు చేయరు. అన్ని రకాల చెడుల నుంచి దూరంగా ఉంటారు. కనీసం ఉండడానికైనా ప్రయత్నిస్తారు. కానీ ఏదో ఒక పొరపాటు జరిగి పోతూనే ఉంటుంది. అలాఉపవాసం ఏ విధమైన మచ్చలేకుండా పరిపూర్ణంగా ఉండడం అనేది అసంభవం. అందుకే ముహమ్మద్ ప్రవక్త ఇలాంటి లోపాలకు అతీతంగా ప్రత్యేకమైన దానం చేయవలసిందిగా హితవు చెప్పారు. దీన్ని ఇస్లామీ ధర్మశాస్త్ర పరిభాషలో 'సద్ఖ-యె-ఫిత్ర్' అంటారు.

ఒక ప్రవచనంలో ఇలా ఉంది. 'ఫిత్రాదానం చెల్లించనంత వరకు రమజాన్ ఉపవాసాలు భూమ్యాకాశాల మధ్య వేలాడుతూ ఉంటాయి.ప్రవక్త ఫిత్రాదానాన్ని విధిగా నిర్ణయించారు. ఇది ఎందుకంటే ఉపవాసి యొక్క ఉపవాసం అసభ్యం, అశ్లీలాల మరకల నుంచి పరిశుద్ధం కావడానికి.'

హజ్రత్ ఇబ్నె ఉమర్ ఉల్లేఖనం ప్రకారం ముహమ్మద్ ప్రవక్త సద్ఖ ఫిత్రాగా ఒక 'సా' (పావు తక్కువ రెండు శేర్లు) ఖర్జూరం లేక 'జౌ' జొన్నలు, గోధుమలు కానీ ఏదో ఒకటి చెల్లించాలని ఉపదేశించారు. నగదుగా కూడా చెల్లించవచ్చు. దీని వల్ల రెండు లాభాలు ఉన్నాయి. ఒకటేమిటంటే మానవ సహజ బలహీనతల వల్ల ఏదైనా చిన్న చితకా పొరపాట్లు ఉపవాస కాలంలో జరిగితే అవి పరిహారం అవుతాయి. రోజా పరిపూర్ణతను సంతరించుకుంటుంది. రెండోది ఏమిటంటే ఈ ఫిత్రాదానాల వల్ల సమాజంలోని పేదవారికి కాస్త కడుపునిండా తిండి దొరికే మార్గాలు తెరుచుకుంటాయి.

అందుకే ముహమ్మద్ ప్రవక్త మహనీయులు ఫిత్రాదానాన్ని 'తూమతుల్లిల్ మసాకీన్' అన్నారు. అంటే ఇది దీనులు, నిరుపేదల భృతి అని అర్థం. అందుకని ఈ పవిత్ర

మాసంలో ముస్లింలు అందరూ ఫిత్రాలు చెల్లిస్తారు. కేవలం ఉపవాసం ఉన్నవారు మాత్రమే కాకుండా ముస్లింలు అందరూ ఈ దానం చెల్లించడం విధి. కుటుంబంలో ఎంతమంది సభ్యులుంటే అంతమంది తరపున ఫిత్రా చెల్లించాలి. పండుగ రోజు నమాజు కంటే ముందు జన్మించిన శిశువు తరపున కూడా ఫిత్రా చెల్లించవలసి వుంటుంది. పావు తక్కువ రెండు శేర్లు గోధుమలు గానీ దాని ఖరీదు కానీ ఎలాగైనా ఈ దానం చెల్లించవచ్చు. దీని వల్ల సమాజంలోని పేదవారు కూడా ఈ ఆర్థిక సాయంతో తమకు కావలసిన పండుగ సామగ్రిని కొనుక్కుని అందరితో పాటు పండుగ సంబరాల్లో పాలుపంచుకునే అవకాశం ఉంటుంది. అందుకని పండుగకు నాలుగైదు రోజులు ముందుగానే ఈ విధిని నెరవేర్చుకోవడం శ్రేయస్కరం.

✦ ✦ ✦

# 97. ఉపవాసంతో దైవభీతి

**ఖుర్‌ఆన్ గ్రంథం అవతరించిన పవిత్రమాసం రమజాన్ మాసం. ఈ సమయంలో ఉపవాసాలు పాటించడం వల్ల దైవభీతి కలుగుతుంది. ఉపవాసం అంటే కేవలం అన్నపానీయాలు మానుకోవడం కాదు, మనలోని చెడును పారద్రోలి, మంచిని పెంచుకోవడమే ఉపవాసం పరమలక్ష్యం. రమజాన్ ఉపవాస దీక్షల పరమార్థం...**

పరమ పవిత్రమైన రమజాన్ మాసాన్ని గురించి, ఈ మాసంలో పాటించే ఆరాధనల గురించి ఎంత చెప్పుకున్నా తక్కువే. అన్ని మాసాలకంటే రమజాన్ మాసం అత్యంత ఘనమైన మాసం. ఈ మాసంలోనే సమస్త మానవుల మార్గదర్శిని, మోక్షప్రదాయిని అయిన పవిత్ర ఖుర్‌ఆన్ గ్రంథం అవతరించింది. ఇది యావత్తు మానవ జాతికి దైవం ప్రసాదించిన మహాభాగ్యం. మానవుల శ్రేయోసాఫల్యాల కోసం, ఉపవాస వ్రతం (రోజా) అనే ఒక ప్రత్యేక ఆరాధన కోసం దైవం ఈ మాసాన్ని ఎన్నుకున్నాడు. ఇతర మాసాల్లో చేసే ఆరాధనలకన్నా ఈ మాసంలో ఆచరించే ఆరాధనలు ఎంతో విలువైనవి. కాబట్టి పూర్తి చిత్తశుద్ధితో, ఏకాగ్రతతో, నియమనిష్టలతో ఉపవాస వ్రతాన్ని ప్రారంభించాలి. ఈ విధంగా రోజా పాటించినప్పుడు మాత్రమే దాని ప్రయోజనాలను మనం పొందగలుగుతాము. అనుక్షణం మనం మన అంతరంగంలోకి తొంగి చూసుకుంటూ రోజా నిబంధనలను ఖచ్చితంగా పాటిస్తున్నామా లేదా అని ఆత్మపరిశీలన చేసుకోవాలి.

## చెడుకు స్వస్తి

ఇక్కడ మనం ఒక విషయాన్ని గమనించాలి. తెలిసో, తెలియకో మనం నిత్యం ఈ నిబంధనలను పాటిస్తూనే ఉంటాం. కానీ దైనందిన విషయాల్లో మన వైఖరి ఎలా ఉంటుందో మనం ఎప్పుడైనా ఆలోచిస్తున్నామా?ప్రశాంత చిత్తంతో మనం ఒకసారి

ఆత్మపరిశీలన చేసుకుంటే మన పొరపాట్లు ఏమిటో గమనించగలుగుతాం. అబద్ధాలాడడం, చాడీలు చెప్పడం, ఇతరుల్ని నిందించడం, ప్రజల సొమ్ము కోసం పాకులాడడం, దుర్భాషలాడడం, లంచాలు మెక్కడం, ఇతరుల శ్రమను దోచుకోవడం, అక్రమాలకు, దౌర్జన్యాలకు పాల్పడడం లాంటి అనేక పొరపాట్లు మనవల్ల జరుగుతూ ఉంటాయి. అయితే వీటికి ఉపవాస వ్రతానికి లేదా దైవారాధనకు సంబంధం ఏమిటి? అని కొంతమంది అమాయకంగా ప్రశ్నించవచ్చు. వాస్తవానికి ఈ చెడులను నిర్మూలించడమే ఉపవాస వ్రతం అసలు లక్ష్యం.

## దైవభీతి సుగుణం

ఉపవాస వ్రతం వల్ల దైవభీతి జనిస్తుంది. ఎవరి హృదయంలో దైవభీతి ఉంటుందో ఆ వ్యక్తి ఎలాంటి చెడుకు, దుర్మార్గాలకు పాల్పడలేదు. అందుకే 'ల అల్లకుం తత్తఖూన్' అంటోంది పవిత్ర ఖుర్ఆన్. ఒక హదీసులో ముహమ్మద్ ప్రవక్త (సల్లం) ఇలా సెల విచ్చారు. 'ఉపవాస వ్రతం వల్ల మీలో దైవభీతి అనే సుగుణం జనిస్తుంది. ఎవరైతే విశ్వాస శుద్ధితో, దైవ ప్రసన్నతను, ఆయన ప్రసాదించే పుణ్యఫలాన్ని పొందాలన్న కాంక్షతో ఉపవాసవ్రతం పాటిస్తారో అలాంటి వారి తప్పిదాలను దైవం క్షమించి వేస్తాడు.'

## మంచికి మూలం

ఉపవాస వ్రతం పాటించడం అంటే కేవలం అన్న పానీయాలను వదిలేయడం అని కాదు. అన్ని రకాల చెడు కార్యాలకు స్వస్తి చెప్పి మంచి పనులు అవలంబించడం ఉపవాస వ్రతం అసలు లక్ష్యం, ఈ లక్ష్యానికి అనుగుణంగా మన దైనందిన జీవితాన్ని మార్చుకోకపోతే ఉపవాస వ్రతం వల్ల కలిగే ప్రయోజనాలేవీ మనకు లభించవు. అందుకే ప్రవక్త మహనీయులు ముహమ్మద్ (సల్లం) ఇలా అన్నారు: "ఎవరైతే ఉపవాసవ్రతం పాటిస్తూ అసత్యం పలకడం, అసత్యాన్ని ఆచరించడం, మానుకోరో అలాంటి వారు ఆకలిదప్పులతో పస్తులున్నా దైవానికి ఏమాత్రం ఆసక్తి లేదు. అందుకని ఈ పవిత్ర మాసంలో మనం సత్కార్యాలు చేయడంలో, చిత్తశుద్ధితో కూడిన వ్రతం పాటించడంలో అత్యంత శ్రద్ధ చూపించాలి. వ్రతం పాటిస్తూ నమాజులు ఆచరిస్తూ గ్రంథ పారాయణం చేస్తూ రాత్రులు ప్రత్యేకంగా 'తరావీహ్' నమాజులు ఆచరించిన వారిని దైవం అమితంగా కరుణిస్తాడు."

# 98. రోజా, ఫిత్రాలతో గొప్ప పుణ్యం

**మనం భక్తితో చేసే చాలా కార్యక్రమాలు బాహ్యప్రపంచానికి తెలుస్తాయి. ఉపవాసం అలాకాదు. అది దేవునితో భక్తునికి ప్రత్యక్ష సంబంధాన్ని ఏర్పరు స్తుంది. ఉపవాసం అంతటి గొప్పది. రమజాన్ మాసంలో చేసే దానం కూడా అంతే గొప్ప ఫలితం ఇస్తుంది.**

పవిత్ర రమజాన్ మాసం శుభాలను గురించి, ఈ మాసంలో ఆచరించే కర్మల ప్రతిఫలం గురించి ఎంత చెప్పుకున్నా తక్కువే. నిజానికి ఉపవాసం (రోజా) ఒక మహత్తర మైన, మహోన్నతమైన ఆరాధన. ప్రత్యక్షంగా దైవానికి, దాసునికి మధ్య మాత్రమే సంబంధం కలిగి ఉన్న ఆరాధన. ఇతర ఆరాధనలకు ఉపవాసానికి ఒక స్పష్టమైన తేడా ఉంది. మానవుల ప్రతి చర్యనూ దైవం గమనిస్తాడు. సాటి ప్రజలు కొన్నింటిని గమనిస్తే మరి కొన్నింటిని గమనించలేరు. ఉదాహరణకు నమాజ్ (దైవ ప్రార్థన) ఒక ఆరాధన. దీన్ని ఆచరిస్తున్నప్పుడు దైవమూ చూస్తాడు. ప్రజలూ గమనిస్తారు. నమాజ్‌లో నిలబడడం, కూర్చోవడం, సాష్టాంగ ప్రమాణం ఇవన్నీ ఉంటాయి. దాంతో పాటు ఫర్జ్ నమాజ్‌లు సామూ హికంగా మసీదులలో చేస్తారు. కాబట్టి అందరూ చూస్తారు. అలాగే జకాత్ (ఆర్థిక దానం) దానం కూడా ఒకరు ఇచ్చేవాళ్లయితే, మరొకరు తీసుకునే వాళ్లు. కాబట్టి ఎంత గుప్తంగా దానం చేసినా కనీసం ఒక్కరికైనా తెలిసే అవకాశం ఉంది. అలాగే హజ్. ఇది కూడా వేలాది, లక్షలాది మందితో కలిసి ప్రయాణం, కలిసి ప్రార్థనలు చేస్తారు. కాబట్టి ఇది కూడా బాహ్యంలో అందరికీ కనిపించే ఆరాధనే. ఇలాగే మిగతా ఆరాధనలన్నీ.

## దైవం, భక్తుల మధ్య ప్రత్యక్షబంధం

కాని ఒక్క ఉపవాస (రోజా) ఆరాధన మాత్రం కేవలం దైవం, దైవ దాసునికి మాత్రమే సంబంధించిన ప్రత్యేక ఆరాధన, ఒక మనిషి గుట్టు చప్పుడు కాకుండా పగటి వేళ కడుపు నిండా మెక్కి 'నేను ఉపవాసం ఉన్నాను' అని ప్రజల్ని నమ్మించవచ్చు. కాని

దైవ విశ్వాసులైన వారెవరూ అలా చేయరు. ఎందుకంటే అతడు రోజా పాటిస్తున్నది పరుల కోసం కాదు. దైవం కోసం అన్న స్పృహ అతనికి ఉంటుంది. అందుకే 'రోజా నాది, దాని ప్రతిఫలం స్వయంగా నేనే నా దాసునికిస్తాను' అన్నాడు దైవం. అంటే రోజా ఒక్కటే దైవానిది, ఇతర ఆరాధనలు దైవానివి కావు అనే అర్థం ఎంత మాత్రం కాదు. వాస్తవం ఏమిటంటే ఇతర ఆరాధనల విషయంలో ఒక పరిమితి ఉంది. కాని రోజా విషయంలో మాత్రం అలాంటి పరిమితి లేదు. ఉపవాస ప్రతిఫలాన్ని దైవం అనంతంగా ప్రసాది స్తాడు. ఎంత కోరితే అంత, మానవ ఊహకు సైతం అందనంతటి ప్రతిఫలం ఉపవాసికి ప్రత్యేకం.

## ఉపవాసికి స్వర్గప్రవేశం

అంతేకాదు ఉపవాసుల కోసం వారి గౌరవానికి తగినట్టు ఒక ప్రత్యేక ద్వారం గుండా వారికి స్వర్గ ప్రవేశం కల్పిస్తాడు. ఉపవాసులు మాత్రమే స్వర్గంలో ప్రవేశించగలిగే ఆ ద్వారం పేరు 'రయ్యాన్' (ముత్తఫిఖున్ అలైహ్).

అందుకని రమజాన్ ఉపవాసాలను అత్యంత శ్రద్ధా భక్తులతో పాటించాలని, ఉపవాసాల ద్వారా మనిషిలో నిజమైన దైవభక్తి, దైవ భీతి, సహనగుణం, పరోపకారం, జాలి, దయ, కరుణ, సానుభూతి లాంటి సాత్విక గుణాలు జనించాలని ముహమ్మద్ ప్రవక్త (సం) ఉపదేశించారు.

## లోపాలను సరిదిద్దే - ఫిత్రా

అలాగే ఈ పవిత్ర మాసంలో ప్రతి ఒక్కరూ ఫిత్రా దానం చెల్లించాలి. ఫిత్రా దానం వల్ల రెండు ప్రయోజనాలు పొందే అవకాశం ఉంది. ఒకటి ఉపవాస కాలంలో యాధృచ్ఛి కంగా, పొరపాటుగా, (కావాలని, బుద్ధి పూర్వకంగా కాకుండా) వ్రతం పాటిస్తున్న వ్యక్తి వల్ల ఏదైనా చిన్నపాటి తప్పిదం జరిగితే ఫిత్రాదానం అలాంటి లోపాన్ని పూరిస్తుంది. రెండవది దీనివల్ల పేదల పండుగ అవసరాలు తీరుతాయి. అందుకే ఫిత్రాను పండుగ కంటే వారం రోజుల ముందే ఇచ్చేస్తే పేదలు ఆ పైకంతో కొత్త వస్త్రాలు, పండుగ సామగ్రి కొనుక్కోవడానికి వీలు కలుగుతుంది. ఫిత్రా దానంగా పావు తక్కువ రెండు శేర్లు

గోధుమలు దానం చేయాలి. కానీ ఇది గోధుమలు, 'జౌ'ల కాలం కాదు కాబట్టి ఈ నాటి మార్కెట్ రేటుప్రకారం నగదు కాని, వస్త్రాలు కాని వారి అవసరాన్ని దృష్టిలో పెట్టుకుని దానం చేయాలి. ఇంట్లోని కుటుంబ సభ్యులందరి తరపున ఫిత్రా దానం చేయాలి. పేద సాదలను ఆదుకోని ఆరాధనల వల్ల ఎలాంటి ప్రయోజనమూ కలగదు. ఫిత్రాదానం చెల్లించనంతవరకూ రమజాన్ ఉపవాసాలు (రోజాలు) భూమ్యాకాశాల మధ్య వేలాడుతూ ఉంటాయి. ఫిత్రా దానం పొందడానికి పేదవారైన ముస్లిం, ముస్లిమేతరులు అందరూ అర్హులే. ఇంకా ఈ మాసం చివరి పది రోజులు 'ఏతికాఫ్' కూడా పాటించాలి. 'షబేఖద్ర్' అనబడిన విలువైన రాత్రినీ అన్వేషించాలి.

✦ ✦ ✦

# 99 దైవ విశ్వాసులకు వసంతం

**పవిత్ర రమజాన్ మాసాన్ని ముస్లిం సోదరులంతా భక్తిశ్రద్ధలతో జరుపుకుం టున్నారు. మహిమాన్వితమైన మాసంగా భావించే రమజాన్ నెలలో పాటించవలసిన ముఖ్య విధులు, రోజా వ్రత నియమాలు, ఈ సమయంలో చేయాల్సిన ప్రార్థనలు రమజాన్ సందర్భంగా..**

సత్కార్యాలు చేసేవారికి అన్నీ మంచి నెలలే, అయినా రమజాన్ నెలలో దైవ కారుణ్యం విశేషంగా వర్షిస్తూ ఉంటుంది. దీన్ని సద్వినియోగం చేసుకోవడానికి శక్తివంచన లేకుండా కృషి చేయాలని, ఒక వ్యాపారి వ్యాపార తరుణంలో తన దగ్గరున్న డబ్బునంతా పెట్టుబడిగా పెట్టి, చివరికి తన సొంత అవసరాలను కూడా తగ్గించుకుని, నిద్రాహారాలు మాని ఎలా శ్రమిస్తాడో అంతకంటే ఎక్కువగా దైవ విశ్వాసులు ఈ శుభతరుణంలో శ్రమించాలని ముహమ్మద్ ప్రవక్త ఉపదేశించారు. ఎవరి జీవితం ఎప్పుడు సమాప్తం అవుతుందో ఎవరికీ తెలియదు. అందుకే మానవ జీవితం గాలిబుడగ లాంటిదని చెబుతూ ప్రవక్త, నాకైతే కుడివైపుకు సలాం చెప్పిన తర్వాత ఎడమ వైపుకు సలాం చెప్పే వరకు కూడా శ్వాస ఉంటుందో ఉండదో తెలియని పరిస్థితి అన్నారు. అందుకే ప్రతి సంవత్సరం రమజాన్‌ను శ్రద్ధాభక్తులతో జరుపుకోవాలి.

## రోజా నియమం

దైవకృప వల్ల మనమంతా పవిత్ర రమజాన్ మాసంలో శ్వాస తీసుకుంటున్నాం. ఈ మాసంలోని ఒక్కొక్క క్షణం ఎంతో అమూల్యం, ఎంతో శుభప్రదం. ఇది ఉపవాస దీక్షలు (రోజావ్రతం) ఆచరించాల్సిన మాసం. నమాజులు చేయాల్సిన మాసం. పాప పరిహారం కోసం దైవాన్ని వేడుకునే మాసం. ఈ మాసంలో స్వర్గంలోని ద్వారాలన్నీ తెరిచే ఉంటాయి. అందుకే ఈ మాసంలో తప్పకుండా రోజా వ్రతాన్ని పాటిస్తూ వీలైనంత ఎక్కువ సమయాన్ని నమాజుల కోసం, దైవదాస్యం కోసం, పవిత్ర ఖుర్‌ఆన్ గ్రంథ పారాయణం

కోసం వెచ్చించాలి. శారీరక పరిశుద్ధతతో పాటు ఆత్మ పరిశుద్ధతకు ప్రాముఖ్యత నివ్వాలి. మంచి మాటలే మాట్లాడాలి. లేదా మౌనంగా ఉండాలి. దుర్భాషలు, అశ్లీల పదాలు మాట్లాడకూడదు.

## రమజాన్ ప్రార్ధన

**'లాయిలాహ ఇల్లల్లాహ్ వస్తగ్ఫిరుల్లాహ్ అస్ అలుకల్ జన్నత వ అవూజుబిక మినన్నార్'** రమజాన్ మాసంలో ఈ నాలుగు విషయాలు అత్యధికంగా స్మరించమని ముహ మ్మద్ ప్రవక్త ఉపదేశించారు. 1. లాయిలాహ ఇల్లల్లాహు అనే దేవుని ఏకత్వ వచనాన్ని అత్యధికంగా స్మరించాలి. 2. అవస్తగ్ ఫిరుల్లా అంటూ తమ అపరాధాల మన్నింపుకు దైవాన్ని వేడుకోవాలి. 3. అస్అలుకల్ జన్నత్ స్వర్గాన్ని అనుగ్రహించమని దైవాన్ని అధికంగా ప్రార్ధించాలి. 4. అవూజుబిక మినన్నార్ నరకం నుంచి విముక్తిని ప్రసాదిం చమని వేడుకోవాలి. రమజాన్ మాసంలోని మొదటి పది రోజులూ కారుణ్య దినాలు. పదినుంచి ఇరవై వరకు క్షమాపణా దినాలు. ఇరవై నుంచి ముప్పై వరకు నరకాగ్ని నుంచి విముక్తి దినాలు.

✦ ✦ ✦

# 100. క్రమబద్ధ జీవన విధానం ఉపవాస పరమార్థం

**పవిత్రమైన రమజాన్ మాసంలో ముస్లింలు పగలంతా కఠిన ఉపవాసం చేస్తారు. ఈ ఉపవాసాన్నే రోజా అంటారు. నెల రోజుల ఈ ఉపవాస దీక్షను ఒక శిక్షణగా ఖుర్ఆన్ అభివర్ణించింది. రమజాన్ ఉపవాసాల పరమార్థం ఖుర్ఆన్ ఆధారంగా...**

'యా అయ్యు హల్లజీన ఆమనూ కుతిబ అలైకుముస్సియాము కమాకుతిబ అలల్లజీన మిన్ ఖబ్లికుం ల అల్లకుం తత్తఖూన్'

'విశ్వసించిన ఓ జనులారా! ఏ విధంగానైతే పూర్వ ప్రవక్తల అనుచరులపై ఉపవాసవ్రతం విధిగా ఉండేదో, అలాగే మీరు కూడా ఉపవాసం విధిగా పాటించాలి. దీనివల్ల మీలో భయభక్తులు జనించే అవకాశం ఉంది. (అల్ బఖర్ 183)

## ప్రాచీన ఆరాధన -రోజా

ఉపవాసం ఒక ప్రాచీన ఆరాధన, ఇది ఈ రోజు ఉనికిలోకి వచ్చింది కాదు. ఏనాడైతే మానవజాతి ఉనికిలోకి వచ్చిందో ఆనాటి నుంచి ఈ ఉపవాస దీక్షలు ఉన్నాయి. అన్ని కాలాల్లో, అన్ని దేశాల్లో అన్ని జాతుల్లో, అన్ని మతాల్లో ఉపవాస వ్రతం ఆచరణలో ఉంది. ఇప్పుడు కూడా హిందూసోదరులు, క్రైస్తవ సోదరులు కొన్ని ప్రత్యేక దినాల్లో ఉపవాసాలు పాటించడం మనం చూస్తున్నాం. కాకపోతే ఆచరణా విధానాల్లో కొద్ది మార్పులు ఉంటాయి. కాని మొత్తంగా చూస్తే ప్రాచీన కాలం నుంచి అన్ని మత ధర్మాల్లో ఈ ఆరాధనా విధానం ఉందనేది రూఢి అయిన విషయం. అయితే రమజాన్ సందర్భంగా ఇస్లాం ఉపవాసానికి ఇచ్చే నిర్వచనాలను పరిశీలిద్దాం.

## మనోనిగ్రహం

అరబ్బీ భాషలో ఉపవాసాన్ని 'సౌమ్' అంటారు. సౌమ్ అంటే ఆగిపోవడం,

కట్టుబడి ఉండడం, లోబడి ఉండడం అనే అర్థాలున్నాయి. ఇస్లామీ పరిభాషలో సౌమ్ అంటే ఒక నిర్ణీత కాలం వరకు అన్న పానీయాలను త్యజించి, లైంగిక వాంఛలను అదుపులో ఉంచుకోవడం, మనసు కోరే గొంతెమ్మ కోరికలకు లొంగకుండా ఉండడం, దురాశ, ప్రలోభాల కారణంగా అడుగులు తడబడే సమయంలో నిగ్రహాన్ని, స్థయిర్యాన్ని ప్రదర్శించడం అని అర్థం. తినడం, తాగడం, శృంగార సంబంధాలు మనోవాంఛల్ని, మానవ సహజ కోరికల్ని రెచ్చగొడతాయి. కాబట్టి ఈ మూడింటి నుంచి దూరంగా ఉండడం, లేక ఆగిపోవడమే ఇస్లామీ ధర్మశాస్త్రం రోజాకు ఇచ్చిన నిర్వచనం.

## తపోనిష్టతో దైవప్రీతి

బాహ్యా సంబంధ కోరికలతోపాటు అంతర్యంలోని కోరికలు, చెడుల నుంచి మనసును, నోటిని సురక్షితంగా ఉంచుకోవడం కూడా ధార్మిక పండితుల దృష్టిలో ఉపవాసంలో ఇమిడి ఉంది. గత ప్రవక్తలందరూ కూడా తమపై శాస్త్రాలు అవతరించక పూర్వం తపోనిష్ఠలో జీవితాలను గడిపిన వారే. శక్తిమేరకు అన్నపానీ యాలను, ఇతర మానవ సహజ అవసరాలను విసర్జించి, తమ ఆత్మలను దైవభక్తితో నింపుకున్నారు. అప్పుడే వారిపై దైవసందేశం అవతరించింది. హజ్రత్ మూసా ప్రవక్త, హజ్రత్ ఈసా ప్రవక్త, హజ్రత్ ముహమ్మద్ ప్రవక్త వీరంతా అలాంటి జీవితాలనే గడిపారు. మూసా ప్రవక్త తూర్ పర్వతంపై ఇలాంటి తపోనిష్ఠలో 40రోజులు గడిపిన తర్వాతే ఆయనపై 'తౌరాత్' గ్రంథం అవతరించింది. క్రీస్తు మహనీయులు ఇలాంటి నిష్టాగరిష్ఠ జీవితాన్ని 30రోజులపాటు గడిపారు. అప్పుడే ఆయన వాక్కునుంచి ఆయన హృదయం వివేక విజ్ఞతా జ్యోతుల్ని విరజిమ్మడం ప్రారంభించింది. దైవం ఆయనకు ఇంజీల్ (బైబిల్) ప్రసాదించాడు. ముహమ్మద్ ప్రవక్త 'హిరా' అనే కొండగుహలో 30 రోజులపాటు ఆరాధనలో నిమగ్నమైన తర్వాత ఆయనపై ఖుర్ఆన్ గ్రంథం అవతరించింది.

## రోజా లక్ష్యం ఇది..

ఇంతకూ ఉపవాసం ముఖ్య ఉద్దేశం ఏమిటంటే, మనిషిని భయభక్తులు కలవానిగా, మానవోత్తమునిగా తీర్చిదిద్దడం అతడి హృదయాన్ని పరిశుభ్రతతో, పవిత్రతతో నింపడం. భయభక్తులు అంటే మనిషి మనసు పాపకార్యాల పట్ల తడబాటును

ప్రదర్శిస్తూ సత్కార్యాల వైపుకు అత్యధికంగా మొగ్గే ఒకానొక పరిస్థితి. ఈ స్థితిని మానవుడిలో పుట్టించడమే ఉపవాసం అసలు ఉద్దేశం. ధనవంతులకు, ఏ విచారం లేకుండా ముప్పూటలా కడుపునిండా తినేవాళ్లకు పేదసాదల ఆకలిబాధ తెలిపేది ఉపవాసం ఒక్కటే. ఇలాంటి ధనవంతులు ఉపవాసవ్రతం పాటిస్తే వారికి ఆకలి బాధ స్వయంగా అనుభవంలోకి వచ్చి, ఇతరుల ఆకలిబాధను అర్థం చేసుకోవడానికి వీలు కలుగుతుంది. తద్వారా నిరుపేదలకు కాస్త సాయం చేసి వారి క్షుద్బాధను నివారించడం ఎంత గొప్ప పుణ్యకార్యమో వారు అర్థం చేసుకోగలుగుతారు.

## వ్రతం ఒక శిక్షణ

ఒకరకంగా చెప్పాలంటే ఉపవాస వ్రతం అనేది ఒక నిర్బంధ శిక్షణ లాంటిది. ముస్లింలు అందరూ సంవత్సరానికి నెలరోజులు ఈ శిక్షణ తీసుకుంటారు. దీనిప్రభావం వారి జీవితంలో మిగిలిన పదకొండు నెలల్లో ప్రసరించాలనేది రోజా ఉద్దేశం. దీనివల్ల వారి ఆలోచనల్లో ఆచరణల్లో అనివార్యంగా మార్పు సంభవిస్తుంది. అయితే చిత్తశుద్ధి, దైవప్రసన్నత ప్రధాన షరతు. చిత్తశుద్ధిలేకుండా నెల్లాళ్లూ ఎంతభక్తిగా, నిష్ఠగా వ్రతం పాటించినా దాని ప్రభావం మన జీవితాలపై పడకపోవచ్చు. అందుకని చిత్తశుద్ధి, దైవప్రసన్నత ప్రధాన షరతు. అందుకని చిత్తశుద్ధి ప్రధానంగా అనునిత్యం ఆత్మపరిశీలన చేసుకుంటూ, సత్కార్యాలు ఆచరిస్తే, ఉపవాస దీక్షలు పాటిస్తే ఉపవాసాల ఉద్దేశం నెరవేరుతుంది. దైవభీతి ప్రధానమైన జవాబుదారీ భావనతో కూడిన సుందర సత్సమాజం ఉనికిలోకి వస్తుంది.

✦ ✦ ✦

# 101. ఘనమైన రాత్రి షబెఖద్ర్

**మేము ఈ గ్రంథం ఖుర్‌ఆన్‌ను ఒక విలువైన రాత్రిలో అవత రింపజేశాము. ఆ విలువైన రాత్రి ఘనత ఏమిటో మీకు తెలుసా? ఆ రాత్రి వెయ్యి మాసాలకన్నా అత్యంత విలువైన రాత్రి. దైవదూతలు, ఆత్మ తమ ప్రభువు అనుమతితో ప్రతి అనుజ్ఞతో దివి నుండి భువికి దిగివస్తారు. ఆ రాత్రి శుభో దయం వరకూ శాంతియుతమైన రాత్రి (అల్‌ఖద్ర్ 97)**

రమజాన్ మాసంలో షబెఖద్ర్‌కు ఇంతటి విలువ, ఘనత, ఔన్నత్యం దక్కడానికి ఈ రాత్రిలో పవిత్ర ఖుర్‌ఆన్ అవతరించడమే ప్రధాన కారణం. సూర్యుని వెలుగు వేడిమి, చంద్రుని కాంతి చల్లదనం ఏ విధంగా మానవుల మధ్య వ్యత్యాసం చూపెట్టవో అలాగే పవిత్ర ఖుర్‌ఆన్ గ్రంథం కూడా, దేవుని దాసులయిన మానవుల మధ్య తారతమ్యం చూపదు. సమస్త మానవాళిని, సమదృష్టితో చూస్తుంది. దాని కారుణ్యానుగ్రహాల ప్రబోధనా కాంతి సమస్త మానవ జాతిపై సమంగా ప్రసరిస్తుంది. హజ్రత్ ఆయిషా ఇలా అంటున్నారు. 'అంతటి మహాగ్రంథం అవతరించిన ఆ మహోన్నత రాత్రిని పొందినప్పుడు నేనేం చేయాలి?' అని నేను ముహమ్మద్ ప్రవక్త వారిని ప్రశ్నించాను. దానికాయన ఇలా సమాధానం చెప్పారు: 'అల్లాహుమ్మ ఇన్నక అఫువ్వున్ తుహిబ్బుల్ అఫ్‌వఫు ఆఫుఅన్ని' అంటే 'ఓ పరాత్పరా! నువ్వు క్షమించే వాడవు, క్షమించడమంటే నీకు మహా ఇష్టం కనుక నన్ను క్షమించు' అని ప్రార్థించమని ప్రవక్త నాకు ఉపదేశించారు.

## ఆ రాత్రిని వెతికి పట్టుకోండి

ఈ రాత్రిని రమజాన్ మాసంలోని చివరి పది రాత్రుల్లో అన్వేషించమని ముహమ్మద్ ప్రవక్త ఉపదేశించారు. అంటే 21, 23, 25, 27, 29 ఈ ఐదు రాత్రుల్లో ఏదో ఒక రాత్రి లైలతుల్ ఖద్ర్ (షబేఖద్ర్) కావచ్చు.

వాస్తవానికి ఇది 'ఫలానా' రాత్రి అని చెప్పడానికి ఒకసారి ముహమ్మద్ ప్రవక్త

మస్జీదుకు వస్తున్నప్పుడు ఇద్దరు వ్యక్తులు రోడ్డుపై ఘర్షణ పడుతున్నారు. ప్రవక్త వారికి నచ్చచెప్పి ఘర్షణను నివారించే ప్రయత్నంలో ఇది ఫలానా రాత్రి అనే తేదీని మరచిపోయారు. అప్పుడు ప్రవక్త పోట్లాడుకునే వారిని విడదీసి మసీదులోకొచ్చి ఇలా ప్రసంగించారు. ప్రజలారా వినండి. నేను షబేఖద్ర్ ఫలానా రాత్రి అని చెప్పడానికి మీ వద్దకు వస్తున్నాను. కానీ మార్గంలో ఇద్దరు వ్యక్తులు పోట్లాడుకుంటున్నారు. వారి పోట్లాటను నివారించే క్రమంలో నాకు దైవం తెలిపిన తేదీని మరచి పోయాను. అందుకని ఈ మాసపు చివరి పది రోజుల్లో ఈ రాత్రిని వెదకండి అన్నారు. అంటే జగడాలు, పోట్లాటలు ఎలాంటి అనర్థాలకు దారితీస్తాయో కూడా మనకు ఈ సంఘటన వల్ల అర్థమవుతోంది. మరొక విషయం ఏమిటంటే బహుశా ఈ రాత్రిని అన్వేషించే తాపత్రయంలో దాసులు సాధ్యమైనంత ఎక్కువగా దైవారాధనలో గడపాలని, తద్వారా తమ పాపక్షమాపణ కోసం తమ సృష్టికర్తను అధికంగా వేడుకోవాలన్నది కూడా ఆ సృష్టికర్త ఉద్దేశం కావచ్చు. కాబట్టి ఈ పవిత్ర మాసంలోని ప్రతీ క్షణాన్నీ సద్వినియోగం చేసు కుంటూ, చివరి పది రోజులు, షబెఖద్ర్ అన్వేషణలో గడిపినట్లయితే శారీరక, మానసిక ఆధ్యాత్మిక అభివృద్ధితో పాటు ఇహ పరలోకాల్లో సంపూర్ణ సాఫల్యం పొందే అవకాశాలు పుష్కలంగా ఉన్నాయి.

✦ ✦ ✦

# 102. ఖుర్ఆన్ అవతరించిన వేళ...

**రమజాన్ మాసంలో సమస్త వానవాళికోసం హితోపదేశ గ్రంథం పవిత్ర ఖుర్ఆన్ అవతరించింది. ఉపవాసాల వల్ల మనలో దైవభీతి జనిస్తుందని ఖుర్ఆన్ గ్రంథం తెలుపుతుంది.**

రమజాన్ పేరు వినగానే సాధారణంగా మనకు నోరూరించే సేమియాలు గుర్తుకు వస్తాయి. నగరవాసులకు అయితే హలీమ్, హరీస్ వంటకాల ఘుమఘుమలు ముక్కు పుటాలను అదరగొడతాయి. ఇస్లాం ధర్మశాస్త్రం ప్రకారం ముస్లిం సోదరులకు రెండు పండుగలున్నాయి. ఒకటి రమజాన్ (దీని అసలు పేరు ఈదుల్ ఫిత్ర్). రెండోది బక్రీద్ (ఈదుల్ అజ్హా). రమజాన్ పండుగకు ముందు ముప్పయి రోజులపాటు ముస్లింలు ఉపవాస దీక్షలు పాటిస్తారు. దీక్షా సమయంలో అన్న పానీయాలే కాకుండా అన్ని రకాల వ్యర్థ కార్యకలాపాలకు దూరంగా వుంటారు. ఉపవాసం పాటించేవారు తెల్లవారుజామున సూర్యోదయానికి ముందే మితాహారం తీసుకుంటారు. దీన్ని 'సహెరి' అంటారు. తరువాత సూర్యాస్తమయం వరకు ఎంతో నియమనిష్టలతో ఉపవాసాన్ని పూర్తి చేసి సూర్యుడు అస్తమించిన తరువాత దీక్ష విరమిస్తారు. దీన్ని 'ఇఫ్తార్' అంటారు.

రమజాన్ మాసంలోనే ఉపవాస వ్రతం విధిగా నిర్ణయించడం జరిగింది. రమజాన్ మాసంలోనే సమస్త మానవాళికోసం హితోపదేశ గ్రంథం పవిత్ర ఖుర్ఆన్ అవతరించింది. ఉపవాసాల వల్ల మనలో దైవ భీతి జనిస్తుందని ఖుర్ఆన్ గ్రంథం తెలుపుతుంది. దైవభీతి భావనలు జనించి, దైవ విధేయతకు అలవాటు పడితే సమాజం సకల రుగ్మతల నుంచి సురక్షితంగా వుండగలుగుతుందని ముస్లింలు నమ్ముతారు. మానవుల మానసిక ఆధ్యాత్మిక వికాసాలకు దోహదపడే ఈ ఉపవాస వ్రతాన్ని సజావుగా పాటించగలిగినందుకు, సకల మానవుల సన్మార్గం కోసం ఖుర్ఆన్ గ్రంథం ఈ మాసంలో అవతరించినందుకు సంతోషంతో, కృతజ్ఞతతో దైవానికి స్తోత్రాలు చెల్లిస్తూ జరుపుకునే పండుగ రమజాన్.

ఈ మాసంలో ముస్లింలంతా ఉపవాస వ్రతంతోపాటు సదఖా, ఫిత్రా వంటి దాన ధర్మాలు కూడా చేస్తారు. ఫిత్రా అనేది పేదసాదల హక్కు. ఫిత్రా చెల్లించే స్తోమత వున్న

ప్రతి ముస్లిం రమజాన్ మాసంలో తప్పనిసరిగా ఫిత్రా చెల్లించాలి. ఇది పేదవారి పండుగ అవసరాలను తీరుస్తుంది. దీనివల్ల వారు కూడా పండుగ సంతోషంలో పాలుపంచుకో గలుగుతారు. అందుకని ఫిత్రా దానాన్ని పండుగకు ఒకటి రెండు రోజులు ముందుగానే చెల్లించాలి. దానం చేసేటప్పుడు ఎదుటివారికి ఆప్యాయంగా, క్షమాబుద్ధితో మృదువుగా అందివ్వాలని ఖుర్ఆన్‌లో పేర్కొని వుంది. కనుక చిత్తశుద్ధి ప్రధానంగా దానధర్మాలు, సత్కర్మలు ఆచరించాలి. ఈ మాసంలో సత్క్రియల ప్రతిఫలం ఇతర మాసాలతో పోల్చుకుంటే అనేక రెట్లు ఎక్కువని ముస్లింలు విశ్వసిస్తారు. అందుకే ఈ మాసంలో ముస్లింలంతా నమాజులు, రోజాలు, దైవనామస్మరణ, దానధర్మాలు, తహ జ్జుద్‌లు అధికంగా ఆచరించడానికి ప్రయత్నించాలి.

## ఫిత్రా దానం అంటే...

ఫిత్రా అనే పదం ఇఫ్తార్ నుంచి వచ్చింది. ఒక 'సా' ఫిత్రా దానాన్ని అంటే భారత కొలమానం ప్రకారం సుమారు మూడున్నర సేర్లు, హనఫీ ఫికహ్ ననుసరించి పావుతక్కువ రెండు సేర్లు లేక పావు తక్కువ రెండు కిలోలు ఇవ్వాలి. ఒకరోజుకు సరిపడే కంటే ఎక్కువ ఆహారం ఇంట్లో నిలువ ఉంటే చాలు ఫిత్రాదానం ఇవ్వడం తప్పని సరి అవుతుంది.

గోధుమలైతే అర్ధ 'సా' (పావు తక్కువ రెండు సేర్లు) ఇవ్వవచ్చు. ఫిత్రాదానం రమజాన్ మాసం చివరలో తప్పనిసరి అవుతుంది. ఫిత్రాదానం రమజాన్ చివరలో ఇవ్వవలసి ఉన్నా అంతకంటే ముందు కూడా దాన్ని ఇచ్చేయవచ్చు.

ఫిత్రాదానం పండుగ నమాజ్ చేయకముందు చెల్లించడం శుభప్రదం. హజ్రత్ ఉమర్ (ర) ఉల్లేఖనం ప్రకారం ప్రజలు ఈద్‌గా వైపు వెళ్లకముందే ఫిత్రా ఇచ్చివేయాలని మహాప్రవక్త (సఅసం) ఉపదేశించారు. జకాత్ మొత్తాన్ని ఏ ఏ అంశాల్లో ఖర్చు చేస్తారో ఫిత్రా దానాలను కూడా దాదాపు అవే పద్దుల్లో కేటాయించవచ్చు. అయితే నిరుపేదలు, నిరాధారులు, అనాధలకు ప్రాధాన్యం ఇవ్వాలి. ఎందుకంటే ఈ సంతోష సమయంలో సమాజంలోని నిరుపేదలను, వితంతువులను, నిరాధారులైన సోదరీసోదరులను మరచిపోవద్దని తాకీదు చేస్తోంది ఇస్లాం. వారికి దానాలు చేయడం ద్వారా వారు కూడా పండుగ జరుపుకునేలా చేయండి అని ఉపదేశిస్తోంది. అంతేకాదు. ఉపవాస వ్రతాల్లో

మానవ సహజమైన పొరపాట్లను ఫిత్రాదానాల వల్ల ప్రక్షాళనం చేసుకోవాలన్నది కూడా ఇందులో ప్రధానమైనదే.

ఈవిధంగా రమజాన్ మాసమంతా గడిపి పండుగ రోజున ప్రాతఃకాలాన ఫజ్ర్ నమాజ్ ముగించుకొని పండుగ పనుల్లో లీనమైపోతారు. స్నాన పానాదులు పూర్తి చేసుకొని, కొత్త వస్త్రాలు ధరించి, అత్తరు, పన్నీరు పూసుకుని దైవనామాన్ని స్మరిస్తూ నమాజు కోసం ఊరి వెలుపల ఈద్గాహ్‌కు వెళతారు. అక్కడవారి ఇమాం (నాయకుడు) వారితో నమాజు చేయించి ఖుర్‌ఆన్ హదీసు గ్రంథాల వెలుగులో ప్రసంగిస్తాడు. తరువాత అందరూ దైవానికి కృతజ్ఞతలు చెల్లించి సంతోషంతో శుభాకాంక్షలు తెలుపుకుంటూ తిరుగుముఖం పడతారు.

కులమత వ్యత్యాసం లేకుండా సోదరసమానత్వాన్ని చాటుతూ తమ స్నేహితులకు ఈద్ ముబారక్ తెలుపుతూ వారిని ఆనందంగా ఇంటికి ఆహ్వానించి సేమియా పాయసాన్ని వడ్డిస్తారు. ఈ విధంగా ఈదుల్ ఫిత్ర్ పండుగ సమాజంలో చక్కని ఆరోగ్యవంతమైన, సామరస్యపూరితమైన సోదర భావాలను పెంపొందిస్తుంది.

✦ ✦ ✦

# 103. ఈద్ ముబారక్

**సమస్త రుగ్మతల నాశిని, ఆరోగ్యప్రదాయిని రమజాన్!**

**ఖుర్ఆన్ అవతరించిన పుణ్యమాసం రమజాన్!!**

**సద్భావనకు, సచ్ఛీలతకు, సమరస భావనకు, సర్వమానవ సమతకు ఎత్తిన విశ్వాస పతాక రమజాన్!!!**

**శత సహస్ర శీతల చంద్రోదయాల ఏకీకృత సాంద్రత చందన పరిమళ వీచిక రమజాన్!!!!**

ఆనందం ఆయుష్షును పెంచుతుంది. భక్తి ముక్తిని ప్రసాదిస్తుంది. ఆనందించే సమయ సందర్భాలు ఎన్నో ఉంటాయి. వాటిలో పండుగలు అతి ప్రధానమైనవి. పండుగలు మానవ సమాజానికి ప్రాణ సమానమైనవి. కొన్ని పండుగలు విజయ సంకేతాలుగాను, మరికొన్ని పండుగలను జాతి నాయకుల సంస్మరణలోనూ జరుపు కుంటారు. అలాగే ఇస్లామీ ధర్మంలో కూడా రెండు పండుగలున్నాయి. ఒకటి రమజాన్ (ఈదుల్‌ఫిత్ర్) రెండోది బక్రీద్ (ఈదుల్ అజ్‌హా)

నెలనాళ్లపాటు ఎడతెగకుండా, ఎంతో భక్తిప్రపత్తులతో సాగిన ఉపవాస దీక్షలతో ఈ రమజాన్ పండుగ సంబంధాలు ముడిపడి ఉన్నాయి. ఉపవాసమనే మహత్తర ఆరాధ నను నెరవేర్చడమంటే దైవాదేశ పాలనలో ఒక గురుతరమైన విధిని నెరవేర్చడమన్నమాట. ఇలాంటి శుభ సందర్భంలో ఒక మనిషిగా మానవ హృదయం ఆనందోత్సాహాలకు లోనుకావడం, ఒక దైవ విశ్వాసిగా కృతజ్ఞతాభావంతో ఉప్పొంగడం సహజం. ఈ మానవ సహజ స్పందనల ప్రత్యక్ష ప్రదర్శననే 'ఈదుల్ ఫిత్ర్' అంటారు.

## మహాభాగ్యం ఇది

పండుగ సందర్భంగా ఒక దైవ విశ్వాసి తాను ఉపవాస విధిని నెరవేర్చ గలిగి నందుకు, తన సంతోషాన్ని బహిరంగంగా వ్యక్తం చేసినప్పుడు దైవాదేశ పాలనలో ఒక విధిని నెరవేర్చే భాగ్యాన్ని ప్రసాదించినందుకు దైవానికి కృతజ్ఞతా స్తోత్రాలు చెల్లిస్తాడు.

అంతే కాదు దైవం మానవాళికి ప్రసాదించిన మహాభాగ్యాల్లో అత్యున్నతమైన మహాభాగ్యం ఈ రమజాన్. మానవాళి ఇహపర సాఫల్యాలకు వెలుగుబాట చూపే మార్గదర్శిని పవిత్ర ఖుర్ఆన్ రమజాన్ మాసంలోనే అవతరించింది. ఈ నెల్లాళ్లు ఉపవాస వ్రతం పాటించి ముస్లింలు అందుకు తమ కృతజ్ఞతను చాటుకుంటారు.

## పర్వం... సంప్రదాయం

పండుగ నాడు యావత్ ప్రపంచంలోని ముస్లింలందరూ వేకువ జామున్నే లేచి పండుగ సన్నాహాలు ప్రారంభిస్తారు. 'గుసుల్ స్నానం' ఆచరిస్తారు. నూతన వస్త్రాలు ధరిస్తారు. సుగంధ ద్రవ్యాలు పూసుకుంటారు. పండుగకు ముందే 'ఫిత్రా' దానం చెల్లించినప్పటికీ పండుగ రోజు కూడా పేదసాదలకు దాన ధర్మాలు చేస్తుంటారు. అందరూ సామూహికంగా 'తక్బీర్' పఠిస్తూ నమాజ్ కోసం 'ఈద్‌గాహ్'కు వెళతారు. సమస్త మానవాళి మార్గదర్శకత్వం కోసం ఖుర్ఆన్ గ్రంథాన్ని అవతరింపజేసినందుకు, దానికి కృతజ్ఞతగా నెల్లాళ్లపాటు రోజా వ్రతం పాటించగలిగినందుకూ, వెయ్యి మాసాల కన్నా ఘనమైన రాత్రి అని చెప్పబడిన లైలతుల్ ఖద్రను తమకు అనుగ్రహించినందుకు సృష్టికర్త ముందు వినమ్రంగా తలవంచి, సాగిలపడి రెండు రకాతుల నమాజ్ ఆచరిస్తారు. అనంతరం 'ఇమాం అక్కడ హాజరైన వారినుద్దేశించి 'ఖుర్ఆన్, హదీస్' గ్రంథాల వెలుగులో ప్రసంగిస్తాడు. అనంతరం అందరూ కలిసి సర్వమానవాళి శ్రేయోసాఫల్యాల కోసం సామూహికంగా ప్రార్థనలు జరుపుతారు. చిన్నా, పెద్దా, ముసలి, ముతకా అంతా ఈ వేడుకల్లో అత్యంత ఉత్సాహంతో ఆనందంతో పాల్గొంటారు. 'ఈద్ ముబారక్' అంటూ పరస్పరం శుభాకాంక్షలు తెలుపుకుంటారు. పండుగకు తయారు చేసిన సేమియా, షీర్ ఖుర్మా లాంటి తీపి వంటకాలను స్నేహితులు, బంధువులకు ఆప్యాయంగా తినిపిస్తారు. హిందూ, ముస్లిం, క్రైస్తవ, సిక్కు సోదరులందరికీ నిండు మనసుతో శుభాకాంక్షలు అందజేస్తారు.

## స్ఫూర్తి కొనసాగితేనే సార్థకం

మానవుల్లో దైవభీతిని జనింపజేయడానికి, వారిలో పరస్పర సోదర భావాన్ని పెంపొందించడానికి, సమాజంలో శాంతి సౌభ్రాతృత్వాలు పరిఢవిల్లడానికి, మత

సామరస్యానికి రమజాన్ పండుగ దోహద పడుతుంది. అయితే, ఈ నెల్లాళ్లపాటు ఆచరించిన ఆరాధనలు, అలవరచుకున్న దైవభీతి, పేదసాదలపట్ల చూపిన ఆదరణ, సానుభూతి, సత్ప్రవర్తన, గుండెల్లో కొలువుదీరిన నీతి నిజాయితీ, న్యాయం ధర్మం తదితర సులక్షణాలను, సుగుణాలను పండుగ నాడే విసర్జించకుండా, మిగతా పదకొండు నెలలకూ ఈ సదాచరణలు విస్తరించాలి. అప్పుడే ఈ నెల్లాళ్ళ ఆరాధనలకూ, పండుగ సంబరాలకూ ఒక అర్థం ఉంటుంది. సాఫల్యమూ సిద్ధిస్తుంది. 'ఈదుల్ ఫిత్ర్' రోజున అల్లాహ్ తన దూతలతో, ఈనాడు ఈ నా దాసుల పాపాలన్నింటినీ క్షమించి వేశాను అని గర్వంగా ప్రకటిస్తాడు. కనుక ఈద్ నమాజ్ ముగించుకుని వెనుతిరిగిన వ్యక్తి పాప ప్రక్షాళన పొంది, పునీతుడౌతాడు. అందుకని ఈ క్షణం నుంచి ధర్మ సమ్మతమైన జీవితం గడుపుతామని ప్రతి ఒక్కడూ ప్రతిన పూనాలి. అప్పుడే రమజాన్ పర్వదిన పరమార్థం నెరవేరుతుంది. దైవం సమస్త మానవాళినీ సన్మార్గంపై నడుపుగాక!

✦ ✦ ✦

# 104. రమజాన్ స్ఫూర్తి నిరంతరం

**యావత్ మానవాళికి శిక్షణ ఇవ్వడమే ఉపవాస వ్రతం అర్థమని, ప్రజలలో భక్తి భావాలని వ్యాప్తి చేయడమే రమజాన్ పరమార్థ మని ఖుర్ఆన్ చెబుతున్నది. ఈ మాసంలో పాటించిన క్రమ శిక్షణను స్ఫూర్తిగా తీసుకుని ప్రతి ఒక్కరు మిగిలిన 11నెలలు ప్రశాంత జీవితం సాగించాలన్నదే రమజాన్ లక్ష్యం.**

ఈదుల్–ఫిత్ర్ పర్వదినం పంచిన పరమానందం నుంచి ముస్లిం సోదరులు ఇప్పుడిప్పుడే తేరుకుంటున్నారు. నెలనాళ్ళపాటు సత్కార్య సుగంధాలతో వారిని అలరించిన పరమ పవిత్రమైన విశేష రమజాన్ మాసానికి మొన్న మొన్ననే ఘనంగా వీడ్కోలు పలికారు. రమజాన్ మాసానికి ఈద్‌తో వీడ్కోలు పలికినప్పటికీ నెల రోజులపాటు అది ఇచ్చిన దైవభీతి శిక్షణ, దయాగుణం, సోదరభావం, పరస్పర సహకార భావన, సామరస్య భావన, ఒకరి కష్ట సుఖాల్లో ఒకరు పాలుపంచుకునే గుణం, పరమత సహనం, మానవ సమానత్వం తదితర గుణాలకు సంబంధించిన శిక్షణ ప్రభావం మిగతా పదకొండు నెలల్లోనూ ప్రతిబింబించాలి.

## స్ఫూర్తి విస్తరించాలి

పంచభక్ష్య పరమాన్నాలు తనివితీరా తృప్తిగా ఆరగించి, వెంటనే వాంతి చేసుకున్న చందంగా, నెల నాళ్లపాటు కఠోర నిష్టతో శిక్షణ పొందుతూ ఆచరించిన సదాచరణలు పండుగ ముగియగానే బూడిదలో పోసిన పన్నీరు కాకూడదు. అలా కాకూడదంటే నెల్లాళ్ళ రమజాన్ స్ఫూర్తి మిగతా పదకొండు నెలలకూ విస్తరించాలి. రమజాన్ కాలంలో ఏవిధంగా దైవారాధన ఆచరించారో, దైవభీతిని అలవరచుకున్నారో, చెడుమాటలకు, చెడు చేతలకు దూరంగా వున్నారో, నెలనాళ్లు ఒక్క అబద్ధమూ ఆడకుండా, ఏ ఒక్కరిని మోసగించకుండా, ఎవరి మనసూ నొప్పించకుండా, అందరి మేలును కాంక్షిస్తూ, పేద సాదల పట్ల దయ, సానుభూతులు చూపుతూ, వారిని ఆదుకుంటూ, అనాథలు, వితం

తువులు, వికలాంగులకు సహాయపడుతూ నీతి, నిజాయతీగా, న్యాయంగా, ధర్మంగా ఎలా మసలుకున్నారో మిగతా కాలమూ అదే స్ఫూర్తి కొనసాగాలి.

## మనసుకు శిక్షణ

నిజానికి ఈ శిక్షణ ద్వారా సుగుణాలను వారిలో పెంపొందించడానికే సంవత్సరానికి ఒక్కసారి ఇలాంటి ఏర్పాటు జరిగింది. మానవాళికి ఇలాంటి శిక్షణకోసమే ఈ ఉపవాస వ్రతమని, వారిలో దైవభీతిని జనింపజేయడమే దీని ముఖ్య ఉద్దేశమని ఖుర్‌ఆన్ గ్రంథం ఎలుగెత్తి చాటింది. అంతేకాకుండా ఈ గ్రంథం మొత్తం మానవాళికి సన్మార్గ దీపిక అని, దీని బోధనల ప్రకారం మానవాళి నడుచుకుంటే, ప్రపంచంలో మానవ సమానత్వం, శాంతి సౌభాగ్యాలు పరిఢవిల్లుతాయని, అశాంతి, అభద్రతలు, దౌర్జన్యాలు నామరూపాలు లేకుండా అంతరించిపోతాయని మానవాళి సుఖశాంతులతో వర్ధిల్లుతుందని ఈ గ్రంథం విస్పష్టంగా ప్రకటించింది. కనుక రమజాన్ స్ఫూర్తిని కొనసాగిస్తూ, అది ఇచ్చిన శిక్షణను, దాని వలన అలవడిన సుగుణాలను మిగతా కాలంలో కూడా ప్రతిబింబింపచేస్తే నిజంగా మొన్న ముగిసిన పండుగ నిస్సందేహంగా ప్రతిరోజు ఆనందాన్ని పంచుతుంది.

✦ ✦ ✦

# 105. మహనీయుల త్యాగఫలమే ఈదుల్-అజ్‌హా

**ఇస్లామీ ధర్మశాస్త్రం ప్రకారం ముస్లిమ్‌లకు ప్రధానమైన పండుగలు రెండు వున్నాయి. వీటిలో మొదటిది ఈదుల్ ఫిత్ర్. అంటే రమజాన్ పండుగ. రెండవది ఈదుల్ అజ్‌హా. దీన్నే బక్రీద్ పండుగ అని, ఈదె ఖుర్బాన్ అని కూడా అంటారు. ఇస్లామీయ చరిత్రలో దీనికి చాలా ప్రాముఖ్యం వుంది.**

నేటికి దాదాపు ఐదువేల సంవత్సరాలకు పూర్వం ప్రస్తుతం ఇరాక్‌గా పిలవబడుతున్న దేశంలో హజ్రత్ ఇబ్రాహీం అలైహిస్సలాం జన్మించారు. ఆనాటి ప్రజలు సూర్యచంద్రాదులతోపాటు అసంఖ్యాక దేవుళ్లను అమిత భక్తితో పూజించేవారు. స్వయంగా హజ్రత్ ఇబ్రాహీం కుటుంబం పూజారుల కుటుంబం. ఆయన తండ్రి ఆజర్. ఆయన గొప్ప పురోహితుడు, ఆలయ ధర్మకర్త. అటువంటి కుటుంబంలో పుట్టి పెరిగినప్పటికీ, ఇబ్రాహీంకు ఆ వాసనే గిట్టలేదు. ఆ ఆచారాలను, మూఢనమ్మకాలను తీవ్రంగా వ్యతిరేకించారాయన. తన కుటుంబానికి, జాతికి, ముఖ్యంగా తండ్రికి విగ్రహారాధన మానమని ఎంతగానో నచ్చచెప్పారు. కానీ ఈ ప్రయత్నాలన్నీ బెడిసికొట్టాయి. ఈ సూచనను ఆయన జాతి నిర్ద్వంద్వంగా తిరస్కరించింది. తండ్రి అయితే అగ్గిమీద గుగ్గిలమే అయ్యాడు. 'నా కడుపున చెడబుట్టావు' అంటూ ఛీత్కరించాడు. మర్యాదగా దారికి రాకపోతే ఇంట్లోంచి గెంటేస్తానని హెచ్చరించాడు. అయినా హజ్రత్ ఇబ్రాహీం తన వైఖరిని మార్చుకోలేదు. చివరకు ఆయన తండ్రి అన్నంత పనీ చేశాడు. జాతి కూడా ఆయన్ని బహిష్కరించింది. హజ్రత్ ఇబ్రాహీం అలైహిస్సలాం తాను నమ్మిన సిద్ధాంతాల కోసం ఉన్న ఊరునూ, కన్నవారిని విడిచిపెట్టి, భార్యబిడ్డలతో పరాయి చోటుకు వలసపోయారు. ఉన్న ఊరిని, కన్న వారినే కాదు, కన్న కొడుకునూ త్యాగం చెయ్యమని దైవాజ్ఞ అయ్యింది. కేవలం దైవ ప్రసన్నత కోసం ఏం చెయ్యడానికైనా సిద్ధపడిన ఆ మహనీయుడు ఈ దైవాజ్ఞ గురించి కొడుకుతో సంప్రదించాడు. తండ్రికి తగ్గ ఆ తనయుడు వెంటనే దైవాజ్ఞను నెరవేర్చుమన్నాడు. ఆజ్ఞాపించిన ఆ దేవుడే నాకు సహనం వహించే

సద్బుద్ధిని ప్రసాదిస్తాడని సమాధానమిచ్చాడు. తనయుని నోట ఈ మాట విన్న ఆ తండ్రికి కళ్ల వెంట ఆనంద భాష్పాలు జలజలా రాలాయి. కేవలం కలలో కనిపించిన సంకేత దృశ్యాన్ని దైవాజ్ఞగా భావించి ఓ తండ్రి కన్నకొడుకును దైవమార్గంలో అర్పించడానికి సిద్ధపడడం, అదేవిధంగా కన్నతండ్రి కలను సాకారం చెయ్యడానికి ఓ కొడుకు ప్రాణ త్యాగానికి సంసిద్ధుడవడం మానవజాతి చరిత్రలోనే ఓ అపూర్వమైన, అద్భుతమైన ఘట్టం. తండ్రీ కొడుకుల ఈ చర్యకు దేవుడు ఎంతగానో సంతోషించాడు. వారిని 'ముస్లిం' అనే బిరుదుతో సత్కరించాడు. దీన్నిబట్టే మనం ముస్లిం అనే పదానికి వున్న ప్రాముఖ్యాన్ని అర్థం చేసుకోవచ్చు. ముస్లిం అంటే ఎవరు? ఎలా వుండాలి? అనే విషయాల్ని కూడా దీని ద్వారానే మనం అర్థం చేసుకోవచ్చు. దివ్యఖుర్‌ఆన్ ప్రకారం, దైవ ప్రేమ ముందు సకల ప్రేమలనూ ఎలాంటి అరమరికలు లేకుండా తర్పణం చేసినవాడే నిజమైన ముస్లిం. ఈదుల్ అజ్‌హా పండుగ అటువంటి ఓ తర్పణాన్నే మనకు గుర్తు చేస్తుంది. ఈ పర్వదినం ఎలాగైతే దైవప్రేమలో సర్వ సమర్పణకు మనల్ని సిద్ధం చేస్తుందో అలాగే అలాంటి త్యాగధనులకు ఇహపరలోకాల్లో ఎన్నెన్నో అపూర్వ వరాలతో, కానుకలతో సత్కరిస్తుంది. ఓ నిజమైన దైవదాసుడు తన మనోవాక్కాయ కర్మల ద్వారా విశ్వాస పరిపూర్ణతను నిరూపించుకుంటే దైవం అతనికి ఎలాంటి మహోన్నత స్థానం ప్రసాదిస్తాడో హజ్రత్ ఇబ్రాహీం అలైహిస్సలాం దృష్టాంతమే నిదర్శనం. కేవలం దైవ ప్రసన్నత కోసం తనయుణ్ణి దైవమార్గంలో సమర్పించడానికి మానసికంగా సిద్ధమైన మరుక్షణం నుంచే ఆయన ఒక్కొక్క ఆచరణకూ ఓ ప్రత్యేకత సంతరించుకుంది. ప్రళయం వరకు వారి ఒక్కో ఆచరణ సజీవంగా వుంటుంది.

## ప్రపంచ ముస్లింలందరికీ కాబాయే ఖిబ్లా

మక్కా నగరంలో ఆయన నిర్మించిన 'కాబా' కట్టడాన్ని ప్రపంచ ముస్లింలందరికీ ఖిబ్లా (ముస్లింలు ప్రపంచంలో ఏ మూలనున్నా నమాజు సమయంలో అటువైపే తిరిగి ప్రార్థన చేయాలి అని) గా నిర్ణయించబడింది. ఆయన ఎంతో భక్తి ప్రపత్తులతో కాబా చుట్టూ చేసిన ప్రదక్షిణను ముస్లిం సమాజంపై విధిగా నిర్ణయించడం జరిగింది. ఇబ్రాహీం తన మిత్రుని పిలుపునకు ఎలా స్పందించి, హాజరయ్యారో, ఎలాంటి నిరాడంబర వస్త్రధారణ చేశారో ఖచ్చితంగా అలాగే 'లబ్బైక్' అనాలని, అటువంటి నిరాడంబర వస్త్రాలే

ధరించి, తన గృహాన్ని సందర్శించాలని హాజీలను దేవుడు ఆదేశించాడు. హజ్రత్ ఇబ్రాహీం ఎటువంటి మానసిక స్థితిలో తనయుని స్థానంలో పొట్టేలును జిబహ్ చేశారో, ఆ చర్యకు ముగ్ధుడైన దైవం దాన్ని (ఖుర్బానీ) పండుకవేడుకలో ఒక భాగం చేశాడు. ఇబ్రాహీం సతీమణి హజ్రత్ హాజిరా అలైహిస్సలాం తన చిన్నారి బాబు దాహం తీర్చడానికి 'సఫా' 'మర్వా' కొండల మధ్య నీటికోసం వెదుకుతూ, ఆదుర్దాగా అటు ఇటు వెదుకులాడిన దృశ్యాన్ని దైవం నిత్య నూతనంగా వుంచడానికి ఆ రెండు కొండల మధ్య 'సయీ' చేయ మని హాజీలను ఆదేశించాడు. ఈ విధంగా వారి ఒక్కో ఆచరణకూ ప్రత్యేక ప్రాముఖ్యం కల్పించి, ప్రళయం వరకు సజీవంగా వుంచిన ఏర్పాట్లు మానవ చరిత్రలో మరెక్కడా మనకు కానరావు. అంతేకాదు, ఈ తండ్రీ కొడుకులు కాబా నిర్మాణ సమయంలో చేసిన వేడుకోలును సైతం దైవం స్వీకరించాడు. ఈదుల్ అజ్‌హా పండుగ మనకు ఆ మహనీయుల త్యాగనిరతిని, ఒక్కో ఆచరణను గుర్తుచేసి, మనకు ఆదర్శ ప్రాయంగా నిలిచి, దైవమార్గంలో ధన, ప్రాణాల త్యాగానికి సిద్ధం చేయడానికి ప్రతియేటా వస్తూ, ఎన్నో వరాలను మోసుకొస్తుంది. కాబట్టి మనం పండుగ పరమార్థాన్ని గ్రహించి నట్లయితే, ఆ మహనీయుల స్ఫూర్తితో మనలో కూడా ఎన్నో సుగుణాలు జనించే అవకాశం ఉంటుంది.

✦ ✦ ✦

# 106. త్యాగాల ప్రతీక 'బక్రీద్'

**దైవప్రవక్త అయిన హజ్రత్ ఇబ్రాహీం దైవాజ్ఞ మేరకు తన ఒక్కగానొక్క చిన్నారి తనయుడిని దేవునికి సమర్పించేందుకు సిద్ధం అవుతారు. దైవభక్తికి మహోన్నత నిదర్శనం ఇది. ఇబ్రాహీం త్యాగాన్ని ఆదర్శంగా తీసుకుని ముస్లిం సోదరులంతా బక్రీద్ జరుపుకుంటారు. పవిత్ర పుణ్యక్షేత్రం మక్కాలో లక్షలాది మంది హజ్ యాత్రికులు కొలువై దేవా నీ సన్నిధి చేరాను అని నినదించే పవిత్రమైన రోజు ఇది. బక్రీద్ సందర్భంగా ప్రత్యేక వ్యాసం.**

యావత్ ప్రపంచంలోని ముస్లిం సోదరులు జిల్‌హజ్ మాసం 10వ రోజున బక్రీద్ పండుగను జరుపుకుంటారు. చరిత్రలో ఈ రోజుకు విశేష ప్రాముఖ్యం ఉంది. ఆ రోజు సౌదీ అరేబియాలోని మక్కా నగరం లక్షలాది మంది హజ్ యాత్రికులతో కళకళలాడు తుంది. 'లబ్బైక్' (దేవా నీ సన్నిధిలో హాజరయ్యాను) అనే నినాదాలు సర్వత్రా మిన్నం టుతూ ఉంటాయి. అల్లాహ్ ఆదేశాలను, ముహమ్మద్ ప్రవక్త సంప్రదాయాలను పాటిం చడంలో భక్తులు నిమగ్నమై ఉంటారు. నేల ఈనినట్లు కనిపించే ఆ జనవాహినిలో దైవగృహ ప్రదక్షిణ (తవాఫ్) చేసేవారు కొందరైతే, సఫా, మర్వా అనే కొండల మధ్య పరుగులు (సయీ) తీసేవారు మరికొందరు.

## హజ్, ఖుర్బానీలకు మూలం

అదొక అపురూప సుందర దృశ్యం. ఎంతో రమణీయమైన అద్భుత సన్నివేశం. ప్రభు స్తోత్రంతో పరవశించి తన్మయత్వం చెందే ఆధ్యాత్మిక కేంద్రబింబం. ఆ అనుపమాన, అపూర్వ హజ్ దృశ్యాన్ని గురించి ఊహిస్తేనే హృదయం పులకించి పోతుంది. ఒకప్పుడు ఆ ప్రాంతం ఎలాంటి జన సందోహం లేని నిర్జీవ ఎడారి ప్రాంతం. కాని ఈనాడు విశ్వ ప్రభువు అనుగ్రహంతో నిత్య నూతనంగా, కళ కళ లాడుతూ ప్రపంచ ముస్లింలందరికి

ప్రధాన పుణ్యక్షేత్రంగా విరాజిల్లుతోంది. పుణ్యక్షేత్రమైన మక్కాలో జరిగే హజ్ ఆరాధనకు, ప్రపంచ వ్యాప్తంగా ముస్లింలు జరుపుకునే 'ఈదుల్ అజ్‌హా పండుగకు అవినాభావ సంబంధం ఉంది. అసలీ పండుగకు హజ్, ఖుర్బానీలకు మూల కారణం హ(జత్ ఇబ్రాహీం. (అలై)

## కలను నిజం చేసిన త్యాగశీలి

ఇబ్రాహీం అలైహిస్సలాం ఒక గొప్ప దైవ ప్రవక్త. ఇబ్రాహీంకు ఖలీలుల్లాహ్ అంటే దేవుని మిత్రుడు అన్న బిరుదు కూడా వుంది. ఇబ్రాహీం తన జీవితం ద్వారా దైవ ప్రసన్నతకు మించిన కార్యం మరొకటి లేదని నిరూపించారు. కలలో కనిపించింది కూడా కరుణామయుని ఆజ్ఞే అని తలపోసేవారు. వెంటనే దానిని ఆచరించే వారు. ఒకనాడా యన ఓ కలగన్నారు. నిజానికి ఆ కల ఓ పరీక్ష. మానవ జాతి చరిత్ర కనీవినీ ఎరుగని పరీక్ష. దైవాదేశపాలనలో ఎలాంటి ప్రేమానురాగాలకు తావులేదని చాటి చెప్పిన అసాధా రణ పరీక్ష అది. ఒక రోజు హ(జత్ ఇబ్రాహీం కన్నకొడుకు గొంతు కోస్తున్నట్లు కల గన్నారు. దీన్ని దైవాజ్ఞగా తలచిన ఆయన ఈ విషయమై కొడుకును సంప్రదించారు. వృద్ధ దశలో లేక లేక కలిగిన ఏకైక సంతానాన్ని దైవాదేశం మేరకు చేతులారా బలిచేయ వలసి రావడం తండ్రికి పరీక్ష అయితే దైవప్రీతి కోసం ఎంతో భవిషత్తు కలిగిన నిండు జీవితాన్ని త్యాగం చేయాల్సిరావడం తనయునికీ పరీక్షే. అయినా ఆ తండ్రికి తగ్గ తనయుడు. దైవకారుణ్య కొలనులో విరబూసిన చిరుమొగ్గ. ఏ మాత్రం వెనుకా ముందు ఆలోచించకుండా 'నాన్నగారూ.. దైవాదేశాన్ని వెంటనే నెరవేర్చండి. నేను దానికి సిద్ధంగా వున్నాను. దైవ చిత్తమైతే మీరు నన్ను సహనవంతునిగా చూస్తారు అన్నాడు. దీంతో ఇబ్రాహీం తన ప్రాణం కంటే కూడా మిన్న అయిన కన్న కొడుకు మెడ కొయ్యడానికి కుత్తుకపై కత్తి పెట్టి ఉద్యుక్తులయ్యారు. చిరుమొగ్గ ఇస్మాయీల్ కూడా దైవమార్గంలో తన చిన్ని ప్రాణాన్ని ధారపోయడానికి సిద్ధమై, మెడ కోయడానికి వీలుగా నేలపై పడుకున్నాడు. ఈ విధంగా తండ్రీ కొడుకులిద్దరూ దైవాజ్ఞ ముందు తలవంచిన అపూర్వ ఘట్టానికి సృష్టి యావత్తు అచ్చెరువొందింది. వాయువు స్థంభించింది. సృష్టిలోని అణువణువు అవాక్క యింది. అంతటా నిశ్శబ్దం ఆవరిచింది. అప్పుడు దిక్కులు పిక్కటిల్లేలా దైవవాణి ప్రతిధ్వనించింది. నా ప్రియ ప్రవక్తా ఇబ్రాహీం..! నువ్వు నీ స్వప్న ఉదంతాన్ని నిజం చేసి

చూపించావు. నా ఆజ్ఞాపాలనలో మీరు మానసికంగా సిద్ధమైన క్షణంలోనే నేను మీతో ప్రసన్నుడనయ్యాను. నా ఈ పరీక్షలో మీరు అత్యుత్తమ శ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. ఇక భౌతిక చర్యగా మిగిలి పోయిన బలితతంగంతో నాకసలు నిమిత్తం లేదు. ఇప్పుడు మీరు పూర్తిగా విశ్వాసులయ్యారు.

## త్యాగోత్సవం

ఇదీ సంక్షిప్తంగా హజ్రత్ ఇబ్రాహీం గారి త్యాగ గాథ. ఈ త్యాగాన్ని స్మరించుకోవడానికే ముస్లింలు యేటా పండుగ జరుపుకుంటారు. ఈ పండుగను 'ఈదుల్ అజ్‌హా' అని, బక్రీద్ అని, ఈదె ఖుర్బాన్ అని వ్యవహరిస్తారు. ఇబ్రాహీం ప్రవక్త తన కుమారుడిని త్యాగం చేసిన ఘట్టాన్ని స్మరించుకుంటూ ముస్లింలు ఆ రోజున ఖుర్బానీలు ఇస్తారు. అవసరమైతే దైవం కోసం, దైవధర్మం కోసం, న్యాయం కోసం తాము కూడా ఎలాంటి త్యాగాలకైనా వెనుకాడబోమని ప్రకటించడమే ఈ ఖుర్బానీల ఉద్దేశ్యం. ఇది దైవం ముందు తమ విధేయతను చాటుకునే సాధనమే తప్ప, దైవానికి ధనసంపదల అవసరం గాని, రక్త మాంసాల అవసరం గానీ ఎంత మాత్రం లేదు. అందుకే ఈ పండుగను త్యాగోత్సవం అని కూడా చెప్పుకోవచ్చు. ఆర్థిక స్తోమత కలవారు హజ్ ఆరాధన కోసం మక్కాకు వెళ్లగలిగితే, ఆ స్తోమత లేనివారు తమతమ గృహాల వద్దనే పండుగ జరుపుకుంటారు. ఎలాంటి ఆర్థిక స్తోమత లేనివారు సైతం పండుగనాడు చిత్తశుద్ధితో రెండు రకాతుల నమాజు చేసినా దైవం వారికి కూడా హజ్ ఖుర్బానీలు ఆచరించిన వారితో సమానంగా పుణ్యఫలాన్ని ప్రసాదిస్తాడు. అందుకని పండుగ రోజు ధన, ప్రాణ త్యాగాలతో పాటు మనోవాంఛల్నీ త్యాగం చేయాలి. స్వార్థం, అసూయ ద్వేషాలను బలిచేయాలి. మనసు కోరే గొంతెమ్మ కోరికలు పూర్తిగా విసర్జించాలి. సాటి వారి కోసం ఎంతో కొంత త్యాగం చేసే గుణాన్ని పెంపొందించుకోవాలి. అలాంటి త్యాగ గుణాన్ని మానవునిలో జనింపచేయడమే ఈ త్యాగాల పండుగ బక్రీద్ పర్వదిన పరమార్థం.

✦ ✦ ✦

# 107. త్యాగాలను స్మరించుకునే పర్వం బక్రీద్

**ఈ ప్రపంచం ఓ పరీక్షా స్థలం. మంచి మార్గాన్ని ఎంచుకొని, లోక కళ్యాణం కోరుకునే వారికి ఇక్కడ అడుగడుగునా పరీక్షలే. ఎన్ని కష్టాల పర్వతాలు విరుచుకుపడినా ఎన్ని అవరోధాలు ఎదురైనా నలుగురి మంచి కోరేవారే గమ్యానికి చేరి, జయకేతనం ఎగురవేయగలరు. అలాంటి వ్యక్తుల్లో అగ్రగణ్యుడు త్యాగానికి ప్రతిరూపం హజ్రత్ ఇబ్రాహీం అలైహిస్సలాం. ఆయన త్యాగాలకు ప్రతీకగా ప్రపంచ వ్యాప్తంగా ఉన్న ముస్లిం సోదరులు బక్రీద్ పండుగ జరుపుకుంటారు.**

హజ్రత్ ఇబ్రాహీం(అలై) ఐదు వేల సంవత్సరాల క్రితం ప్రస్తుత ఇరాక్ దేశంలో జన్మించారు. ఆ కాలంలో నమ్రూద్ అనే రాజు దేశాన్ని పాలించేవాడు. ఆయన నిరంకుశ పాలనలో దేశం అశాంతికి నిలయంగా ఉండేది. ప్రజలు మూఢాచారాల్లో కూరుకుపోయారు. ప్రజల దురాచారాలను చూసి హజ్రత్ ఇబ్రాహీం కలతచెందేవారు. ఇన్ని రకాల దైవాలు వున్నారా? లేక ఒక్కడే ఉన్నాడా? ఇలాంటి సవాలక్ష ప్రశ్నలు ఆయన మనసులో మొలకెత్తాయి. ఇలా ఆలోచించి... ఆలోచించి చివరికి దేవుడు ఒక్కడే అనే నిర్ణయానికి వచ్చారు. మరి ఆ దేవుడు ఎవరు? ఎలా ఉంటాడు? ఎంత ఆలోచించినా ఎవరిని ప్రశ్నించినా సమాధానం దొరకలేదు. అన్వేషణ సాగించారు. అది ఫలించింది. చివరకు ఓ రోజు ఆయన ఎలుగెత్తి ఇలా ప్రకటించారు "సోదరులారా! నేను అస్తమించే వాటిని ఎన్నటికీ పూజించను. వాటికి తలవంచను. భూమ్యాకాశాలను, వాటి మధ్యన ఉన్న సమస్తాన్ని సృష్టించిన ఆ సర్వశక్తిమంతుడు ఎవరైతే ఉన్నాడో ఆయనకే నేను తలవంచుతాను. ఈ సకల చరాచరసృష్టి ఆ ఏకైక 'శక్తి' ఉనికికి నిదర్శనం" అన్నారు. అప్పటి నుంచి ఆయనకు దైవ జ్ఞాన భాగ్యం లభించింది. ఆ జ్ఞాన కాంతులే ఇబ్రాహీం అలైహిస్సలాంను ఏకైక దైవధర్మ ఉద్యమ వైతాళికునిగా, దైవ ప్రవక్తగా మార్చాయి.

## ఆయనే నా ప్రభువు

సకల చరాచర సృష్టికి మూలాధారమైన సృష్టికర్తను మాత్రమే పూజించాలని ఆయన చేసిన ఉపదేశం ప్రజలకు రుచించలేదు. జాతి ఆయన సందేశాన్ని తిరస్కరించింది. 'నీ స్వహస్తాలతో తయారు చేసుకున్న ప్రతిమలను పూజించడం మాని, నిన్నూ, నన్నూ సమస్త విశ్వాన్నీ, విశ్వంలోని అణువణువునూ సృష్టించిన ఆ సర్వేశ్వరుడిని పూజించమనే ఆయన బోధ అరణ్యరోదన అయింది. పైగా ఇబ్రాహీం సందేశాలను విని ఆగ్రహించిన నమ్రూద్ రాజు ఆయనకు దేశ బహిష్కార శిక్ష విధించారు.

## పుణ్యక్షేత్రం మక్కా నగరం

ఇబ్రాహీం స్వదేశాన్నే కాదు, ఉన్న ఊరును, కన్నవారినీ వదిలి, దైవ ధర్మాన్ని, శాంతి సందేశాన్ని ప్రచారం చేస్తూ దేశ దిమ్మరిలా జీవితం ప్రారంభించారు. వయసు మీదపడుతున్నది. తన తరువాత దైవకార్యాన్ని నిర్వహించేందుకు వీలుగా సంతానాన్ని ప్రసాదించమని దైవాన్ని వేడుకున్నారు. దైవం ఆయన మొరను ఆలకించి పండంటి మగ బిడ్డను ప్రసాదించాడు. లేక లేక కలిగిన సంతానాన్ని చూసుకుని ఇబ్రాహీం దంపతులు ఆనందంతో మురిసిపోయారు. కానీ ఆ సంతోషం ఎంతోకాలం నిలువ లేదు. భార్యనూ, కొడుకునూ తీసుకెళ్లి ఎడారి ప్రదేశంలో వదిలి రమ్మని దైవం ఆజ్ఞాపించాడు. ఇదొక పరీక్ష. ఇబ్రాహీం వెనుకాముందు ఆలోచించకుండా దైవాదేశాన్ని పాటించారు. కనీసం నాలుక తడుపుకోవడానికి సైతం గుక్కెడు మంచినీళ్లు కరువైన ఆ ప్రదేశంలో ఆ పసివాడు దాహంతో గుక్కపట్టి ఏడుస్తూ తన కాలి మడిమలతో భూమిన రాసిన చోట బ్రహ్మాండమైన నీటి ఊట వెలసింది. ఆ జలంతో తల్లీ కొడుకులు దాహం తీర్చుకున్నారు. ఆ పవిత్ర నీటినే నేటికి 'జంజం' పేరుతో ముస్లింలు తీర్థజలంగా సేవిస్తున్నారు. ఆనాటి ఎడారి ప్రాంతమే నేడు సుందర మక్కా నగరంగా రూపుదిద్దుకొని ప్రపంచ ముస్లిం సోదరులకు పుణ్యక్షేత్రంగా విరాజిల్లుతోంది.

## దైవ గృహం కాబా

హజ్రత్ ఇబ్రాహీం దైవాదేశం మేరకు మాక్కాకు తిరిగొచ్చి భార్యాబిడ్డలను కలుసుకొని, తనయుడు ఇస్మాయీల్ సాయంతో 'కాబా' గృహాన్ని నిర్మించారు. దీంతో

కాబా దైవ గృహంగా పేరుపొందింది. తర్వాత ఇబ్రాహీంకు తన కొడుకు గొంతును తన స్వహస్తాలతో కోస్తున్నట్లు కల వచ్చింది. దీన్ని దైవాజ్ఞగా భావించిన ఆయన కుమారుడిని వెల్లకిలా పడుకోబెట్టి, దైవ నామస్మరణ చేస్తూ మెడపై కత్తి పెట్టి జిబహ్ చేయడానికి ఉద్యుక్తులయ్యారు. 'నా ప్రియ ప్రవక్తా ఇబ్రహీం! నువ్వు నీ స్వప్న ఉదంతాన్ని నిజం చేశావు. నా ఆజ్ఞాపాలనలో మీరు మానసికంగా సిద్ధమైన క్షణంలోనే నేను మీతో ప్రసన్నుడనయ్యాను. ఇప్పుడు మీరు పూర్తిగా విశ్వాసులయ్యారు. అంటే నా ప్రతి ఆదేశాన్ని తు.చ. తప్పక ఆచరించడంలో పరిపూర్ణులయ్యారు. ఈ శుభ సమయాన మీ త్యాగ నిరతికి చిహ్నంగా నా స్వర్గం నుంచి ఒక దుంబాను పంపుతున్నాను' అని దైవ వాణి పలికింది. వెంటనే ఇస్మాయిల్ స్థానంలో ప్రత్యక్షమైన గొర్రె జాతికి చెందిన పొట్టేలును జిబహ్ చేశారు హజ్రత్ ఇబ్రాహీం అలైహిస్సలాం.

## చిత్తశుద్ధితో దైవ ప్రార్థన

ప్రపంచ వ్యాప్తంగా ముస్లిం సోదరులు జరుపుకునే ఈదుల్ అజ్హా లేదా బక్రీద్ పండుగ ఆ మహనీయుల త్యాగస్మరణే. ఈ రోజే సౌదీ అరేబియాలోని మక్కా నగరంలో హజ్ ఆరాధన జరుగుతుంది. ఆర్థిక స్థోమత ఉన్న ముస్లింలంతా తమ జీవిత కాలంలో కనీసం ఒకసారయినా 'హజ్‌యాత్ర' అంటే 'కాబా' సందర్శనా యాత్ర చేయాలి. ఆర్థిక స్థోమత లేని వారు పండగ సందర్భంగా తమ తమ ఇళ్లవద్దనే 'ఖుర్బానీ'లు ఇస్తారు. ఆ స్థోమత కూడా లేని వారు దైవ సన్నిధిలో రెండు రకాతుల నమాజ్ (దైవ ప్రార్థన) చేసినా, కరుణాసముద్రుడయిన దైవం వారికి కూడా హజ్, ఖుర్బానీలు ఆచరించిన వారితో సమానంగా పుణ్యఫలాన్ని ప్రసాదిస్తాడు. దైవానిక్కావలసింది రక్త మాంసాలు కాదు, సిరిసంపదలూ కాదు. కేవలం చిత్తశుద్ధి, సంకల్పశుద్ధి మాత్రమే. దీనిని చూడడానికే దైవం మానవులకు రకరకాల పరీక్షలు పెడతాడు.

## దైవప్రసన్నతే జీవిత ధ్యేయం

ఇబ్రాహీం, ఇస్మాయిల్‌ల త్యాగాల నుంచి స్ఫూర్తి పొందే ఉద్దేశంతో బక్రీద్ పండుగను భక్తిశ్రద్ధలతో జరుపుకొంటారు. ఈ సందర్భంగా మక్కాలో జరిగే హజ్ కూడా హాజీలకు త్యాగభావాన్ని సత్యం, ధర్మం, న్యాయం, పరోపకారం లాంటి సుగుణాలను

బోధిస్తుంది. ఈ పండగ నుంచి స్ఫూర్తి పొందడమంటే దైవభీతిని, పాపభీతిని, బాధ్యతా భావాన్ని మనం చేసే ప్రతి పనికి, పలికే ప్రతి మాటకు రేపు దైవం ముందు సమాధానం చెప్పుకోవలసి ఉంటుందన్న భావనను మనసులో ప్రతిష్ఠించుకోవడమే. ఈ దైవభీతి భావనే మానవులను మంచివారుగా సౌశీల్యవంతులుగా, త్యాగమూర్తులుగా తయారు చేస్తుంది. అందుకని ఈ పండగ రోజున ధన, ప్రాణాలను, మనో వాంఛలను త్యాగం చేయాలి. కేవలం దైవ ప్రసన్నతే జీవిత ధ్యేయమై ఉండాలి. ఈ ప్రపంచం నుంచి అన్యాయాన్ని, అధర్మాన్ని, అశాంతిని, అవినీతిని, అణచివేతలను అంతం చేయడానికి ఎలాంటి త్యాగానికయినా సిద్ధంగా ఉండాలని పిలుపునిస్తూ స్ఫూర్తిగా నిలుస్తుందీ 'బక్రీద్' పండుగ.

✦ ✦ ✦

# 108. త్యాగస్ఫూర్తి రగిలించే మొహర్రం

**ముహమ్మద్ ప్రవక్త (సఅసం) బోధనలతో ముస్లింలంతా పునీతులయ్యారు. మహాప్రవక్త పరమపదించిన తరువాత ప్రజాప్రతినిధులుగా ఖలీఫాలు రాజ్యం చేశారు. తరువాతి పరిణామాల్లో ఖిలాఫత్ వ్యవస్థకు తూట్లు పొడుస్తు న్నప్పుడు, ప్రజాస్వామ్య ప్రేమికులైన ఇమామ్ హుసైన్ ప్రాణాలను సైతం లెక్కచేయక రాచరికానికి ఎదురు తిరిగిన వీరోచితగాథ ముహర్రం సంద ర్భంగా....**

మొహర్రం అనగానే ప్రతిఒక్కరికీ ఇమామెహుసైన్ పేరు గుర్తుకొస్తుంది. రక్తపుటేరులతో ఎర్రబారిన కర్బలా మైదానం మన కళ్లముందు కదలాడుతుంది. ప్రజాస్వామ్య పరిరక్షణ కోసం ఇమాం పరివారం ఎదుర్కొన్న కష్టాలు కడగండ్లు స్మృతిపథంలో లీలగా మెదులు తాయి. ఆ మహనీయుని అమరత్వాన్ని స్ఫురణకు తెచ్చి, న్యాయం కోసం మేము సైతం అంటూ మనల్ని సమాయత్త పరిచేది మొహర్రం మాసం పదవ రోజు ఆషురా; మంచీ చెడుల మధ్య, న్యాయం అన్యాయం మధ్య సంఘర్షణ ఎప్పుడూ జరుగుతూనే వుంటుంది. గతంలోనూ జరిగింది. ప్రస్తుతమూ జరుగుతోంది. మునుముందు కూడా జరుగుతూనే వుంటుంది. ఇది నిప్పులాంటి నిజం. ఈ సత్యాసత్యాలకు, మంచీ చెడులకు మధ్య జరిగిన సంఘర్షణా ఫలితమే కర్బలా దుర్ఘటన.

## ప్రజాస్వామ్యమే పరమావధి

ముహమ్మద్ ప్రవక్త పరమపదించిన తరువాత ప్రజాస్వామ్య పద్ధతిలో ప్రజలు తమ ప్రతినిధిని ఎన్నుకున్నారు. అటువంటి ప్రజాప్రతినిధిని ఖలీఫా అని పిలుస్తారు. మొట్ట మొదటి ఖలీఫాగా హజ్రత్ అబూబకర్ సిద్దీఖ్ ఎన్నికయ్యారు. ఆయన తరువాత వరసగా హజ్రత్ ఉమర్, హజ్రత్ ఉస్మాన్, హజ్రత్ అలీ ప్రజాస్వామ్య పద్ధతిలో ప్రతినిధులుగా ఎన్నికయ్యారు. వీరి పరిపాలనా కాలంలో న్యాయం నాలుగుపాదాలపై నడిచింది. ఆర్థిక,

ధార్మిక, రాజకీయ పరిపాలనా రంగాలన్నింటిలోనూ సమతూకం నెలకొని ఉండేది. ప్రజలందరికీ ఎలాంటి వ్యత్యాసాలు, తారతమ్యాలు లేకుండా సమాన న్యాయం, గౌరవ మర్యాదలు లభించేవి. అందుకే వీరి పరిపాలనా కాలం ప్రపంచ మానవ చరిత్రలోనే ఓ సువర్ణ అధ్యాయంగా పేరొందింది.

## అధికార దాహం

నాలుగో ఖలీఫా హజ్రత్ అలీ తర్వాత ప్రజలు ఇమామె హసన్‌ను తమ ప్రతినిధిగా ఎన్నుకున్నారు. అప్పుడు సిరియా ప్రాంత గవర్నర్‌గా వున్న హజ్రత్ మావియా కొందరు స్వార్థ రాజకీయ నాయకుల సలహా మేరకు అధికారం కోసం పోటీపడ్డారు. ఫలితంగా ఇరువర్గాల మధ్య యుద్ధానికి రంగం సిద్ధమైంది. కానీ ఇరువైపులా కరవాలాలు చేతపట్టిన అమాయక సోదర ప్రజానీకాన్ని చూసి ఇమామె హసన్ మనసు చలించిపోయింది. వెంటనే రణరంగం నుంచి నిష్క్రమించి ప్రజలు కట్టబెట్టిన రాజ్యాధికారాన్ని త్యాగం చేశారు. ఈ విధంగా మావియా మనసులో నాటుకున్న రాజ్యకాంక్ష అనే విషబీజం పెరిగి పెద్దదై అధికార వ్యామోహంతో తన కొడుకు యజీద్‌ను రాజుగా గుర్తించమని ప్రజలపై ఒత్తిడి తెచ్చారు. రాజ్యంలో అలజడులు, హింసాకాండ చెలరేగాయి. ప్రజలు ధనప్రాణాల భయంవల్ల యజీద్‌ను రాజుగా గుర్తించారు. ఈ విధంగా ప్రజాస్వామ్యానికి పెద్దదెబ్బ తగిలింది. ప్రజాస్వామ్యవాదులకు ఈ పరిణామం ఏమాత్రం రుచించలేదు. వారు రాచరికానికి ఎదురు తిరిగారు. ప్రజాస్వామ్య ఉద్యమానికి నాయకత్వం వహించే బాధ్యత ఇమామె హుసైన్ (హసన్ తమ్ముడు) భుజస్కంధాలపై మోపారు. ఇస్లామీ ధర్మశాస్త్రం ప్రకారం ఏ సమస్యకైనా చర్చలు, సంప్రదింపులే పరిష్కార మార్గాలు, అందుకని ఇమామె హుసైన్ ఆ మార్గాన్నే ఎంచుకున్నారు. ముఖాముఖి చర్చల కోసమని ఇమాం రాజధాని కూఫాకు బయలుదేరారు. ఈ విషయం తెలుసుకున్న యజీద్ ఇమాం రాజధానికి చేరితే తన అధికారానికే ముప్పు వస్తుందని గ్రహించి ఆయన్ని అడ్డుకోవడానికి ఓ పెద్ద సైన్యాన్ని పంపాడు. మార్గమధ్యంలో కర్బలా అనే చోట యజీద్ సైన్యం ఇమాం పరివారాన్ని అడ్డగించి, యజీద్‌ను రాజుగా అంగీకరించమని సైన్యాధిపతి ఇమామె హుసైన్‌ను హెచ్చరించాడు. తాను కేవలం చర్చల కోసమే రాజధానికి వెళుతున్నానని, దయచేసి తనను అడ్డగించవద్దని ఇమాం సైన్యాధికారిని కోరాడు. కానీ సైన్యాధిపతి ఇమాం మాటల్ని

ఏ మాత్రం ఖాతరు చేయకుండా, యజీద్‌ను రాజుగా గుర్తించడమో, లేక యుద్ధమో తేల్చుకోమన్నాడు. ఆశయసాధన కోసం ప్రాణత్యాగానికైనా సిద్ధమే కాని దౌర్జన్యం ముందు తలవంచనన్నారు ఇమామె హుసైన్ (రజి).

## రక్తపుటేరులు

దీంతో ఇరువర్గాల మధ్య భీకర సంగ్రామం మొదలైంది. చూస్తూ చూస్తూనే రోజులు దొర్లిపోతున్నాయి. కర్బలా మైదానం రక్తంతో ఎర్రబారింది. కేవలం న్యాయం కోసం, ధర్మం కోసం, ధర్మసంస్థాపన కోసం సాగే ఈ సంగ్రామంలో ఇమాం పరివారం శక్తివంచన లేకుండా అలుపెరుగని పోరాటం సాగిస్తూ ఒక్కొక్కరే నేలకొరుగుతున్నారు. చివరికి ఏకాకిగా మిగిలారు ఇమామె హుసైన్. ఆరోజు మొహర్రం మాసపు పదవ తేదీ. శుక్రవారం. హోరాహోరీ భీకరపోరు కొనసాగుతోంది. అటు శత్రుసైన్యం వేలసంఖ్యలో వుంది. ఇటు ఇమామె హుసైన్ ఒక్కడే ఒక్కడు. అయినప్పటికీ ఆ అనుపమ పరాక్రమ శాలి, అనన్య ధైర్యసాహసాలతో అనేకమంది శత్రువులను నేలకూల్చారు. శుక్రవారం జొహర్ నమాజ్ సమయం అయిపోతున్న కారణంగా ఇమామె హుసైన్ నమాజ్ కోసం కొన్ని నిమిషాలు అనుమతించాల్సిందిగా శత్రువును అభ్యర్థించారు. ప్రార్థనకు అనుమతించిన ఆ శత్రువులు ఇమాం సజ్దా (సాష్టాంగ ప్రణామం)నుండి లేస్తే తమ ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసిపోతాయని భావించారు. పిరికిపందల్లా ఇమామె హుసైన్ సజ్దా స్థితిలో ఉండగానే బరిశెతో పొడిచి చంపారు. ఇదీ క్లుప్తంగా ఆనాడు జరిగిన ఘోర దుర్ఘటన.

ప్రజాస్వామ్యానికి స్వార్థరాజకీయ శక్తులు సమాధి కడుతున్నప్పుడు మనకెందుకులే అని చేతులు ముడుచుకుని కూర్చోకుండా తన కర్తవ్యాన్ని నెరవేర్చి ప్రజాస్వామ్యానికి ప్రాణంపోసిన త్యాగమూర్తి ఇమామెహుసైన్. అందుకే సామాన్య ప్రజలే కాకుండా చరిత్రకారులు సైతం ఆ అమరవీరుని కార్యనిర్వహణను, శూరత్వాన్ని కొనియాడారు. ఆనాడే కాదు, ఈనాడు కూడా ప్రజాస్వామ్యానికి తూట్లు పొడుస్తున్న దుష్టశక్తులు మన సమకాలీన రాజకీయాల్లో కుప్పలు తెప్పలుగా ఉన్నప్పటికీ బాధ్యతలు గుర్తించి స్పందిం చకుండా చోద్యం చూడడం శోచనీయం. దానికోసం ఇమామె హుసైన్ లాంటి దూరదృష్టి తెగింపు కావాలి. మరో హుసైన్ కావాలి. మరో హుసైన్ పుట్టాలి.

✦ ✦ ✦

# 109. సంక్షేమ సంకల్పం మొహర్రం

**మొహర్రం మాసం పదోరోజుకు ఆషూరా అని పేరు. ఈ తేదీకి ఇస్లామీ చరిత్రలో విశేషమైన ప్రాధాన్యత ఉంది. ముస్లిముల నూతన సంవత్సర ప్రారంభమాసం మొహర్రం సందర్భంగా ఆషూరా విశిష్టతలను గురించి..**

నేటికి దాదాపు వేయిన్నర సంవత్సరాలకు పూర్వం కూడా అరబ్బులు మొహర్రం మాసాన్నే తమ మొదటి మాసంగా లెక్కించేవారు. ఆ తరువాత ముహమ్మద్ ప్రవక్త కూడా అదే విధానాన్ని అమలులో ఉంచారు. అసలు ముహమ్మద్ ప్రవక్త సమాజానికి, విశ్వాసాలకు ఉపకరించే ఏ పాత పద్ధతులనూ మార్చలేదు. సమాజ వికాసానికి దోహదపడే విధానాలను పద్ధతులను స్వయంగా ఆచరించారు.

## పవిత్ర దినం

ఇస్లామీయ చరిత్రలో మొహర్రం మాసానికి అత్యంత ప్రాముఖ్యత ఉంది. మొహర్రం మాసం పదో తేదీని ఆషూరా అంటారు. పూర్వచరిత్రలో ఈ తేదీకి ఎనలేని ప్రాముఖ్యత ఉంది. ఆదిమానవుడైన ఆదం అలైహిస్సలాంను దైవం సృష్టించింది, స్వర్గానికి పంపించింది ఆషూరా రోజునే. నోవా (నూహ్) ప్రవక్త నావను కనీవిని ఎరుగని భయంకర తుపాను నుంచి రక్షించి, దైవం ఒడ్డుకు చేర్చింది కూడా ఈరోజే. యూనుస్ ప్రవక్తను చేప కడుపు నుంచి రక్షించింది కూడా ఈ రోజే. ఇబ్రాహీంను నమ్రూద్ రాజు అగ్ని గుండంలో పడవేయించినప్పుడు దైవం ఆయన్ని అగ్ని నుంచి కాపాడాడు. మోషే ప్రవక్తను, ఆయన అనుయాయులను, అష్టకష్టాలకు గురిచేసిన రాజు 'ఫిరౌన్' (ఫారో) బారినుండి రక్షించాడు. దీనికి కృతజ్ఞతగా మోజెస్ ప్రవక్త అనుయాయులు (యూదులు) ఆరోజు ఉపవాసం ఉండేవారు. ఈ విషయం తెలుసుకున్న ముహమ్మద్ ప్రవక్త మోషే ప్రవక్తను యూదులకంటే ఎక్కువగా మనం గౌరవిస్తాం కాబట్టి మీరు రెండు రోజులు ఉపవాసం పాటించండి అని బోధించారు. అంటే 9, 10 తేదీల్లో కానీ, 10, 11 తేదీల్లో కానీ ఉపవాస వ్రతం పాటించాలి. ఈ ఆషూరా ఉపవాసాలకు రమజాన్ ఉపవాసాల

తరువాత స్థానం ఇచ్చారు ముహమ్మద్ ప్రవక్త (స). ఈ రెండు ఉపవాసాలు పాటించిన వారి గత సంవత్సర పాపాలన్నీ దైవం క్షమిస్తాడు.

## ఇమామ్ త్యాగఫలం

హజ్రత్ ఇమామె హుసైన్ జయంతిని పురస్కరించుకుని ముస్లింలు ఆషూరా ఉపవాసాలు పాటిస్తారు. ఇమామె హుసైన్ ముహమ్మద్ ప్రవక్త మనుమడు. బీబీ ఫాతిమా, హజ్రత్ అలీల సుపుత్రుడు. బాల్యం నుంచే అపారమైన తెలివితేటలు, అనుపమానమైన ప్రజ్ఞాపాటవాలను కనబరిచేవారు. తాతగారైన ముహమ్మద్ ప్రవక్త (స) సహచర్యంలో పెరిగి, ఆయన వద్ద శిక్షణ పొందిన మహావ్యక్తి. భయభక్తులతో, జవాబుదారీతనంతో నిండిన జీవితం ఆయనది. ప్రజాస్వామ్య పరిరక్షణ కోసం కంటకుడైన యజీద్ సైన్యంతో వీరోచితంగా పోరాడి అమరులయ్యారు. ఈ దుర్ఘటనలో తన పరివారంలో 72 మంది వీరులు కూడా అమరులయ్యారు. హజ్రత్ ఇమామె హుసైన్ మహనీయుడు ఏ ఆశయ సాధన కోసం ప్రాణాలను పణంగా పెట్టి త్యాగం చేశారో ఆ మహదాశయాన్ని స్మరించు కుంటూ, దాని సాధనకు ప్రతినబూనవలసిన దినం ఇది. ప్రజాస్వామ్య పరిరక్షణ, సుపరిపాలన, శిష్టరక్షణకు ప్రజలంతా కలిసికట్టుగా నడుం బిగించాలి. ఇదే మొహర్రం సందేశం.

✦ ✦ ✦

# 110. త్యాగానికి ప్రతీక మొహర్రం

ఇస్లామీయ చరిత్రలో 'మొహర్రం' మాసానికి ఒక ప్రత్యేకత ఉంది. ప్రజాస్వామ్య విలువల పరిరక్షణ కోసం హజ్రత్ ఇమామె హుసైన్ రాచరికానికి ఎదురు తిరిగి, పోరాడి, ప్రాణాలర్పించిన రోజు మొహర్రం మాసం పదవ తేది. ఇస్లామీయ పరిభాషలో మొహర్రం పదవ తేదీని 'యౌమె అషూరా' అంటారు. యౌమె ఆషూరానాటి శుభాలు అనేకం ఉన్నాయి.

## ఎన్నో శుభాలు

ఆది మానవుడు హజ్రత్ ఆదం లైహిస్సలాం పశ్చాత్తాపాన్ని దైవం మన్నించింది ఈ రోజే. ఇద్రీస్ అలైహిస్సలాంకు దైవం ఆకాశంలోని అత్యున్నత స్థాయిలో చోటు కల్పించింది కూడా ఈ రోజే. హజ్రత్ నూహ్ అలైహిస్సలాం ఆయన అనుచరులను దైవం పెనుతుఫాను నుంచి రక్షించి ఓడపై ఒడ్డుకు చేర్చింది కూడా ఈ రోజే. హజ్రత్ ఇబ్రాహీం అలైహిస్సలాంను అగ్ని పరీక్ష నుంచి కాపాడిందీ ఈ రోజే. హజ్రత్ మూసా ప్రవక్తతో దైవం తూర్ పర్వతంపై సంభాషిచింది, ఆయనకు 'తౌరాత్' గ్రంథం బహుకరిచిందీ ఈ రోజే. హజ్రత్ అయ్యూబ్ అలైహిస్సలాంను భయంకర వ్యాధినుంచి విముక్తి కల్పించిందీ ఈ రోజే.

## ఇమామెహుసైన్ అమరగతి

సుదీర్ఘ ఎడబాటు అనంతరం తండ్రీ కొడుకులైన హజ్రత్ యాఖూబ్ అలైహిస్సలాం, హజ్రత్ యూసుఫ్ అలైహిస్సలాంను దైవం కలిపిందీ ఈ రోజే. హజ్రత్ యూనుస్ అలైహిస్సలాంను దైవం చేప కడుపు నుంచి బయటికి తీసి రక్షించిందీ ఈ రోజే. హజ్రత్ దావూద్ అలైహిస్సలాంకు దైవం క్షమాభిక్ష ప్రసాదించిందీ ఈ రోజే. హజ్రత్ ఈసా అలైహిస్సలాంను అల్లాహ్ ఆకాశంపైకి ఎత్తుకున్నదీ ఈ రోజే. హజ్రత్ ఇబ్రాహీం, హజ్రత్

దావూద్‌లకు సహీఫాలు అందజేయబడింది కూడా ఈ రోజే. ముహమ్మద్ ప్రవక్త సల్లం ముద్దుల మనవడు ఇమామెహుసైన్ అమరగతి పొందినదీ ఈ రోజే. ఆయనతో పాటు ఆయన పరివారం 72 మంది అమరులైందీ ఈ రోజే. అంతేకాదు మొట్టమొదట దైవం ఈ సృష్టిని ప్రారంభించింది కూడా ఈ 'ఆషురా' రోజునే. మొట్టమొదటి సారిగా ఆకాశం నుంచి వర్షం కురిసింది కూడా ఈ రోజే. అంతటి విశేష విశిష్టతలున్నాయి ఈ రోజుకు.

## సుదీర్ఘ ఉపవాస ఫలం

ఎవరైతే ఈ 'ఆషూరా' రోజున ఉపవాస వ్రతం పాటిస్తారో వారు సుదీర్ఘ కాలం పాటు ఉపవాసం పాటించిన వారవుతారు. వారి పాపాలు మన్నించబడతాయి. ఎవరైతే వస్త్రాలు లేనివారికి వస్త్రాలు ఇస్తారో వారిని దైవ భయం, శిక్షల నుంచి కాపాడతాడు, దాహంతో ఉన్నవారి దాహార్తి తీర్చినవారికి, ఆకలిగొన్నవారికి అన్నం పెట్టిన వారికి దైవం స్వర్గ దస్తర్‌ఖాన్‌పై విందు భోజనం ఏర్పాటు చేస్తాడు. ఇన్ని సుఖాలు, ఇన్ని లాభాలున్న మొహర్రంను అర్థం పర్థం లేని దురాచారంగా మార్చకుండా, దీని శుభాలను గుర్తించి ముఖ్యంగా మన ఇమాం ఏ లక్ష్యం కోసం ప్రాణత్యాగం చేశారో తెలుసుకుని మనమూ దానికై ప్రయత్నించడమే ఆయనకు నిజమైన నివాళి.

✦ ✦ ✦